జన్మోధీరుని కుమారుఁడు మనోధీరుఁడు
మనోధీరుని కొమారుఁడు మన్మసిద్ధిరాజు
కొండొకసిద్ధిరాజు కొమారసిద్ధిరాజు
కస్తూరి సిద్ధిరాజు గండగోపాలరాజు
తల్లియేగురు (?) సిద్ధిరాజు దళవాయి భీమన
పట్టభద్రుఁడు భారద్వాజగోత్రుండు
వరవితరణగుణ వంశవర్ధనుఁడు
నవరసాలంకార నవమన్మథుండు
నిలఁ గీర్తిగలరాజు నలసిద్ధిరాజు....
ధరమీఁద షోడశదానవినోది
యిలఁ గీర్తిగలరాజు నలసిద్ధిరాజు
వాసికెక్కిన సూర్యవంశమునఁ బుట్టె"

*          *          *

ఇనకులాధీశ్వరుం డీ సిద్ధిరాజు

*          *          *

భానుకులజుండగు పల్లవరాజు

*          *          *

పల్లవ నలసిద్ధి పట్టాభిషేకుఁ

*          *          *

ఈ నల్లసిద్ధిరాజు పల్లవాధీశ్వరుఁడట; సూర్యవంశోద్భవుఁడట; ధరణికోట అమరలింగము నకు బ్రాహ్మణ కన్యవలనఁ బ్రభవించిన ముక్కంటి సంతతివాఁడట. పల్లవులు భారద్వాజ గోత్రులు. నల్లసిద్ధి ముక్కంటిపల్లవుని వంశమువాఁ డగుటచేత నతనిదియు భారద్వాజ గోత్రమే.

నల్లసిద్ధిరాజునకును కాటమరాజునకును ఈ యుద్ధము ఎఱగడ్డపాటిలో మాఘ బహుళ అమావాస్య మంగళవారమునాఁడు జరిగినట్లు గ్రంథమువలనఁ దెలియుచున్నది. స్థానిక చరిత్రముల ప్రకార మీ మాఘమాసము చిత్రభాను సంవత్సరములోనిది. నల్లసిద్ధిరాజు కొలువులోనివాఁడు ఖడ్గ తిక్కనమంత్రి. ఇతఁడు సిద్ధయమంత్రి కుమారుఁడు. ఒడంబడిక ప్రకారము పుల్లరిని చెల్లింప నందున ఖడ్గతిక్కన రాజు ముదల గొని కాటమరాజుపక్షమువారిమీఁదికి దండెత్తివెల్లి వారితో యుద్ధముచేసి పరాజితుఁడై తిరుగ వచ్చి యింటివద్ద తల్లిచేతను భార్యచేతను అవమానితుఁడగును. అందుమీఁదట మఱల రోషము వచ్చి యుద్ధభూమి కరిగి అనుపమాన సాహస పరాక్రమములతో శత్రుసేనపైఁ గవియును. "ఇతఁడు బ్రాహ్మణుఁడు; బ్రాహ్మణునిఁ జంపిన పాపము వచ్చును, ఇతనిని జంపకపోయిన మన బలమును సమయింపకపోఁడని" కాటమరాజుపక్షమువారు వితర్కించు చున్నసమయమున వారి మంత్రి బ్రహ్మరుద్రయ్య యను శివబ్రాహ్మణుఁడు తా నేగి యాతనిని వధ యింతునని చెప్పి కదనరంగమున కరిగి సిద్ధయ తిక్కన నెదుర్కొని పోరాడును. తుదకు వా రుభ యులు నొకరి నొకరు నతికికొని వీరశయనము నొందుదురు. తరువాతకూడ ఉభయపక్షములవారికి

భయంకరమైన యుద్ధము జరుగును. ఈ యుద్ధమున కాటమరాజువారి పక్షమున వారి గోగణముకూడ అనుపమాన పరాక్రమముతో శత్రువులతోఁ బోరాడి వందలకొలఁది శత్రుసేనను సంహరించును. ఈ గోగణములోని 'బొల్లావు' పోరాటమును, విపుల విక్రమ సాహసములును సుదీర్ఘముగ గ్రంథమున వర్ణితములైనవి. చిట్టచివరకు నెల్లూరి నల్లసిద్ధిరాజునకు పరాజయము సంభవించును.

"పల్లవరాజులఁ బాలేటఁ జంపి
పగవారి రక్తాన ప్రదక్షిణము తిరిగి
పాలేటి గంగకు పగవాని శిరసు
పాదకానుక పెట్టి ప్రస్తుతిఁ జేసి
*            *            *
పరమోపకారులు బహుపరాక్రములు
సాధించి పగతుఱఁ జాల సమయించి
యరలేక యొరగిరి యమరయాదవులు."

## నల్లసిద్ధి ఎవరు? ఎప్పటివాఁడు?

నెల్లూరిని బరిపాలించిన నల్లసిద్ధిరాజు పల్లవరాజని, ముక్కంటి సంతతివాఁడని కాటమరాజు కథలోఁ గలదు. మూఁడు కన్నులుగల పల్లవరాజగుటచేత అతనికి ముక్కంటి పల్లవుఁడని, పల్లవ ముక్కంటియని వ్యవహారము కలిగినది. ముక్కంటి పల్లవుఁడు ధరణికోట అమరలింగమునకును బ్రాహ్మణకన్యకును ప్రభవించినట్లు మన గ్రంథములో నున్నది. నెల్లూరుజిల్లా తల్పగిరి కైఫీయతు కూడ త్రిలోచనుఁడను పల్లవరాజు బ్రాహ్మణకన్యకకు జనించినట్లు చెప్పుచున్నది. త్రిలోచనపల్లవుని రాజధాని ధరణికోట. ఈకారణములచేత ముక్కంటి పల్లవుఁడును స్థానిక చరిత్రములలోఁ బ్రసిద్ధుఁడైన త్రిలోచనపల్లవుఁడును ఒక్కరే యనియు, ముక్కంటి పల్లవునికి త్రిలోచనపల్లవుఁడనునది నామాంతర మనియు నిశ్చయింపవచ్చును. త్రిలోచనపల్లవునిగుఱించిన గాథ లనేకములు కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు, కృష్ణ జిల్లాలలోని స్థానికచరిత్రములవలనఁ దెలియవచ్చుచున్నవి. ముక్కంటిని గుఱించిన విశేషములు కాటమరాజుకథలో తెలుపఁబడలేదు. వీటినిగుఱించి తెలిసికొనుటకు స్థానికచరిత్రములు తక్క మనకు ఇతరాధారము లేవియు లేవు. ఆ చరిత్రములవలన ముక్కంటి పల్లవునిగుఱించి తెలియవచ్చు విశేషము లివి.

ముక్కంటి పల్లవుఁడు పరమశైవుఁడు. ఈతని కాలమునాఁటికి తెలుఁగు దేశములో జైన, బౌద్ధమతము లభివృద్ధిలో నుండెను. వీటి నణఁచివేసి హిందూమతమును పునరుద్ధరించుటకై గంగాతీరమునుండి బ్రాహ్మణు లనేకులను తెలుఁగుదేశమునకుఁ దీసికొనివచ్చి వారి కనేకాగ్రహారము లిచ్చెను. ఇట్లిచ్చిన యగ్రహారములు డెబ్బదియని కొన్ని కైఫీయతులును, ఏడువందలని మఱి కొన్నియుఁ దెలుపుచున్నవి; ముఖ్యముగా ఒక్కొక్క ఋషిగోత్రమువారి కొక్కొక్క యగ్రహారము చొప్పున సప్తర్షిగోత్రజులకు ఉప్పుటూరు, వంగిపురము, కారంచేడు, పాలసలమిత్రు,

గుంటూరు ఇసుంగల్లు, కొర్బ్బెర అను గ్రామముల నగ్రహారములుచేసి యొసంగెను. దేశ మంతయు అడవి బలిసియుండఁగా దానిని నఱకించి జననివాసయోగ్యమును కృషియోగ్యమును గావించెను. దేవాలయము లనేకములను గట్టించెను. ఈతని కాలమువఱకు శివాలయములలో శూద్రులే యర్చకులుగ నుండిరి. పూజకూడ అవైదికముగ నుండెను. ముక్కంటి పల్లవరాజు వారి నందఱిని దీసివేసి బ్రాహ్మణులను పురోహితులుగ నియమించి పూజ వేదోక్తము గావించెను. ఇతఁడు సూర్యవంశజుఁడును కాశ్యపగోత్రుఁడునైన కరికాలచోడ మహారాజునకు సమకాలికుఁడు. కావేరీతీరమునకుఁ దరులు కట్టుటకై కరికాలుఁ డీతనిని వెట్టికి రావలసినదని వర్తమాన మంపఁగా త్రిలోచనపల్లవుఁ డందుకు నిరాకరించెను. అందుమీఁదట కరికాలుఁ డాతని నుదుటినున్న కంటిని అదిమి ఆతనియుద్ధతి నడంచెను. ముక్కంటియను త్రిలోచన పల్లవునిగుఱించి మన కిన్ని విశేషములు దెలియుచున్నను ఆతఁ డెప్పటివాఁడో, పరిపాలన మొనరించినట్లు తెలిసిన పల్లవరాజవంశములలో నాతని స్థానమేదో ఇంతవఱకు నిర్ణయముకాలేదు. త్రిలోచనుఁడని కాని ముక్కంటియని కాని పేర్లుగల యొక పల్లవరాజు ఉండినట్లు శాసనములవలనఁ దెలియరాదు. అని యటులుండ పల్లవులు సూర్యవంశోద్భవులు కారు; కాని భారద్వాజ గోత్రులే. ఈకారణమున కాటమరాజు కథలో ముక్కంటియు అతని సంతతివారును ఇనకులోద్భవులని వ్రాయుట పొరపాటు. కాని నవచోళ చరిత్రమను ద్విపద కావ్యమును రచియించిన లింగనకవి ముక్కంటి పల్లవునికి, కరికాలునికి గలిగిన వైరమునకు సంబంధించిన ఈగాథలను ముక్కంటి చోడుఁడనువాని కంటఁగట్టి తనగ్రంథమున వర్ణించెను.

ఇఁక స్థానిక చరిత్రముల ననుసరించి నలసిద్ధిరాజు చోళకులజుఁడు, ఇనవంశోద్భవుఁడు; పల్లవరాజు మాత్రముకాఁడు. ఖడ్గతిక్కనయు పల్లవరాజుల కొలువులోనివాఁడుకాఁడు. తిక్కన తండ్రియయిన సిద్ధనయు, సోదరులైన భాస్కర కేతనామలును, పినతండ్రియగు కొమ్మన కుమారుఁడైన కవి తిక్కనయు — అందఱును నెల్లూరిని బరిపాలించిన చోళరాజుల కొలువులోనివారే. కేతన తన దశకుమారచరిత్రలో ఖడ్గతిక్కన తండ్రియయిన సిద్ధనామాత్యు నిట్లభివర్ణించియున్నాఁడు :

> "స్థాపిత సూర్యవంశవసుధాపతినాఁ బరతత్వధూతవా
> ణీపతినా నుదాత్తనృపనీతి బృహస్పతినా గృహస్థ గౌ
> రీపతినాఁ గృపారససరిత్పతినాఁ బొగడొందె సిద్ధసే
> నాపతి చోడ తిక్క జననాథశిఖామణి కాప్తమంత్రియై".

సిద్ధన నెల్లూరి ప్రభువైన చోడతిక్క నృపాలుని ఆప్తమంత్రి. ఖడ్గతిక్కన సోదరుఁడును, సిద్ధనామాత్యుని ద్వితీయపుత్రుఁడును అయిన బాచఁడను భాస్కరమంత్రియు ఈచోళరాజుల కొలువులోనివాఁడే. ఆతఁడు దశకుమార చరిత్రమున నీవిధమున వర్ణితుఁడయినాడు :

> "ఉరవడి నుగ్రసేవణపయోనిధి బాడబవహ్నిచాడ్పునన్
> దరికొని కుంభజన్మక్రియఁ ద్రాగి రఘుక్షితినాథుమాడ్కి న
> చ్చెరువుగ నింక జేసెనని చెప్ప జనప్రకరంబు విక్రమా
> భరణుని సిద్ధనార్యునకు బాచని నన్నవగంధవారణున్."

నెల్లూరి రాజ్యముపై సేవణసైన్యము దండెత్తివచ్చినప్పుడు సిద్ధయభాస్కరుఁడు (బావఁడు) దాని నెదిరొక్కని యుద్ధముచేసి సంహరించెనని పైపద్యమువలనఁ దెలియుచున్నది. దండెత్తివచ్చిన సేవణ దేశాధీశ్వరుఁడు సింఘణదేవుఁడు. ఇతఁడు శకవర్షము 1132 మొదలు 1169, అనఁగా క్రీ. శ. 1210 నుండి 1247 వఱకు పాలించెను. ఇతని మహాసైన్యాధిపతి మహాపసాయిత లక్ష్మీదేవ దండనాయకుఁడు. ఈతఁడే నిర్వచనోత్తర రామాయణమున చోడ తిక్కని విజయముల నభివర్ణించు పద్యములలో లకుమయ (లక్ష్మయ) యని వ్యవహరింపఁబడెను. తిక్కచోడరాజు ఈ సేవణులతో యుద్ధముచేసి వారి నోడించి వారి గుఱ్ఱములను వశపఱుచుకొనెనట, చూడుఁడు :

"లకుమయ గురములూరికి నెత్తివచ్చినఁ
గొనఁడె యాహవమున ఘోటకముల"

సిద్ధయ భాస్కరుఁడును చోడ తిక్కరాజును పాల్గొన్న యుద్ధ మొకటే. సేవణ దండయాత్ర ఈ ప్రాంతముపై శకవర్షము 1137, అనఁగా క్రీ. శ. 1215 ప్రాంతమున జరిగినట్లు శాసనములవలనఁ దెలియుచుండుటచేత సిద్ధన ద్వితీయ తనూభవుఁడైన భాస్కరుఁడు క్రీ. శ. 1215 ప్రాంతమున నుండవలెను. ఇట్లగుటచేత భాస్కరుని అన్నయైన ఖడ్గతిక్కనయు ఆప్రాంతమువాఁడే యనుటకు సందియము లేదు.

చోడ తిక్కరాజు కుమారుఁడయిన మన్మసిద్ధిచోడ భూవరుని యమాత్యుఁడు తిక్కన సోమయాజి. ఇందువలన భాస్కరుని సంతతివారయిన సిద్ధన కొమ్మనాదులును, వారి పుత్రులును నెల్లూరి పాలకుఁడు చోడతిక్కరాజును, అతని సంతతివారిని గొలిచినవారే కాని పల్లవ ప్రభువుల కొలువుచేసినవారు కారు. చోడ తిక్కభూపతి శాసనములు క్రీ శ. 1209—10 సంవత్సరములనుండి కానవచ్చుచున్నవి. చోడ తిక్కని కుమారుఁడు మనుమసిద్ధి క్రీ. శ. 1249_50 నుండి పరిపాలించినట్లు తెలియుచున్నది. ఈ కారణముచేత ఖడ్గతిక్కనయు క్రీ. శ. పదుమూఁడవ శతాబ్దిలో నుండినట్లు నిశ్చయింపవచ్చును.

ఇఁక కాటమరాజు కథలోని నల్లసిద్ధిచోళరా జెవ్వరో విచారింపవలసియున్నది. ఇందు నిమిత్తము మనము నెల్లూరిని బరిపాలించిన తెలుఁగు చోళులు - చోడ తిక్కరాజు పూర్వులను గుఱించి తెలిసికొనుట అవసరము. ఇదివరలో నుడివినట్లు చోళులు సూర్యవంశజులు; కాశ్యపగోత్రులు; కరికాలచోళుని సంతతివారు. వీరిలో కొందఱు ద్రవిడదేశమునను, మఱికొందఱు తెలుఁగుదేశమునందును బరిపాలించిరి. ఈ కారణముచేత తెలుఁగుదేశములోని చోళులకు తెలుఁగు చోళులని వ్యవహారము కలిగినది. ప్రధానముగ తెలుఁగు చోళవంశములకు మూలపురుషు లిరువురు: రెండవ కరికాల నృపతి, దశవర్మభూవరుఁడు. రెండవ కరికాలనృపుని వంశమే చాల పెద్దది; ముఖ్యమయినది. ఇం దనేక శాఖలు కలవు. ఈ శాఖలవారి కందఱికి రెండవ కరికాలుని సంతతివాఁడయిన చోడ బిజ్జన మూలపురుషుఁడు. ఈతనికి బిజ్జనయని, తెలుంగు బిజ్జన, విద్యన యని వ్యవహారము. ఇతఁడు గండగోపాల, జగనొబ్బగండ బిరుదాంచితుఁడు. ఈ బిజ్జన సంతతివారిలో మధురాంతక పొత్తపి చోళుఁ డొకఁడు. పాండ్యరాజ్యమునకు రాజధానియైన మధురను జయించుటచేత మధురాంతకుఁ

డని, ఆంధ్రదేశములో పొత్తపి యనునగరమును స్థాపించిన చోళరాజుచేత పొత్తపి చోళుఁడని పేరు కలిగినది. పొత్తపి కడపమండలములోనిది. మధురాంతక పొత్తపిచోళుని వంశమువారికి మొదట పొత్తపి రాజధానిగా నుండెను. ఈవంశములో నుదయించిన దాయభీమచోళుని సంతతి వారు నెల్లూరి నాక్రమించుకొని దానిని రాజధానిని జేసికొని తత్పరిసరప్రాంతమును బరిపాలించిరి. ఈ తెలుఁగుచోళులశాఖ లనేకములు. వీరి శాసనములుకూడ చాల బయలుపడినప్పటికి చాల తరములవఱకు వారి వంశావతార క్రమమును దెలుపునవి అరుదుగ నుండుటవలన ఈ తెలుఁగు చోళుల సంపూర్ణవంశవృక్షము నిచ్చుటకు కాని, శాసనములవలనఁ దెలియవచ్చిన చోళరాజు లందఱి పరస్పర సంబంధమును దెలిసికొనుటకు కాని అవకాశము లేకున్నది. అయినను మన కింతవఱకు దొరికిన ఆకరముల ననుసరించి నెల్లూరు తెలుఁగుచోళుల వంశవృక్షము నీక్రిందిరీతి నీయవచ్చును.



పైనిచ్చిన వంశవృక్షములో సిద్ధరాజులు చాలమంది కలరు. ఈశాఖ తెలుఁగు చోళులు సిద్ధవటములోని సిద్ధేశ్వరస్వామికిని, కాళహస్తిలోని తిరుకాళదేవునికిని భక్తులు. ఈ కారణమున సిద్ధరాజులని సిద్ధిరాజులని, తిరుకాళరాజులని తిక్కరాజులని వారికి పేర్లు కలిగినవి. ఎఱసిద్ధి, తమ్ముసిద్ధి, నలసిద్ధి(నల్లసిద్ధి), మనుమసిద్ధి యనుపేరులు వీరిలో నెక్కువ. ఎఱ్ఱసిద్ధి మొదలైన పేరులు ఈ గ్రంథములోఁగూడ గానవచ్చును. దీని ననుసరించికూడ నల్లసిద్ధి పల్లవవంశజుఁడు కాఁడని నిశ్చయముగఁ జెప్పవచ్చును. కాటమరాజు కథలో వచ్చిన నల్లసిద్ధి భూవరుఁ డెవరో యిఁక నిశ్చయింపవలసి యున్నది.

చోడతిక్క భూపతియు, అతని కుమారుఁడు మనుమసిద్ధ భూనాథుఁడును వరుసగా క్రీ. శ. 1209-10, 1249-50 సంవత్సరములనుండి పరిపాలించినట్లు వారి శాసనములవలనఁ దెలియుచున్నట్లిదివఱకే చెప్పఁబడినది. అట్లయినచో కాటమరాజు కథలోని నల్లసిద్ధి మనుమసిద్ధి ద్వితీయ పుత్రుఁడైన నల్లసిద్ధియైనఁ గావలెను; లేదా చోడ తిక్కరాజు పెదతండ్రియో, పెదతాతయోనైన నల్లసిద్ధియైనఁ గావలెను. ఖడ్గతిక్కన తండ్రియైన సిద్ధనామాత్యుఁడు చోడ తిక్కరాజు మంత్రియైనప్పుడు ఖడ్గతిక్కన చోడ తిక్కరాజు పూర్వులైన నల్లసిద్ధిభూవరులయొద్ద నుండుట యసంభవము. మనుమ గండగోపాలుఁడు క్రీ. శ. 1297 ప్రాంతమున నున్నవాఁడగుటచేత అతని తండ్రియు, చోడ తిక్కభూపతి మనుమఁడును అయిన నల్లసిద్ధిరాజు క్రీ. శ. 1270, 1275 ప్రాంతమున నుండవలెను. కాని కవితిక్కన పెదతండ్రి కుమారుఁడయిన ఖడ్గతిక్కన మనుమసిద్ధి కుమారుఁడైన నల్లసిద్ధికి మంత్రి యగునా యని సంశయము.

నల్లసిద్ధి నామాంకితులైన చోళరాజుల శాసనము లనేకములు కానవచ్చినవి. ఎఱసిద్ధి తమ్ముఁడైన నల్లసిద్ధి శాసనములు శకవర్షము 1109 నుండి 1126 వఱకుఁ గానవచ్చుచున్నవి. నెల్లూరు జిల్లా వెంకటగిరి తాలూకా కడగుంట గ్రామములోని శకవర్షము 1065 (క్రీ. శ. 1148) నాఁటి శాసనమువలన మఱియొక నల్లసిద్ధిరాజును, కురుగుంటపల్లి శివారు గ్రామమయిన దొంగలసానిలోని శకవర్షము 1081 (క్రీ. శ. 1159) నాఁటి శాసనమువలన వేఱొక నల్లసిద్ధిరాజును తెలియవచ్చుచున్నారు. ప్రాయికముగ ఈ రెండు శాసనములవలనఁ దెలియవచ్చు నలసిద్ధి బేతభూపతి కుమారుఁడైన నల్లసిద్ధియగునేమో విచారింపవలసియున్నది. కడప జిల్లా ప్రొద్దుటూరు తాలూకా చాడూరులో శకవర్షము 1114 నకు సరియైన పరీధావి సంవత్సరము నాఁటి నల్లసిద్ధి శాసన మొకటి కలదు. ఈ నల్లసిద్ధిరాజధాని కడప కెనిమిది మైళ్ల దూరముననున్న వల్లూరుపుర మగుటచేత ఈతఁడు నెల్లూరుపురవరాధీశ్వరుఁడు కాఁడనుట నిశ్చయము.

ఈ కాలముననే పల్లవవంశజులలోకూడ ఒక నల్లసిద్ధిరాజుండుటవలన ఈ 'నల్లసిద్ధి సమస్య' మఱింత క్లిష్టమగుచున్నది. శకవర్షము 1172, అనఁగా క్రీ. శ. 1250 లో కాంచీపురమునుండి పరిపాలించుచుండినట్లు తెలియవచ్చిన త్రిభువన చక్రవర్తి విజయగండ గోపాలదేవుఁడను చోళధరణీధవునికి నల్లసిద్ధరసర్ (నల్లసిద్ధరాజు) సామంతుఁడు. ఇతఁడు పల్లవకుల తిలకుఁడు, ముక్కంటికాడువెట్టివంశమున నవతరించినవాఁడు. త్రిభువన చక్రవర్తి విజయగండ గోపాలదేవునికి నల్లసిద్ధ

భూమీశుఁడు సామంతుఁడని స్పష్టముగా చెప్పు శాసనములును ఉన్నవి. అయితే ఈతని శాసనములన్నియు కాంచీపుర సమీప ప్రాంతముననే కానవచ్చుటచేత నితఁ డాప్రాంతమునె పాలించుచుండినట్లు చెప్పవచ్చును. ఇతఁడుకూడ క్రీస్తుశకము పదుమూఁడవ శతాబ్దిలోనే యుండినను నెల్లూరి కధిపతి కానందున ఇతఁడు మన కాటమరాజు కథలోని నల్లసిద్ధి కానేరడు.

ఈపై విషయముల ననుసరించి చూచినచో ఖడ్గతిక్కన ప్రభువైన నల్లసిద్ధి యెవరో నిశ్చయింపఁగుదరకున్నది. ముందు ముందు చరిత్రపరిశోధకు లీ సమస్యను పరిష్కరింపవలసినదే కాని యింతవఱకుఁగల సాధన సామగ్రితో నట్టి పరిష్కారము చేయుట కవకాశము కనిపించుట లేదు.

## యుద్ధకాల విచారణ :

కాటమరాజునకును నల్లసిద్ధికిని యుద్ధ మెప్పుడు జరిగెనన్న విషయమునుగూర్చి చర్చించుటకుఁ దగిన ఆకరములు లేవు. కాటమరాజు కథలో ఈయుద్ధము మాఘ బహుళ అమావాస్య మంగళవారమునాఁడు జరిగినట్లు కలదు. స్థానికచరిత్రలలో నీమాఘమాసము చిత్రభాను సంవత్సరములోనిదిగఁ దెలుపఁబడినది. చిత్రభాను సంవత్సరమునకు సరియైన శకవర్షము లివి — 1024, 1084, 1144, 1204. యుద్ధము జరిగిన మాఘమాసము చిత్రభాను సంవత్సరములోనిదే యైనచో నీసంవత్సరములలో దేనిలో మాఘ బహుళ అమావాస్య మంగళవారమునాఁ డయ్యెనో చూడవలసియున్నది. ఖడ్గతిక్కన సోదరుఁడు శకవర్షము 1137 (క్రీ. శ. 1215) ప్రాంతపువాఁడగుటచే 1024 ను పరిగణనలోనికిఁ దీసికొనక్కఱలేదు. మిగిలిన వానిలో ఒక్క 1034 (క్రీ.శ. 1163) లో మాత్రమే మాఘ బహుళ అమావాస్య మంగళవారమయినది. శకవర్షము 1081 (క్రీ.శ. 1159) లో నల్లసిద్ధి రాజై యుండినట్లు దొంగలసాని శాసనమువలనఁ దెలిసియేయున్నది. అందువలన నీయుద్ధము 1084 లో జరిగినట్లు నిశ్చయింపవచ్చు ననుకొన్నప్పటికి ఖడ్గతిక్కన ఉండియుండఁడు. చోడ తిక్కని పాలనమే శకవర్షము 1181 లో ప్రారంభమైనది. ఈతని రాజ్యపాలనము ప్రారంభము నుండియు సిద్ధన ఈతని కమాత్యుఁడుగా నుండెననుకొన్నను అతని కొమారుఁడైన ఖడ్గతిక్కన అతని కంటె ముం దుండియుండఁడు. ఇఁక మిగిలిన 1144 (క్రీ. శ.1228), 1204 (క్రీ. శ. 1288) లలో మాఘ బహుళ అమావాస్య మంగళవారము కాకపోవుటచేత యుద్ధము జరిగినట్లు తెలియవచ్చిన ఈ తేది, సంవత్సరము సరియైనవి కావని సంశయింపవలసివచ్చుచున్నది.

యుద్ధము జరిగిన కాలము స్థానికచరిత్రలవలన ఇట్లు తెలియుచుండఁగా నెల్లూరు శాసన సంపుటములలోని గుండ్లపాలెము శాసనము శకవర్షము 1170 కాళయుక్తి సంవత్సర కార్తిక శు 5 గురువారమని తెలుపుచున్నది. ఇదికూడ సరియైన తేదిగఁ గనఁబడదు; ఎందువల్లననఁగా శకవర్షము 1170 కి సరియైన బార్హస్పత్యమానాబ్దము కీలక కాని కాళయుక్తి కాదు. కాళయుక్తియే సరియైన సంవత్సరమని, శకవర్ష సంఖ్యయే తప్పుగా చెక్కఁబడియుండునని యనుకొన్నచో దానికి సరియైన శకవర్షము 1180 అగును. ఈ 1180 కాళయుక్తి సంవత్సరమున కార్తిక శు 5 గురువారమునాఁ డయినదేమో విచారింపవలసియున్నది. ఆ సంవత్సరమున అధికమాసము వచ్చినది. ఇది కార్తికమే. అధిక కార్తికమున శుద్ధపంచమీ తిథి శనివారమయినది కాని గురువారము కాలేదు;* నిజ కార్తిక

* గురువారమే కాని శనివారము కాదు

మునకైనను శుద్ధపంచమి శనివారమే అయినది. అందువలన శకవర్షము 1180 కార్తిక శుద్ధ పంచమీ గురువారముకూడ సరియయిన తేదిగా గ్రహింపఁబడదు. శకవర్షము 1170 సరియయినదేమో యనుకొన్న నాసంవత్సరమునకైనను కార్తిక శు 5 శుక్రవారమైనది కాని గురువారము కాలేదు. అందువలన నీ గుండ్లపాలెము శాసనమునం దిచ్చిన యుద్ధకాలముకూడ సరియైనది కాదు. అందువలన నెల్లూరి నల్ల సిద్ధిరాజునకును కాటమరాజునకును యుద్ధ మెప్పుడు జరిగినదియు నిష్కర్షగల యాధారములతో నిర్ణయించుటకు వీలు కాదు.

## గ్రంథరచనా కాలము :

ఈ కాటమరాజు కథ ఎప్పుడు రచింపఁబడియుండునను విషయమునుగూర్చి యించుక విచారింతము. ఖడ్గతిక్కన పదమూఁడవ శతాబ్దిలో నుండినవాఁడగుటచేత నల్లసిద్ధిరాజును ఆ కాలమునందే యుండియుండవలెను. నల్లసిద్ధిరాజువంశమే యిందు తారుమారుగఁ జెప్పఁబడినందున అతని వంశముపేరుకూడ సరిగా తెలియరానంతటి తరువాతి కాలమున నీగ్రంథము రచియింపఁబడవలెను. ఏతద్గ్రంథ రచనాకాలమును నిర్ణయించుటకుఁ దగిన యాకరము లేవియు నీ గ్రంథమున లేవు; కాని యీ గ్రంథము 111 వ పుటలో "చెన్నపట్టణ మేలు చంద్రశేఖరుఁ" డుదాహృతుఁడయినాఁడు. ఈ చంద్రశేఖరుఁ డెవ్వఁడో మనకుఁ దెలియదు. ఇఁక చెన్నపట్టణము మాత్రము చాల ఇటీవలనే వెలసిన పురము. కాళహస్తి ప్రభువంశములోని దామర్ల అంకభూపాలుఁడు రచియించిన ఉషాపరిణయమున చెన్నపట్టణమును గుఱించి యిట్లు తెలుపఁబడినది :

ప్రళయకావేరి మైలాపురంబుఁ గల్మి
కేరమునఁ బోర నది మట్టుపెట్టఁ దండ్రి
పేరఁ దన్మధ్యభూమిని పృథువిభూతి
నలవరిచెఁ జెన్నపట్టణ మయ్యనృపతి.

ఈ యయ్యపరాజు ఉషాపరిణయ కర్తయైన అంకభూపాలుని సోదరుఁడు; చెన్నభూపాలుని కుమారుఁడు. చెన్నరాజునకు వెంకటరాజు, అయ్యపరాజు, అంకరాజు, తిమ్మరాజు, వెంకటరాజు (చినవెంకటరాజు) అని అయిదుగురు తనూభవులు. వీరిలోని అంకనృపాలుఁడే ఉషాపరిణయ కర్త. కాళహస్తీ ప్రభువులైన ఈ దామర్లవారు ఆంధ్రభాషాభిమానులు; ఆంధ్ర ప్రబంధ నిర్మాతలు. చెన్ననృపాలుని సోదరుఁడైన దామర్ల వెంగళభూపాలుఁడు తన తండ్రి వేంకటాద్రి భూవరుని కంకితముగా బహుళాశ్వచరిత్రమను ప్రబంధమును రచియించెను.

అంకభూపాలుని సోదరుఁడైన అయ్యభూనాథుఁడే ప్రళయకావేరికి మైలాపురమునకు ఎడతెగని పోరాటము జరుగుచుండుటచేత దానిని నివారించుటకై ఈరెంటికి మధ్యను తన తండ్రి చెన్ననృపతిపేరఁ జెన్నపట్టణమును వెలయఁజేసెను. దామరల చెన్నభూపతి క్రీ. శ. 1586 మొదలు 1614 వఱకు పరిపాలించిన విజయనగరాధీశ్వరుఁడు ఆరవీటి ఇమ్మడి వేంకటపతి దేవరాయలకు

సామంతుఁడు; రామదేవరాయలకుకూడ సమకాలికుఁడయినందున అతని కుమారులు అయ్యప, అంక భూపాలాదులు రామదేవరాయలకు పిదప విజయనగర రాజ్యాధినేతయైన మూఁడవ వేంకటపతి దేవరాయల కాలమునను (క్రీ. శ. 1632—1642) — ప్రాయకముగ అటుతరువాత కొంతకాలము వఱకునుగూడ — ఉండినట్లు నిశ్చయింపవచ్చును. ఈ కాలమున ప్రళయకావేరి (పులికాటు) డచ్చి వారికిని, మైలాపురము (మైలాపూరు) పోర్చుగీసువారికిని ప్రధాన వ్యాపారస్థానములుగ నుండెను. వర్తకవ్యాపారము విషయమున నీ యుభయులకును ఎడతెగని పోరాటము జరుగుచుండిన కాలమది. ఈపోరాటమును నివర్తింపఁజేయుటకే అయ్యపేంద్రుఁడు ఈరెండు స్థలములకు మధ్య తనతండ్రి చెన్నభూమీశునిపేర చెన్నపట్టణమును గట్టించెను. దామరల అయ్యపరాజు మైసూరిని క్రీ.శ. 1659 నుండి 1672 వఱకు పాలించిన దొడ్డదేవరాయ వొడయరుకు సమకాలికుఁడు. దొడ్డదేవరాయలకును విజయనగరాధీశ్వరులకును గలిగిన పోరాటము సందర్భముననో యేమో ఆ మైసూరి ప్రభువునకును అయ్యప నృపతికిని యుద్ధము జరిగినది. ఈ యుద్ధములో అయ్యపరాజు నిహతుఁడయ్యెను. దొడ్డదేవరాజ వొడయరు పరిపాలన కాలములో జరిగిన యుద్ధమిది. కాని యిది సరిగా ఏసంవత్సరమున జరిగెనో తెలియదు. అయ్యపరాజు 1659, 1672 సంవత్సరముల నడుమ హతుఁడయియుండవలెను. ఈకారణమున చెన్నపట్టణ సంస్థాపనము 1632 కు తరువాతను, 1672 కు పూర్వముననుటకు సందియములేదు. ఎంత పూర్వమను విషయముతో మన కిట ప్రసక్తిలేదు. చెన్నపట్టణము నుదాహరించిన యీ కాటమరాజు కథ పదునేడవ శతాబ్దిలో, అనఁగా నిప్పటికి రెండువందల యేఁబది, మూఁడువందల సంవత్సరముల క్రిందటగాని, ఈలోపున — ప్రాయికముగా పదునేడవ శతాబ్ది అంతమునగాని రచియింపఁబడియుండవలెను. ఇట్లగుట నీగ్రంథమును నల్లసిద్ధికిని కాటమరాజునకును జరిగిన యుద్ధమునకు పిదప నాలుగు వందల సంవత్సరములకుఁ దరువాతగాని రచియింపఁబడలేదని విదితమగుచున్నది.

## గ్రంథ ప్రశస్తి ప్రచారములు:

కాటమరాజుకథ చాల ప్రాచీనకాలమునుంచి యేదో యొక పాటరూపమున వాడుకలో నుండియుండవలెను. దాని ననుసరించియే యీగ్రంథమును పినవెల్లయ రచియించియుండును. హంసవింశతియను తెలుఁగు కావ్యమును రచియించిన అయ్యలరాజు నారాయణామాత్యుని కాలమునాఁటికీ కథకు జనాదర మెక్కువగ నుండెను. యాదవులనఁబడు గొల్లలు కొంతమంది ఊరూరఁ దిరిగి ఈకథను ప్రచారము చేయుచుండినట్లు పై నుడివిన హంసవింశతి కావ్యమువలననే తెలియుచున్నది. కాటమరాజుకథ చెప్పు నుద్దుల గొల్లలను, కథచెప్పు విధమును ఆకావ్య మిట్లు అభివర్ణించుచున్నది:

> “కొమ్ములు వీరణాలు జిగిగుల్కెడు ప్రాఁతల కృష్ణలీలలం
> గ్రమ్ముగుడార్లు వీరుఁడగు కాటమరాజు కథానులాపముల్
> బమ్మిన పుస్తకాలు ముఖపట్టెడి కట్టురుమాలలు న్నెటా
> సొమ్ములు నామముల్ వెలయ నుద్దుల గొల్లలు వచ్చిరంతయుఁన్.
>
> “ఇట్లు వచ్చి,

"ఫెళఫెళ వీరణాల్ ఖళిఫెళి వాయించి
పోటుబో కొమ్ములు నాట మ్రోఁది
దొనకొండ గంగను దొలుత సన్నుతిఁ జేసి
కృష్ణున కతిభక్తిఁ గేలు మోడ్చి
యాదికాలపు గొంగ్ర నందఱఁ గొనియాడి
తాత తండ్రుల పేళ్లు దలఁచి పొగడి
బిరుదుల నరుదుగాఁ జేకొని మొఱయించి
దీవించి వీరుల త్రోవ తెన్ని

కులము పెద్దల కథ లామికొనఁగఁ జెప్పి
సిడము పుట్టించి పుత్రులఁ జెందఁగలరు
వీరులను గొల్వఁడని చెప్పి వీడుకొల్పఁ
జనిరి సుద్దుల గొల్లలు సంతసిల్లి."

కాటమరాజునకు నతులు చేయుచుండుట, వీరులను భక్తితో పూజించుట, యాదవుల ప్రధాన దైవతమైన గంగకు వేఁటలు, బోనములు, సిడులు కావించుట — ఈ యాచారము లిప్పటికిని నడచుచున్నవే. నెల్లూరు జిల్లా దర్శి డివిజను దొనకొండలోని గంగకు ఏటేట గొప్పవి జాతర జరుగును. ఆ విధముగానే కనిగిరి తాలూకా పాలేటి యొడ్డున నున్న పెద్ద ఆలవలపాటి గ్రామములోగూడ ఏటేట వైశాఖ పౌర్ణమికి గంగతిరునాళ్లు జరుగును. ఈ రెండుచోట్ల జరుగు గంగజాతరకు చుట్టు ప్రక్కల గ్రామములనుండి గ్రామీణులు కుంకుమ బండ్లు కట్టుకొని ప్రభలతో తిరునాళ్ల కరుదెంచి గంగకు మ్రొక్కుబడులు చెల్లించి పొంగళ్ళు పొంగింతురు. కాటమరాజు తండ్రి పెద్దరాజు, ఇతని తండ్రి వల్లురాజు. ఆలవల్లురాజని నామాంతరము. ఆ రాజుపేరనే ఈ గ్రామానికి ఆలవలపాడు అనుపేరు కలిగినదేమో. పెద్దిరాజు ఈ గ్రామమున కధిపతి యందురు. ఆ(అ)లవపాటి గంగతిరునాళ్లను గురించి నా నెల్లూరు మండల యాత్రలో నిట్లు వ్రాసియున్నాను.

"ఆ తిరునాళ్లకు కందుకూరు కనిగిరి సీమలనుంచి 'ఎక్కడెక్కడి వాళ్లూ' రెండెడ్లబళ్లు కట్టుకొని రంగురంగుల చీరలు మొదలైనవి గూళ్లుగా కప్పి, ఎడ్లకు వింత వింత అలంకారాలు చేసి ముస్తాబై వస్తారట. కోటప్పకొండ (గుంటూరు), జగ్గన్నతోట (తూర్పుగోదావరి) లలో ప్రభల తీర్థం సాగినట్లు బండితీర్థం సాగుతుందట. వచ్చిన యాత్రికులంతా ఆ వాగు (పాలేటి) ఒడ్డున గంగమ్మకూ కాటమరాజువారికీ పశుక్షేమం కోరి పొంగళ్ళు పొంగిస్తారట. నేరేళ్లవాగుదగ్గర కొండమీద కంచలింగా లున్న ఆలయం ఉన్నది. కొండకింద సమీపాన రావిచెట్టున్న స్థలందగ్గర యాదవ వీరులు యుద్ధానంతరం ఏట్లో కడిగిన కత్తులు పాతినారని చెప్తారు. వాగు కవతలి వొడ్డున సమీపానే గంగదేవళం ఉన్నది.

"పశువుల నిమిత్తమై వచ్చిన యుద్ధములో యాదవులైన కాటమరాజువారే గెలిచినారు గనుక ఇప్పటికీ ఆ ప్రాంతపు పశుపాలకులకు వారిమీద ఉండే భక్తి అట్టిది. ఇప్పటికీ ఆ ప్రాంతాల

వారికీర్తి మాసిపోలేదు. మన్యాలకూ కొండలకూ మేతకోసం పశువులను తోలుకపోయేటప్పుడల్లా పశుధనం కలవారందరూ అవి తిరుగా సురక్షితంగా ఇల్లు చేరుకొన్నట్లయితే పొంగళ్లు పొంగిస్తామని కాటమరాజువారికి మ్రొక్కుకొంటారట. ఎప్పటి యుద్ధం! ఎప్పటి కాటమరాజు! ఇప్పటికీ పోలేదు విజయుడైన ఆరాజు పలుకుబడి! ఆ ప్రాంతాల కాటమరాజువారికి గుళ్ళుకూడా లేచినవి. మార్కాపురసీమలో ఇప్పటికీ కాటమరాజు శిలావిగ్రహాలను చూడవచ్చును. మార్లెళ్లగ్రామము కనిగిరి తాలూకాలోనిది. ఈమార్లెళ్ల ప్రాంతమే మార్లెళ్లసీమ.

"గంగగుడి ఉన్నచోట్ల సాధారణంగా కాటమరాజు విగ్రహం కనబడుతూనే ఉంటుంది. గంగ కాటమరాజువారికి కులదేవతట. పశువులకు సంబంధించిన వివాదంలో విజయం పొంది ఆ ప్రాంతాల పశుధనం కలవారిపాలిటి పరమదైవమైనాడు కాటమరాజు.

"కాటమరాజు కథకు ప్రచారం విశేషం అక్కడ. అలవలపాటి గంగతిరునాళ్లలో రాత్రులకు రాత్రులు బట్టురాయబారము, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, కాటమరాజుకథ — ఈ మొదలైన పాటలలోనే గడచిపోతవట."

## కాటమరాజుకథా ప్రచారకులు :

ఈ కాటమరాజుకథను ప్రచారము చేయుట కవలంబింపఁబడిన విధానము చాల విచిత్రమైనది. దీనిని గురించి నా నెల్లూరు మండల యాత్రలోనే మొదటిమాటు విన్నాను. 'నా నెల్లూరు మండల యాత్ర'లో దీనినిగురించి వ్రాసిన విషయమునే ఈక్రింద పొందుపఱుచుచున్నాను.

"కాటమరాజువారు మొదట తమ కథ ప్రచారంచేయుట కధికారం ఇచ్చినది కొమ్మువాళ్లకట. వీళ్లది మాదిగలలో (హరిజనులలో) ఒకకులం. కాటమరాజు వారి కథలు మాసిపోకుండా కాపాడినది వీరేనట. ఇందుమూలాన యాదవులైన గొల్లలు వాళ్లను ఎక్కువగా గౌరవిస్తారట. ఎప్పుడయినా కొమ్మువాడు యాదవుల (గొల్లల) ఇంటికి వస్తే వానికి ముందు భోజనం పెట్టకుండా గొల్లలు భోజనం చేయరాదట. ఇది అనుశ్రుతముగా వస్తున్న ఆచారం. ఇప్పటికీ ఈ యాచారం సాగుతున్నదట. తమ పూర్వచరిత్రను కాపాడి ప్రచారంచేసే ఆజాతికి గొల్లలు ఇంతవరకు చూపించిన, ఇప్పటికీ చూపిస్తున్న అఖండగౌరవం ఇది.

"ఈ కథలు పాడేవాళ్ళు గొల్లలలోకూడా ఉన్నారట. వారికి పికిలివాళ్లని పేరు. వీరు ముఖ్యంగా కందుకూరు తాలూకా ముప్పాళ్ల గ్రామంలో ఉన్నారు. వారికీపాటలు పాడడం వంశపరంపరగా వస్తూవున్న వృత్తి అయింది. కందుకూరు తాలూకా గ్రామాలలో ఎక్కడెక్కడ అమ్మవారి జాతరలైనా ఈపాటలు పాడేనిమిత్తం వీళ్లు వస్తూవుంటారట. ఇందుకు వీళ్లకు నివర్తనలు (వృత్తిమామూళ్లు) ఉన్నవట. పంచలింగాలకొండ గంగతిరునాళ్ళలో కొమ్మువాళ్లే కాక పికిలివాళ్లుకూడా ఈ పదాలు పాడుతారట. కాని అక్కడ ఆచారం ఏమిటంటే ప్రాచీన సంప్రదాయ గౌరవాన్నిబట్టి కొమ్మువాళ్ళు ముందుగా గుడా కత్తితేనేకాని పికిలివాళ్లెత్తకూడదట. ఇవి కాటమరాజు కథకు సంబంధించిన ప్రాచీన సంప్రదాయాలు ఆప్రాంతాల వాడుకలో ఉన్నవి."

## 'ఆవుల పరపు':

కాటమరాజువారికిని, వారితోఁబాటు యుద్ధములో అతిసాహసపరాక్రమములతోఁ బోరాడిన గోగణమునకును కొన్నికొన్ని గ్రామములలో క్రీ.శ. 1800 ల ప్రాంతములవఱకు నుత్సవములు జరుగుచుండినట్లు స్థానికచరిత్రలవలనఁ దెలియుచున్నది. స్థానికచరిత్రములను కైఫీయతులు 1800 ల ప్రాంతమున వ్రాయఁబడినవి. కడపజిల్లాలోని సిద్ధవటము కైఫీయతువలన కుంభగిరి గ్రామములో నడచుచుండిన ఈ యుత్సవమునకు సంబంధించిన యీక్రింది విశేషములు తెలియవచ్చుచున్నవి.

"కాటమరాజువారి సైన్యంలో హతశేషులైన యాదవులు యుద్ధరంగమందు తమతోకూడా నిలిచి శత్రువులను హతంచేసినవారియొక్క రూపములు శిలలపైన చెక్కించి[ని*]. వీరులు అనే ప్రతిమలు తాలూకు మజుకూరు 'సగిలిపాయకట్టు' మాంజే కుంభగిరి అనే గ్రామములోను వున్నవి. ఇదిగాక యుద్ధరంగమున ప్రాణములు వదలి సద్గతిని పొందిన గోగణములయొక్క శిరస్సులు శృంగములతోకూడా తీసుకవచ్చి వాటికి పసుపు రాచి నిత్య సాంబ్రాణి ధూపములు యిచ్చి యిండ్లలో వుంచుకొని, — యిదిగాక గోవుల ఆకృతిగా శిలలపైని చెక్కించి అవిన్ని పఖుస్తళమందు వుంచి పూజలు చేస్తున్నారు. ఆశిలలు వుంచిన స్తళానకు జనులు ఆవులమాలె అని చెప్పుకుంటున్నారు. ఆ ఆవులమాలెవద్ద పైని చెప్పిన యాదవులు ప్రతిసంవత్సరమున్ను తాళమేళములు పంబజోళ్లు వీరతాళ్ళు జమిడికెలు వురవన మద్దెళలు — యీ వాద్యములతో సంభ్రమం (సంబరం) చేస్తున్నారు. ఈ సంభ్రమానకు వారి సంబంధీకులైనవారున్ను వారు కట్టించిన ఆవులమాలెయందు అభిమానంగలవారున్ను యెంత యెంత దూరంలో వున్నాగాని వారిని కాటమరాజుగారి పాంగెస్తులని వాడుతున్నారు. ఆలాగంటి పాంగ్యస్తులు అయినవారికి పసుపుగుడ్డను అక్షతలు కట్టి సంభ్రమంచేసే దినం నిర్ణయం చెప్పి పంపించీ వార్ని పిల్వానంపించి అందరు గుంపుగూడి ఆవులమాలెవద్ద సంభ్రమం చేసేటప్పుడు పాంగ్యస్తులు అయినవారికిలో వారి వారికి తానకములు అనే నిర్ణయం కలదు. తానకమనగా యేమంటే వెల్ల యెద్దు తానకం, బొల్లెద్దు తానకం, బోడియెద్దు తానకం, కరెద్దు తానకం పైయెద్దు తానకం — యీ ప్రకారం అనేక తానకములు అనే నిర్ణయం కలదు. తానకసౌజ్ఞ యేమంటే వెల్లెద్దు తానకంవాడు ఆవులమాలెవద్దికి వచ్చి నిలిచివున్నప్పుడు పంబకారు అంటే పంబజోడు వాయించేవాడు వెల్లెద్దు పరాక్రమం దలచి ఆ ఆవు మేయుట నీరు త్రాగుట గంతులు వేయుట అక్కడక్కడ దిరుగుట తుదను యుద్ధరంగములో చేశిన పరాక్రమము సహాగా పొగడితే ఆతానకం అనుసరించివుండేవానికి శివం వచ్చేది కలదు. యీప్రకారం కొంతసేపు తానకములు పాడిన తరువాత కాటమరాజువారి పరాక్రమమున్ను సుద్దులు అని పాడేది కలదు. యీసంభ్రమములోను యిండ్లవద్ద వుండే శృంగసహితములైన గోశిరస్సులు తెచ్చి మాలెలో వుంచేది కలదు. అందుకు శనగలు పెసలు నానవేసి శిలపైని వుండే ఆవుల ప్రతిమలకున్ను దేవరావులు అనే గోశిరస్సులకున్ను నైవేద్యం చెల్లించి ఆ పణ్యారం బ్రదికివున్న గోవులకు తినిపించేది కలదు. ఈ సంభ్రమం (సంబరం) పేరు ఆవుల పరుపు అని వాడుకనేవారు."

ఇప్పటికి కడప నెల్లూరు జిల్లాలలోని కొన్నిగ్రామములలో ఇట్టి వేడుకలు జరుగుచున్నట్లు తెలియుచున్నది. ఆవుల పరుపు అన్నదాని కర్థమేమో. అది ఆవుల పరపు అని యుండవలెనని నా యూహ. పరపు అనఁగా ప్రదేశము (ఉదా: నెత్తపు పరపు; తుళప్పురపు). ఆవులకు సంబంధించిన వేడుకలు జరుగు ప్రదేశము గనుక దీనికి ఆవుల పరుపు అని పేరు కలిగెనేమో.

పురశవాకం, మద్రాసు,
21-2-1958.

మల్లంపల్లి సోమశేఖర శర్మ.

# కాటమరాజు కథ



## అవతరణిక

శ్రీ జాహ్నవీగంగఁ జిత్తమునఁ దలఁచి
రాజితంబుగ విఘ్నరాజుకు మ్రొక్కి
కమలేశుఁ గీర్తించి కమలాక్షుఁ దలఁచి
కరిచర్మధరుఁ డైనఘనునిఁ బ్రార్థించి
చవుషష్టివిద్యావిశారదుల నెంచి
కవివర్యులకు నమస్కారంబు సేసి
హరిపాదసేవకుఁ డతిభక్తిపరుఁడు
గుణుతైన కొమనాల గోత్రాబ్ధి చంద్రుఁ
డెనయంగ గంగుల యెల్లయ్య కూర్మి
తనయుఁడు సర్వన తగు సహోదరుఁడు
పినయెల్లి యనువాఁడు ప్రియముము దీపింప
వలనొప్ప శ్రీనాథు వచనపద్ధతిని
సలిపెను యదుశాస్త్రచరిత మంతయును
నాకథావృత్తాంత మది యెట్టి దనిన

## కథాప్రారంభము

శ్రీకరం బైనట్టిసృష్టి లోపలను
కాటరా జనువాఁడు ఘనపుణ్యపరుఁడు
అమితవిక్రమశాలి యాదవరాజు
కుముదబంధుకులుండు గోపోషకుండు
పెద్దిరా జనువాని ప్రియనందనుండు
వగకునై పశువులఁ బాకనాట మేపి

పుల్లరి యీయక పోగులుచు వచ్చి
యెలమి వైరం బున్నయెఱగడ్డపాటఁ
బల్లవరాజుతోఁ బగవచ్చె ననుచు
వీరగంగమ ముందు వీరులై మేము
పగఱతోఁ బోరాడి పగదీర్తు మనుచుఁ
బరిచారకులఁ బిల్చి పలికెను రాజు
పాలేరు గడిసేసి పరఁగ క్షణమందు
మాతండ్రి పోల్రాజు మఱి యెదురుగాను
తమ రెండుతావుకుఁ దమక మేర్పఱచి
రణవీధి తమచుట్టు రమ్య మౌనటుల
నెత్తుగాను గుడారు లెత్తింపుఁ డనుచుఁ
గాటమరాజు కొంకక యానతిచ్చెఁ
బరిచారకులు నట్టు వనుపడి వేగఁ
దఱచుగాను గుడార్లఁ దగవొప్ప నెత్తి
తగ నొప్పఁగా వీరతమక మేర్పఱచి
చిత్తర్వుల గుడార్లు చెంత నెత్తించి
పచ్చనన్నె గుడార్లు పరఁగ నెత్తించి
నలుబది స్తంభాల నామతీర్థంపు
గూడార్లు రత్నాలగూడార్లు ముత్తె
గూడార్లు వెలిపట్టుగూడార్లు చాల
నెండలకు గూడార్లు దండివానలకు
జిడ్డుమైనపుఁ బూతఁ జెలఁగుగుడార్లు
పచ్చపట్టుగుడార్లు పందిటిగుడార్లు
నెడలేక యెత్తించి రెన్నో గుడార్లు
గూడార్లకును బైఁడికుండ లెత్తించి
ఘన శరభ శార్దూల గండ భేరుండ
ముఖబిరుదు లన్నియు ముంద ఱెత్తించి
నలనన్న చూచి యంతట సంతసిల్లి
తన మఱఁదితోఁ దాను దగ వేడ్కతోను
నలుబది స్తంభాల నడుగుడారమున
వలనొప్పఁ బంచమహావాద్యములతోను



పెద్దిరాజునకు భార్య పెద్దిమాదేవి స్వప్నవార్తను
జెప్పుట. సంతానమునకై తనను గొలువ
రమ్మని కటకముస్వామి స్వప్నమున
తెలియ జేసెనట.



పెద్దిరాజు, పెద్దిమాదేవి సంతానమునకై కటకముస్వామిని
ప్రార్థించుట.



కాటమరాజు, పాపనూకమ్మ వారికి
జన్మించుట.



కాటమరాజు సైన్యసమేతముగావచ్చి వాలికేతవరాజును సంహరించి
పగతీర్చుకొనుట. ఈ వాలికేతవరాజే తన తండ్రిమరణమునకు
కారణభూతుడు.



కాటమరాజు నలసిద్ధిసైన్యముతో యుద్ధమున గదియుట. నలసిద్ధి యెక్కిన
యేనుగును బొల్లియావు తన ఒంటికొమ్ముతో విరుగబొడుచుట.

నెలకొని యుండంగ నెల్లూరనుండి
రసికుఁ డౌనొకభట్టు రాయబారింప

## భట్టు రాయబారము వచ్చుట

సిద్ధిరాజుపంపున శీఘ్రుంబె వచ్చి
కాటరాజు గుడార్లు కనువిచ్చి చూచి
యాశ్చర్య మందుచు నాభట్టు వచ్చి
కనుగొని రాజుకుఁ గనులెదుట నిలిచి
యార్భటంబులు సేసి యమరంగఁ జదివె
'బ్రహ్మయు వగు నీకుఁ బార్థివేంద్రుండ!
బడుగులరాజవు బహుకీర్తిదీప!
ఘనరిపుసంహార! కాటమరాజ!
సోమవంశాధీశ! చోద్యంబు వినుము
ఒడబడిన పుల్లరి నొప్ప నియకుంట
యపకీర్తి చేకూర్చు నడుగు దాఁటకుము
ఇప్పించు పుల్లరి యిటునటు కదలు
తప్పనాడకు నీతిధర్మమ్ము' లనఁగ
నామాటలకు రాజు అగ్నియై మండి

## కాటమరాజు పై ముఖ్యము

కొమరుబంగరుభట్టు గొబ్బునఁ బిలిచి
పలికించె నలసిద్ధి భట్టుతో నిట్లు
పల్లెత్తి పుల్లరి పలుకాడు నేనిఁ
గడువేగమున వానిఁ గదలి పొమ్మనుము
భట్టు భట్టును గదిసి భాషించి రపుడు
''రాయబారము చాలు రసికుఁడ! వినుము
పుల్లరంటే కాసు పుట్ట దిచ్చోట
నీమాట మీరాజు కెఱిఁగింప వోయి
సమ్మతి గాదేని సరగ మామీఁద
దండెత్తి మీరాజుఁ దరలి రమ్మనుము

కాక మాపెద్దల కడు యుద్ధమహిమ
చెవి కెక్క యుండు మీక్షితిపాలకునకుఁ
గదనమంటే వీడు కదల లేఁడేమొ
తఱచు మాటలు మాని దాగుండు మనుము"
అంత చింతాక్రాంతుఁ డై రాయభట్టు
రాయబారము చెడె రా యన్నవంత
కొండంత నెత్తిఁ బైకొన నూరి కేఁగెఁ
గలియుగకర్ణుండు కాటమరాజు
భట్టు మళ్లుటఁ జూచి ఫక్కున నవ్వి
పద్మనాయునితోడఁ బగ విచారించి
'నాయుఁడ! వినవోయి! నాచిని మఱఁది!
పాయరాని చెలికాఁడ! పద్మరాఘువుఁడ!
మొదవు నాకో ధర్మయుద్ధ మటంచుఁ
గలిగితే మన కబ్బుఁ గైలాస మనుచు
సంతోషపడుదుము సమయా మేతెంచెఁ
దొల్లి పెద్దల పగల్ దొరకొని వచ్చెఁ
బల్లవరాజుతోఁ బాలేటియొద్దఁ
బగ గొన్న మాతండ్రి ప్రతిన యీడేర్తుఁ
దెంపున సిద్ధిరా జంపినభట్టు
పగలు చాటుచుఁ బోయెఁ బగ నిజం బాయె
రాయబారము వారి రాజుకుఁ జెప్పి
యెప్పుడు వచ్చునో యెఱుఁగంగ రాదు
కడువేగఁ గావలెఁ గట్టాయితమ్ము'

## కాటమరాజు యుద్ధమునకు సిద్ధ మగుట

అని దొనకొండ తేఁ డయితన్న కంత
పల్లికొండకు జాబు పాటించి వ్రాసి
కాలారిచేతికి గ్రక్కున నిచ్చి
పసుగున రమ్మని పంపుమా యనుచుఁ
బద్మనాయకునితోఁ బల్కె నాక్షణమె

దానకొండరాజులు చనుదెంచువఱకు
బొల్లావు లెద్దులకుఁ జల్లవారికిని
"బగ చేరువయ్యెను బయనంబు కొండు
ఎఱుక చేసితి మంచు నెఱింగించుమోయి!"
అని చెప్ప నాయకుఁ డాచల్ల వారి
కెఱుక సేయించె నంతేని వేగముగ
నావేళ సూర్యుండు నస్తాద్రి కరిగె
నాప్రొద్దు యాదవుల కానంద మాయెఁ
బరమాన్నముల తోడ బంతి భోంచేసి
మఱి నిద్ర వోయిరి మందపాలకులు
భల్లునఁ దెల్లవాఱె భానుఁ డుదయించె
నప్పుడు వల్లికొండ అయితమరాజు
భట్టావుల రాజు పరఁగ నెల్లయ్య
సకలసంభ్రమముతోఁ జనుదెంచి రంత
నాదెళ్లనాయుండు నేతిముద్దయ్య
కలనికి సంతోషకలితులై వచ్చి
రరివీరులకు వైరి కరియావులన్న
పగల నిర్జింపఁగఁ బంచలింగాల
పర్వతము నెల్లారి ప్రాంతంబునకును
జాల వేడుక నొంది సరఁగ నేతెంచె
బిరుదు గలమన్నీఁడు బీరినేఁ డంత
పగతుర కరులను బట్టి వధింతు
నని వేడ్క నలరుచు నతివేగ వచ్చె
దానకొండ నున్నట్టి దుర్గాధిపతులు
వచ్చి రందఱు నటకు వసుధ గంపింపఁ
బల్లికొండను గంగఁ బ్రార్థించి రంత
పుడమి యాకాశంబు పొడమనినాఁడు
ఏకజలంబవై వెలుఁగుచుండితివి
అండబ్రహ్మాండంబు లఖిలంబు నీవు
అందుఁ బుట్టినవారి కాదర్వ నీవు

తగ సూర్యచంద్రులకు దారివి నీవు
జగము లన్నియుఁ బ్రోచు జగదంబ వీవు
ఏకస్వరూప వా నేలికవు నీవు
సరి నకారాది యక్షరరూప వీవు
మదముల నుడిగింప మాతవు నీవు
జగములు వెలిఁగింప జగదేవి వీవు
స్త్రీ పురుషులు నీవు సిద్ధులు నీవు
ఓంకారరూపవు యుగకాళి వీవు
శరణన్న వారిని సరిఁ బ్రోచు నీవు
ఘనులు ప్రార్థన సేయఁ గరుణించు నీవు
వల్లవుల్ గొలిచెడు వరదయామూర్తి!
తిరుమ దు లర్చించు దివ్యస్వరూపి!
మముఁ గరుణ సూడంగ మఱియుఁ బాలేట
ఘనముగా వెలసిన గంగరో! నీవు
వల్లవుల వైకుంఠ వాసులఁ జేసు
సమరంబుఁ జేయించు జనని! చిన్మూర్తి!''
యనుచుఁ గీర్తింపంగ నంత నాగంగ
చెలఁగి దర్శన మీయ సేన లందఱును
హస్తముల్ ముకుళించి యామె నెలవంది
కొమరొప్ప లింగాలకొండ కేతేర
నంతఁ గాటమరాజు నందఱఁ జూచి
గూడారులో నుండి గొబ్బున వచ్చి
పల్లికొండకు దండు పయనంబు సేసి
పసఁగ నయితన్నను బ్రస్తుతి సేసి
యందఱ నెదఁ జేర్చి హర్షించె నపుడు
కోర్కెతో లింగాలకొండపై కెక్కి
ఘనముగా గంగరేక్కడకు నేతెంచి
కడఁగి యాక్రింద లింగములఁ దిలకించి
మామ యని హర్షించి మఱి పల్లికొండ
తగ లింగ మైనట్టి తండ్రికిఁ గొమాళ్లు
దండంబుఁ బెట్టి ప్రదక్షిణము సేసి

ములరు చుండిరి యప్పు డాపల్లికొండ
తనమామ లింగంబు దగ వేఁడె నిట్లు
"శంకరా! శివశివా! శరణు మహాదేవ!
భక్తుల పాలిటి పరమేశ! యీశ!
తొలి చంద్రశేఖరుని దొడ్డఁ బూజించి
పర్వతంబున నిల్పి పరమేశు కృపను
నావుల వలురాజు కతిపుణ్యవశత
వల్లమకుఁ బోల్రాజువై పుట్టినావు
ఆ పురహరు రూప మట్టు పూజ చేసి
తుదను జంగాలకై దురములో నీవు
పరిణాన జంగాలఁ బర్వతము పంపి
చోడదళంబులు చుట్టంగ నీకు
హరహరా! యని యెంచి యాటు పాఱఁ జూచి
చక్కగా కానాపకానలఁ గూల్చి
ముప్పై మూఁడు కోట్ల నుందుగా నంపి
అరువై యాఱు పోట్లు నాకతిభార మాయె
హరిపురికి సెలవిచ్చి యంపు నన్నంటే
వల్లవుల యోమామ! వలదంటి నీవు
తల్లిదండ్రులు లేని తనయుల నర్థిఁ
బంచకొండమువారి బాగుగాఁ దెచ్చి
యింత లంతల వారి నీడేర్చు మంటి
బాలల దొసకొండ యేలించు మంటి
చిత్రభానున మాకు శిశువు లొప్పింపు
చిత్రభానునఁ బగ సిద్ధముగ వచ్చుఁ
దనకుఁ బంచలింగాల కొండ తా వని పలికి
గంగ రేకులక్రింద లింగమై యుందు
నని పల్కినాఁడవు ఘనుఁడ వోమామ!
నీమాట మీఱక నీకృపచేత
నరలేక పెంచితి హర్షించి పలుకు
డాసిరి పగవారు దగ్గర వచ్చి
బాలుర పూఁటవై పరఁగంగ మాకుఁ

బగ దీర్ప సెలవిచ్చి పంపవే మమ్ముఁ
బల్లికొండ మాటలకుఁ బకపక నవ్వి
యావుల పోలురా జనులింగమూర్తి
ప్రత్యక్షమై వానిఁ బరఁగంగ మెచ్చి
పగఁ దీర్చు మని సెలవు బాగుగా నిచ్చి
యందఱికి సెలవిచ్చె నాలింగమూర్తి
ధీరులై సెలవంది దిగి వచ్చి కొండ
వీరతమకముకడ వేగంబె నిలిచి
పల్లికొండ రాజులఁ బరఁగంగఁ బిలిచి
పట్టపురా జెక్కఁ బయనంబు చెప్పెఁ
గరియావుల రాజు ఘనుఁడు వల్లభన్న
నాచకూళ్లనాయఁడు నేతివారి ముద్దయ్య
పోచయ్య పుమ్మయ్య పుత్తమరాజు
మొదలైన వీరులు మోదముతోడఁ
బదిలముగ తాణాలు బాగుగా నిలుప
నత్తఱి బీరిసేఁ డతివేగ మ్రొక్కి
శెలవు దయసేయు మని సన్నిధి నిలిచె
మంగలిపాటను మఱి యుండ మనిరి
అయితన్న పల్లికొండ యతిభక్తితోను
గాటమరాజును గడుభక్తితోను
నాదినారాయణుని నాత్మలోఁ దలఁచి
గంగను నిలువేల్పు ఘనముగాఁ దలఁచి
పరఁగఁ దమకానకుఁ బ్రదక్షిణము చేసి
యావీరతమకాన నపుడు కూర్చుండి
భీమదుర్యోధనుల బిరుదులు వినుచు
రహిం వీరతమకాన రామాయణమ్ము
వినుచును సాగటాలు వేడ్కనాడుచును
బగఱను నెదురెదురు పరికించుచుండ

విఫలుఁ డగుసిద్ధిరాజు రణసన్నద్ధుఁ డౌట

నంతట నెల్లూర నాసిద్ధిరాజు
వంతుగా వీరపరివారంబు గొల్వ
నాయకు లందఱు నాట్యశాలకడ
నాయత్తు లగుచుఁ డా మపుడు గూర్చుండి
రాయెడ భట్టును రాయబారంబు
ముగియించుకొని వచ్చి ముందర నిలిచి
ముకుళితహస్తుఁడై మొఱ చెప్పసాఁగె
“సిద్ధిరాజ ! నీయాన శీఘ్రమే పోయి
పాలేటియొద్దను బంచలింగాల
కొండకుఁ దూర్పునఁ గొదవేమి లేక
వన్నెవన్నె గుడార్లు వాడ లేర్పడఁగ
నందంద యెత్తించి యాదవరాజు
నలుబది స్తంభాల నడుగుడారముఁ
బగడసాలల నాడ తగవు పాటించి
దర్శించి మన్ననఁ దగఁ బ్రస్తుతించి
‘పసుల పుల్లరి యీక మసలి వచ్చితిరి
ఒప్పినధన మీక యూరకుండితిరి
శిలాక్షరము వంటిది సిద్ధిరాజుధనము
నెఱముడుపులు గట్టి నెల్లూరి కంపి
యడుగు సాగుట యుక్త’ మన్నంత లోనఁ
గొదకొని యాదవుల్ కోపాన లేచి
యాగ్రహోదగ్రులై యవనీశ ! నిన్నుఁ
దూల నాడుచును దుందుడుకు లాడుచును
బుల్లరి యిమ్మంటె పొడిపింతు మనిరి
‘భట్టవు నీ వని పలుకు చున్నాము
కయ్యంబు తప్పక కాఁబట్టె యుండె
రమ్మను మనికి మీరాజు నింతటనె
శక్తి లేకుండిన శరణార్థు మనుము’
అని తూలనాఁడి న న్ననిపి” రటన్న

విన్నాఁడో లేదో తా వివశుఁడై వ్రాలె
నాగ్రహోదగ్రుఁడై యట్టిట్టు సూచి
మన్నీల దొరలను మంత్రులఁ బిలిచి
'సాహసులార! యోక్షత్రియు లార!
భారతవేత్త లా భావజ్ఞు లార!
వినుఁడి యాదవుల యీ వెకలి సాహసము
తొలి కౌరవులనాఁడె ధూర్తు లటంచు
వారిపై నాకెంతో వైరస్య ముండె
భీమినాయఁ డనేకప్రియములు సెప్పె
భూమి యాదవు లెంతో పుణ్యాత్ము లనుచు
సత్యము దప్పనిసరసు లటంచు
నామాట నమ్మి నే నావులకొఱకు
భూమి నిచ్చితి నంతఁ బూరెల్ల మేసి
యాయావు లెంతెంత హాని చేసినను
దనువులో సత్యంబు దప్పకుండితిమి
వీడక గొల్లలు విపరీతముగను
నాడుచున్నా రిప్పు డడ్డఁకువ లేక
పదునైన మాటలు పలికిన వెనుక
గొల్లరాజును లెక్క గొనకుండ దండు
వెళ్లకుండంగాదు వెస రాచపాడి'
సిద్ధన్న తిక్కన్న శీఘ్రమే పిలిచి
లేఖ లుద్దగిరికి లిఖియించు మనెను
కోట్ల పర్యంతము కూడును దండు
చీట్లు వ్రాయించుమీ శీఘ్రాన తిక్క!
వాలాయముగ దండు వత్తురు గాని
కోలలకయి బోయగొట్టాల కంపు
వేలు లక్షలు వచ్చు వివర మేర్పడను
ననినఁ దిక్కనమంత్రి యన్ని దిక్కులకుఁ
గడువేగమునఁ బంపెఁ గమ్మ రమ్మనుచు
నంపిన లేఖల కవని యాకసము

కంపింపగా దంతు కదలి యేతెంచె
తిరువణామల తిప్పరాజు తిరుకంటరాజు
నిరువదివేలతో నేతెంచె నప్పుడు
పెదవేఁగి చొక్కరాజు పెదవరుడరాజు
మదగజంబుల తోడ మఱి వేగ వచ్చె
ఆర్లకొండచ్చిరా జాదివన్నె మాదిరాజు
తర్లెను మూఁడువేల్ దళముల తోను
గయకొండ నేలెడి ఘనగంగరాజు .
పదివేల దళముతోఁ బరఁగ నేతెంచె
నుర్లకొండ సోమయ్య యుదయాద్రి యుమ్మయ్య
సర్వసైన్యములతో సరఁగ నేతెంచె
నాదుకొని నండెత్తె నాయకొని వచ్చె
చన్నపట్టణమేలు చంద్రశేఖరుఁడు
వేదముని వెంగళయ వీరబలగముతో
నెనయంగ దండెత్తె యాదవుల మీఁద
పట్టుకోట బసువరాజు పాపతిమ్మరాజు
కట్టుజల్లులు గడలు గుమిగూడి వచ్చె
రాకోట యేలెడి రాయశృంగుండు
నత్యుగ్రకోపమున నతివేగ వచ్చె
చోడమండల మేలు సురియ సోమన్న
సబడీల మూఁకతో సరగ నేతెంచె
బరఁగ కాళహస్తి యేలు పాపతిమ్మరాజు
వెలికంచి యేలెడి వెంగళపతియు
జోళ్లగుర్రాలతో జోఁకతో వచ్చె
ప్రభగిరి పట్న మేలు పద్మశేఖరుఁడు
రభసంబుతో దండు రాగిడలః గాను
నందికనుమ నాగరాజు నాలుగువేల
యందెల గడలతో నప్పు డేతెంచె
నార్థవనమును నేలు సంగభీతినేఁడు
వేడుకతో దండు వేగంబె వచ్చె

నందివాడ పోతినేఁడు నన్నూరుమూకతో
నందు గల్గె నటంచు సరగ నేతెంచె
పెచ్చెమల తిమ్మరాజు పెదభావరాజు
నచ్చాళిమూకతో నప్పు డేతెంచె
బలవంతుఁ డగువాఁడు పట్టుపిన్నయ్య
విలుమూక పండ్రెండువేలతో వచ్చె
తొమ్మిది వేల్ మూక జోతుల సోమినేఁడు
సమ్మతమ్ముగ దండు సరగ నేతెంచె
మన్న మదిరి నేలేటి మంచిగంధము మాదిరాజు
యేకాంగిమూకతో నేతెంచె నపుడు
పసులమందలకంటెఁ బదిలక్ష లగుచు
మసలుచుఁ గదిలిరి మఱి వేగముగను
గొల్లమందల కంటెఁ గోటాను కోట్లు
అల్లూరి మూకలు నరుదెంచి వచ్చె
మాళవ సౌరాష్ట్ర మగధభూపతులు
కాశ్మీర కర్ణాట కాంభోజ పతులు
భాసుర నేపాళ పాండ్య భూపతులు
బర్బర కేకాది బహుమూక లెల్ల
ద్రావిడ కొంకణ ధరణిపాలకులు
నరసి భావింపఁగా నాంధ్రభూపతులు
సింధు కుకుర కురు శింశుపాలకులు
నెసఁగంగ నెల్లూరి కేతెంచి రపుడు
కరి ఘోటకంబులుఁ గాల్బలంబులు స
ర్వేపల్లి మిట్టపై వెస దళాల్ నిలిచె
వేగుచో సంద్రము వెల్ విరిసినట్లు
బాగుగా నేతెంచె బహుళ సైన్యములు
నిలిచిరి వజ్రీలు నిర్విచారమున
దళవాయు లంపిరి తగు వేడ్కతోను
బుడమీశు కావార్త పోయి విన్పింపఁ
గడు వేగమున భద్రగజమును నెక్కి
యన్నలుఁ దమ్ములు నాప్తవర్గంబు

నెన్నికఁ దేజీల నెక్కి రిర్గడల
బలసేనుఁడై వీరపరివారహితులు
కొలువంగ ముత్యాలగొడుగులనీడ
బహువాద్యమేళముల్ బలువిడి మ్రోయ
మహిపాలుఁ డేతెంచె మంత్రులుఁ దాను
దూరాన రాఁగాను దుర్గాధిపతులు
తగు బార్లుఁ దీర్చిరి దళము లందఱను
భానుకులేశుండు బారుల వెంట
వెనుకను నడిపించె వేడుకగాను
గరితురంగంబుల ఘనవీరభటుల
విరివైన లొటిపిటల్ వెస రాఁగఁ జూచి
వారి యాటోపంబు వారి ముస్తీబు
వారి సన్నాహంబు వరుసతోఁ జూచి
యప్పుడు సిద్ధిరా జతి సంతసిల్లి
బంధుజనుల్ తాను పట్నాన కరిగె
యేరాజు పరివార మేర్ప రప్పించి
వారికి భత్యాలు వలసిన ట్లిచ్చి
దొరమన్న వారిని దోడి తెప్పించి
పరమాన్నముల నెలమి బంతిఁ బెట్టించి
దేశాధిపతులతోఁ దేజ మీఱంగ
భాషింపుచుండెను బట్నంబులోను
నంతట భూపాలుఁ డామఱునాఁడు
వంతు కెక్కినమంత్రివర్గంబుఁ బిలిచె
ఛత్రచామరములు సాగి పట్టంగ
మంత్రులు సుతులు సామంతులుఁ దాను
చనుదెంచి రంతట సైన్యాన నిలిచి
దినము దిన మొక్కొక్క దేశాధిపతులు
పనివడి గణిడీలు పట్టించ నపుడు
ఎనుబ దెన్మిదివేల యేకాంగవీరు
లొలయఁ దొమ్మిదివేల యుత్తమాశ్వములు
సారిది నెన్మిదివేల చొక్కపు, చిల్పిపెలును

నిరువదిలక్షల యేనుగోడిగలు
కరులును మూఁడువేల్ గ్గడ లైదులక్ష
పరఁగంగ లొటిపిటల్ పదునైదువేలు
పస గలపచ్చల పాలకీల్ నూఱు
సరిగెలు నొకలక్ష యందలాల్ నూఱు
వెరసి ముప్పదివేల వింజామరములు
డమ్మానము లేనూరు ఢాలు లేనూరు
కొమరొప్ప జగజంపు గొడుగు లేనూరు
తుపాకి విలుమూక తొమ్మిది లక్ష
పదునైన శూలాల బంట్లు నాన్నూరు
గడి మన్నెవారును గాక సర్దార్లు
నడిమి కొల్లలకాండ్రు నాలుగువేలు
బహువాద్యమేళాలు పరఁగ నేనూరు
మహిపాలుఁ డటు సూచి మఱి సంతసిల్లి
యతులప్రతాపుఁడు నాసిద్ధిరాజు
తనహితమంత్రులు దాయంగఁ బిలిచి
పరఁగ సోదరుల నొప్పారగఁ జూచి
హితసహోదరులతో నిట్లని పలికె
కనుగొంటిరా మీరు ఘనవీరభటుల
నింత పటాటోప మింత ముస్తీబు
నింత పరాక్రమం బెంతవాఁ డోపు
విధిలిఖిత మేరీతి వెలసెనో కాని
పుడమిని వీరితోఁ బోల రెవ్వారు
పంపిన మనమొన బాగుగాఁ బోయి
చంపి వత్తురు వారి సమరంబునందు
మన యొక్కమొన చాలు మడియింప వారి
వారిమందలలోను వాసుదేవుండు
నారూఢి బొల్లియావై పుట్టినాఁడు
అందుచేఁ గృష్ణసహాయ మున్నదని
పదిఁబడి యాదవుల్ వదరు చున్నారు
అది గాక వారికి నధికధైర్యంబు

పురణింప గవివాతఁ బులి యున్న యట్టు
లతిధైర్యసాహసు లాచల్లవారు
వారితో సరిపోరువారు దుర్లభులు''
అని మది సిద్ధిరా జనుమానపడఁగ
ననెను దిక్కనమంత్రి యధికసంప్రీతి

## రణమునకుఁ బంపమని తిక్కన్న నలసిద్ధి నర్థించుట

"పల్లవ! నలసిద్ధి! పట్టాభిరామ!
చల్లవారిని జాల సన్నుతించకుము
మన ముందు వా రెంత మాత్రంబు గారు
చల్లవా రెంతె యీ సైన్యం బదెంత
యాదవబల మది యంతయు నెంత
మన దళంబులు చూచుమా యెన్ని గలవొ?
శరణంచు నిన్గొల్చు జగతీశ్వరులవి
సైన్యోపసైన్యాలు చాలఁగాఁ గలవు
అందలాల్ గలరాజు లెందఱో గలరు
పాలకీరాజులు చాలఁగా గలరు
కనుచూపుమేర కింకను బైనఁ గలదు
పగ యన్న నెల్లూరు పొగులు చున్నదియుఁ
గయ్యమంటే సేన కనలుచున్నదియు
భుజము లొండొంటొరయ బుక్కాము రాలు
నేతట్టు చూచిన నిలను మనదళమె
మూఁడామడల దాఁక మొనసి యెడలేక
చెదర నాఱామడ సేన లున్నవియు
యీదళంబుల సాటి యాదవుల గణమె
కులపర్వతంబులఁ గోరి చెప్పంగఁ
దెలియంగ పోలుపల్లె తివ్వలే సాటి
యేటి నిండి పాఱఁగా నెంపలి చెట్టు
పాఱకుండఁగ నాచి పట్టంగఁ గలదె?
సర్వదళా లేడ? చల్లవా రేడ?

ఓ సిద్ధిరాజ! నే నొకడనే పోయి
సమయించి వత్తును శత్రుసైన్యంబు
గహ్వారంబున రాజు గద్దించినట్లు
చల్లవా రందఱిని సమయించి వత్తుఁ
జక్కఁగా నలుకుదు సమరంబులోను
పల్లవాధిప! రాజ! పంపుము నన్ను"
అనిన భూనాయకుం డందుకే మనక
యట్టి యూరక యుండె; నామలునాఁడు
నొనరఁ దిక్కనమంత్రి యొప్పఁగాఁ బలికె
"ధరణీశ! నిన్న నే దండంపు మన్న
నందుకు బదులు మాటాడకుండితివి
ఏమి నీయుద్దేశ మెఱిగింపు" మనఁగా
అన నవ్వి తిక్కన కవనీశుఁ డనియె
"కరణాల దేయూరు కయ్యామే యూరు
చదువను జదివింప సరి సంప్రతింప
వ్రాయను వ్రాయింప వ్యవహారసరణి
లెక్కింప మీకుఁ జెల్లిన దంతె కాని
పగతుర నిర్జింపఁ బనికాదు మీకు
నరుల కండలు రాల్చు నలవాటు లేదు"
అన్న భూపతికిఁ దిక్కన్న యిట్లనియెఁ
'గరణ మంచును గృప గల్గినఁ జాలు
బ్రాహ్మణుండనె నిజము రానీను కొంత
యీవని కంపుమీ యాడేర్చివత్తు
గట్టిగా సెలవిచ్చి కలనికిఁ బంపు'
మంచుఁ బైపై నడ్గ ననుమతి సేసి
గందంబుఁ గస్తూరి ఘనముగాఁ బూసి
తబుకుత్రోఁ దములము తగఁగ నిప్పించి
పోయి రమ్మని చాలఁ బోషించి పంపెఁ

## తిక్కన్న రణమున కేగుట

బంపిన నాతండు బహుప్రతాపమున
నుత్తమాశ్వంబును నొనరంగ నెక్కి
కొలువంగ జగజంపుగొడుగులనీడ
సలలితంబుగ వెల్లచామరంబులను
మదగజంబులతోడ మహిమ దీపింప
ఖడ్గతిక్కనమంత్రి కదనకండూతి
గొనకొని చాగలకొండ కేతెంచె
నావేళ చల్లవా రత్యంతబలులు
దేవేంద్రభోగులై ధీరులై యుండఁ
దనదండు గడిచేసె తనరె నామంత్రి
యపుడు తిక్కనమంత్రి యార్చుచుఁ గదిసెఁ
గదిసిన యాదవుల్ ఖడ్గము లంది
చెదరక నిలిచిరి కదనరంగమున
గోవింద యనుచు నా గోపాలగణము
వేవేగమున రాచవీరులఁ గదిసి
గాండీవములతోడఁ గదిసి పోట్లాడ
గడలను గడలనుఁ గదిసె నిర్బలము
వాణిజ గదాశములు వంకిణీల్ కొంత
కటార్ల నొకకొంత కత్తులఁ గొంత
నట్టహాసము చేసి రనియేకతడవు
చలముకొని యెండలో సమసినరీతి
నాకు లన్నియుఁ బండి యామట్టిమీఁద
వడిఁజేసి సుడిగాలి సుడిసినయపుడు
కారాకు డుల్లినకై వడితోను
మడిసెను దిక్కనమంత్రి సైన్యమ్ము
యదుబలములకును నెట్లుఁ బోట్లాయెఁ
దిక్కన్న యుద్ధాన నొక్కఁ డున్నాఁడు
అని యాదవుల్ పూని యాలంబు సేయఁ
గదలక నిలిచిరి ఘనముగ నంత

మది నెంచెఁ దిక్కనమంత్రి తా నపుడు
"వద్దు వద్దన రాజు వచ్చితి నేను
చల్లవా రెదురంగ సమసె నాబలము
నే నున్నఫల మేమి ? యిపుడు యాదవుల
పై దూఁకి గజములఁ బరిమార్చి వత్తు"
ననుచుఁ దా నశ్వమ్ము నని వీడుకొల్పి
కపటారిగజములఁ గదిసి రాఁగాను

## పిన్నమనేఁడు తిక్కనను జంపక విడుచుట

జల్లపిన్నమనేఁడు సార్వభౌముండు
అల్లంతటను నిల్పి యతని కిట్లనియె
"పోరు నిల్పఁగదోయి ! భూసురోత్తముఁడ !
సరి గాదు మాతోను సమరంబు సేయ
నగ్రజన్మలు మీరు యాదవుల మేము
ఉగ్రంబు మీమీఁద నుంచంగ రాదు
తరతరముల తాతతండ్రులు మేము
భట్టుల బ్రాహ్మల వైష్ణవోత్తముల
వెట్టిచెఱల్ మాన్పి వెనుక వేసికొని
ప్రాణా లొసఁగి కీర్తి ప్రబలి యున్నాము
కడకు బ్రాహ్మణహత్య కట్టుకోరాదు
ఆమీఁద నెఱుగుదు వన్నియు నీవు
భూమీశుఁ డెఱుఁగనిపోరు నీ కేల ?
దవ్వున నున్నాఁడు ధారుణీశ్వరుఁడు
యిచట నీయుద్ధంబు నెవరు చూచేరు ?
పోరు నీ కేల పో బుధపుంగవుండ !
యిట సిద్ధిరాజు దండెత్తి రమ్మనుమి"
యని యిట్లు చల్లపెన్నయ్య వారింప
నశ్వంబుపై నుండి యపుడు తిక్కన్న
మనసులో నొకనీతిమార్గంబు దలఁచె
యతిప్రాస లుండని యూకైత యేల ?
సుతి గూడి నడవనిసాగసువద మేల ?

పతి సూచి మెచ్చనిబంటుతన మేల ?
యితరులు మెచ్చనియీాపెసాధన యేల ?
యేఁ బోయి రాజున కిపుడు చెప్పినను
దగుబలములఁ గొని దండెత్తి వచ్చు
మునిదళముతో వచ్చి ముందుగా నేను
పగతురఁ జంపుదుఁ బల్లవుల్ మెచ్చఁ
జల్లవారిని ద్రుంతు సమరంబులోన
ననుచుఁ దిక్కనమంత్రి యాత్మలోఁ దలచి

ఖడ్గతిక్కనవిజుగు

యని సేయ కప్పుడే యచ్చోటుఁ బాసి
తనబల మంతయు ధాత్రిఁ గొల్వఁగను
చనియె గృహమునకుఁ జయ్యన నపుడు
అశ్వంబుపై డిగ్గి యలసట దీర్చి
యశ్వాలలోఁ దేజి నపుడు గట్టించి
తనువులోపల నున్న దాహంబు దీర్చి
గొనకొని శయ్యపైఁ గూర్చుండఁగాను
సిద్ధనమంత్రి దా శీఘ్రమె వచ్చి
సుద్దులవార్తలు సుతునిఁ దా నడిగె
నేమి తోఁచక పుత్త్రిఁ డెదురాడ కున్న
నప్పుడు పుత్రుండు యాదవుల కోడి
పాఱి వచ్చె నటంచుఁ బల్కె నొకమాట
"కొడుక ! యీవంశంబు కడు దొడ్డ దోయి
పెద్దకాలమునాఁడు పేరు మోసినది
పులికడుపున గొఱ్ఱె పుట్టుచందమునఁ
గలిగితి నాయింతిగర్భంబునందుఁ
జదువున శాస్త్రాన సాహసమునందుఁ
దిక్కన ! నీసాటి ధృతి లే దనంగ
సాహసంబున వారి సాధింపఁ బోయి
యింతగా వెన్నిచ్చి యిటువలె రాను

మగతనంబునఁ బుట్టి మగవాఁడ వనుచుఁ
బగతురకు వెన్నిచ్చి ప్రాణం బదేల ?
యరులకు నోడి యీ యవని మనుకన్న
నరగ రణభూమిలో నమయుట మేలు
పందవు గాని భావజ్ఞుఁడవు గావు
ఎందు కీ ప్రాణం బదేల యీ బ్రదుకు"
అనుచు సిద్ధన మంత్రి యటు తూలనాడె
ఘనుఁ డైనయట్టి తిక్కనమంత్రి యపుడు
తనమది నెంతయుఁ దలఁకక యుండె
నప్పుడు పురజను లందఱు నతనిఁ
జప్పట్లు గొట్టుచు జాతు లాడుచును
గేకలు వేయుచు గేలించి రిట్లు
"వివేక మెఱుఁగని వెఱ్ఱియేగాని
యవనీశ ! నేఁ బోయి యని సేతు ననుచు
నూరకే 'చెప్పని యొక్క ప్రొ' ద్దనఁగ
జగడానికై నీవె సాగిపోయితివి
తాటాకులను మోసి తగ వ్రాయఁ గాని
చెలఁగి యుద్ధము సేయఁ జేత నేవాను
యెదిరించి నిలిచిన హెచ్చుసేనలను
నరిసేయ నవి యజ్ఞశాలలు గావు
అరులపోటులు గాని యక్షతల్ గావు
మారణాగ్నులు గాని మంత్రాలు గావు
చనుదెంచుచక్రాలు చక్కిలాల్ గావు
ఘనచక్రబాణాలు గారెలు కావు
ఆర్చి దూసెడి కత్తు లరిసెలు గావు
పొడిచేటిబల్లెముల్ పూర్ణముల్ గావు
కుంతముల్ రుచిఁ బప్పుకూరయుఁ గాదు
కమ్మనిపాయసము కాదు కయ్యంబు
వండినయాపిండివంటయుఁ గాదు
బంటుతన మేయూరు బ్రాహ్మఁ డేయూరు"
ననుచును బురజను లందఱు నతని

నని యేకవిధముల హాస్యంబు సేసి
యెన్ని యాడినఁ గాని వెఱవక యుండెఁ
గావున మధ్యాహ్నకాలంబు నాయెఁ
బరఁగఁ దిక్కనభార్య పతిశీల గనుక
పగటకు వెన్నెచ్చి పరుగున వచ్చి
యాఁకొని తనవిభుఁ డలసినాఁ డనుచుఁ
గడువేగ విభునికిఁ గ్రాఁగిననీళ్లు
బిందెలఁ జన్నీళ్లు బిరబిరఁ దెచ్చి
పసిఁడిచెంబుల నీరు పాళాలు సేసి
యొక్కెడ మంచంబు నడ్డంబు పెట్టి
యుద్ది శేరు పసుపు నమరంగ నుంచి
'కూర్చుండి స్నానంబు గొబ్బునఁ జేయుఁ'
డని చెప్పి వచ్చెను న త్తదగ్గఱకు
'గొబ్బున నీరాడి కూఁతురు వచ్చెఁ
దీర్చి యడ్డబొట్టు స్థిరముగాఁ బెట్టు
గంధంబు చెక్కిళ్ల ఘనముగాఁ బూసి
పళ్లాన నన్నంబు బాగుగాఁ బెట్టు'
అత్తతో మనవిగా నటు విన్నవించ
మామ సిద్ధన విని మది సంతసించి
తనసతి బోధించి తగ వీడుకొల్పి
స్నానంబు చేసియుఁ దగ సంధ్య వార్చి
భోజనశాలలోఁ బొందుగా నిలిచెఁ
బ్రీతితో డుతఁ దల్లి పీట వేయించి
యన్నంబు వడ్డించి యతిభక్తితోను
'నాఁకొని వస్తివి యరులకు నోడి
భోంచేయు' మని సెలవు పొందుగా నిచ్చెఁ
బప్పుకూరన్నము పరఁగ భోంచేసె
నమృతంబు వడ్డించె నాసమయమున
వేగ నావులపాలు విఱుగంగఁ గాచి
యన్నంబులోఁ బోసె నావిఱుగుఁబాలు
కన్నులఁ జూచి తిక్కనమంత్రి పలికె

'పడతిరో! యోతల్లి! పాలు విఱిగినవి
యివి నాకుఁ బోయంగ నేమి చిత్రంబు'
అన్న కొమరునిఁ జూచి యాతల్లి పలికె
'నరుణోదయము వేళ నది యెట్లొ కాని
యావులుఁ బెయ్యలు నటు మేయఁ బోయి
యరులతోఁ బోరాడి యటుమీఁద నీవు
విఱిగిన నినుఁ జూచి విఱిగెను బాలు'
అనినఁ గుమారుండు నవ్వు డే మనక
తన ధృతి యంతయుఁ దప్పక నిల్పి
యప్పుడు బహులెస్స నన్నంబుఁ దినియుఁ
గప్పురవిడియంబు గ్రక్కున సేసి
పస గలజాజులు పఱచిన సెజ్జ
నీతి గలతిక్కన నిద్ర భోగించి
కలలోను దిక్కన కత్తులతోను
గండమొండెంబులుగా దునుమాడి
తెలతెల్ల వాఱంగఁ దిక్కన లేచి
సంధ్యాదికృత్యముల్ సయ్యనఁ దీర్చి
గంధంబు గస్తూరిఁ గడువేడ్క నలఁది
నవరత్నములభూషణంబులఁ దొడిగి
వే వేగ భోంచేసి విడె మందుకొనియు
ధాత్రి నెన్నఁగ బుద్ధి తలఁచె వేగంబె
తన తండ్రి సిద్ధనఁ దగఁగఁ బిల్పించి
యతులప్రతాపుండు నవ్వు డిట్లనియె

తిక్కన్న ప్రతినఁ బూని కదనమున కుఱుకుట

"ఓ తండ్రి! వినవయ్య యొక విన్నపంబు
నాయొక్క కీర్తి యానందంబు నొంద
యదుబలంబులమీఁది కరుఁగుచున్నాఁడ
వారిని దునుమాడి వత్తినా మేలు
పోరాడి వారిచేఁ బొలిసితినైన

నీ వట కావార్త నిజ మని తెలిసి
వేవేగ రణభూమి వెదకంగ రమ్మి
ఆముకొని పగవారి హాతము సేయంగఁ
గవగొని పగఱు నాకండలు నఱుకఁ
బరఁగ నెమ్మిలె యున్నఁ బగతురఁ ద్రుంతు
నొకచోటె నుండఁ బో దొనరఁగా బొంది
కదనంబులో బొంది కానపుంటేను
నచ్చట నిచ్చట నాయుద్ధభూమిఁ
బరఁగఁ గండలు నెగిరి పడుచుండె నైనఁ
దిక్కున్న కండ లని తెలియంగఁ జూడు"
తగఁ జెప్పి తండ్రికి దండంబుఁ బెట్టి
వనజగర్భుని రాణి వాణిఁ బూజించి
యప్పుడు తిక్కన యశ్వంబు నెక్కి
జననికిఁ దగఁ జెప్పి శౌర్యంబుతోను
గదిసి కొంతదళము కవగొని నడవ
సరిగపేటురుమాల జగజంపుగొడుగు
తిమురుచు రాఁగాను ధీరత మెఱసి
యురవడిగాఁ దేజి నుఱుకుచు రాఁగ
నాజిలో రాఁగాను యాదవుల్ సూచి
చల్లపిన్నమనేఁడు సరగ నిట్లనియె
ఫెల్లున నవ్వి యావిప్రునిఁ జూచి
'తనబల మంతయు ధాత్రిఁ గోల్పోయి
మనుజేశుకొలువుకు మగిడి పోతేను
మానవాధీశుని మంత్రివర్గంబు
పూని రోషంబును బుట్టించినారు
బంధుజనుల్ దూఱి పగ రేపినారు
అంతఁ గొంత దళంబు లనుసరింపంగ
బుద్ధి చాలనియట్టిభూసురోత్తముఁడు
యుద్ధంబు సేయ నుద్యోగించినాఁడు
సర్వథా బ్రాహ్మఁడు చావక పోఁడు.
బ్రహ్మహత్య మనకుఁ బాపుకోరాదు.

అని బ్రాహ్మణునిఁ జంప మైతిమే నిపుడు
ఇందఱ నితఁడు మాయింపక పోఁడు
చంపకుండఁగ రాదు చావఁగా రాదు
ఇందుకు గతి యేమి యెఱిగింపు’ మన్న
ప్రఖ్యాతి గలమంత్రి బ్రహ్మరుద్రయ్య
ధీమంతుఁ డిట్లని తెగ విన్నవించె

బ్రహ్మరుద్రయ్య పిన్నమనేనిశంకఁ బాపుట

‘చింతింప నీ కేల క్షితితలేశ్వరుఁడ !
చలముకొని పోరాడఁ జనుదెంచునపుడు
కులవివేచనఁ జేయఁ గూడ దెవ్వరికిఁ
బఱఁతికై రాముఁడు పాపి రావణుని
రణమునఁ ద్రుంచఁడా బ్రాహ్మణుం డనక
వైరి నెక్కు వనక వధియింపవలెను
ఎదిరించి నప్పుడు ఎవరైతే నేమి
వధియింపవలె గాని వర్జింపఁ దగదు
ఇట్లుండె ధర్మ మిం దేల చింతింప
నట్లుగాకయు బ్రహ్మహత్యకై నీవు
వెనుకాడెదవ యేని విను చల్లపిన్న !
ఆజిలో నీవ నేనై యొప్పఁ గలను
బ్రాహ్మఁ డాతఁడు శివబ్రాహ్మఁడ నేను
బ్రాహ్మణులము పోరు పాటింపఁగలము
ఆతని నేఁ జంపు టది ముఖ్య మాయె
నతనిచేతన నేను హత మైతి నైన
యాదవకులనాథ ! యది వినవయ్య !
గోదావరియు నెట్టుగొండ లెన్నాళ్లు
ఆదిత్యచంద్రులు నవని యెన్నాళ్లు
అన్నాళ్లు వెలయు నీయాదవకథయుఁ
గలియుగ మెన్నాళ్లు కలుగు నన్నాళ్లు
నవనిలో నాపేరు నర్చితం బగును

హరహరా! హరహరా! యని బ్రహ్మరుద్రుఁ
డరుదైనతలమీఁది యా శివలింగ
మచ్చోట వెలయించె నర్చన లిచ్చె
గంధాక్షతలచేతఁ గావించెఁ బూజ
మారేడుపత్రియు మల్లెపువ్వులును
శిరమున వెలయించె శివలింగమునకు
వీరభోనమ్మును వేగ చెల్లించెఁ
గపురతాంబూలమ్ము కానుక లిచ్చె
ధూపదీపము లిచ్చి స్తుతులు గావించె
చంద్రసూర్యాదులు సాక్షిగా నిట్లు
మీఱక నడిపించుమీ మాతలంపు
మాకు లింగైక్య మిమ్మాడిక్కఁ జెల్లింపు”
మని బ్రహ్మరుద్రుఁ డిట్లానతి యిచ్చి

## రుద్రయ్యతిక్కన్నలు పోరిలో మడియుట

కడు వేగమున వీరకాసె బిగించి
యడరి విభూతిరుద్రాక్షలు దాల్చి
వీరాంకములు మేన వెలయించి మించి
యాత్మలింగము మనమందునఁ జేర్చి
కరవాలమును బట్టి ఘనుఁడు రుద్రయ్య
పరికింప నావీరభద్రుచందమున
యాదవు లాకకొంద అపుడు గొల్వంగ
ముఖ్యనాయకుఁ డయి ముదము దీపింప
వేవేగ రుద్రుండు వృషభంబు నెక్కె
సరి తిక్కఁ డంత నశ్వంబు దూఁకించె
మఱి బ్రహ్మరుద్రుండు మార్కొని నిలిచె
తీవ్రించి తిక్కన త్రిప్పె ఖడ్గంబు
కరవాలు జళిపించె ఘనుఁడు రుద్రయ్య
తిక్కన యశ్వంబు తిమురుగా నడచి
త్రొక్కను జెట్లనుఁ ద్రొక్కింపుకొనుచుఁ

దఱిమి తిక్కన రుద్రుదళముల నఱికె
సరగఁ దన తేజీని జబుకునఁ గొట్టి
మొత్తమై మూఁకల మొత్తి నఱుకంగ
బసవేశ్వరునిఁ దాను బ్రహ్మరుద్రయ్య
తురగంబునకు మించి దూఁకించె నపుడు
బారులఁ దెగటార్చి బాపురే! యనుచు
బంటు బంటు కదిసి బహుయుద్ధ మాయె
వాటంబుగాఁ జూచి వడి నఱుకు వారు
ఉత్తమాశ్వంబును నుఱికింపఁ దిక్కఁ
డెద్దును దూఁకించె నెలమి రుద్రయ్య
బృథివిపై నెగసెను బెంధూళి యపుడు
కదనాన నిర్వురు కానరాకుండ
ధరణి ధూమము గప్పెఁ దఱచుగా నపుడు
ఎక్కడి యాదవు లెడ లేక కదిసి
యెక్కడెకఁడ రుద్రుఁ డెదిరించినట్లు
యక్కడఁ జూచిన నాజిలో నపుడు
తిక్కన్న జగడానఁ దిరుదీపు లాడి
యాఁకించి ఖడ్గంబు నందుకొని యపుడు
వైరుల నొక్కొక్క వాటునఁ ద్రుంచె
నప్పుడు రణములో నట్టచట్టలుగఁ
దలలును బాహులుఁ దఱుచు మొండెములు
కుప్పలై కండలు గుండెలు రాలెఁ
దప్పక తిక్కన్న దళ మెల్ల నొఱగ
నప్పుడు తిక్కన్న కాయె గాయాలు
చూచిరి యాదవుల్ చోద్య మందుచును
"దిక్కన్న యొక్కఁడై దిగువాఱినాఁడు
పెక్కు రొక్కనితోడఁ బెనఁగాడ రాదు"
అని బ్రహ్మరుద్రుఁ డల్లంతట నిలిచె
నిలిచినతో దోడ్తోన నీతిజ్ఞు లగుచు
నిలిచిరి యని మాని నెఱజోదు లెల్ల
నప్పుడు తిక్కన్న యగ్నిచందమునఁ

గదిసెను గోపాగ్ని కన్నుల నురల
నదలించి రుద్రుని సడ్డాన వైచె
పడి రుద్రుఁ డంత నావాటు దప్పుకొనెఁ
గరవాలు గైకొని కదిసె రుద్రుండు
విడిబడి రిద్దఱు వీరయుద్ధమున
ధరణిపై నొండొరుం దప్పించుకొనుచు
లంఘించి వెనుకకు రాగడిల్లుచును
బ్రాకుచు దూఁకుచుఁ బైకి రేఁగుచును
దాటించి నఱుకుచుఁ దాఁకి పొడ్చుచును
నురవడితో వచ్చి పరువడి సేసి
కటపెట ఖంఖంగు ఘల్లుఘల్లనుచు
మెఱపులవలె మీఱి మెఱయుచుఁ బిడుగు
చఱపులవలె గొప్పసడిని వ్రేయుచును
నిర్వురు పోరిరి మర్వాగు లగుచుఁ
దిక్కుఁ డుద్రిక్తుఁడై తెగ వ్రేయ రుద్రుఁ
డక్కడఁ జెక్కలై యవనిపైఁ బడియెఁ
బడుచునే రుద్రుఁ డాపక ఖడ్గధారఁ
దడయక యామంత్రితల ద్రుంచి వైచె
నతనియాయుధములు నతనిశస్త్రములు
నాముకొని యాదవు లందుకొని రపుడు
బలియుఁ దిక్కనఁ జంపెఁ బంత మీడేర్చె
బ్రహ్మరుద్రయ్య తాఁ బ్రాణాలు విడిచె

## బ్రహ్మరుద్రయ్యమృతికి పిన్నమనేఁడు దుఃఖించుట

నంతలోఁ జల్ల పిన్నమనాయనికిని
బ్రహ్మరుద్రునిమృతివార్తలు సేరెఁ
బిన్నమనాయఁడు బిట్టు దుఃఖించెఁ
దనసహోదరులైనతమ్ములుఁ దాను
సాహసాత్ముఁడు చన్నచందంబు సూచి
తెగి వ్రయ్యలై యున్నదేహంబు పొదిగి

ముందర నిడుకొని మునింగె దుఃఖమునఁ
"కటకటా! రుద్రుఁడా! కట్టడి నీకు
నిటులౌనె బ్రాహ్మఁడా! యీశ్వరుమహిమ
యాదవులకు బ్రహ్మహత్య రాకుండఁ
దిక్కన్నఁ దెగటార్చి దివి కేఁగినావె!
పరమోపకారివి పావనమూర్తి!
పరఁగ మాకొఱకయి ప్రాణ మిచ్చితివి
యెన్నెన్ని జన్మాల నెత్తినఁ గాని
తిన్నగా నీఋణము తీర్చుకోఁ గలమె
మాతోడ నాడినమాటఁ గ్రమమె
భూతలంబున నీకుఁ బూజ లొనరించు
వను దైవ యిలవేల్పు వని కొల్చి కాని
పరికింప నీ ఋణముఁ బాపుకో లేము"
అనుచుఁ బిన్నమనాయుఁ డనుజులుఁ దాను
బ్రహ్మరుద్రుని గుణములఁ బ్రస్తుతి సేసి
మహనీయు మైనసమాధిఁ గల్పించె
మాఘమాసమున నమావాస్యతిథిని
మంగళవారాన మధ్యాహ్నవేళ
గోబిలమున రుద్రుఁ గూర్చుండఁ బెట్టి
విమలమౌ శంఖుచక్రాల్ పేరణాల్ మ్రోయ
నీలకంఠునియందు నిక్షేపపఱిచి
యందఱు నిష్ఠను నరుదెంచి రంత
సిరి గలతిక్కన్న చెల్లెఁగా నంతఁ
జిల్లరసైన్యంబు చేరి నెల్లూరు
సిద్ధికొల్వుకు శీఘ్రంబె పోయి
తెల్పిరి తిక్కన్న తీవ్రశౌర్యంబు
ననిలోనఁ దెగటార్చి యాదవబలము
కొదమసింగము లేళ్లగుమిఁ గూల్చినట్లు
కణుకులు కణుకులుగా సేన నఱికె!
గసిమసంగుచు నుప్పుగల్లుగాఁ జిదిమె
బ్రహ్మరుద్రునితోడఁ బ్రతి నిల్చి పోరె

నొండొరులను వారు ఖండించుకొనిరి
ధీరవిహారులై తెగిరి యుద్ధమును
తిక్కన్న రుద్రయ్య దివి కేఁగినారు
ఆమాట విని సిద్ధనామాత్యుఁ డరిగె
రణభూమిఁ గొడుకు మారణముఁ గన్గొనఁగ
నటఁ జోద్య మందుచు నప్పుఁ డిట్లనియె
"కొడుక! నీరణము భర్గుం డెంచవలెను
నరులకు నెంచఁగా న్యాయంబు గాదు
ఇనకులాధీశ్వరుం డీసిద్ధిరాజు
ఋణముఁ దీర్చుటకుఁ గా నేతెంచినావు
ఫణిరాజు గొనియాడఁ బగ ద్రుంచినావు
పేరు గలయాపుణ్యపెన్న సాక్షిగను
కలువరాజు భాస్కరుఁడు సాక్షిగను
నిలిపితి నీకీర్తి నిఖిలంబునందు"
అనుచు వెదకెను జాల సబ్రంపుఁగొడుకు
జలధిలో మీనముల్ చలియించునట్లు
నెత్తుటేవఱ్ఱులోఁ దుత్తునియలుగఁ
దిక్కన్నకండలు తేలాడుచుండె
నెగిసెగిసి పడుచుండె నీవలావలకుఁ
గనుగొని యవి సూచి కన్నీరు గార్చి
కావిదోవతిని నాకండలు పొదివి
యాతఁడు నెల్లూరి కప్పు డేతేరఁ

## తిక్కన్నసతి సాగుమానము చేయుట

తెలిసి పుణ్యాంగన తిక్కన్నభార్య
పాదార్చనలు చేసెఁ బతిఁ దెచ్చె ననుచుఁ
గావిదోవతిలోని కండలు సూచి
ఘల్లున నావిప్రకాంత యిట్లనియె
"ఓమామ! వినవయ్య యొకవిన్నపంబు
సత్యంబు స్త్రీపురుషసమ్మతి వినుము

పురుషుకంటెను ముందు పోయెనా ప్రాణి
తగఁ బ్రాణనాథుండు తనుఁ జేరుదనుక
నాగి ప్రతీక్షించు నటఁ బుణ్యకాంత
పురుషుఁడే ముందైనఁ బుణ్యకాంతలకుఁ
బతిఁ గూడి యొక్కటై పరలోకయాత్ర
పుణ్యప్రదం బని పొగడును శ్రుతులు
పతి నెడఁబాయుట పరఁగ దోషంబు
నాప్రాణవిభునితో న న్నంపు'' మనిన
సిద్ధనమంత్రి నిశ్చింతుఁడై విప్ర
వర్యులఁ బిలిపించి చర్య లెఱిగించి
సాగుమానక్రియల్ జరపించె నపుడు
పరిపరివిధములఁ బరికించి రపుడు
అంతయుఁ జెప్పిరి యట నున్నవారు
'ఇనకులాధీశుండ! జననాథతిలక!
అనిలోనఁ దిక్కన్న హాత మాయె నయ్య
యామహాత్మునిభార్య యతిపుణ్యకాంత
సాగుమానము చేసె జననాథ!' యనిన

## నలసిద్ధి వీరపరివారముతో రణభూమి కేఁగుట

నామాట విని నృపుఁ డధికకోపమునఁ
దామసింపక లేచి దాడు గదలించి
చాటింపు సేయించి సకలభాషలను
గడువేగఁ గావించెఁ గట్టాయితంబు
కనకంపుమాడలుఁ గట్నాలుఁ జాల
నెనయంగఁ బరిజనుల కిప్పించె రాజు
రాజబంటులు నాక రాజాధిరాజు
దారిద్ర్యహతముగా ధనము లిప్పించి
యవని యాకాశంబులందు వ్యాపింప
భీకరంబుగ రణభేరి వేయింప
నఫిరీలు పట్టిరి నా డెడలేక

బూరగల్ కొమ్ములు భువి దద్దరిల్లఁ
దప్పెట్లు తుడుములు తఱచు వాద్యములు
భేరినాదులకుఁ దప్పెట్లమోదులకు
ధారుణీశునిదండు ధర తల్లడిల్లఁ
జయ్యనఁ గదలిరి సరదార్లు మొదల
వరఁగ శృంగారించి భద్రగజములను
నాలంబు ముస్తీదు నంబారి యెత్తి
పై నెఱ్రపట్టుతోఁ బటము లెత్తించి
యేనుఁగులబారుతో నెఱసిద్ధి గదలెఁ
జిక్కంగ నొకమూఱు చొక్కంపుగడలు
బంగారుతీగల బాగైనగడలు
పెండెకట్లగడలు పెదజల్లిగడలు
గంటలు నందెలుఁ గట్టినగడలు
పదునైనయీటెల బాగుగా నెగచి
ముస్తీదు విలుమూఁక మొన యేరుపఱచి
ప్రళయుఁడై నడచెను బాపసిద్ధిరాజు
కఠినంబు లౌపిచ్చుకత్తులతోను
బేరు గలసరదార్లు బిరుదుమన్నీలు
ముస్తీదులై మూఁకముందఱ నడవ
వెలయు సంతోషమున వేడుక మీఱఁ
గస్తూరిసిద్ధిరాజు కదలె నాక్షణమె
జాతి గలగుఱ్ఱాల సన్నద్ధపఱచి
ముచ్చవాడ వల్లాల మువ్వ లల్లాడ
వడిసేయు గుఱ్ఱాలు వరుస వల్లాలు
బంపు చేసినవిధము బారు నడవంగ
నాకాశ మంటె నీయవనీతలంబు
గొమరసిద్ధిరాజు ఘోటకము నెక్కి
బాకు జంజాళముల్ పరఁగఁ జేపట్టి
యావలీవల రాజు లండను రాఁగ
గడిమన్నె మూఁకలు కదిసి నడవంగ

సాహసుల్ మన్నీలు సరికొని రాఁగ
విచ్చుఁగత్తులవారు వీమతులై నడవ
జల్లిగడలును జాల జమిలిటెక్కెములు
వింజామరంబులు వేయు నిర్గడల
బంగారుగొడుగులఁ బట్టిరి వేగ
సురఁటులఁ బట్టిరి చూడఁ జోద్యముగ
ఘనుఁ డగునలసిద్ధి గజముపై నెక్కె
కలనికిఁ జనుదెంచెఁ గట్టుగ్రమునను
గండగోపాల్రాజు కడువేగమునను
జయ్యన శూలాల సాగించ బండ్ల
నావిరోధులదండు లచ్చోటఁ గదిలె
గొడ్డండ్లు కత్తులు గొబ్బునఁ దెచ్చి
కాఱడవి నడపించె గడియలోపలను
బాటలు చేసిరి పరిచారకులును
నానలసిద్ధిరా జవలీలముగను
బారుల నడపించె బాటలవెంటఁ
గనుఁగొని సేనలఁ గన్నులఁ జూచి
దాకొని వచ్చెను ధంసీదళములును
జల్లవారిని దూర్పు సరిమోర చేసి
దళమి గురువారానఁ దగ వొప్ప నిలిచెఁ
గనుఁగొని యాదవుల్ కడు సంతసిల్లి
హల్లున నవ్వి పిన్నయ్య యిట్లనియెఁ

## పిన్నయ్య తనవారిని హెచ్చరించుట

'గొమరొప్పఁ దిక్కన్న కొంతదళమునను
హాత మాయె నని రాజు అతిరోషుఁ డగుచు
సర్వదళములతోడ సరగ నేతెంచె
నని పరికింపుచు నటు పాఱఁ జూచి
హేరాళముగ దండు యేతెంచి రాఁగ
బిన్నయ్య పిలిపించి బిరుదు గలవారిఁ

దమహితబాంధవుల దాయంగఁ బిలిచి
"వినరోయి ! చెప్పెద వీరభటులార !
సిద్ధిరాజుకు నిన్ని సేనలు లేవు
'మఱి యేమి యెఱుఁగరు మందగొల్లలును
దొమ్మిగాఁగను బోయి తోలితెత్తాము'
అనుచు వచ్చినయది యాకొల్లదండు
జగడాని కని చెప్పఁ జయ్యన రారు
వారిపై ముందుగా వసర వెళ్లినను
డాసి చంపక మీరు డాబు సేయకుఁడు
కటార్లు జంజాళముల్ కత్తులు మఱియు
వజ్రంపు మణులు గలవంకిణీల్ వాఁడి
నేజాలును సురాయి నేర్పుతోఁ బట్టి
బాకులఁ జేఁబూని బాపురే! యనుచు
భళిభళీ! యనుచును బాగుగా నపుడు
ముస్తీబులై మీరు మొనసి యెదురెక్క-
నప్పుడు కొల్లదం డాశ్చర్య మంది
మొనసి కలవర మంది మోరెత్తి చూచి
యుదుట నడవులఁ బట్ట నుఱికించి రండి
తోణికి చంపకుఁ డన్న దోషంబు వచ్చు
మారొక-ని నిలిచిన మఱవకుండంగ
చెండాడి చంపను సెల"వని పలికె
గొల్లలు కంపటీల్ గోసంగిబలము
తఱచు మన్నియులెల్లఁ దలపడి రప్పు
డావేళ వేవేగ నాయుధంబులను
వడిఁ గదిసి నఱికిరి వసుధపై నెగసి
సురియలతోఁ బొడ్చి శూరులై నిల్చి
పోరిలోఁ గయ్యాల శూరు లెంతేని
బాకులఁ బోట్లాడి బాపురే! యనుచు
దొడ్డిబడ యాదవులతోఁ బోరి రపుడు
చలముకొని యమ్ములజడి గురియింప
గడల గడలఁ జాలఁ గదిసెను బలము

పొడిచిన యీటెలు పొత్తైముల్ విఱిగి
వఱలుచు ధరమీఁద వాపోవువారు
కదిసి యాదవులును గాటార్ల నఱక
వాటుకుఁ దునియలై పరగెడివారు
కాటార్లఁ బొడిచినఁ గడు నిల్వలేక
ప్రాణమూర్ఛను బొంది పడి యొఱఁగువారు
చెయిచెయి తారసిలి చేరి నఱకుచును
దందర నొందుచు ధరఁ గూలువారు
బరిసీలఁ బల్లేలఁ బడఁ బొడువంగ
రణమున నొఱగిరి కోతు లందఱును
నురవడి బాణాలు నురముఁ వెడలి
క్రమ్ముచు రక్తము కాల్వలై పాఱ
శరములఁ గుంతాలఁ జెల్లించి పొడువ
హరిహరీ! యన ముక్తి యనియెంచువారు
బటువుగా వీఁపున బరిసెలు వెళ్ల
రామరామా! యని రహి నెంచువారు
చక్రాలఁ గొందఱు శిరసుల వ్రేయఁ
గాత్రముల్ తెగి పాఱఁ గడుఁ దలఁచువారు
సురకత్తి పిడికత్తి సురియలతోను
సరిపాటి రిపులను సాహసులఁ గూల్చి
ఘోరయుద్ధముఁ జేసి గోసంగు లపుడు
బాహుబలముతోను బట్టి పోట్లాడ
గోసంగిబలములు కూలినఁ జూచి
పిన్నమనాయుఁడు ప్రీతి నిట్లనియె
"సమసెను మనదళము సమరంబునందు
సరి చూడ పగదళము శాన యున్నదియుఁ
గొందఱుమన్నీల ఘోరయుద్ధంబు
సేయంగఁ బంపుట శ్రేయస్కరంబు"
బోరున నాచల్ల భూపతిసుతులు
భక్తి గలపిన్నయ్య పగఱకు వైరి
యాచల్లగోవిందు హరి సరివచ్చు

రఘురాముపోలెను రాక్షసులఁ జంప
నంతవాఁ డగుచల్ల నాతుఁడు గలఁడు
సత్యహరిశ్చంద్రు సరి యన వచ్చుఁ
దర్వాత నాచల్ల తగను కోనేరు
భీముని సరివచ్చుఁ బృథివిలోపలను
నధికపరాక్రముఁ డచ్యుతుఁడు గలఁడు
భరతునంతటివాఁడు బాహుబలశాలి
చల్లపుణ్యయ్యం డనుసఘుం డతండు
పగతుర వధియింపఁ బటుక్రోధమూర్తి
యందటి తమ్ముఁడు నా వెంకటాద్రి
పంచపాండవులకుఁ బ్రతి యనవచ్చు
అప్పుడు వా రేడ్గు రన్నదమ్ములును
నొప్పుగా దశమినాఁ డొక్కప్రొద్దుండి
తాన మొప్పఁగ నాడి ధవళాలు గట్టి
నెలవంక తిరుమణి నేర్పుతోఁ దీర్చి
వారు దేవునిపూజ వరుసతోఁ జేసి
పత్రితోఁ బూజించి భక్తిచే నిలిచి
'యో దేవదేవుండ! యోవిశ్వరూప!
యో పాపసంహార! యో పరమేశ!
సకలజీవుల ప్రాణసంరక్షకుఁడవు
ఎన్నఁడు మీచింతయే స్వామి! మాకుఁ
గడు విక్రమముఁ గని కైలాస మిమ్ము'
అని వేఁడి మ్రొక్కిరి యాక్షణంబునను
దశమి యొక్కప్రొద్దు తగవొప్పఁ జేసి
ప్రియముతోఁ దమ్ములఁ బిలిచె దగ్గఱికిఁ
'జక్కని తమ్ములు! సాహసులార!
బుద్ధి తిర్గక రణభూమిలో నిలిచి
హెచ్చి పగతురఁ జంప నెత్తి చనుఁడయ్య!
మఱపు వెఱపు లేక మడమ తిర్గకయ
పరులకు వెన్నిచ్చి పాఱ కోర్పునను
నిలువుఁడీ సమరాన నీతి దప్పకను

వెఱవకుఁడీ వారు వెఱ పేమి లేదు
అలుగులు నాఁటిన హరిహరులఁ దలపుఁ'
డని చెప్పి పిన్నయ్య యాయుధ మంది
యాలంబు సేయఁ గట్టాయిత్తపడిరి
కాసెలు బిగియించి గంధంబు పూసి
రాళ్లు దాపినయట్టి రాకట్లఁ దాల్చి
ముత్యాలహారముల్ మురియుచు వేసి
చౌకట్లఁ గర్ణములఁ జయ్యనఁ దొడిగి
దేదీప్యముగ వెల్గుదివ్యాంబరములు
నవరత్నములభూషణంబులుఁ దాల్చి
కడు సూర్యకాటార్ల ఘనముగాఁ బూని
మహాదేవ ! హరహరా ! మహాదేవ ! యనుచు
జగడము సేయంగఁ జనుదెంచి రంత
వారు వచ్చుటఁ జూచి వసుధీశుఁ డపుడు
పిన్నయ్య తమ్ము లు పేర్మితో రాఁగ
నంబారిపై నిల్చి యటు పాఱఁ జూచి
యాశ్చర్యమును బొంది యప్పు డిట్లనియె
'చక్కదనంబున సరి మన్మథునకు
దండిసే నని మదిఁ దలఁపక వీరు
సాహసుల్ గాకుంటె చనుదెంచఁ బోరు'
వీరభటులకు గూర్చి వివర మేర్పడను
గొమరసిద్ధిరాజును గొబ్బునఁ బంపెఁ

## కొమరసిద్ధి రణమున నిహతుఁ డగుట

గొమరసిద్ధిరాజు ఘోటకము నెక్కి
సమరాన కావేళఁ జయ్యనఁ గదిసెఁ
గదిసినయతనితో ఘనుఁడు పిన్నయ్య
కదిసెఁ దమ్ములతోడఁ గట్టుగ్రమునను
ఫెళఫెళ నార్చుచుఁ బృథ్వి కంపింప
నార్భాటములు చేసె వసంభుగుల్ కొనఁగ

జడిసి పగతురగుండె జల్లని పగుల
శేషు వేజివ్వాలు చరియించినట్లు
ఆసూర్యకాటార్ల నప్పటప్పటికి
జళిపించి మెఱపులచందాన నుండఁ
బులులుఁ బులుఃఖు గదిసి పోరుచందమునఁ
జలముకొని పోరాడి చల్లపిన్నయ్య
బాహుబలోగ్రుఁడై భళిభళీ! యనఁగ
నార్చుచుఁ గోపాన నంకించి కదిసి
యా కొమరసిద్ధిరా జశ్వంబుఁ బొడిచె
వసుధపై నశ్వంబు వ్రాలుట యెఱిఁగి
కొమరసిద్ధిరాజు కోపించి దూఁకె
కదిసిరి యప్పుడు కట్టుగ్రమునను
బిన్నయ్య తమ్ములు పృధ్వి కంపింప
నంతకంటె బలులు నతిబలాధికులు
వారిని గొల్చిన వసర యాదవులు
ఎన్నఁ దరము గానిమిన్నసర దార్లు
మార్కొని రణములో మంచిసాహసులు
పేర్కొని యుద్ధంబు పెనఁగి సేయుచును
దీకొని శిరములు తెగఁగ వ్రేయుచును
కో యని వ్రేయుచుఁ గో యు నార్చుచును
గేకలు వేయుచుఁ గ్రేవ నఱకుచును
ఘాతలు సేయుచుఁ గదిసి పొడిచినను
నఱుగుచు రణమున వాలిరి కొంత
ఘోరయుద్ధము సేసి కుంభినిమీఁద
నారీతి నని సేయునట్టిసమయమునఁ
జల్లవారి గోసంగి సమిడి—గు బొమ్మ
మదపుటేనుఁగునైన మట్టఁగలవాడు
చిల్లరమూకల సేనగాఁ గూల్చి
యాగ్రహోదగ్రుఁడై యార్చుచు మిగులఁ
జేతిక త్తికిఁ బగఱఁ జెఱకుచందమునఁ
గుడి యెడమ విసరుచుఁ గూల్చుచు రిపులఁ

దేవ నూటొక్కండెముల్ తెగి పడ నఱికి
చంపెను బొందులు సందు లేకుండ
నప్పుడు పిన్నయ్య యధికకోపమున
నట్టహాసంబున నాముకొని పోరి
యాకొమరసిద్ధిపై హస్తంబు నెత్తి
కడువేగమున సూర్యకాటార్లతోడఁ
దడయనికోపాగ్నిఁ దలఁ ద్రుంచి వైచెఁ
గొమరసిద్ధిరాజు కూలినయపుడె
కన్నులఁ జూచెను గస్తూరిసిద్ధి
మఱియును నలసిద్ధిమండలేశునికి
వినిపించె నప్పుడు విహ్వలుం డగుచు
మది నిబ్బరించుక మండలేశ్వరుఁడు
పనివడి కస్తూరిఁ బయనంబు సేసి
'నీవు దళములతోడ నిప్పుడే పోయి
క్షణమున గొల్లలఁ జదిపి రమ్మనఁగ
నరుదైన బలముతో నశ్వంబు నెక్కి

## కస్తూరిసిద్ధి కదనమున కుఱుకుట

కస్తూరిసిద్ధిరాజు కదలి తా వచ్చెఁ
గదిసిరి యుద్ధాన ఘనముఖ్యు లంతఁ
గార్ముకంబునఁ గొంత గదిసి నఱుకుచును
జెయిచెయి తారసిలి చెలరేఁగి పొడిచి
తాకించి నఱకంగఁ దల లూడ నపుడు
శిరములఁ గుంతాలఁ జెల్లించి పొడువ
హరి యని తలఁచుచు నట నొఱగువారు
చక్రాలఁ గొందఱి శిరముల ద్రేయ
సత్యాత్ములై నట్టి చల్లవారికిని
వలపటిపార్శ్వాన వంకిళ్లు నాఁటె
హరిని మఱవక తలఁప నాచల్లవారి
దాపటిపార్శ్వానఁ దగిలె నఱకులు

ధర్మాత్ము లైనట్టి తగు చల్లవారి
యెత్తిన బాణంబు లెదలందు నాఁటు
నాఁగి విడుచు బాణంబు లురమున వెడలి
పిక్కలఁ బక్కల బిగువుసందిళ్ల
మూపున వీఁపున మొనసె గాయాలు
నప్పుడు గొల్లల కతిభార మాయెఁ
జాలఁగాఁ బగతురఁ జంపి చెండాడి
కొంత పగదళము ఘోరాజిఁ గూల్చి
తమ మనస్సున హరిఁ దప్పక తలఁచి
శివకేశవులఁ దలఁచి శ్రీరాము వేఁడి
హరిముఖ్యు లైనట్టి యాచల్లవారు
ధర మూర్ఛఁ జెందిరి తందర గుడిచి
ఘోరరూపంబునఁ గుంభినిమీఁద
నానర నా'యోద్ధురు నాఅగి రచ్చోట
నంతట మృతు లైరి యాచల్లవారు
ధారుణీశ్వరుఁ డంత దండు కొల్పోయి
తమ్ముఁడు కొమరసిద్ధి ధరఁ గూలె ననుచు

## నలసిద్ధి పోరునకుఁ దలపడుట

మదిని జింతింపుచు మండలేశ్వరుఁడు
ఘనరోషుఁ డగుచును గజముపై నెక్కి
కదలంగ సెలవిచ్చి గడియ మించకను
కణకణ వాయించి కంచురణభేరి
నపికీలు పట్టిరి నా దెడలేక
తుడుములుఁ గొమ్ములుఁ దుమి మేర లేక
యన్నిట మ్రోయించి రగుభుగుల్కొనఁగఁ
బట్టగ రాజుకుఁ బట్టుగొడుగులును
వింజామరంబులు విరివిగా వేయ
మునుకొని నడవంగ ముందర భట్లు
కదలి వచ్చెను రాజు కయ్యంబు సేయ

పరఁగ యాదవులును బంచలింగాలఁ
గనుచూపుమేరన కని సిద్ధిరాజు
వచ్చి యడ్డావుకట్ట వైళంబె నిలిచి
దిరిసెల రేగడ తిన్నెల బయల
కరియెద్దుకురువను గడి సేసి మొనలు
ఆదూరు పెంట్రేల అన్నెబోయినపల్లె
యీదల భీమవరం విడిపట్టు సేసి
చీమపెంట ... ... చిటిమడుగుపాడు
ఆరుమూడుగుళ్లు అలిమేర సేసి
మారిసీనిపల్లె మంగల్లిపాడు
దామిశెట్టిచెరువు దంతెలు బయలు
కంపమడుగుపాడు గడిసేసి మొనలు
గుజ్జర్ల వాగున గుజ్జుపురాతు
లారీతి నిలిచెను నవనీశుదంతు
నలుబలంబులతోను నలసిద్ధిరాజు
'తలచైన మనదళముఁ దప్పక చూచి
పరఁగంగ యాదవుల్ పాటిపోకుండ
బడమట వెలుగోటఁ బదిలానఁ గాచి
దిట్టముగ నుండు'మని దిగుమజిలి చేసె
గొడుగులుఁ బడిగెలు గుమ్మటంబులును
బదిలానఁ దేజీలు భద్రగజములును
శూలాలు బండ్లును సొరిది బాణాలు
హితులు సహోదరు లిష్టబాంధవులు
పరఁగఁ బ్రధానులుఁ బరివార మంత
నరనాథునిరుమేల నాసమయమున
విరివిగా బలములు వేగంబె నిలిచి
దండు నిల్వఁగ సర్వదళములమీఁద
నవు డొక్కవిధమున నపశకున మాయె

## నలసిద్ధి సేనలో నపశకున మగుట

మెండై నరాగాలు మొఱ సాడసాగె
చీతువల్ మింటిపైఁ జెలరేఁగి పలికె
నవతల పైడికం టదిరిపడి లేచె
పాలపేరెముపాఱెఁ బాములు నడకొట్టె
నేల నాడువచోట నిలిచెను గాలి
యాలంబులోఁ జాల నపశకున మాయె
నందుకు సిద్ధిరా జాశ్చర్యపడెను
సంధ్యగోపాలునిఁ జయ్యనఁ బిలిచి
'విను సాధ్యగోపాల! వివర మంతయును
నెనయంగ మనదండు నిచ్చోట దిగఁగ
ననియేకవిధముల నపశకున మాయె
నేమ్య మనాగతం బెఱుఁగుదురు మీరు
ఈశకున పంతం బదెట్టు లున్నదియొ
యీ శకునపక్షు లేమేమి పల్కెడినొ
పక్షులు పలికేటిపలుకులక్షణము
నీక్షణంబున మాకు నెఱిగింపుఁ' డనెను

## సంధ్యగోపాలుఁడు శకునముల తెఱం గెఱిగించుట

సంధ్యగోపాలుండు జననాథుఁ డడుగ
దినకరుఁ బ్రార్థించి దిక్కు లర్చించి
ఖగములు పలికినక్రమము తా నెఱిఁగి
'భానుకులాధీశ! పట్టాభిషేక!
యేమని చెప్పుదు నిట్టిచిత్రంబు
న న్నడిగినందుకు నరనాథ! నీకు
వినిపింపఁగాఁగలను వృత్తాంత మంత
నవుతల పైడిగం టదిరిపడినందు
కదిరిపడి బొల్లావు అరుదెంచు నిటకు
బలుమృగము కిసురుపెట్టినందులకు

పంతాన సమయించుఁ బరఁగ బొల్లావు
గుఱ్ఱాల కాతులు గూడ శకునాన
తఱిమిన పశువుకు దాఁగినవారు
భీభత్సు లౌచురు బిరుసు పోనాడి
సుడిగాలి గూడార్ల సుడిసినందులకు
సరదార్లు పలువురు సమయ నున్నారు
కనుపెంటి పలికినకారకార్థమున
నాజిలో నేనుఁగుల్ హాతము కాఁగలవు
పాలపక్షులు పేరెము పాఱినందులకు
నాలంబులో మన యశ్వంబు లొఱగు
నల్లపుల్గులు కూయునాపంతమునకు
మేలైనయశ్వాలు మెండుగా మడియుఁ
బడగల ముడిచినపాముశకునానఁ
బట్టపురాజుకు బట్టిడిపడగ
లుర్విపైఁ బడవేసి యుఱకంగఁ గలరు
గొప్పగా గొఱ్ఱెలు కూసినందులకు
గొదలేని పరిజనుల్ కూలంగ గలరు
వడగాలిశకునాన వసుధేశతిలక !
వడిచెడి మనదండు వంకలఁ బట్టి
యడవుల నడమాడి యటు పాఱఁ గలదు
పాఱెడు టాకుల పంతానఁజాల
వసరైనలొటిపిటల్ వఱగ నున్నవియు
శీతువుల శకునానఁ జిల్లరమూఁక
కూఁతలుపెట్టుచు గుట్ట లెక్కాడిని
వాసి కెక్కిన సూర్యవంశాబ్ధిచంద్ర !
యీశకున పంతంబు లిట్లు కాఁగలవు'
అని సంధ్యగోపాలుఁ డాడుచుండంగ
విని రాజుఁ గొలిచెడు వీరనాయకులు
పత్తికూళె మన్నవారు పరఁగనాయకులు
నాసంధ్యగోపాలు కంద జెట్లనిరి

## సంధ్యగోపాలునితో వీరనాయకులు ప్రలాపించుట

'సంధ్యగోపాలుండ! సఖుఁడవా నీవు
మీ తాతతండ్రులు మిమ్మును బెంచి
వెలయుంగ జనువుచే నెమరాడ కున్న
మాటాడితివి గాక మందెమేలమున
బలగము లేనాఁడు పసర మేనాఁడు
కొఱమాలినట్టి యా కుటిలమానవుఁడు
తృణము చేఁబూనుక తోలితే నుఱుకు
నింతమాటకు నీ వదేమొ చిత్రముగ
వీరమన్నెనాయకుల్ దొడ్డ సరదార్లు
నావు కుఱుకుదు రని యరుదు చెప్పితివి
యీవింత మాటలకు నేమనవచ్చు
నావుకు వెఱచేమ యపకీర్తి గాక
యెన్ని యవతారము లెత్తిఁగాని
ఘనముగాఁ బొడుతుము కదిసి పోనీక
సింహామునైనను జీరెద మోయి!
పులినైన గవిఁ జొచ్చి పొట్టేలి భంగిఁ
జలమున నెదిరించి చంపెద మోయి!
రెండుచేతులఁ బొడ్చుదండిమగఁడైన
బంటుతనంబునఁ బరిమార్పగలము
ఒక్క బొల్లావుకు నోడేమ మేము
చిక్కించి బల్లాలఁ జిమ్మెము గాని
పుట్టించితివిగాక వట్టి భయములను
గట్టుమా నీకవిలె కట్టుమా చాలు'
అని యిట్లు పరివార మాడినందులకు
విని రాజు మదిని నావేళ సంతసిలి

## సిద్ధిరాజు వీరనాయకుల నప్రమత్తులై యుండఁగోరుట

'పంతంబు గలవీరపరివారజనులు !
అంతవా రౌదురు అనుమాన మేల ?
శకునపంతము కల్ల సలుపంగరాదు
వినరోయి ! నామాట వెస చిత్ర మనక
యొకరొకరు పదిలాన నుండుఁడీ రాత్రి
భద్రేభములమీఁదఁ బట్టి దివిటీలు
నిద్రగాచుండుఁడీ ! నీవు నే ననక
యొంటరిగాంద్రను నొనరంగఁ బిలిచి
బంటుకు బారెడు ప్రహరి వేయించి
యావెన్క వెల్విరిసి యమరంగ దిగుఁడి
వలలన్ని చాలుఁగా వడ్డుఁడీ చక్క
వలలకు నెడముగా వాటంబుగాను
జిలుకుటమ్ములు పాతి శీఘ్రంబుగాను
దగనొప్ప వారాలు త్రవ్వించి యపుడు
కాలువల్ దీయుఁడీ కందకాల్ వెంట
నాయకులు దొరలు నందఱు మీరు
నాయత్తపడరోయి ! యశ్వాల నెక్కి
యెంతవాఁడైనను నెదిరించలేఁడు
యాదవు లంటేను వెఱపేమి లేదు
అవతారమూర్తి యని యావు నెన్నుదురు
అదిగాక దిగుమజిలి యటు నిల్వఁగాను
వపశకున మాయెను నాధిక్యులార !
దానిచేఁ దృణమైనఁ దాకు బాణముగఁ
గల్లగా దీమాట కడకతో వినుఁడు
వజ్రీలు సరదార్లు వడి జమేదార్లు
కన్నోజిరౌతులుఁ గాలిదళ మంతఁ
దప్పెట్లు దారలుఁ దఱచు వాయింపుఁ
డప్పటప్పటికిని నధికంబుగాగ
కోవరము తిరుగంగ ... ... ...

మూవాత పెమ్మనేని ముని యుక్కళాన
చెలువుగా నుంచుఁడీ సేనలలోను
నడు నుక్కళంబున నంగభీతినేని
పొడబాల సామినేనితోఁగూడఁ బొందుగా నుంచుడి
జతనాన నుండుఁడీ సైన్యంబుతోను
అతులపరాక్రముం డతివేగమునను
వసుధేశ్వరుడు వెట్టివాండ్రను బిలిచి
'యరుణోదయముదాఁక నలసట లేక
దివిటీలు పట్టుఁడో ధీరతతోను
దంతులపైఁ గొన్ని ధరమీఁదఁ గొన్ని
మెండుగాఁ బట్టరో మెఱసి దివిటీలు'
అప్పుడు వెట్టివాండ్రగుబుగుల్ గాను
బయినున్నదుప్పట్లుఁ బాగాలు చించి
చాలక బొక్కసల చలువదుప్పట్లు
చించి దివిటీలకుఁ జెలఁగి చుట్టుచును
బరిపరి విధములఁ బయనంబుగాఁగ
రమ్యముగ నలనన్న రణతమక ముండి
మారిపల్లి కొండతో నప్పుఁ డిట్లనియె
'బంటుమాటలు విని పరఁగ సిద్ధిరాజు
సర్వదళములతోను జయ్యన వచ్చి
చల్లవారిని బోరఁ సమయించి మించి
మార్కొని యెదిరించి మఱినిల్చి యుండె
వీరతమకము మన మెక్కిన యపుడె
యాదవు లందఱు నాయత్తపడిరి
యావులు నెద్దులు నాదివిష్ణుండు
వీరగోసంగులు బీరన్న మొదలు
పసిడితమకముచుట్టు పగకు నెదురెక్కి
పల్లికొండ! సెలవుకై పరఁగ నున్నారు
బలభద్రశేఖరుఁడ! పల్లికొండమూర్తి!
యేకాదశియు నేఁడు ఎవ్వారివంతు?
సెలవొసఁగు మని పల్కి సన్నుతి సేయ

దివ్యదేహుఁ డతండు తెలిసి తాలేచి
తనవెంట నయితన్న తగఁ బిల్చికొనియుఁ
బంచవాద్యంబులు పరివరిగతుల
వల్లవు లందఱు వైనవైనాల
గాజుగిన్నెలతోను గంధ మక్షతలు
దివ్యనామంబులుఁ దిరుచూర్ణములును
నావుకుఁ దగినట్టియాభరణములుఁ
బసిఁడిబిందెల నీరు బాగుగాఁ గొనుచుఁ
గంచుకొమ్ముల భూమి కక్కసిలగాను
నమురముఖాలకుడారు లోపలను
బొంకంబుగా నున్న బొల్లావు గాంచి
కళలు గుల్కుచు నావు కడకు నేతెంచెఁ
దగఁ బల్లికొండ ప్రదక్షిణము తిరిగి

## బొల్లావు నలంకరించుట

గోవురూపం బైన గోపాలకునికిఁ
బసిఁడిబిందెలనీటఁ బాదముల్ గడిగి
యావురూపం బైనయాదివిష్ణునికి
నందంబుగా వెదురాకుచందమునఁ
దిరుమణి తిరుచూర్ణము దిద్దిరి తోడ
నలఁదిరి మేనున నగురు గంధంబు
నటు పున్గు జవ్వాజి యలఁదిరి చాల
నురయించి కస్తూరి నురటుల విసరి
గుమగుమ వాసనల్ గుబులుకొనఁగాను
ఝణఝణ యనుచును జెలఁగుచు మ్రోంగ
నాల్గుపాదంబుల నాదుటందెలను
నావు శృంగారించె నైతమరాజు
మెండుగా వేసిరి మేలుగంటలను
రత్నాలు దాపినరావిరేకలను
దళతళ మెఱయంగ ధరియింపఁ జేసి

కొమ్మున బంగారుకుప్పెను దొడిగి
రహిమించ మెడచుట్టు రంగుగా నపుడు
గోమేధికంబులగొలుసును వేసె
మురు వైనముత్యాల మువ్వలపేర్లు
గంటల సరసను ఘనముగా వేసె
మూపురమునకుఁ జుట్టు మురువుగజ్జలును
సన్నగజ్జలు వేసె సందుసందులను
బాతాళ గణపతిఁ బంతంబు గెలిచి
యావుకై తెచ్చిన యర్ధణాల్ గంట
బొడ్డుగంటగ వేసెఁ బొందుగా నపుడుఁ
ఆభరణంబుల నావుకుఁ దొడిగి
పల్లికొండ నివాళి పళ్లెముల్ పట్ట
హారతు లిచ్చి రా యాదిమూర్తికిని
నప్పుడు సాంబ్రాణి యగుభుగుల్ గాను
పొగను వేసిరి దిశల్ పొడగట్టకుండ
నగురుపొగఁ బీల్చుచు నా వుండఁ గాను
మామయు నల్లుండు మఱి యెదుట నిలిచి
యావును వేఁడిరి హస్తముల్ మొగిచి

## బొల్లావును ప్రార్థించుట

పరతత్త్వరూప ! శ్రీహరి ! బొల్లియావ !
గోపినామము గలగోవిందమూర్తి !
యోగులఁ బ్రోచిన యో కామధేను !
హరులకు నరులకు నాదర్వు నీవు
మాకుఁ గేవలుఁడవు మఱి విష్ణుఁడవును
బుడమిలో జను లెల్లఁ బొడగని పొగడ
నరుదుగాఁ వెలయవె యావుగా మంద
నిరతముఁ జూడమె నీరూప మెల్ల
రూపులోఁ బ్రత్యక్షరూపంబు మాకు
జూపులోఁ జూచిన సూక్ష్మరూపంబు

నిత్యపాపము వాయ నినుఁజూడఁ గలిగెఁ
బరఁగ మల్లికయును బరమేశ్వరుఁడును
వరము లడిగినయట్టిసురలు నందఱును
బ్రత్యక్షసురభులై ప్రబలిరి గనుక
కోరినట్టులు మాకుఁ గోర్కె లీడేరఁ
గైలాసపతిసేవ గలిగెను మాకుఁ
బరమున సుఖియింపఁ బావను లగుచు
సౌఖ్యంబు బొందితిమి సత్యవాక్సురభి!
చెఱకువాడను నుండ జెలఁగి పోల్రాజు
చౌరారి జంగాలఁ జెఱలు పట్టంగ
వచ్చి పోల్రాజును జొచ్చిరి మఱుఁగు
పరమోపకారుఁడై పట్టీయలేక
పంతావు సురభిని ప్రార్థన సేసె
మనవి చేకొంటివి మాయా స్వరూపి!
జంగాల వెనుకనుఁ జక్కబోయితివి
యెప్పుడు మాతండ్రి యనిఁ గూలినాఁడు
యాపగల్ నేఁటికి ననుకూల మాయె
బలువైనసేనతోఁ బగరాజు రాగ
మన చల్లపిన్నయ్య మా కని పోరి
తనవంతుపగఁ దీర్చి ధరణిపైఁ గూలె
నల్లదె! పగవాఁడు నాముకొన్నాడు
మనకు యెదురు నిల్చి మార్కొనినాడు
బలు యుద్ధమునుఁ జేయఁ బంతంబుఁ గెలువ
నీవ దిక్కని చాల నెఱనమ్మినాము
మాతండ్రిపగఁ దీర్చి మమ్ము రక్షింపు
మెద్దు లావులె యని యేతేరఁ బగఱ
తలకోలలను వేసి తఱిమి పట్టుదుము
యెఱుగక నీమహిమ యిట్లాడువారె
మాకు సహాయమై మడియించి నపుడు
యాద్యుండ వని యెంతు రావు గా దనుచుఁ
గలియుగంబున నీదుకథ నిల్వవలెను

భువిఁ గంటకులఁ జంప బుధులను నిలుప
నీకుఁ జెల్లెనుగాక యెవ్వరి వశము ?"
అని యిట్లు వేఁడిన నావు తా లేచి
సంతోషమును బొంది చయ్యన నిలిచి
యల్లుఁడు మామయు నతిభక్తితోను
ననిసేయు మని చాల నావును వేఁడి
సాష్టాంగముగ నమస్కారముల్ సేసి
తరలి వచ్చిరి పీరతమకాన కంత
తమకంబు నిర్గడల దనకొండ విభులు
క్రిక్కిఱిసి యుండిరి యుక్కుఁ బోఁడి రాల
నప్పుడు రణములో నగుభుగుల్ గాను
పట్టపగలై యుండెఁ బట్టు దివిటీలు
కాల్చిన దీవిటీల కారుచు బాగయుఁ
గప్పెను శ్రీరామకపిలావు మీఁద
దివిటీల వెల్తురు తీయగాఁ జూచె
శ్రీహరి రూపమౌచి త్తజగురుఁడు
కూడారు వెడలి తాఁ గొడగొని వచ్చె
యూలించి వినె నంత నయ్యాదిమూర్తి
తిడిమి తిడిమిన భూమి దిగులు గొనఁగాను
నదిరిపాటునఁ దుడుము లగుభుగుల్ గాను
బిల్లఁగ్రోవులనాదు పెల్లుకొని మ్రోఁగ
నుదటుగా వాయింప నొగి నుగ్రమూర్తి

## బొల్లావు యుద్ధము

గోవురూపం బైనగోవిందమూర్తి
కొమ్ము లాతను దీడి కోపాన మించి
పాదమ్ము తాటించి పగతుర మీఁద
మచ్చుపుటముగ నెగసె మఱి పుట్టకడకుఁ
గార్మొకమ్ములు సేసి ఘాతకొరాఁడి
వారిపై బిడుగులై పడవలె ననుచు

నేన్నెత్తుగడ్డల నెగసిపడ జిమ్మె
పాదుకొమ్మునఁ జిమ్మె బగులు గడ్డలను
నుప్పరం బెనయంగ యోజనము పొడవు
నలసిద్ధిరాజు ముందర సరదార్లు
ఘనగుంపుగా నున్న గడ్డపైఁ బడెను
తలలు పుచ్చెలు పగిలి తరల కాడాడ
మెదడు చిందిన యంత మేదినిపైన
వఱిగిరి వ్రజీలు వసుధపై నంత
మందటి యాలోన మఱి తిప్పరాజు
ఆశ్చర్య మందుచు నటు చూడగాను
గోపించి మించిన కొంచెపు గడ్డ
తిర్ణమల తిప్పరాజు తీరమున బడెను
గ్రక్కు మిక్కు మనక కూలె నచ్చోట
నాగడ్డ మ్రోతలకు నట్టిట్టు చెదరి
సర్వసేనలు రాజు సరఁగ రా వెఱచి
తమ తమ యాలముల దగ్గర నిలిచి
మదిఁ దలపోయుచు మఱియు నిట్లనియె
"వానలేని పిడుగువలె మీఁదబడెను
మిన్ను విఱిగెనో మన మిత్తి యానేమొ
యే మనవచ్చును నీచోద మరయ"
సంధ్య గోపాల్రాజు సరస కేతెంచి
ముకుళిత హస్తుఁడై ముందర నిలిచి
"యోరాజ! విను మది యొక వింతగాదు
ఈగడ్డ పరతేమి వింతగాదయ్య!
మనదండు మీఁదికి మఱి కదలివస్తు
తామసంబునఁ గొమ్ము ధర గ్రుచ్చి యావు
వనర జిమ్మిన గడ్డ వసుధేశ్వరుండ!"
అనియిట్లు రాజుతో నాడు చుండఁగను
పంక్తికూళ్ల మన్నువారు పరఁగ నాయకులు
నాసంధ్యగోపాలు కప్పు డిట్లనిరి
"పంతగాఁడ వనుచుఁ బలికితిమిగాని

పొగరుచే నాబోతు పొడిచి ధరఁజిమ్మె
దుమ్మె రేఁగును గడ్డ తృణమంత లేవ
దావు చిమ్మిన దని యదురు చెప్పితివి
అశ్మశకాంత్రంబు ఆడితి మాట
ఘనకార్యములు చేసి గడపితిమి కాని
గగనంబుపైనుండి గడ్డలు రాళ్లు
పడి యొకరుగాకుండఁ బరువడి దళము
మడిసె నేరీవింత మహిని గనలేదు
చెప్పంగఁ గథలను జెవుల వినలేదు
ఇదియేమొ మహిమగా నిలను మఱితోచు
నీవుచెప్పిన మాట నిజమైతె చాలు
నావె కారణమైన నది యెంతపాటి
బలబల తెల్లవాఱు బలములు గదిసి
యడవుల దాఁగిన నాగుహాల నున్నఁ
దలకోలలను బట్టి తాళ్లఁ గట్టుదుము"
దివ్యదృష్టిని దెలిసి దేవతామూర్తి
పంతముల్ పరికించె బరఁగ బొల్లావు
పాదము తాటించి బలుఱంకె వేయఁ
గొండలు ధ్వను లిచ్చెఁ గుంభిని వణఁకె
నాకాశ మదరె సర్వామరుల్ బెదర
నెగసి ఘల్లున దూకి యెడపక పొడిచె
నుక్కళంబుల వార లుర్విపై నొఱగఁ
గుప్పించి పొడిచెను గూలెఁ బీనుఁగులు
నామేడి దగ్గఱ నధిపుల నెల్ల
మున్నూటి విలుమూక మునివాత పెన్న
చలమున నెదిరించి చంపె బొల్లావు
అధికకోపముచేత నాబొల్లియావు
మెండ్యెంబు దగ్గఱికి మెల్లనే వచ్చి
కాలియురుల్ సూచి కడు జౌకళించి
యావలఁ బడదూకె నవలీలగాను
బండిన వెనుద్రొక్క బంతినే వనుచుఁ

దనవాలమునఁ జుట్టి ధరణికి నడచి
త్రొక్కిన నమసెను తుపాకిమూక
కుప్పించి మెండ్యంబు కూలంగఁ దన్ని
తన్నిన మెండ్యంబు తరువాత నున్న
మన్నీలపై నుఱికి మాయగా నెగసి
సేనలకుఁ బిడుగయి చెల్లించి పొడిచి
నిలిచి హుంకారమ్ముసలిపి యటు సూచి
యటు లొక్కకొమ్ముసన నదిరిపడఁ బొడిచి
యిటులఁ దన్నినఁ దల లెగసి పోవంగ
ఘోర యుద్ధముచేసె గోవిందమూర్తి
బొల్లావు పొడగాంచి భూనాథుబలము
అల్లకల్లోలమై యటుతిర్గి మొనలు
మొత్తమై నిలిచెను మొనసిరాలేక
సాహసుల్ నిలిచినచందంబు సూచి
తనమది నూహించె ధరఁ గూల్చువిధము
పగతుర మీఁదికిఁ బాదచక్రాల
దండుపై నెగసెను తళుకుచందమునఁ
దలలు వ్రాలంగాను దాటించి దూకెఁ
దిరిగి చూడఁగఁ దలల్ దిబ్బలై యుండె
నట్టిటు పీనుగుల్ గుట్టలై యుండె
ఘన శంఖ చక్రాల గరుడబొల్లావు
ఏతట్టు చూచిన నెడలేక కదిసె
చాచిరి యీటెలు సరగ విల్మూక
తనవాలమునఁ బట్టి తఱిమి చంపంగ
జిక్కిన చిల్లరసేనలఁ జూచి
యవతారమూర్తిని నయియుండి నేను
ఒక్కొక్కరిని జంప నొగిఁ బాడికాదు
అని తనదేహంబు నటు మించఁ బెంచి
పరఁగ హనుమంతుండు పర్వతాల్ సుట్టి
పెకలించుచందానఁ బెనసి తా నపుడు
తనవాలమునఁ గొంత దళమును జుట్టి

ఎత్తి నేలను గొట్టె నెడలేక యుండ
ఘనరౌద్ర కోపమున ఘంటమువ్వలును
జలరేగి మ్రోగంగఁ జొకళింపుచును
ఘల్లునఁ బై దూకె ఘనులఁ బడఁదాకె
లేవకుండగఁ ద్రొక్కి రేచి కోపాన
నాదుటందెలు మ్రోగ నాల్గుపాదములఁ
బాదాలు తాటించెఁ బగతురపైనఁ
దన్ని సమ్మెటవ్రేట్లు తాకినయట్లు
పఱియలై పుఱ్ఱెలు వడఁగ నాడాడ
బ్రద్దలై గుండెలు వఱగంగ దళము
పొడమాపి పగతుర బొల్లియా వపుడు
సుడిసి తన్నఁగఁ బ్రేవు చుట్టుకొని వచ్చెఁ
కొందఱు విలుమ్మక గుంపులై యున్నఁ
గొమ్ము చక్కఁగ వఁచి కుదురుగాఁ బొడిచె
పెడమొగంబుగ వెంటఁ బ్రేగులు వెళ్ల
వాలము మొడఁ జుట్టి వడి నేలఁ గొట్టి
పాలేట గంగభూపాలునిఁ జంపె
నందికనుమునాగరాజు నడికలనఁ జచ్చెఁ
గొందఱు మన్నీలు గుట్టలై పడిరి
యెడలేక చంపెను వెస నాదిమూర్తి
కందుకంబునుబోలెఁ గాంతిలో నెగసి
ఘల్లునఁ బడదూకి గజములఁ జూచి
చేరువను నాయావు చెంగలింపంగ
శ్రీహరిఁ గని రాజు చింతింపసాగె
నాశ్చర్య మందుచు నటు దిగుల్గొనుచు
గజము సింహముఁ జూచి కలువరించినటు
వైరిని గనుగొని వగదప్పి యుండెఁ
బంతాన సురభియుఁ బైపడి వచ్చి
ఘనగజంబుల మీఁద గ్రక్కున దూఁకె
నావును జూచిరి యట మావటీలు
మఱియు డీకొల్పిరి మదపుటేనుఁగుల

ఢీపెట్టి యేనుగుల్ క్రుధన గదిసె
మదపుకేరంగుల మట్టిమల్లాడె
ధరణి నుప్పర మెగయ దానవు లెల్ల
నెగసి కుంభస్థలము లేనుఁగుల మెదడు
గుట్టలుగఁ బడియుండుఁ గుంభినిలోను
గొండలై మొండెముల్ గొతపెట్టుచుండు
మఱి యెగసి తన్నిన మావటీ లంతఁ
దల లూడి కూలిరి ధర మొండెములుగఁ
దొండములు బిగఁద్రొక్కి తొలఁగి పోనీక
కుతికలఁ బొడిచిన గుండెలు చినిఁగి
వెన్నునఁ గొమ్మూఁది యేనుఁగు లొఱగె
నాలసింవక తోడ నా యాదిమూర్తి
సింహమై యేన్గులశిరసుల కెగుర
ఘు~ సింహ మని యవి కలవరమంది
కల్లుపడుయేనుఁగుల్ కడు నొఱగెఁ గొన్ని
తగరులచందానఁ దాకిన యపుడె
గుండెలు బ్రద్దలై కూలె నశ్వములు
విలవిల తన్నుక విడిచెఁ బ్రాణాలు
గొదకొని యశ్వాలఁ గొమ్మున గ్రుచ్చి
పుత్తెలు పడఁ జిమ్మి బొల్లావు నుమట
నవలీలగాఁ జంపి యచ్చోటుఁ బాసి
ఘోర రణమున నిల్చి గొదకొని చూచి
కంచుభేరీలుచు గనకతప్పెట్లుఁ
దుడుములు మొదలుగా మరమందు విడిచి
గూడార్ల డేరాల గొబ్బున విడిచి
నొఱగిన రణముపై నొగిఁ గాఱఁజూచి
'సిరిలేని గుళ్లవలెఁ జెన్ను మాయంగ
సిరిదప్పి గూడార్లు చెలగంగరాదు'
అనియెంచి మదిలోన నా యుగ్రమూర్తి
గొడుగులు పడిగెలు కూలంగఁ దన్నిఁ
బడఁదీసి డేరాలు పాదానఁ జుట్టి

భూమిమీఁదను మచ్చుపుటముగా నెగసె
దివిటీలు చల్లార్చి దిక్కు లాలించి
మొలబంటి పీనుఁగుల మొండెముల నడుమ
నాధేనువును నిల్చి యటునిటు సూచి
యెదిరించి యనిసేయ నెవ్వరు లేక
యలపు దీరఁగ నుండె నరజాము సేపు
వీరనాయంకు లావేళ నందఱును
గత్తుల నీటెలఁ గడుఁ బాఱవైచి
చిత్తు విత్తుగఁ జెల్లఁ జిక్కినవారు
గుట్టలం బట్టిరి కొంద ఱావేళ
బెదరి చిల్లరమూఁక బెగడొంది పోయి
పొదలు దూఱాడాడ పొంచుండ సాగె
నప్పుడు మేఘుంబు నటు గప్పె మింటఁ
గప్పెను జీకట్లు ఘనసేనమీఁద
నావు వచ్చెరాక యటు కాసరాక
యా వీరనాయకు లప్పు డుఱుకంగ
నొకరిపైఁబడియొకరు నొడికట్లు పడిరి
తల్లడింపుచు వారు తల్లక్రిం దైరి
కత్తులు నేజాలుఁ గడు వంకిణీలుఁ
దమ యాయుధంబులు తఱచుఁగా నాటి
చిత్తు విత్తుగ వెసఁ జెల్లేటివారు
ఆవు వచ్చె నని యప్పుడు బెదరి
యాఘోరరణమున నప్పు డుఱుకంగ
గూఁడారు చేరుల కొంపలు దగిలి
తలక్రిందుగాఁ బడి తారెడువారు
నెళవు చీకటివేళ నెప్పెఱుఁగ లేక
యావు తన్నఁగఁ బడి యటు తొలఁగి కీళ్లు
పడి ప్రాకులాడుచు వాపోవు చుండి
రా వీరనాయంకు లప్పు డుఱుకంగ
వలలఁ దగుల్పడి వాపోవువారు
పడలేక యాపదల్ పడఁతులచేత

వస్తి మేమిటి కని వగఁ జెందువారు
నక్షత్రైలు భేడె లటు పాఱవైచి
మళ్లి చూచుచు వారు మఱియు నుఱుకంగఁ
బడివారి పాదాలఁ బడి లేవలేక
హరి హరీ! మముఁ గావు మనియెడి వారు
చక్కని మేద్యంబు సందున దూఱి
పఱుగున నుఱుకంగఁ బుఱియలు పగిలి
యాపద నొందుచు నని రిట్లు వారు
కడ తేరితిమయ్యైన గండంబు గడచి
బోనాలు పెట్టుదుము పోలేరు తల్లి!
చాలను దండముల్ సలిపెడి వారు
కాలికొద్ది యుఱికి కదుమన్న వారు
కావరపుమన్నీలు గను దూరముగను
నుఱికి ధీరత నిల్చి తిరిగి యిట్లనిరి
మనకన్న దొరకొడుకు మహి లేఁ డటంచు
నుఱికేటి వారిని నూఱడిం చొకడు
పఱుగువాఱకుఁ డయ్య! పఱుగువాఱకుఁడు!
కడఁక నామెడమీఁద గల్లు వడ్డాది-
యని పల్కె నొక్కరుఁ డాసమయమున
బోటుబంట్లిల్లను బ్రోగులై రచటఁ
బంతాలు తిన్నంగఁ బలికిరి వారు
పగలు గాదాయెను బడుగెడలువేసి
పగదీరఁ బొడ్తు మని పలికె నొక్కండు
ఎఱుఁగకుండగ మనము వెనుకను డాసి
యిప్పు డేమాయె నని యీఁటెఁ జేఁబూని
ఘంటలు నందెలుఁ గదలఁ ధాటించి
యటు మళ్లి కుప్పించి యావుత ట్టెగసి
వెనుక నంతట నిల్చి వెఱవ కిట్లనియె
నీరీతిఁ బొడిచిన నిల నేడ నుందు
నప్పుడు మనసైన్య మటు చెదర కున్న
నవలీలగాఁ బొడ్తు నని పల్కె నొకఁడు

నీతిమార్గం డొకఁడు నిలిచి యిట్లనియె
'దగ్గఱ లే దని తఱచు ప్రేలేరు
ఎదిరించఁ దాన్నైతె యేనుఁగుల నట్లు
నరదార్ల భటులను సాహసులఁ గూల్చి
మాయగా నుండియు మఱివచ్చెనైన
వయసు ప్రాయము లేదు వడి నుఱుకనైనఁ
దరిమల్లఁ బడి చావు తప్పించుకొనియుఁ
బఁతాలు పలికేరు పడియుండలేక
యేటికిఁ జాపంగ నిట నుండుఁ' డనఁగ
నవ్వు నని తలపోసి రంగఱు నవ్వుకు
'తఱుముచుఁ దోకను దా నెత్తినపుడు
హనుమంతుఁ డనుకొంటి నాయావు రూపు'
'ఆయావు గాదు నీ వంటివి కాని
కరులపై నుఱుకంగ గట్టిగాఁ జూస్తి
కొదమసింగమురూపు కుదురుగా నుండె
వినరోరి! మొదు టుండి వివరించి చూస్తి
శంఖచక్రంబులు చలఁగి యల్లాడ
నాదివిష్ణనుకొంటి నాయావు రూపు
ఈరీతి నుండఁగా వింతపడ నేల?
అన్నలారా! యిఁక నావుఁ దలఁచక
మన పూర్వఫల మంచు మఱి తలఁపుఁ డోయి!'
యా వీరనాయంకు లటు తలపోసి
యీ కొల్వులోనుండి యిటు పడుటకన్నఁ
దివిరి యే బలుసాకుఁ దెచ్చుక తిన్న
నలబలము లేకుండు మనిమెడి వారు
సంధ్యగోపాలుండు చాటఁ జేసితిమి
నందకాడను నట్లు జరగలే నైతిఁ
దనవెంటఁ గొందఱు తగిలి రా రైరి
పొడిచి చంపుదు మించిపోయెను గాని
పోయ ననఁగా నన పొడబాల సోము
"తటిమిటి నావును దలనూపకుండఁ

దో డెవ్వరును లేక తోఁణకి పోఁడువంగ
వచ్చితి నా యావు వచ్చునో యేమొ ?
యేవంక వచ్చునో యెఱిఁగి పోఁడుతాము
కాచి యుండుఁడి చక్కఁగను వీరులార !"
ఓబళ యనువాడు ఒకవార్తఁ జెప్పె
'నాలుపాటలు గావు ఆవు వచ్చినను
నజ్జుగాఁ ద్రొక్కని నవ్వులు గావు
చాటున నుండుఁడీ చాలుఁ గాయకుఁడి !'
తండారిగాఁ జెప్పి తా నిల్వలేక
గుజ్జర్ల ఓబళ గుజ్జంబు విడిచి
బొజ్జ పిసుకుకొంచుఁ బోసాఁగె నపుడు
చయ్యంపు ఓబళ జంజాలి యాట
తూటి తీగలక్రింద దూఱె నాపదకు
శకునంబు గాదాయె సాఁగి రాఁగాను
వేగవచ్చితి మని వెతఁగుందువారు
కాని శకునమునఁ గదలి నందునను
గలనిలో బొల్లావు కల్లుగాఁ జంపె
నిఁకనైన నెల్లూరి కీప్వాడే పోయి
మంచిశకునమున మరలి వచ్చెదము
ఎన్నఁ డీ గోవార్త యెఱుఁగము కాని
యుండూరఁ బరిణాన నుందు మనువారు
'సంధ్యగోపాలుని సత్యంపుఁ బలుకు
పొట్టకావరమునఁ బోనాడఁ బట్టె
సంజయైనను దిక్కు జరగమైతి' మన
నల్లున నగి యొక్కఁ డండ పోద నుండి
'పరఁగ నాప్రకు వెఱచి పంత మెంచేరు
తెల్లవాఱిన నాప్రుఁ దేటపడఁ జూచి
యొక్కండనే పోయి యొద్దిక దానిఁ
బరఁగ దోలుక వత్తుఁ బంతంబు చూడుఁ
డిట్టట్టు వేగించి యిఁక రెండుజాలు
తెల్లవాఱను నిటఁ దేకుటినైన

నందఱును నెల్లూరి కరుగుదా' మనెను
మగిడి యిట్టుల వారు మదిఁదోఁచినట్టు
లనుకోఁగ విని యెఱుక నాడెవిష్ణుండు
పంతాలు కొందఱు పలుకుమాటలును
గోప్రము వెఱచియుఁ గొనియాడు మాట్ల
మనసునఁ దలపోసి మఱి యాదిమూర్తి

## బొల్లావు రాగా సేనలు పఱుగువాఱుట

చంపంగఁ జచ్చిన సైన్యంబులకును
నడవులఁ బట్టియు నడగలే దుమటు
సే నీడ నుండంగ నిలుతురో వారు
తిరిగి యుద్ధము సేయ ధీరులు గలరో
యంతట నిలువక పంతముల్ మాని
యుఱుకఁ గలవారైతె నుండ నేమిటికి ?
యుఱికి నాపైఁ బడి యొగిఁ జంపరాదె ?
గుఱిగాను వేగమే గూడారుఁ జొచ్చి
యత్యుగ్రకోపియై యప్పుడు బొల్లావు
కాళ్ల నాదెను ప్రమోదఁ గాలు తాటించి
ఘన అంకెతో బొడ్డుఘంట నాడించె
నాధ్వని విని నృపుఁ డాశ్చర్య మంది
యుడుగు చుండఁగ సేన లసుభగు లయిరి
వచ్చె బొల్లావని వాపోవుచూను
డాఁగినపొద వీడి తల్లడింపుచును
నుఱుకంగ నాయకు లురుదాళ్ల భంగి
నెదలఁ దీగలుచుట్ట వెతఁ గుందువారు
సాహసవంతులు చబుకుల భంగిఁ
గోరిందరెబ్బలు గొబ్బునఁ గొట్టఁ
గండల రక్తంబు కాల్వలై పాఱ
వెతనొంది యుఱికిరి వెన్నంటె ననుచు
బాగైన నాయకుల్ పఱుగువాఱంగ

సుంద్రకంపము బడి నాగి దాడు బెట్టి
రాఘుంట ధ్యానులకు నావు వచ్చె నని
తల్లడింపుచు పాటి తబ్బిబ్బు లయిరి
'పాఁడియావులు కొల్ల వఁగంగ నిచటఁ
గొంచుఁ బోవుద మని గొబ్బున వస్తి
తల్లిబిడ్డలు సూడఁ దాపు సేరసయొ
దిక్కుమాలితి చావు తీగెలలోనె !
నక్కలే దిక్కాయె నట్టడవి గదె'
పరిపరి విధముల పరితాప మొంది
వెతఁజెంది యుఱికిరి ఏరువా వనక
పొడబాల సోమన్న పొడగానకుండ
నేడ దూరిన సందు లెనలేసి పొదలు
తెగి దూఱ నాడాడ దేహ మంతయును
జీరలు జీరలై చిందె రక్తమ్ము
దగిలిన కొత్తిపోట్లు తఱచుఁగా నాటె
బలిమిని బొదదూఱి పఱుగువాఱంగ
జల్లులు గంటాడె జరజర దూరి
యని యొడిఁ బట్టుక యాయాటఁ బాఱ
నైచియు నోబళ పఱుగువాఱంగ
ఘంట దాపున నుండి ఘణాఘణ మ్రోగె
నాసడి సామి కేఁ డావు వచ్చె నని
తందర లాడుచుఁ దాను దో నుత్రికె
చలపట్టి బొల్లావు సమయింపఁ దలఁచి
వెనువెంట వచ్చెని వేరు గతి యేమి ?
అని మొబళ్లుఁను వాగు నతివేగ దాటఁ
దగఁ దూము లేఁక దాటి తాఁ దిగ్గి చూచి
నలుగడ లాలించె నాఘుంటనాదు
విని గ్రచ్చపొదఁ జొచ్చె వేగంబె యతఁడు
పిట్టకీచురు మన్న బిట్టులిక్కిపడుచుఁ
బోటుబం టగునట్టి పొడబాలసోము
- కన్నులఁ బొడువంగ గ్రచ్చముళ్లిండె

సిద్ధిరాజు సేనలు చెదరి యాడాడఁ
బోదల గుట్టల దాఁగి పోనఁగ వేఁడుచును
వంకవాగులను దైవం బా వటంచు
నెక్కడ దాఁగిన వేఁడుచు నుండి
రాదిమూర్తికి నిది యంతయుఁ దెలిసి
యారణంబును వీడి యాదివిష్ణుండు
కోలని లోపలఁ జొచ్చి కోపానఁ దన్నుఁ
గదిసిన యాభద్రగజములఁ జంపి
యరిగెలు ఖేడెలు నటు నుగ్గుసేసి
సరదార్ల బంటుల సాహసులఁగూల్చి
(*... ... ... ... ...)
అందలంబులవారి వందలుగఁ జంపి
పాలకీవారిని బవరానఁ గూల్చి
యందెలగడ లన్ని యటు నుగ్గుసేసి
తుడుముల భేరీలఁ దునియలు సేసి
నడి ధమామీలను వ్రక్కలు సేసి
హరిహరుల్ పొగడంగ నరులు వేడంగ
నరసింహు రూపమైనటు గదలి వచ్చి
యంటత బొల్లియా వతివేడ్కతోను
నసురముఖుగూడారు కప్పడే తెంచి
వంతానఁ గూడారఁ బవళించి యుండెఁ
దెలతెల్లవారంగఁ దొలిచుక్క పొడిచెఁ
బలికె దిక్కులఁ గలపక్షు లేమరక
యినుఁ డుదయాద్రికి నేతెంచి వచ్చె
నడవుల దాఁగినయవనిపాలకులు
పొదల దాఁగినయట్టిపోటుమన్నీలు
వ్రెల దాఁగినవరుసుమన్నీలు
మోకాళ్ల మోపున మోరెత్తి చూచి
వంగి వంగియు నావు నడఁ జేఁడి రంత
లేచి చూచియు నావు లేదు లే దనుచు

* ఇట గ్రంథ పాతము. ½ పేజీ.

జననాథు బాతికిఁ జేరి రాఁగాను
గలవరింపుచు సోము కడుభీతితోను
నదె వచ్చె బొల్లావు అదిగో యటంచు
దద్దరిల్లుచు నుండ దండినాయకులు
వెఱువకు మని పోద వెళ్లఁ దీసినను
నదెవచ్చె నదెవచ్చె ననుచుండఁగాను
జడియకు మని వీఁపు చఱచేటివారు
ఎదుఱొమ్ము చఱచిరి యేమి లే దనుచు
భయముఁ బోఁగొట్టి వే పదపద మనుచు
సిద్ధిరాజుల యొద్దఁ జేరి రందఱును
మొగిచి హస్తము లెత్తి మొఱపెట్టి రిట్లు

## చెదరిపారినసేన సిద్ధిరాజుతో మొఱపెట్టుట

"అవనీశ్వరా! మేము ఆప్రత్తోఁ జాల
నాఁపద పడలేక యడవుల కుఱుక
వఱ్ఱెల వాగుల వడి చిక్కుకంప
నంధకారంబున నంతఁ గంప కున్న
నాపుచే సమసెను నయ్యరో! దళము
సంధ్యవేళను చెప్పె సంధ్యగోపాలు
పంతంబు పలికిరి పలుగాకు లెల్ల
నెఱుఁగని మాటకు నెంత లే దనక
గట్టిగా నుండంగఁ గట్టడి సేయఁ
గట్టడి నుంటిమి గట్టిగా మేము
పయిరుండి యామిన్న పడుచందమునను
నాపు మాపైఁబడి యార్చి పెల్లుగను
చిత్తువిత్తుగ మనసేనలఁ గూల్చి
గజముల నశ్వాలఁ గల్లుగాఁ జంపెఁ
దగ రాత్రి సమసిన దళ మింత యనుచుఁ
జెప్పి చెప్పఁగ లేము చేరి చూడగదె"
ఆ మాటకును రాజు ఆశ్చర్యపడుచు

నారాజు మంత్రుల యందఱ తోడ
నారణంబున నిల్చి యటు వాఱఁ జూచి
ధరఁ గప్పి యొఱగిఁ దళెములఁ జూచి
'శ్రీరామబొల్లావు చేసిన పోరు
కన్నులఁ జూడంగఁ గాదెణ మాయె'
నని తాపమునఁ గుంది యప్పు డిట్లనియెఁ
'గానిశకునంబునఁ గదలిచని యెత్తి
కలనిలో నిలిచిన కారణం బిదియు'
నెత్తిన గూడార్ల వేగంబె దించి
ధారుణీశ్వరు దండు తరలె నావలను
నెడముగా బయలను నెత్తె గుడార్లు
పేరాళముగ నిల్చె నారాజు దండు
డేరాల నెత్తించె ధీరుఁడై రాజు
అట రాజు మంత్రులు నాత్మబాంధువులు
గాదకాని డేరాలఁ గూర్చుండి రంత
సర్వదళంబుల సభ వారిఁ బిలిచి
యుర్వీశ్వరుండు తా నొయ్యనఁ బలికె
'విచ్చుఁ గత్తుల వార! విలుమూక వార!
గడిమన్నె మూకలు! కాల్బలము లార!
కంచు టరిగెలవార! కనుగానినార?
పోటుకాండ్రుర వెంట పోయి సరిపోరి
పనిబడి చంపంగఁ బైనమై రండి
యిబ్బడి బత్యాల నిప్పింతు మీకు'
ననురాజునకు మ్రొక్కి యప్పు డిట్లనిరి
'రాజ! యీరే యాప్ర రణమందుఁ జొచ్చి
హెచ్చుగాఁ జంపెను వేలులక్షలును
గదలు చుండఁగ నావు ఘంటనాదులకుఁ
గొండలు ధ్వను లిచ్చెఁ గుంభిని యదరె
నపుడు సమసిన మూఁక లంతంత గాదు
ఘంటధ్వనుల కేము కల్లుపడ్డాము
ఇబ్బడి బత్యాల నిచ్చినా వద్దు

ప్రాణాలు గలిగితే బలుసు కూరిమ్మి
యిబ్బడి బత్యాల సిటు తెత్తు" మనఁగ
మాఱె విని యేరాజు మతి నిశ్చయించి
సంధ్యగోపాలుతో సరగ నిట్లనియెఁ
'గ్రాలెడు ఘంటలు గజముల మెడల
మ్రోగుచు నున్నవి మ్రోఁత మిన్నంటి
యీపుఘంటలు కొండ లదరంగ మ్రోగె
నా మ్రోతలె లక్షణం బది యెట్టి' దనుచు
నడిగిన గోపాలు హస్తముల్ మొగిచి
మ్రోత పుట్టినతీరు మొదలు వచియించె

## సంధ్యగోపాలుఁడు ఘంటవృత్తాంతమును చెప్పుట

'ద్వాపర యుగమందుఁ దగ దుష్టులైన
బాణుండు నరకుండుఁ బౌండ్రుండు మఱియు
బహుపాపి కంసుఁ డక్క బలురక్కసుండు
కాలయవనుఁడు బకుఁడు గడుసుప్రళయుండు
దంతవక్త్రుండును దగ ధేనుకుండు
సాల్వుండు మురుఁడు నాఁ జను రాక్షసాళి
మొదలుగా భూదేవి మోయంగ లేక
హరికి మొఱపెట్టిన నతఁడు పరిమార్ప
మధురలోఁ గృష్ణుఁడై మనుజుఁడై పుట్టి
వరఁగ ద్వారక యను పట్నంబు నేలి
యంతఁ బూతనఁ జంపి యసురులఁ గూల్చి
పదునాఱువేల గోపస్త్రీల నేలి
చిన్నవాఁడై యుండి శ్రీకృష్ణమూర్తి
యింద్రుని దేవేంద్రు నెంతవాఁ డనిన
వాడున నింద్రుండు వానఁ గురియించె
వానకు వెఱవక వకట్రేలునను
గోవర్ధనంబును గోటనే యెత్తి
మఱియు నా గిరిక్రింద మనుజుల నెల్లఁ

గరులు సింగంబులుఁ గదిసె హితమునను
మేకలుఁ దోఁడేళ్లు మిళితమై యుండె
నెలుకలుఁ బిల్లులు నేకమై యుండె
గండభేరుండముల్ ఘనశరభములు
నేకమై పక్షులు వెలయుచు నుండె
వైరివర్గము లేక వసుధ జీవులను
కాపాడుచుండెను గోపాలకుండు
నింద్రుండు వానకు వెఱవఁడే యనుచు
బ్రళయ మహా పిడుగులఁ బంపెను నపుడె
యాసమయంబున నా కృష్ణమూర్తి
డాసివచ్చినపిడుగు డాచేతఁ బట్టె
యొడిసిపట్టినపిడుగు నొనర బంధించి
కరుణచే నావిశ్వకర్మఁ బిల్పించి
'వినుము కలియుగమందు విశ్వకర్మడ!
పాతాళ గణపతి పశుపతి పూజ
సేయుసమయంబునఁ జేరి నాదించు
ఘనమైన యామఁచిఘంట గావించు
మదిగాక జాంబవుఁ డాదికుల మందుఁ
గడఁచి జన్మము లెల్లఁ గలియుగ మందు
వీరన్న వరమున బీరన్న యనఁగ
నాదికులమునఁ బుట్టె నతఁడు చేపట్టె
వీరభద్రుని కత్తి కీడగు చుండ
గోసంగి పేరిటఁ గొంగవాల్ కత్తి
యిప్పుడే కావించి వినుమ యిఁక నొకటి
కోర్కెతో నాకోడె కత్తిఁ గావించు
మాకత్తితోఁ జాల సక్కటి గలదు'
కల్క్యవతారుఁ డీక్రమమునఁ జెప్పఁ
గావించె నావిశ్వఘనుఁ డంతలోను
నవి నూచి శ్రీకృష్ణుఁ డాశ్చర్యపడుచు
నాయాయుధములకు నానతి యిచ్చెఁ
'తెలఁగి మిమ్ముల్లఁ జేతఁ జేపట్టువారు

వేవేగమున వచ్చి వేఁడిన యపుడె
సాహాయ్య మగుఁ డని సామి చెప్పంగఁ
ప్రార్థించి యాఘంటఁ బాగుగఁ జేపట్టి
పాతాళగణపతికి బాగుగా నిచ్చె
నా ఘంట నాదించి హరునిఁ బూజింప
గర్వాన నిచ్చిన ఘనుఁ డలపఁ డెనుగు
నవతారమును వీడి యదువంశ మందుఁ
గాటమరాజు నాఁ గడఁదతోఁ బుట్టె
కవులావులను మేప ఘనవుఁ బుల్లఁ బెరిగిన
నెదకి తాఁగొంకఁ గలఁగి విఘ్నేశుఁ జూచి
భాషించి ప్రార్థించి పై సమ్మోహింపఁ
బగడసాలల నాఁడ భాగుగాఁ దలంచి
యాండి పంతము గెల్చి యొప్పు డా రాజు
ముమ్మారు గలిచెను ముదముతో బిలిచి
రమ్మంచి యా విఘ్నేశుఁ డిద్దియా ఘంటఁ
గొమ్మని రాజుకు గర్వాన నిచ్చెఁ
కవులావుల కడకు ఘంటఁ దాఁ దెచ్చి
బొల్లావునకు దాసి బొడ్డునఁ గట్టె
నాఘంట నాదంబు సంతసింత గాడు
విన్నపము సేసెన పిదప సిద్ధరాజు
అత్యుగ్రుఁ డై మండె యమ్మోఁకఁ బిలిచి

## సిద్ధిరాజు వీరులను బొల్లావుమీఁదికిఁ బంపుట

ఘంట చంపదు ఆవు ఘాతలు గాని
వెసనొక్క యావుకు వెంచి ప్రాణంబు
దాఁచి నూతెండ్లకుఁ దగ నుండఁ గలదె
చావును బుట్టువు సర్వేశ్వరుండు
కట్టడి సేసిన క్రమము మది నుంచి
వెలివక యనువుల కెదిరించవలెను
నందికనుమ నాగరాజ ! నందకోట రామరాజ !
వాగర్త భీమరాజ ! వలపర్తి పాపరాజ !

కందుకూరి గంగురాజ! కస్తూరి తిమ్మరాజ!
పత్తికోట బసువరాజ! పద్మాక్షు గోపరాజ!
విటకోట అబ్బిరాజ! యింద్రభోగం అక్కిరాజ!
సజ్జన రామరాజ! సంకల్ప సిద్ధిరాజ!
వింధ్యాద్రి జగ్గరాజ! యివ్వాడః పోయి
బొల్లావు వెన్నంటి పోనీక చంపి
శీఘ్రాన రమ్మని సెలవిచ్చె రాజు
వీడుకోల్పిన రాజు లీకెల నంది
సానకత్తులఁ గొన్ని జబురుగా వంది
విల్లు నంబులుఁ బొదులు వేసనుఁ దా మంది
యప్పుడు రాజులు నవని గంపింపఁ
గదసంబు సేయును గదిసి రంతంత
నావు జూడను వచ్చి యావుచు జూచి
నెమ్మది గూడర నిద్రవోవంగఁ
గొనకొని యార్పుచుఁ గూడి రిర్గడల
నాయార్పులను విని యావు తా లేచె
నిజ మని శంకతో నిలిచె బొల్లావు
నిలిచిరి యావుపై నెదిరి విలుమ్మక
తెంపుగా విండ్లను దెగ నిండఁ దీసి
విడిచిరి బాణాలు వేయివిధముల
నప్పుడు బాణాలు నావుపై రాఁగఁ
బింజల ధ్వని యనిఁ బెనుమ్రోఁత మ్రోఁగ
వదలించి దూకుచు నావుపైఁ గదియ
నేమి యెర్గని యావు వెఱ్ఱిగా నుండి
కదిసి రానిచ్చి తాఁ గాలుఁ దాటించి
వద్దకు రానిచ్చి వాలమునఁ జుట్టి
యడలంగ రాజుల నవనిపైఁ జంపెఁ
జెలరేఁగి యాయావు సేనల దొరఁదఁ
బడఁ దన్ని చంపుచు వా రెంముఁ జన్నఁ
బొడిచి చంపుచు నావు పారిమార్పఁగాను
సమసిరి మూఁకల సాహసు లెల్ల

## మాయోపాయమున నావు వీరులను మడియించుట

నార్భాటములు విని యాయాదిమూర్తి
రాకడిల్లుచుఁ గదిసి రాచమూఁకలను
దన విశ్వరూపంబు దాఁచి బొల్లావు
మాయరూపముఁ దాల్చి మఱి లేవలేక
పండ్లూడినను సలిబడుగోదవలెను
గజ్జలు మువ్వలు ఘంటలు సరులు
నావుపై జోరీగ లాడినయట్లు
పిసుదులై కఱచుక పెనఁగి యున్నట్టు
లారీతిగా నున్నయావుపైఁ జొచ్చి
రాక చేరువ నుండు రాణువ లుండ
నెపముగా నిలిచిరి వింట్లెక్కు పెట్టి
వెస దీసి బాణాలు వేయ నిర్గడల
నాదివిష్ణున కయ్యె నసురు బాణములు
భక్తులమీఁదను బ్రమథగణములును
మంత్రాక్షతల వేగ మఱి చల్లినట్లు
ఆరీతి తెలియక యారాచమూఁక
వేయంగసాగిరి వెస రేఁగి చాల
నెంత వేసినఁ గాని యే మనక యున్న
నప్పుడు కొందఱు నటు డాసి వచ్చి
యంతటంతట నిల్చి యావును జూచి
‘బాణాలు వేయకుఁడి పడి లేవలేదు’
అని యిట్టు లాడుచు నందఱుఁ గూడి
పొంచి చూచిరి యావుపోలిక లన్ని
యీరాత్రి పోరిన దీయావు గాదు
వంటికొమ్మావైన పట్టి ముదుసలి
మనసేనలను రాత్రి మహిఁ గూల్చినట్టి
యావు దీనికి బిడ్డ యావుననె నొకఁడు
జోరీగలను నావు స్రుక్కింది కాని
కొమ్మొక్క టున్నది కొంచె మనరాదు

బలిసి యుంటే యిది బహుబలువ దనిరి
గుఁడెమునురు రాగ గూడారు నుండి
మందలో నుంచక మతి తోలినారు
వేసిన బాణాలు వెక్కస మాయె
యొక్కశర మంటిన నొఱగ నిక్కడను
దోక పట్టుక దీనిఁ దోలుక పోయి
పొంనుగా రాజుకుఁ బోలికఁ జూపి
మతి చంపవలె యూవు మహిం నుంచరాదు
గట్టిగా మనమీఁదఁ గయ్యంబుసేసి
మట్టిన బొల్లావు మంద నున్నదియొ
కల్లుపడి యుతికెనో కాఱడవులకు
నెందుఁ జొచ్చెనో కాని వెదకి సాధించి
బారుబాసున నార్వ బల్లాలఁ బొడిచి
మనలఁ జంపినయూవు మహిమీఁదఁ గూలఁ
జంపి పోవలె రాజు సముఖంబు సేర
వారి వంతాల్ వించు వాలంబుఁ జుట్టి
బిగువుగా నంకించి పెకలించి యెత్తి
యొడిసి నేలను గొట్టె నొప్పులై పగులఁ
జెలఁగి యా బొల్లావు సేనలమీఁద
యొడిసి తన్నినఁ గొంద ఱొఱగిరి ధరను
నెందుఁ బోనీయక వెను దగిలి యూవు
పొడిచి చంపుచు నావు పొలియింపఁగాను
సమసిరి మూఁకల సాహసు లెల్లఁ
జిక్కిన వారిపైఁ జెలఁగి దూకంగ
నావు రాకకు వార లగుభగు లైరి
వెఱచి యుతికేవారి వెనుదగిలి యూవు
సందుల గొందుల సాధించి మించి
యెందుఁ జొచ్చినను బోనీక చంపంగ
నవు డుతికి యామూఁక యడవులఁ బట్టె
నారణంబున నిల్చి యంత బొల్లావు
ఎటుపాఱఁ జూచిన నెవరు లే రనుచు

వచ్చి గుడారంబు వద్దను నుండె
నలుగడ నుఱికెను నటురాచమూఁక
సజ్జల వాగునఁ గూడి శ్రమ దీర
రాచమూఁ కప్పు డాలోచనఁ బడియె
నావుచే రాచమూఁ కంతయు మడిసె
వనరంగ మనరాజు వద్దకి నరుగఁ
బద్ధతి గా దిప్డు పరఁగ రాజులకు
సరగఁ బగతుర ననిఁ జంపను జావఁ
గట్టడి కల దది కర్జంబు మనకు
ననుచు నందఱు నాడి రతిరోషమునను
మఱి రాచమూఁకలు మదిని రోషించి
పొడు పొడు మనుచును బొడెములు ద్రొక్కి
కడిసిన శ్రీరామగరుడబొల్లావు
పాదముల్ దట్టించి పగతుర మీఁదఁ
గొమ్ముననగిట్టల గొరిసెలచేత
నుగ్రుఁడై పొడిచెను నుర్వి బొల్లావు
ప్లంలాడు చిఱుగోళ్లఁ బదును గలదంచుఁ
డా నరసింహుఁడై తగఁ జీల్చు ననుచుఁ
గదనాన మూఁకలు గగ్గోలు పడఁగఁ
జౌకళించియు దూకె సైన్యంబుమీఁద
వడిఁజేరి పొడువంగ వాసి గలవారు
చూచి వాలంబునఁ జుట్టి రాఁ దిగిచి
విఱిచి నుగ్గులు సేసె నీటు లన్నియును
వీరకాతుల తలల నెగిరి పడఁ దన్ని
తనపైన గడ లేసి తందర నొంది
యటుమళ్లి యుఱుకంగ నరికట్టి వారి
గుదుల కొమ్మునఁ జాల గ్రుచ్చి యెగఁ జిమ్మె
నెగసెను బీనుఁగుల్ యోజనము పొడవు
తివిరి తటాలున దివిపైనఁ బడెను
దళము పైఁ బడఁగఁ గొందఱు హాత మైరి
దుడ్డుకో-లవారి దురమందుఁ గూల్చి

నడ్డుకత్తులవారి హతమార్చి చంపె
జంజాళములవారి సమరానఁ గూల్చెఁ
దలపడి శత్రులతల లూడఁ దన్ని
మానవుల నిర్జింప మఱి యాదిమూర్తి
యెదురు బెదురునులేక వేడుక దీర
నావు పగతురఁ జంపి యానంద మంది
రణములో శిలబంటిరక్తంబు ముంచి
వచ్చి గుడారంబువద్దను నుండె
నప్పుడు కొందఱు హతశేషు లగుచు
మ్రొక్కి చెప్పిరి రాజుముందర నిలిచి

## పాటినవీరులు బొల్లావును రాజునెదుట ప్రశంసించుట

'పల్లవాధిప! వినుము పరిణామ మెల్ల
బొల్లావు మీఁదను బోయిన దళము
వీరులు శూరులు విక్రమార్కులును
బోరాడి యావుచేఁ బొలిసిరి దేవ!
కన్నులఁ జూస్తిమి క్రమ మెల్ల వినుము
పాదాలు నాలుగు పరఁగఁ జక్రాలు
పై పిల్లగిట్టలు బాణాలఁ బోలు
నది తోక గాదయ్య హనుమంతువాలు
వంటికొమ్మది గాదు వజ్రాయుధంబు
శంఖుచక్రంబుల చాడ్పున నాడు
నసురతలాటాల నాయావు నెగసె
నరసింహుఁ డనుచు నెన్నఁగఁ దగు దాని
నెదురుగా నిలిచియు వెఱవక చూడ
గట్టిగా శ్రీహరికై వడిఁ దోఁచుఁ
గల్లగా దోరాజ! కనలక వినుము
పరఁగ నావుముఖంబు పద్మంబుఁ బోలుఁ
గల్వరేకులఁ బోలుఁ గన్నుల తీరు
ఆ కర్ణములఁ జూడ నానంద మవును

నాదివ్యనామంబు నమరంగఁ జూపె
గట్టిగా శ్రీహరిగరుడవాహనమై
కల్ల గా దో రాజ! కనలక వినుము
పఱఁగ యాదవులతోఁ బగచేతఁ గాని
కాకుండ నో రాజ! కనుగొని నీవు
హరి యని వేఁడిన నఘమంత వీడి
పరమపావను లయి పరఁగు చుండెదరు'
అని విన్నవించిన నా సిద్ధిరాజు

### సిద్ధిరాజు మండిపడి యావుపైకి బోయలను బంపుట

ఘనమైన కోపాగ్ని కన్నులఁ గురియ
వేలును రెండేసివేల్ గలకొట్టి
బోయలఁ బిలిపించ భూనాయకుండు
పరకసాని అబ్బినీడ! పట్టర్ల పిన్నయ్య
గుఱిపోతు అన్నయ్య! గుజ్జర్ల ఓబళు!
మర్ల సాతంనేఁడ! మతుకుల విట్టల!
వంటరి మరినీడ! వయసు ముకుందు!
జల్లిచి ధన్నీఁడ! సాతర్ల వరచి!
బొగ్గుమల చందయ్య! భోగసంబి నేఁడ!
నిగ్గుల కామినీఁడ! నెలవరి భీమినేఁడ!
జన్నవాడ పామినీఁడ! జక్కం ఓబళు!
మినుగూరి బొమ్మినీఁడ! మీనుఁగ కొండు!
తొమ్మిదివేల్ విల్కాక జోతుల సోమినేఁడ!
పయనమై రారోయి! పటువీరులార!
యిమ్మహి వెలసిన యిట్టి సాహసులు
పరఁగంగ మీరు మీ బలములతోను
వేవేగమునఁ బోయి వేయి బాణాలు
తూలి వేయుఁడి యావు తుపాకి గుండ్ల"
అని యిట్లు పేర్పేర నటు సెప్పఁగాను
పయనమై యాయత్తపడి వచ్చి రంత

మొగిచి హస్తంబుల మొనసి యిట్లనిరి
"ఆవు సేసిన యుద్ధ మంతింత గాదు
ఆవుపైఁ జనువారు హాత మౌట నిజము
రాజవు మా ప్రాణరక్షకుండ వీవ !
నేఁడు మాయుద్ధంబు వాడి కనుమయ్య."
అని చెప్పి బోయలు నందఱు వచ్చి
ఘన మైనబొల్లావు కడ కేఁగి రంత

## బొల్లావుమీఁదికి బోయ లెగఁబడుట

నావును జూచిరి యాశ్చర్యపడుచు
నచ్చరింపుచు విండ్ల నెలమిఁ బై కెత్తి
పొంచిరి బాణాలు బొల్లావు మీఁదఁ
బెటబెట విండ్లను బెగనిండఁ దీసి
కడనిల్చి యావుపైఁ గదిసి వేయఁగను
నేయి చల్లినయట్లు నిప్పులమీఁదఁ
గుప్పేటి యమ్ములకుఁ గొదకొని చూచె
నేటికి గండు మీ నెదు రెక్కినట్లు
వేఁటబోయలమీఁద వేగంబె నడచె
నడచిన బోయలు నంత గుమిగూడి
యెడమ కుడిని జేరి యెడలేక వేయ
సాగిన బొల్లావు శంకయే లేక
చీదర కొట్టుచుఁ జెల్లించి దూకెఁ
బొడిచిన శత్రుల పొట్టలు చినిఁగి
వడి రక్తధారలు వరద లై పాఱెఁ
బ్రేవులు తెగి నేలఁ బేరులై రాలె
నదిరి బల్లెంబుల వేసేటివారు
వారిని మెచ్చుచు వడివడి నగసి
శింగిణీవిండులఁ జెండు బెండాడె
వెదురువిండులవారి వెన్నాడి చంపెఁ
దొమ్మిదివేల్ విలుకాండ్ర జోతుల సోమినేనిఁ

గుప్పి రణములోను గూల్చె బొల్లావు
గుఱిపోతు అన్నయ్య గుజ్జర్ల ఓబళు
నరములు శిరముఁలు నజ్జుగాఁ ద్రొక్కి
నీరనృసింహుఁడై విమతులఁ గూల్చి
యతికోపమునఁ బగఱ నవనిపైఁ గూల్చె
నా సమయంబున నతిరోషు లగుచుఁ
దీసిపో కావును దిరిగి కట్టుకొని
'చరిచె గదా యావు చక్కఁగా పొడిచెఁ
దఱిమి చంపఁగ సాగెఁ దలసూపకుండ
నావును నిచ్చోట హతము సేయకయ
యావుకు నుఱికితే యపకీర్తి గాక'
అని పౌరుషంబున నతివేగఁ గదిసి
మఱి పేము సాగిరి మల్లెమొగ్గలను
జెల్లించి వేసిరి చిల్లకోలలను
వేవేగ బాణాలు వేయుచు నావు
నాకీతి బోయలు నారేయి పగలు
నొకవిధంబునఁ బోరి యుర్విపైఁ గూల్చి
యప్పుఁడు బొల్లావు హరినిఁ దలపంగ
నతిభారమును బొంది యావును దలఁపఁ
గనుఱెప్ప వేయక కనకరథములను
హరిహరుల్ గూర్చుండి యావుయుద్ధంబుఁ
జూచుచు నెమ్మదిఁ జోద్యపడు చున్న
నటుమీఁదఁ దలఁచిన హరి సంతసిల్లి
మముఁ జేర రమ్మని మఱి చేతనున్న
యక్షతల్ సల్లిరి హరిహరుల్ మునులు
సేసలు సల్లిరి చెలఁగి దేవతలు
నప్పుడు బొల్లావు అక్షతల్ సూచి
చేరి చల్లిన యట్టి సేసలు సూచి
సంతోషమున నిల్చి సరఁగ వేఁడంగ
నప్పుడు సంధించి యార్చి నాయకులు
పుట మెట్టి బల్లాలఁ బొడిచేటివారు

# కాటమ రాజు కథ

పేరు పేర్కొని యావు పెనగొని డాసి
చొక్కంపుగడలను జొచ్చి పొడుచంగఁ
బరమాత్ముఁ దలపోసి బారున నార్చి
గన్నె రాకమ్మన గాయాలు నాటెఁ
దిరుమందు లావుకుఁ దిరుచూర్ణ మొవర
ఘనముగాఁ గూరంగఁ గాయాల వెంటఁ
బొత్త్రైపు నేజాలఁ బొడువంగ సాగి
గోవుకు వేసిరి గోవింద యనుచు
రామరామా యని రణగొల్లుగాను
బక్కల వేయంగ భారముగ నాటె-
దమకంబు దగ్గఱఁ దగఁ బల్లి కొంచె
గోపాలకులు నెల్ల గోవింద యనిరి
యప్పుడు రాజులు హరహరా యనిరి
యేనుసానలు దీవు వెండినేజాలు
నావుకు రొమ్మన నప్పుడు నాటె
బాణాలు గాయాలఁ బరికట్టి వెడలెఁ
బార్వతి యంబులి పరిలెట్టివారు
పెనగొని యిర్గడలఁ బేరెముల్ వాక్రి
గుమ్మడిగింజల గుప్పుచు నంత
పంతగిరులను బూని పరుగున వచ్చి
యెడపక యావును వేసి రుక్కనను
గదిసి బోయలు నిట్లు కపిలావుమీఁదఁ
జెదరక యుద్ధంబు సేయుచుండఁగను
బెక్కు ముంగిసలతోఁ బెద్ద శేషుండు
సాహసంబున బోరుచందాన నావు
కొమ్ములఁ జిమ్ముచు గొంసెల మట్టి
యాకొని బొల్లావు అలుగులఁ దినుచుఁ
దాహంబు గొని రక్తధారఁ ద్రావుచును
ధీరు లాబోయల దింట్లు ద్రిప్పుచును
వితగాఁ బున్నమ వెన్నెల గాయ
నంతంతఁ బిల్లదీపు లాడిన యట్లు

ప౦తంపు సుర భటుఁవలెను జేయంగ
నంతట నుండియు నమరులు సూచి
యావుపోట్లాటకు నాశ్చర్యపడిరి

## బొల్లావుకు వైకుంఠ ప్రాప్తి

మెచ్చి కనకరథంబు మేలుమే లనుచు
విష్ణు దూతలతోను వింజామరములు
నంపిన నాదూత లటునిల్చి యుండ
నప్పుడు సురకాంత లక్షతల్ సల్ల
నావు నెక్కించిరి యా రథము మీఁద
దేవతా దుందుభుల్ దివినుండి మోఁయఁ
గురిపించి రావుపైఁగుసుమ వర్షంబు
పసిఁడి విమానంబుపై నెక్కి యావు
చెలఁగి యాదూతలు సేవలు సేయ
నటుమించి తుంబురనారదుల్ పొగడఁ
దనయెత్తు పగతుర ధాత్రిపైఁ గూల్చి
మనుజలోకమునుండి మఱియు బొల్లావు
ఆకాశవీథిని నమరులు సూడ
నేకాదశిని నిర్వ దేడు గడియలకుఁ
గరివరదుఁ డంపినకనకరధ మెక్కి
యరిగెను బొల్లావు నావిష్ణుకడకు
నావు రథం బెక్కి యరుగంగఁ జూచి
చోద్య మందుచు వారు సోలిసాకు- చును
(*...............)
కోదలుచు బోయలు పుడమిపై నెగసి
తమపొదుగు వృక్షముల్ తాము దాటుచును
భూనాథుదగ్గఱకు బోయలు వచ్చి
కడువేగమున నిల్చి కరములు మొగిచి
జనపతి కావార్త వినిపించి రంత

---

* ఇట గ్రంథ పాతము. $1\frac{1}{2}$ పేజి.



మొదటి వరుస:—పెద్దిమాదేవి తమ కులదైవ మగుఖనవన్నను ప్రార్థించుట. సిరి దేవి, ఎఱనూక, నలనూక రాజులు వెంటనున్నారు.

రెండవ వరుస:—చల్లా కోనెరు, చల్లా అనంతుడు, చల్లా గోవిందుడు, చల్లాపిన్నయ చల్లా వేంకటాద్రి, తంబళ తిక్కన్నతో యుద్ధంచేసినతావు.

మూడవ వరుస:—కాటమరాజు, పద్మనాయడు కులదైవమును ప్రార్థించుట. బొల్లియావు సిద్ధిరాజుయేనుగును బొడిచిన తావు. బొల్లావు కైలాస యాత్ర.

నాలుగవ వరుస:—ఆస్తిపంపకమైనప్పుడు ఆవుల యెద్దులపాలు పంచుకొని, ధనం పెట్టె నెత్తినబెట్టుకొని కొమరక్క వెళ్లుట.

ఐదవ వరుస:—శివపూజచేయుట, చిందుత్రొక్కుట, మద్దిచెట్టు నరకుట, సిద్ధిరాజు యేనుగు చచ్చుట మొదలగు దృశ్యములు,

## ఆవు దివి కేగినవార్త బోయలు విన్నవించుట

పల్లవాధీశ! యోపట్టాభిషేక!
వలువైనపగ నచ్చెఁ బట్టంపురాజ!
వీనుల పండువుగ వినవయ్య రాజ!
ఆ యాదవుల మంద నవనిపై నుండె
నాదివిష్ణువుగాని యావు గాదయ్య!
యుదయాస్తమానంబు నొక్కకై వడిని
గదిసిన బలములఁ గల్లుగాఁ జంపి
మితిలేని బలముల మేదినిఁ గూల్చి
యలపును సొలపు నాహారంబు లేక
యెడపక యుద్ధంబు నీరీతి సేయఁ
గనుగొని దేవతల్ గగనంబు నుండి
సురలు మునులు నూచి చోద్యపడి వేగ
మెచ్చి పువ్వులవాన మేలు మేలనుచు
నావుపైఁ గురిసిరి యా భావ మేమొ
నెమ్మది గూడార నిలిచి యుండంగ
నోరాజ! నీ వంప నుగ్రంబుతోను
పోయి యా బొల్లావు పోలిక నూచి
యెడపక బాణాలు నీవలావలను
వేసినఁ గదలక యేకముగ నున్న
బల్లాల బరిసెలఁ బరువడిఁ బొడువ
గాయంబు లీవలఁ గానరాఁగాను
నావుకై పంపంగ హరిహరుల్ మెచ్చి
కడసారి యాయావు కనకరథ మెక్కి
పుడమి జనులును జూడఁ బోయెను దివికి
మమ్మునేమన కావు మఱి యుండె గనుక
మా ప్రాణములు గడచి మఱిచూడఁ గలిగె"
నని విన్నవించిన నా సిద్ధిరాజు
విని తమ్ములును దాను వెస విచారించె

## సిద్ధిరాజు యాదవుల నోడింప నాలోచించుట

'నా కామధేనువు ఆదివిష్ణుండు
కాకున్న నీ రీతిఁ గదనంబు సేయ
డావుచే సమసెను నరు దైవదళము
చల్లవారిచేత సమసెను గొంత
చల్లవారు నుందరు సగముబల మనుచు
నుండిరి యాదవు లూరుమెల్ల నడఁగెఁ
జల్లవారు చెల్లంగ సంతోష మాయె
నావు దివి కేగుట యది మహాలెస్స
యిక యాదవులఁ జంప నెంతమాత్రంబు
మాతంగి బంటుటట మంగల్లిపాట
నతిబలశాలిగా నతని జెప్పుదురు
సమయఁ జిక్కిన దళము చాల నున్నదియు
నెంతైన నొక్కరుఁ డేమి సేయఁగలఁ
డంతకు మించిన యతిశూరుఁ డైతే
గాదకొని మట్టింతుఁ గొమ్ము లేనుఁగుల
వశముగా నావును వధియించినట్టి
యాబోయలే చాలు పని సేయగాను'
నని సహోదరులతో నాడుచు రాజు
వీరచయంబుతో వినుమని పలికె
'నా బీరినాయుని ఘాతము సేయుటకు
నేకాదశియు నేడు నిచ్చోటఁ జేసి
వేకువనే దండు వేగంబె కదిలి
యుదయాన బారును నొకకొంత యేచ్చ
కదిసి గోసంగులఁ గల్లుగాఁ జంపి
మఱిపోయి గొల్లరాజుమంద చుట్టుకొని
తఱిమి యాయాదవుల తలలు ఖండించి
పశువుల చెఱలను బాగుగాఁ బట్టి
యొసఁగంగ నెల్లారి కేగుద' మనెను
గోపాగ్ని కన్నులఁ గురియుచు రాజు

ఆప్రొద్దు దళ మంత నచ్చోట నుంచె
నంతట సూర్యుండు నస్తాద్రి కరిగె
బాగుగా దివిటీలు పట్టిరి యపుడు
తురితు జమీనులఁ ద్వరితముగఁ బిలిచి
విచ్చుఁగత్తులవారి వెస సిద్ధపఱిచి
పారాలు చలికీలు బందు లేర్పఱిచి
పనుపడి యుండంగ భానుఁ డుదయించె
రూపకందర్పుండు రూఢి నలసిద్ధి
భూపాలవరుదండు ప్రొద్దునఁ గదిలె
భేరీ ఢమామీలు పెల్లుగొని మ్రోవ
బారులు మంగల్లి పాటను నిలువ

## సిద్ధిరాజురాక విని బీరన్న గోసంగులఁ బిలిపించుట

నావేళ బీరన్న యనుజులుఁ దాను
గాపై ఏనసల్లపట్టు గూడారులోను
పరఁగ జముఖానంబుఁ బఱపించుకొనియు
నాపైనిఁ బులితోలు నమరంగఁ బఱిచి
పంచాక్షరి చర్మము పఱుపుగాఁ బఱిచి
సిరముగా ముక్కంటి దేదీవ్యముగను
పైఁడి జంద్యాలలోఁ బరఁగంగ నిలిపి
కడుమంచి తీర్థాన గంగావు పాల
నభిషేకమును జేసి యాబీరినేఁడు
పంచఘంటల నెలమిఁ బలికించె నపుఁడు
ప్రమధుల ఘంటలఁ బ్రణవంబు మ్రోవఁ
దూముతోఁ దూమెడు తుమ్మిపువ్వులును
నానీలకంఠుని కటు పూజసేసి
తామరల్ కలువలుఁ దగ జాజివిరులుఁ
గరములచేఁ బట్టి ఘనత వేఁడుచును
బంచభూతములకుఁ బరతత్త్వమునకు
స్వామికి నొక్కొకటి సరి సమర్పించి

యీశ్వరు వేఁడుచు వీరుఁడై యుండ
నప్పుడు చెప్పిరి యాదికవు లొచ్చి
"మసిలినేని సుతుండ! మాతంగి గోత్ర!
సిరిదేవి పెంచిన శివునివరపుత్ర!
పశుపతి సౌమిత్ర! భద్రావతార!
పల్లవనాథుని బారు లల్లవిగో
యేచుఁగొఁల్ లొటిపిటల్ హేరాళముగను
నల్లవారుగో వచ్చి యశ్వాల నెక్కి
మానవేశ్వరుదండు మఱివచ్చె నదిగో"
యని విన్నవించిన నాబీరి నేఁడు
సరఁగఁ దనమదిని సంతోష మంది
తనబంధుజనులకుఁ దనసోదరులకు
వినయుఁడై కర్పూరవిడియంబు లిచ్చి
సాహసు లయినగోసంగుల నెల్ల
గబ్బిలు రౌతులఁ గడువేగఁ బిలువ
వచ్చిరి గోసంగిబలము లందఱును
ననువైన బిరుదులు నాయుధంబులును
గొంగవాల్ కత్తులు కోరసిగవారు
బంగారు పరుజులు పట్టుకత్తులవారు
వెండికత్తులవారు వింతపరుజులవారు
దండైన పడిగె జంజాళములవారు
సన్నపుఁ దిరుమణి సంకుటరిగెలవారు
సరిగె కాలిగొలుసుల సంకుటరిగెలవారు
అర్ధనాల జల్లులు సడ్డకత్తులవారు
మావుపిడి బాకులు మఱివంకిణీలు
నమరించి బిరుదులు ఆరహుదా లంది
బొడ్డుగంటరంగన బొడెపాగు శింగన
బిడిదంపు వురుమన పిల్లసూరినేడు
అడ్డగత్తి కంబినేఁడు అడిదెం కాచు
మెఱుపుగత్తి సందినేడు మెడపాగులంకు
వైరిగడ మసిలినేఁడు వాలుగత్తిమగుచు

తిరుగడల మసిలినేఁడు బిరుదుల బాలినేఁడు
రొంపిగడ్డం నాగినేఁడు రుద్రపాఁకొండ
కెంపుల కొమ్మినేఁడు కెతపాగులింగన
పట్టుగత్తి పాపినేఁడు బాకుల సోమినేఁడు
గంగులంక సూరినేఁడు గల్లపాఁబొడ్డు
కంచుటరిగెల పోలు గండమబ్బినేఁడు
నిచ్చకయ్యం లెమ్మ సెలవరి బంపు
పెద్దకత్తి వేశన చేపోలిమాధవు
సదసల సందునేఁడు సమిడెకపాకు బొమ్మ
అరిగెల కంబెను అండెలపాగు
చెన్నుసావడి మన్నీఁడు సమిడిపాఁయెఱ్ఱు
గుడిపెట్టు గుండన గుమ్మడి మారినేఁడు
కారుపోతుల సోమినేఁడు కార్చిచ్చు తిమ్మినేఁడు
వీరలు మొదలైనవీరుల కెల్లఁ
గ్రొత్త చల్లాడాలుఁ గోమరు నాడాలు
కమనీయముగఁ జంద్రకావిదట్టీలు
కడు రత్నములతోడి కాలిగగ్గరలు
కుచ్చుతురాయిలుఁ గుసుమరుమాల
లొరదూసినకత్తులు నొసర బొడ్డుగంట
గంట లొడ్డాణములుఁ గంచుటరిగెలును
నీటు కోరసిగలు నిలువునామాలు
నొఱఁగు రుమాలలు నొడల గంధాలు
ఆడాడఁ బాడుచు నవతారములను
వేడుకఁ గేకలు వేయుచుఁ గొంత
మీసముల్ దీటుచు మిన్ను సూచుచును
దమతోడల్ సఱచుచుఁ దాము సొక్కుచును
గ్రీగంటఁ జూచుచుఁ గెరలి పల్కుచును
దప్పెట్ల ధ్వనులకుఁ దాలేల యనుచు
నవ్వాదు చిందుల నాడిపాడుచును
మత్తేభముల రీతి మసలుచువచ్చి
యంత గోసంగులు వారిఁ దలఁచుకొని

మొత్తమై బీరన్న ముందర నిలువ
వారిలో నలువురు వచ్చి రథిపతులు
చినగబ్బి పెదగబ్బి చెన్నుసోదరులు
పినరంతు పెదరంతు బీరన్న తమ్ము
లనిమొన నాల్గువే లాయత్తపడిరి
బీరన్నకును మొక్కి భీకరలీల
వేడుచు నుండిరి విభవ మంతయును

## గోసంగులు బీరన్నను జేరి కీర్తించుట

"నోయాదిజాంబవ! యొసపరిరుద్ర!
యండసూపినయట్టి యకలంకవరుడ!
మాతంగమునివరద! మఱి దివ్యరూప!
యామహేశ్వరు కృప నతిఘోర తపము
వరవీరసేవ్యులై వసుధ లోపలను
శివనాద మంటిన శ్రేష్ఠకుల మనుచు
నా మహాదేవత లటుపడి మారి
అరుంధతియై పుట్ట నా మహామునులు
కారణమున వసిష్ఠు కన్యకను గూడె
మసిలినేఁ డనునొక్క మఱి పుణ్యశాలి
కులసతి మసిలెమ్మ కోరికవలన
బీరన్న వై పుట్టి బిరుదు వహించి
భవుకృప సిరిదేవి పట్టివై పెరిగి
పరగితి భూమిలో బహుపరాక్రముఁడ!
బహుబలసేనుఁడ! భద్రావతార!"
అని యిట్లు ప్రార్థించి యమరంగ మొక్కి
తప్పెట్లు వాయించి ధరణి వణఁకంగ
రంతులు సేయుచు రాగడిల్లుచును
ధూమంబు గప్పంగఁ ద్రొక్కుచుఁ జిందు
లిరుగడల నుండిరి విరివిగా నంత
నంతట వీరన్న యతిపరాక్రముఁడు

దేవపూజలు సేసి దేవుని మ్రొక్కి
పొందుగాను విభూతి పొసఁగ ధరియించి
సరగ చేలింగాల జంధ్యాల నిడియుఁ
గనకపువ్వులదట్టి కాసెగాఁ గట్టి
వీరగంధంబును వెరవొప్పఁ బూసి
తల్లి యిచ్చినసొమ్ము ధరియించి మించి
యయితన్న యిచ్చినహస్తకంకణము
లన్ని దేహంబున ననువొప్పఁ దొడిగి
యాఱువేల్ గోసంగు లవని గంపింపఁ
గడువేగఁ దప్పెట్లు కంచుకొమ్ములును
వాయింపు కొనుచును వసుధ ఘూర్ణిల్ల
ఆవులన్న పల్లికొండ యయితన్న కడకు
వనరంగ సెలవడ్గ వచ్చె బీరన్న
పరఁగఁ దమకముపైని బలరామువలెను
నయితన్న పల్లికొండ యందమై యున్న
నడుమఁ గృష్ణునివలె నలనన్న వెలుఁగఁ
గనుగొని బీరన్న కడు డాసివచ్చి

## బీరన్న గోసంగులతో నయితన్నను దర్శించుట

సాష్టాంగదండముల్ సయ్యనఁ బెట్టి
ముకుళితహస్తుఁడై మురియుచుఁ బలికె
మాకారణము నెర్గి మమ్ము నీడేర్చ
ధీరుఁడ ! పల్లికొండ ! దివ్యస్వరూప !
అన్న ! కాటమరాజ ! యావతాఁకపరుఁడ !
అయితన్న ! నామీఁద నత్యంతప్రేమ
మనతల్లి సిరిదేవి మాయలు గావు
వలచంటి యమృతము వలసిన ట్లిచ్చి
పేరుగా సిరిదేవి పెంచింది నన్ను
మీఋణం బీడేర్తు మేలు మే లనుచు
వేయు ఘటంబుల యేన్గులతోను

ననువొంద మూఱువే లశ్వాలతోను
లక్షపర్యంతంబు రాణువతోను
పగ వచ్చె నంచును బట్టణంబునఁ
కాటమరా జంత గమ్మి పంపంగఁ
గమ్మవార్తలు విని కలకల నవ్వి
వర్తిమి యిది జయవార్త యటంచు
గడువేగ ముందరి కలనికి నన్ను
నంపెద రని చాల నాశతో నుంటి
మతియెర్గి పెంచితిరి మఱి నేఁటిదనుక
శ్రీహరిబొల్లావుకు సెలవు నిచ్చితిరి
యంపిన పగతుర నవనిపైఁ గూల్చి
యావు వేడుక దీరె హరిపురి కేగ
శివభక్తుఁ డచ్చటఁ జేరి రాఁడాయె
నిందఱి ముందర నీగడియనైన
యుద్ధంబు సేయంగ నొప్పి యంపుండి!
తలపడి పగతురఁ దగ హతము సేతు
కన్నులారఁగఁ జూచి కడువేడ్క పడుచుఁ
దమకంబు పైనుండి తగఁ బ్రతాపంబు
రంగుగాఁ గనుఁడి శ్రీరామనిభులార!
అన్నలుఁ దమ్ములు నల బావమఱఁదు
లందఱిముందర నని సేయువిధము
అందంబుగాఁ జూడుఁ డన్నలు! మీరు
హనుమంతుఁ డంబకై యాలంక సేరి
కాల్చి దగ్ధము సేయుకైవడి నేను
గరుల నుఱుమాడుదుఁ గలను సేయుదును
ఘోరించి సఱుకంగఁ గొంగవాల్ కత్తి
పట్టకత్తి సెల విచ్చి పంపవలె నన్ను"
అని విన్నపము సేయ నందఱుఁ బొంగి
హరిగురువు పల్లికొండ యానతి యిచ్చి
సరఁగ మఱుగున నున్న చాయలకత్తి
తరముల నాఁటిది తగ నుంచె భువిని

శ్రీగంధ మర్పించి చిలికి కస్తూరి
ప్రార్థించి యాకత్తి పరంగ సెల విచ్చి
యంతట బీరన్న యతి వేడ్కతోను
బల్లికొండకు రాజు పరంగంగ మొక్కి
సెల వంది యాకత్తి చేరువ నిలిచి
హరిహర బ్రహ్మాదు లందఱి వేఁడి
సిరిదేవి గౌమరక్కఁ జిత్తానఁ దలఁచి
బత్తిరన్నకు మొక్కి పల్లికొండఁ దలఁచి
బొల్లావు బసవన్న బోరునఁ దలఁచి
యావులన్న నుతించి యయితన్నఁ బొగడి

వీరభద్రుని ప్రార్థించి బీరన్న బీరము సూపుట

యావీరభద్రుని నపుడు ప్రార్థించి
"ఓహో దక్షసంహార ! ఓహో వీరభద్ర !
నీ ప్రతాపంబును నేఁడు నా కిమ్ము
మాతండ్రి మసిలినీఁడు మారమ్మ తల్లి
నీ పేరివాడను నీబంట నేను
నీపట్ల నీ మూర్తి యియ్యవో దేవ !
నీమూర్తి కలిగితే నిఖిలంబులోను
సమరంబులో రిపులఁ జక్కు సేయుదును"
ననుచుఁ బ్రార్థింపంగ నా వీరభద్రు
తన విశ్వరూపంబు దయచేసె నపుడు
బిరుదుగలబలశాలి బీరినేఁ డంతఁ
బరువడి నాకత్తిఁ బ్రార్థింపఁ దొడఁగెఁ
'బిడుగుల తునియ ! ఓహో బింకంపుఁగత్తి !
నీపదము నీబలము నే నెఱుంగుదును
దేవకీతనయుండు తెలియ నిన్నెఱుఁగఁ
గావించి నా విశ్వకర్మ తా నెఱుఁగు
నితరులు నీమహిమ నెఱుఁగ రెవ్వరును
త్రేతాయుగమునాఁడు దేవతలలోను

భైరవం బనుపేర భైరవకత్తి
వీరభద్రుని పేర వెలయు వాలంబు
వానికి సాటిగా వర్ణింపఁ దగును
బ్రళయమహాపిడుగులఁ బట్టి బంధించి
గోసంగి పేరిటఁ గొంగవాల్ కత్తి
వసుదేవ తనయుండు వసుధఁ గల్పించె
నవతారమును వీడి యా కృష్ణదేవుఁ
డావంశమే యని హరిహరాదులును
యాదవులై పుట్టి రాకృష్ణమూర్తి
కాటమరాజై యాకదన మేర్పఱిచె
నున్నారు యాదవు లుగ్రులై యిపుడు
యాదవులకు ముప్ప రావు సమరంబు
మాధవుబంటుకు మఱలఁ బా పనుచు
నానాఁడు శ్రీహరి యానతి యిచ్చెఁ
జారపులుల్ తనకు జాగిలా లాయె
నిరుగడఁ గదిసిన విమతులఁ గూల్ప
నాత్మరచితముగ నా కక్కఱ గలిగెఁ
బరఁగంగ నీవు నా పంపైతి వైన
భూమి నుండినకత్తి! భుజమునకు రమ్ము
నామనసులోఁ జాల నమ్మిక గలదు'
అనుచు బ్రార్థింపంగ నాపట్టుకత్తి
యతివేగముగ నెగసి యరులెల్లఁ జూడ
వలపటిభుజ మందు వ్రాలెను గత్తి
కత్తి భుజమున నిల్పి కడు సంతసిల్లి
కత్తి కప్పాడు నమస్కారంబు సేసి
పరుజులోఁ జెయివేసి పదిలముగఁ బట్టి
పట్టెడలు గట్టెను బాలు పోయించి
పట్టుత్రాళ్లను తాపి పట్టెడల దూసి
ఘన మైనసింహపుఁ గచ్చుటరిగె లంకి
తనమనస్సుకు బుద్ధి తగ నిట్లు సెప్పె
'యమునిసన్నిధికి జీవాత్మ! యేగకుమి



నెల్లూరును ఏడుగురురాజులు పరిపాలించుచుండగా ఎఱగడ్డ పాటి నుండి కాటమరాజు, పద్మనాయడు వచ్చి ఆవులమేపుకై అనుమతి గోరుట.



జొన్నవాడతిప్పవద్ద కాటమరాజుపశువులను గొ మేపుచుండుట.



కాటమరాజుపక్షమువారు పుల్లరి చెల్లింపనందులకై కుందమాదేవిపక్షమువారు వారిగోవులను, వానినిమేపు దొరలను తరిమికొట్టుట.



బీరినాయుడు మద్దిచెట్టుని నఱికి తన ఆయుధము పదునును పరీక్షించు కొనుట



తిక్కన్న సైన్యముగొనివచ్చి కాటమరాజుపరివారముతో యుద్ధముచేయుచుండగా అడుకొని బ్రహ్మరుద్రయ్య తిక్కన్నతో బోరుట.

పరమాత్మలో నైక్యపడవలె మనస!
పీరులఁ బొడగని విఱుగకే మనస!
మేరువుకంటెను మింతువు గాని
పగతురఁ బొడగని పాఱకు మనస!
తెగువతో రోషంబు దీర్తువు గాని
యదరకే యోగుండ! యాయుధముఁ జూచి
యుక్కుగుండై పగఱ నుడిగింతు గాని
బెదరకే యోమనస! పెల్లుమోఁతలకు
మోఁతలకు నెదు రెక్కి మోగవలెఁ గాని
పొరలకే యోప్రాణి! పోర్బలము సూచి
జడియక కల్లఁగాఁ జంపుదు గాని
పగఱఁ గని యోకత్తి! పదను దీయకుమి
మదగజంబులఁ బరిమార్తువు గాని'
అని యిట్లు తనమనసు కంతయుఁ జెప్పి
తనమఱఁది చిన్నయ్య తాను మఱియు
నాలువేల్ గోసంగు లతిశూర వరులు
ముందుగా నిరుమేల మెఱసి రాఁగాను
ధణాధణ తప్పెట్ల ధరణియు మిన్నుఁ
గడుధ్వనుల్ సెలఁగంగఁ గక్కటిల్లుచును
భుజబలాధికుఁ డయి భుజశక్తి మెఱసి
వరదీసి యాకత్తి వడి జళిపించ
తగఁ బరువడి సేసి తాఁ జౌకళించి
ధరణీశు బలములు తప్పక సూడ
మెఱసి కేకలు వేసి మీసంబుఁ దీడి
కత్తిబల్మిని దనకుఁ గల్గిన శక్తిఁ
జిత్తంబులోఁ జాల సింహోగ్రుఁ డగుచు
కదిసి చెఱకుగోల ఖండించినట్లు
ఎదురున్న యా మట్టి నేటవాలుఁగను
మఱి వైచినట్టియామ్రాను ఘూర్ణిల్లి
మోఁడు మీఁ దాయెను మొనలు క్రిందాయె
వాటున నామ్రాను వసుధపై నొఱగె

మ్రాను వఱుగంగను మన్నీలు దొరలు
మానవేశ్వరుఁడును మంత్రివర్గంబు
నంతయు నటుసూచి యాశ్చర్యపడిరి
"యింతటి భుజశక్తి! యెవ్వరో యితఁడు
ఒక్కవ్రేటున మ్రాను నుర్విపైఁ బడెను
చెక్కగా నఱికెను జెఱకుచందమున
మ్రాను తృణముగ నఱికె మానవు లెల్ల
వెయి రెండు వేలైన నీ డనరాదు
పడఁతి నోచిననోము ఫల మెంతొ గాని
యీతండు స్వామి పూజెట్టు జేసినాఁడొ
యితనికి శివుఁ డెట్టు లిచ్చెనో వరము
ఇంతటి రాజ్యంబు నేలితిమి గాని
యింత బలాఢ్యుం డెక్కడే లేఁడు
కపులు వనచరు లని కథలు సెప్పుదురు
భీమన్న! మందకుఁ బెద్ద వైనీవు
ఆమందలోనికి నటుపోయి వత్తు
వామందలో నెల్ల నతిశూరుఁ డితఁడు
ఇతని పే రేమియో యెఱిఁగింపు" మనెను

## భీమన సిద్ధిరాజునకు బీరన్న నెఱింగించుట

అప్పుడు భీమన్న యతివేగమునను
జెప్పంగఁ దొడగెను సిద్ధిరాజుతోను
"మానవేశ్వర! వారి మందలోపలను
నేనుఁగులతోనైన నెదిరింపఁ గలిగి
భీమబలుం డని పొగడించు కొనుచు
నెంతైన చట్టువారి యెరనన్న యొకఁడు
ఆతనికన్న మహాఘనుం డనుచు
నమర విందుము కరియావులరాజు
కడమవా రందఱు కలవారు కాని
కారణంబున మాల కన్నెగర్భమున

వీరభద్రునికృపవెలయ జన్మించెఁ
బ్రేమతో నూకాంబపెంచినకొడుకు
ప్రియమార నామంబు బీరినేఁ డంద్రు
పుడమి వీరికి సాటిభుజబలుల్ లేరు"
అని విన్నవించిన నా సిద్ధిరాజు
విని సహోదరులతో నిట్లని పలికె

## బీరన్న శక్తికి నలసిద్ధి బ్రమయుట

'వీని గాత్రమునకు నీబలంబునకు
ధరమీఁద భద్రావతారుఁడు గాక
నరుఁడై తె యామాత్రను నఱుకంగ లేఁడు
మట్టి నఱుకువానికి మట్టియూడ లెంత ?
అరయంగ 'సారసత్తు' లైనచందంబు
మాత్రి న్గూల్చువారికి మానవు లీడె ?
యేన్గుల ఘటలను నేర్పుఱుపుఁ' డనెను
మనుజేశుమాటపై మదగజంబులను
ననిమొన నేర్పఱిచి రటు వేగ మఱియుఁ
బంద్రెండు వేల్ వింటివాఁడు పట్టు పిన్నయ్య
వన్నెవెయిగుర్రాల వంకిణిరౌతులును
వాటముగ నుంచిరి వైనవైనాన
నశ్వాలబారును నాయత్తపఱిచి
పగులుతుపాకుల బాగుగా నుంచి
బారులఁ దీర్పంగ భానుకులుఁ డంత
బారు లై యుండెడుబలములఁ జూచి

## బీరన్న నలసిద్ధిపైకి నడచుట

యుగ్రుఁడై బీరన్న యుఱిమి తాఁ జూచి
చేతిపట్టకత్తి చెలఁగి జళిపించె
తళుకు తళుక్కన మెఱసెఁ దందర కుడువ
బాతుపై నెగసేటిభైరవు వలెను

గొదకొని బీరన్న గోసంగు లంత
మదగజంబులమీఁద మఱియేగఁ గడిసి
కదిసినయూథభద్రగజముల నెదిరి
మసిలమ్మపుత్రుఁడు మారొడ్డి నిలిచి
యదలించి మొనవడి నంజె తాటించి
దట్టించి యంఁడెలు ధళధళ యనఁగ
నేటికి మత్స్యంబు లెదు రెక్కినట్లు
కొండ లై వచ్చెటి ఘోరగజములను
దొండముల్ తెగనఱుకఁ దునియ లై రాలి
మొండెము లెగిరు నని మొఱవెట్టుచుండు
నామీఁదఁ జెల రేఁగి యత్యుగ్రుఁ డగుచు
వేడ్కతో వేటల వ్రేయుచందమున
దండియేనుఁగుల ధరమీఁదఁ గూల్చి
చిన్నయ్య చెల రేఁగి సేనలమీఁది
బారులఁ దెగటార్చి బాపురే! యనుచు
గబ్బులు రంతులు కదిసి యిర్గడలఁ
జెల రేఁగి నఱకుచుఁ జేబాకులాను
గుప్పించి గుద్దిన గుండెలు చినుఁగ
గోసంగు లందఱు ఘోరయుద్ధమున
నెడలేక విమతుల నిలఁ గూల్పఁగాను
వీరభద్రునిఁ బోలి బీరన్న యపుడు
కదిసి యేనుంగులఁ గలనిలోఁ గూల్పఁ
గుంభస్థలంబులు గుంపు లై యుండు
మదగజంబులమీఁదిమావటుల నెల్లఁ
దృణమాత్రముగఁ జూచి తెగనఱికి వైవ
నంబార్లపై నుండునాడునేదార్లఁ
జిత్తు చిత్తుగఁ బట్టి చెల్లించి నఱుక
వాటున నొఱగిరి వడుసుమన్నీలు
ఘోటకంబులవారు గొదకొని కదిసి
యీటెలు నేజాలు నినుపశూలాలు
బీరినాయనిపైని బెదరక సాచఁ

దనయరిగెత్తో గదలఁ దప్పించి దూఱి
కరవాలమున నన్ని ఖండించి వైచి
పౌరుషంబునఁ దనపంతంబు మెఱయ
రణమున నశ్వాల రౌతుల నెల్ల
దురమున వ్రేటుతునియలుగాను
వైచెను గొంగవాల్ వాటుకే తగును
నశ్వాల నఱుకంగ నాశ్చర్య మంది
పండ్రెండువేల్ మూకపట్టుపిన్నయ్య
యేన్గుల నఱుకంగ నేమిసేయంగ
పీడకొల్పుచు రాజు వెనుక నున్నాఁడు
రణమువెల్లి యఱుక రాత్రి గాదాయె
నాయువు నూఱేడు లాయె నటంచుఁ
బట్టుపిన్నయ్యతో పరఁగ విల్కాక
యప్పుడు కదిసినతుంపవర్షంబు
జడివాన కురిసినచందాన రాఁగఁ
బరఁగ రిపురివ్వున బాణాలు విడవ
జేకత్తిఁ దట్టెరి చెలఁగుచు వాని
దాటించి యరిగెలఁ దట్టెరి వాని
నెడ లేనిబాణాల నెగదట్టి మింటఁ
బరువడి బీరన్న పట్టుపిన్నయ్య
వెన్ను తునకలు గాఁగ వేసె నార్చుచును
పండ్రెండువేల్ మూక బాగుగాఁ జూడ
రెంపు తునకలు గాఁగ రొప్పుచు నొఱగెఁ
బండ్రెండులేల్ దళము పాఱంగఁ జూచి
దోమలు నఱుకుకే తొలఁగును గాక
యీమలకును నాకు నీడు గా దనుచు
జాగిలాలపట్టెడల జరజర దీసి
ఘనగజంబులమీఁదఁ గదియించి వానిఁ
జిక్కినజాగిలాల సేనపై విడిచెఁ
జౌకళించి కదిసి జాగిలా లపుడు
బెబ్బులి సమ్మెటఁ బెనఁగి యేనుఁగుల

గబ్బితనంబున గద్దించుఁ గఱచుఁ
గాలిజాడలఁ దీసి గయ్యాళివాడు
నరులకాళ్లు బట్టి నయముతో నీడ్చు
సాళ్వపక్షి యానుజాగిలము కదిసి
సాగఁ బట్టి రిపులఁ జంపంగ సాగె
బేతాళ సరిపెన బిరుదుగజములఁ
గూనగుర్రాలను గొదకొని కఱచు
గొందఱు వీరుల కోలాహలముగఁ
బిడికత్తి జళిపించి పెనసి నఱుకంగ
వారల్ల నంతంత వడిఁ జేరఁగాను
పట్టార్ల పిన్నయ్య బలమొల్ల నొఱగె
నలసిద్ధిరాజుకు నమ్మినబోయ
బారుల బీరన్న బాగుగాఁ జూచి
యా నాయకునిఁ గదిసె నాబీరి నేఁడు
వంకిణి మల్లుతో వన్నెగుఱ్ఱాలఁ
జిన్నయ్య పోరాడెఁ జిత్తువిత్తుగను
జినగబ్బి యనువాఁడు చెన్నుతమ్ముండు
మిణుగురు బొమ్మపై మెఱసిపోరాడె
మఱియును బెదరంతు మహారోషమునను
బరకసాని అబ్బితోఁ బట్టెపోరాడె
వారివారికిఁ దగినవారితోఁ బోరి
నడుకలనిలో నిల్చి నలసిద్ధిరాజు
మళయాళ సాహసుల మఱి వీడుకొల్పి
మించి గోసంగులమీఁదఁ జెలరేఁగి
గూడెగాండ్రను బట్టి గుదులుగా గ్రుచ్చి
వంకిణీ మల్లుల వడిఁ ద్రుంచివైచి
కుప్పింప సాగిరి కొంకుగాలాలు
గొత్తాలఁ దోడేళ్ల గుమి సొచ్చినట్లు
పోర్లించి పొడిచినఁ జెల్లి రొకకొంత
అప్పుడు విమతుల నాజి లోపలను
గూల్పంగ శిరసులు కుప్పలై యుండు

కరవాలమును దూయగాను బీరన్న
దలలెగసి నూతేసి ధరణిపైఁ బడును
గోసంగిగమిచేత గుంపులు వడిరి
కరులు లొటిపిటలు గాల్బలంబులును
నేలమీఁదను నుండె నెఱపినట్లుగను
ఆరాజు చూచియు నాశ్చర్య మంది
మండలపతి రాజు మన్నీలఁ బిలిచి

## సిద్ధిరాజు సరదారులపరాకుఁ బాపుట

"సరదారులార! రోసాహసులార!
యరులకు నోడనియతిశూరులార!
కరిఘోటకంబులఁ గాల్బలంబులను
మఱి మావటీలను మంచిసరదార్లఁ
దోడగి గోసంగులు త్రుంచి రందఱిని
నొకరికి నొకరైతె యొఱుగ రెవ్వరును
నిక మీరు సేయుఁడా యేకయుద్ధంబు"
అని తుపాకులవారి ననిమొన నిలిపి
యీటెలవారితో నిట్లని పలికెఁ
"బొందుగ రంజకం పొగవెంట దూకి
సాహసంబున వారి సమయించు" మనెను
బాగుగా బోయలు భళిభళీ! యనుచుఁ
దమ మందుగుండును దగ బారు సేసి
సంధించి రంజకం సయ్యనఁ బోసి
జానకీ తాళ్లు చక్కంగ రాల్చి
భూనభోంతరములు బోరు కలఁగంగఁ
గొండలు ధ్వనులిచ్చి గుబగుబ యనఁగ
దండైన గోసంగిదళములమీఁద
వడగండ్లతొలకరివానవిధమునను
దోడిబడఁ గురియించి తూపాకి గుండ్లు
వెనువెంట బాణాలు వేసఁ గాల్చి విడిచి

పోడిమిఁ ద్రొక్కుచుఁ బోగ వెంట దూఱి
ఘోరించి పోడిచిరి గోసంగి మూఁకఁ
గదిసి గోసంగులఁ గల్లుగాఁ జంపి
తూపాకి గుండులు తోడిబడ నెల్లఁ
జత్తనానవిధాన జొత్తు చినుకులుగ
గుండ్ల వెంటను నెత్రు కురియంగ సాగె
నామందు పోగలకు నారవధూళి
మఱి యెగసె మింటిపై మబ్బుచందమునఁ
గావురులో బీరన్న కత్తి జళిపించ
మెఱపు లై మెఱసెను మిన్ను గంపింపఁ

## గోసంగిమూకలు, బీరన్న వైకుంఠమున కేగుట

దాటించి నఱుకుచు ధరఁ గూల్చి నపుడు
ఆఱువేల్ గోసంగుల కంబులు నాటి
నఖశిఖపర్యంత మందఱికిఁ దగిలె
నవ్వేళ దేవత లటు చోద్యపడఁగ
బాగుగా వారి కతిభారంబునాయె
గుండ్లకు బీరన్నగుండెలు వ్రస్సెఁ
జయ్యనఁ దనవగ సమసెను గనుక
శ్రీమహాదేవుండు శివలింగమూర్తి
తనవరపుత్త్రుండు తనభక్తిపరుఁడు
చాలఁగా నవిసె నాసముఖాననైన
నలపు దీరగ నుండు నని తలఁపంగ
భారపుగాయాలఁ బరమాత్మఁ దలఁచెఁ
బై కొన్నయమ్ములపాన్పుపై నొఱగెఁ
గుడియెడమ నొఱగిరి గోసంగు లంత
జాగిలాల్ బీరన్న సరసను నొఱగె
దండి గోసంగులు ద్వాదశినాఁడు
వైకుంఠమున కయి వఱగి రావేళ
బీరన్న చెల్లెను బృధ్వి కంపింప
వారిమందకు గమిడి వడిఁ దీసినట్లు

మంచ బలిమి దీసె మన్నీఁడు చెల్లె
రణమున నొఱిగిన రాణువఁ జూచి
యప్పుడు సిద్ధిరా జాశ్చర్యపడెను
నిటుమీఁద యాదవు లెందఱున్నారొ
యబ్ధిఁ బ్రొద్దది గ్రుంకిన ట్లగు నేమొ
కడువడిఁ జింతించి కడుధైర్యమునను
మగుడి తనసేనకు మళ్ళెను రాజు

## ప్రొద్దుగ్రుంకఁగా నలసిద్ధి కొప్పుకొండలో దాగఁబోవుట

అచ్చోట నుండంగ నటు ప్రొద్దుగ్రుంకఁ
గొప్పుకొండకు రాజు గొబ్బున నడచె
కొప్పుకొండను నున్న కొమ్మకసినేఁడు
అంతటఁ గనుగొని యాబలముఁ జూచి
భూలోకమాతను బోరునఁ దలఁచి
కుంభిని ఘూర్ణిల్లఁ గొమ్మ నాదించెఁ
గొండలు ధ్వను లిచ్చెఁ గంధరముల్ వఱగె
గండభేరుండముల్ గదిలి భీతిల్లె
మృగములు శార్దూలములు పాఱిపోవ
గగనంబు సెదరి చుక్కలు వ్రాలు చుండెఁ
బెడచేతఁ గొమ్మంది...పట్టినాఁడు
గణుతింప యాదవ ఘను లెల్ల వినిరి
తలకొండపాటను దారసంబినేఁడు
వలనొప్ప దళములు వచ్చుటఁ జూచి
తనబలముతోఁ దాను దఁగగ ని ట్లనియె
'రారోయి! ఘనులార! రాజు ఈవేళ
బీరన్న రణమున బెగడి భీతిల్లె
బలములు చెద రిట్లు పాఱిపోఁ దలఁచి
యిక్కడ మన మున్న వివర మెఱుఁగకయు
కొప్పుకొండను మంచిగుహ లున్న వనుచు
విడిబడివచ్చెడి విధమెల్లఁ జూడుఁ'

డని యిట్లు పలుకుచు నాయు త్తపడఁగ
కూంచిదార పట్టెను గొమ్మకసినేఁడు
దారనాదము విని తందర గుడిచి
అతివేగవచ్చిరి యాపీరఘనులు
మంతనంబుగ న స్తమానంబు వేళఁ
దనుఁ జేర వచ్చిన దారసంబినేఁడు
కస్తూరి కుంకుమ గందంబు లిచ్చి
యంకించి రణమున కరుదెంచు మన్న
సిద్ధిరాజు బలముపై సేనలు గదిసెఁ

## కొప్పుకొండలో కొమ్మకసినేఁడు తాకసిల్లుట

గదిసిన సిద్ధిరాజు కలవర మంది
తనమంత్రివరులతోఁ దలపోసె నపుడు
శ్రీహరిబొల్లావు చేసినయఘనికి
గుట్టలై పీనుఁగుల్ కూలి యుండంగ
ఘనుఁడుబీరన్న చే గజము లశ్వములు
బలములు నెడలేక పడియుండె భూమి
నమసిరి గోసంగులు సందులేకుండ
రాత్రి రణమున నుండరా దంచు మనము
వచ్చిన నిక్కడ బలము లున్నవియు
యాదవబలములే యెందుఁ జూచినను
నయినను గొదువయు ననుమాన మేల
సాధింపవలెఁగాక సమరంబునందు
మగిడి వచ్చినదళము మళ్ళిపోకుండ
మనబలము చుట్టుకొని మూతాబు లెత్తి
సేయనుసమరంబు సెలవిచ్చి రాజు
కాలిదళములు కదిసెఁ గనకపొడి రాల
నశ్వాల దూకించి యంది నఱుకంగఁ
గదిసిన యశ్వాలఁ గల్లుగాఁ జంపిరి
దారసంబినేఁడు గదిసె దళములమీఁద
బారులఁ దెగటార్చి బాపురే! యనుచు

వారువీరును గదిసి వజ్రాయుధముల
వంకీళ్లఁ గదిసిరి వజ్రీలు కొంత
చెలరేఁగి పోరాడి చెల్లి రొకకొంత
చేరి విండ్లను గదిసి చెలఁగి వేట్లాడి
కొమ్ము లమ్ములు నాటి కూలి రొకకొంత
యిరువురు సమసిరి యెడము లేకుండఁ
దరవళ్లకత్తులు తఱుచుగా నాటి
యాదవుల నొకలక్ష నవిలోన గూల్చి
యక్కడ బలముతో హాత మైరి వారు
నాలుగో జా మాయె నటఁ జుక్కపొడిచె
శుభ్రకాంతులతోడ సూర్యుఁ డుదయించెఁ
దానాలవారిని దగ సంహారించె
డేరాల కేతెంచె ధీరుఁడు రాజు
సరదార్లతో రాజు సయ్యన ననియె
'నేఁడు యెవ్వరిమీఁద నెదిరింపవలెనో
యెదిరించి రాకున్న యాదవులమీఁద
గడె రెండుగడెలకుఁ గదిసి పోవలెను'
అని తమ్ములును దాను నాడుచుండఁగను
నవునవు ననుచును నంద ఆవేళ
నెదురు సూచుచు నంత విమతులై యున్న

అయితమరాజాదులు నలనన్నకడకు వచ్చుట

మూఁడునదు లొకచోట మొనసియున్నట్టి
కైలాససమ మగుఘనసంగమందు
ఫాలలోచనుఁ డున్న భావంబు దెలిసి
యావేళ నతివేడ్క నయితమరాజు
శైవుడై తనపాలిశంభుఁ బూజింప
గుఱు తైన కన్నికగుండంబునందుఁ
దాన మొప్పఁగ నాఁడి ధవళంబుఁ గట్టి
భసిత త్రిపుండ్రంబు భవ్యరుద్రాక్ష
స్ఫటికహారంబులు వరఁగ ధరియించి

మల్లెలు మొల్లలు మఱి జాజిపూలుఁ
జల్లగా వాసించు సంపెంగపూలు
ముకుళము లై వీకు మొగ్గతామరలు
విరులు చామంతులు విరు లైనమంచి
మరువంపుఁబత్రియు మాచపత్రియును
మారేడుపత్రియు మఱి జమ్మిపత్రి
కరకంతు ప్రియ మైనకలువలు మొదలు
అగురు శ్రీగందంబు నక్షతల్ వేలు
వేలుగా సన్నియు వేగంబె తెచ్చి
సజ్జముఖంబునఁ జలువలు పఱిచి
పరమేశ్వరుని నందు బాగుగా నిల్పి
పంచామృతంబులు బాగుగాఁ దెచ్చి
పంచాక్షరీమంత్ర పఠన గావించి
మఱియును సద్యోదమంత్రోదకముల
నభిషేకముల్ సేయునాసమయమందు
నేకార్తి పంచార్తి నెలమి షడార్తి
మంగళారతిఁ బాడి మఱి పూజ సేసి
రమణ మహిస్సాక్షి స్సాంబ్రాణి ధూపములు
నరయంగ శివునికి నర్పించి నిలిచి
'శరణు గిరిజానాథ! శరణు లోకేశ!
శర ణయ్య భూదేవ! శరణు పరమేశ!
భవదూర! త్రిపురారి! భక్తమందార!
నందివాహనుఁడ! యానంద! భూతేశ!
యిందుశేఖర! మాకు నిహావరము లిమ్మ!'
అని మ్రొక్కి పరమేశు నపుడు ప్రార్థించి
అనికి ముస్తీ బాయె నయితమరాజు
చల్లడమును దొడిగె సరిప్రొద్దువేళ
నొనర శ్రీగందంబు నొప్పుగాఁ బూసె
యాలంబునను గుండ్లు నాయుధంబులును
పఱికినఁ దెగకుండ నటు తూఱకుండ

వజ్రాగి తొడిగెను వల్లవుల రాజు
వింతగా శిరమందు వీరజడ యల్లి
విరజాజులు తురిమి వేసుక మీఁద
పరఁగ మాణిక్యాలపతకంబుఁ దాల్చి
పచ్చలకడియముల్ పసిఁడుంగరములు
మెచ్చైనసేవళము మెడనూలు వేసి
యడపకాఁ డంతట నాకు చుట్టీయఁ
బనుపడి తేజీల పల్లంబు గట్టఁ
బయనంబు కాఁగాను బట్టపురాజు
నాలాగు బాలరాజు లందఱు నపుడు
పాలేట స్నానాలు బాగుగాఁ జేసి
జందెముల్ ధరియించి జాహ్నవి వేఁడి
కడిఁదిరొమ్ముల వీరగందంబు లలఁది
నొసలఁ గస్తురిబొట్టు నూల్కొల్పి దిద్ది
ఘనబాహువులయందుఁ గడియముల్ పెట్టి
రంజిత మైనట్టిరత్నహారములు
తగనొప్పభూషణాల్ ధరియించి రంత
కనకంపుఁబువ్వులు కాసెలు గట్టి
చెలఁగి సూర్యకటార్లు చేపట్టుకొనిరి
ముత్తైదువలు వచ్చి మొగి నివాళ్లిడిరి
కరియావులన్నయుఁ గడుసాహసమున
ధీరుఁడై నెలవంక తిరుమణి దిద్ది
యురమున గందంబు నొప్పఁగాఁ బూసి
కరములఁ జేమపూ కడియముల్ పెట్టి
మేలైనరత్నాల మెడనూలు వేసి
డాకాలిపెండెంబు ధరియించె నంత
బిరుదులు ధరియించి పరువడి వచ్చి
నలభై మూళ్ల దట్టి నడుమునఁ గట్టి
యేకాంగి భీముని యినుపరాగోల
వంకిణిఁ జేపట్టి యూపినయట్లు
వన్నైనచెంగావివలిపంబు గట్టి

కరియావులన్నయు గజముపై నెక్క
నందఱు నశ్వాల నమరంగ నెక్కఁ
బొందుగా బాలులు పొట్టేళ్ల నెక్కి
రప్పుడు బలమెల్ల సనిమొన నుంచి
నాచకూళ్ల నాయఁడు నేతివారి ముద్దయ్య
పోచయ్య ముమ్మయ్య పుత్తమరాజు
కరియావులన్నయు ఘనుఁడు నయితన్న
పరమోపకారుండు భట్టావులన్న
గొప్పైనసందులకొలువుగూడార
పల్లికొండ నలనన్న పద్మనాయుఁడు
సంగతి నుండంగ సముఖంబునకును
వారు పైనం బయి వచ్చి రంతటను
నపరసరస్వతి యారాజుభట్టు
చేరి కైవారాల సేవింపుకొనుచు
వెంట వింజామరల్ వేయుచు నుండ
గొనకొని ముత్యాలగొడుగులనీడ
వచ్చి రందఱు వంశవర్ధనుకడకు
నల్లంత వస్తానె యశ్వాల దిగిరి
నలనన్న కొలువుకు నడకను వచ్చి
బంధుసహోదరుల్ బావమఱఁదులు
నందఱు రాజుకు నతిభక్తి మ్రొక్కి
రంజలి సేసి యా యయితమరాజు
కనుముందు నిలిచెను గడుసాహసమున
జమకాళమును బఱపె జననాథుఁ డపుడు
కుస్తరిం చందఱిని గూర్చుండ మంచు
కస్తూరి గందంబు గలియఁబూయించి
యొనయంగఁ గర్పూరవిడియ మీయంగ
నిలనాథుఁ డైతన్న యిట్లని పలికె
"అన్న ! యో య న్నావులన్నరో ! వినుము
అన్ని దేశంబుల నావుల మేవ
నిచ్చోటఁ బగవార లెదిరించి రాగ

వచ్చోటట వారిని హతము సేసితివి
పన్నుగా దనకొండ పాలించి నేను
నెన్నఁడు జగడంబు నేఁ జేయలేదు
యేడుతరములవగలు నిచటఁ జేకూరె
నానుండి నీయెదుట సనిసేయఁ గలిగె
శ్రీరాముతమ్ముఁడు సీతకై పోరి
యిందిజిత్తును గట్టి యిలఁ గూల్చినట్లు
కదనంబుసేయను గట్టడి గలదు
నరనాథ ! మీయెదుట నొకల భంగి
చాటున్నగూడార్ల చక్కఁ బట్టించు
వాటముగ నెత్తించు వాడ లేర్పడను''
యదువంశతిలకుండు విమలమతితోను
వనిన మాటాడక యల నలనన్న
ఘన మైనగూడార్లఁ గడకుఁ బట్టించెఁ
గనుదృష్టి యుద్ధంబు కానవచ్చునటు
లెనయంగ బారుల నేర్పఱుపగాను
గలికి జగన్నాథుకడనుండి యపుడు
తటుకునఁ దన్నరుఁ దాసర్లు వచ్చి
పశుపతిఁ బొడగని పలికి రీరీతి

## జగన్నాథునికి నలనన్న అర్పణము సమర్పించుట

''వసుమతి యాదవవంశాబ్ధిచంద్ర !
నరనాథ ! మును జగన్నాథు దర్శించి
వరములు నాలుగు వరుసతో నడిగి
యిప్పించుకొని వచ్చి యొసఁగ దేవునికి
నప్పనం బొడబడి రంపగ మీరు
మూఁడువేల్ వరహాలు ముదమొప్ప వినుఁడి !
మున్నూరు గోవులు మూఁడు పోతెడ్లు
బంగారువల్లెకిఁ బంపంగ నపుడు
ఈవస్తువుల నెల్ల నీయక మీరు

సాహాసు లగుచును జనవల దనికి
అడుగు తర్లక స్వామి యఁపు వర మిచ్చి
బట్టవయ్యా! స్వామి ప్రసాద మనఁగఁ
గడు సంతసిల్లెను గాటమరాజు
తగ నన్నదమ్ముల దాయంగఁ బిలిచి
'వినుఁడి సాహాసులార! వివరమంతయును
నొనరంగ స్వామికి నొప్పింది నిజమె
పంపక తీరదు పని సాగకుండ
దాసుల బంపింది దయ యంతె సాలు
నెసఁగ నిందఱిలోన నెవరైన నొకఁడు
శ్రీజగన్నాథునిసేవ సేయుఁగ
నెవ్వరు పొయ్యేరు యెఱిఁగించు' మనెను
నలనన్నతో ననిరి నగుచు నందఱును
"నన్నరో! మోయన్న! యావులన్న! విను
మెన్నన్ని యేండ్లకు వేడుక మీఱ
యుద్ధంబు గలిగెను నిప్పుడు మాకుఁ
గళలు గుల్కుచు వీరకాసెలు గట్టి
యావీరగందఁబు నలఁదియు మిగుల
హర్షం బెసంగఁగా నాయుధా లంది
నీ కనుముం దని నెఱపేము కాని
యని మాకు సంతోషమై యుండగాను
నొప్పగా వీరిలో నొక్కర మయిన
నప్పనము కాసులకు నరుగంగ లేము
అర్థహీనుల కర్థ మబ్బుచందమున
నాకొన్నవారికి నన్న మబ్బినటు
కాలారి లోటిపిటల్ కరి తురంగములు
వడి మీఱి సిద్ధిరాజు వచ్చి యున్నాఁడు
సిద్ధిరాజుమీఁదికి సెల విచ్చి మమ్ముఁ
బవరంబు సేయను బంపుదు గాని
కుటిలారిహరు దుర్గఁ గొలిచి యుండంగ
నిటువంటిపనులకు నెప్పు డంపకుము"

అనిన మాటాడక యావులన్నియును
ఘనుఁ డైనతమబావఁ గనుగొని పలికెఁ
'బందుముల యోబావ! పల్లికొండ రఘుపతి!
యెవ్వారిఁ బొమ్మన్న నిట్టాడు చంద్రి
యెవ్వరు పోవలె నెఱిఁగింపు బావ!'
గత యేమ్య్య యెఱిఁగినఘనుఁడు పల్లికొండ
పట్టభద్రుని జూచి పరఁగ నిట్లనియె
'విమలాత్ములార! మీవీరంబు నూవఁ
గదనంబు సేయను గట్టడి గలదు
బంధు సోదరుడు నుభయపావనుండు
నందఱికిఁ గడుపిన్న యల్లుదాడెన్న
యితనితో సనిసేయ నెవ్వరు లేరు
అతివేగఁ గటకాని కంపవలె నితని
నితనిచే మనవంశ మిల యూఢి కెక్కు'
పల్లికొండ యీరీతిఁ బల్కుసేయఁగను

అల్లుదాడెన్న కటకమునకు ప్రయాణ మగుట

నలనన్న యయితన్న కలకల నగుచు
నల్లుదాడెన్నను హర్షించి పిలిచి
యాకుమారునికిని హర్షం బెసంగఁ
గనకంపుఁబాలకి ఘనతఁ దెప్పించి
పాలకి కెనమంద్రు భటుల నేర్పఱిచి
యల్లుదాడెనకుఁ బదునాల్గురి నిచ్చి
ముందుగా వరహాలు మూట గట్టించి
ఆవుల మందలో నంత వెదికించి
మందలో మున్నూరు మఱివేగ నేర్చి
యారూఢిగా మూఁడు నాబోతులాను
గానుకల్ సేసి జగన్నాథమునకు
గోవులఁ దోలను గోపాలకులను
వేరువేరునఁ బిల్చిఁ బ్రియము దీపింప

మురహరుసేవకు మువ్వలదాసు
పరమోపకారి యా పయ్యావు చెన్ను
దండి యావులు గాచు ధర్మవర్ధనుని
కావటికదిరిని గరుణతోఁ బిలిచి
వారికి భత్యాలు వరుసతో నిచ్చి
'యన్నలారా! యింక నావుల గొనుచు
వెస మీకుటుంబాల వెంటబెట్టుకొని
పుణ్యపురుషునిఁ జేరఁ బొండి వేవేగ'
ననుచుఁ గుమారుని కటు లొప్పగించి
పరఁగ దాసులతోను బ్రసాద మంది
యందఱిఁ బుఃకొల్పి యటువేగ నంపె
పరిజనంబుల కెల్లఁ బంచిపెట్టించె

## అయితమరాజు పగల నేర్పాటు సేయుట

'యినకులాధిపుదండు లెత్తికొని రాఁగ
దేశాధిపతులెల్ల ధీరులై రాఁగఁ
బందుముల యోబావ! బహు దివ్యపురుష!
పైకొని సిద్ధిరాజు బారులుగఁదీసి
యెవ్వ రెవ్వరితోను నెదిరించవలెనో
యెవరికి దొరకునో యిం దని సేయఁ
బంపు నేర్పఱచుమీ! ప్రఖ్యాతిగాను
బంపవే యిట మాకు పగల నేర్పఱచి'
అనిపంతఁ బల్లికొండ యంతలోఁ దెలిసి
యొయ్యన వారితో నొనర నిట్లనియె
'నిందఱికిఁ బగదళం బీడుగా లేదు
కయ్యాన హతముగాఁ గట్టడి గలదు
వారితో నొకరొకరు వైనవైనాన
నిటువలెఁ బోరాడుఁ డేఁ జెప్పినట్లు
కరియావులన! నీవు కదిసి బలంబు
నెఱసిద్ధిరాజుతో నెదిరించి నిలుము

భట్టావుల వల్లభన్న ! బలముఁతోను
పట్టి పల్లార్పమిా పాపసిద్ధిరాజు
గండగోపాల్రాజు కస్తూరిరాజు
ముందుగా నయితన్న ! మొనసి పోరాడు
వెరవుగా నుండవెల్లి విరిగోపుతోను
సిరిబాల ముమ్మయ్య ! సేయు యుద్ధంబు
పెదవేగి భావరాజు పెదవరుడరాజు
నేతివారి ముద్దయ్య ! నీవు నని సేయు
నారుగలనాచకూళ్ల నాయుఁడా ! నీవు
పేరుగల యాగుత్తి భీముతోఁ బోరు
పురుషవృషభుండ ! యో పోచయ్య ! నీవు
తిర్ణమల తిప్పయ్యతో ధీరతఁ బోరు
కొండువారి కొండయ్య గోపుల గంగయ్య
మెండైనబలముతో మెఱసి పోరాడు'
పల్లికొండ యీరీతిఁ బంపు లేర్పఱుపఁ
గాటమరా జంతఁ గడువేగమునను
ననిసేయ సెల వని యందఱి కనెను

## అయితమరాజు భట్టుతో కబురుసేయుట

అప్పు డయితమరాజు ఆసేనఁ జూచి
యపరసరస్వతి యనుభట్టుఁ బిలిచి
సిద్ధిరాజుకడకు శీఘ్రమె పోయి
యుద్ధంబు సేయను నిది మంచివేళ
పాలిఁబెట్టియు నావు పాలిగాకుండఁ
బాలిపంతము లేర్చి ప్రఖ్యాతిగాను
వకరి నొకరు కదిసి వైనవైనాన
నల్లలోకంబుల నెన్నికగాను
యుద్ధంబు సేయవలె వెఱ పింతలేక
రణమున కెదిరించి రమ్మను నీవు
ఆన తిచ్చిన భట్టు నతివేగఁ బోయి

పరుగున సిద్ధిరాజుఁ బ్రస్తుతిఁజేసె
'బలశాలినీ నన్న భట్టును నేను
జనుదెంచి రణమునకు సాగి రాలేక
యడరిరో బీరన్న యాపదచేతఁ
జిన్నయ్య చెలరేగి చేసినయనికిఁ
బరఁగ యాదవు లంత భయ మందినారో
భయమునుచేఁ దీరదు బ్రహ్మకట్టడికి
నేమి తోఁచక వారల లీగతి నుండ
నయితన్న తమ్ములు నతని మఱఁదులును
కదిసి కర్యము సేయఁ గారణ మిపుడు
గనుక గొల్లలు మిమ్ముఁ గడచి పోయ్యేరు
సరఁగ మమతలు వీడి సంతోషముగను
యుద్ధంబు సేయను నిసి మంచివేళ
వివరించి రమ్మని యిటు పంపినారు'
మేదినీశుఁడు విని మేలుకట్నాలు
రాకట్టు ఉంగరాల్ రత్నకడియాలు
భట్టుకు సిద్ధిరాజు బహుమాన మిచ్చి

### ఇరువురిదళములు రణమున గలియుట

యతికోపుఁ డగుచును నతివేగ లేచి
భేరీమృదంగముల్ పెద్ద బూరుగలు
రణభేరి వేయించె రాజు కోపమునఁ
దమకంబుపై నెక్కి తా నుండఁగాను
సరఁగ నాభ్రమోఁతకు సరదార్లు మొదలు
మొనల నేర్పఱిచిరి మొత్తముగ మూక
అప్పుడు నిలిచిన నయితన్న నూచి
తమ్ములు మఱఁదులకుఁ దా సెలవిచ్చెఁ
బంపుదా లేర్పడి పరువడి రాఁగ
నవుదాలపై నిల్చి యా సిద్ధిరాజు
పరువడి యాదవులఁ బాఱంగఁ జూచి

చోద్యమందుచు నుండె శూరుఁడై రాజు
ముందుగా జగడాన ముమ్మరముగాను
ఘన మైనబాణాలు కాల్చి రొక్కడను
నటువెన్కఁ దుపాకు లసుభుగుల్గాను
పెటపెట తుపాకులపెట్లు కాల్చినను
గుభులు గుభులునఁ గొండ ఘూర్ణిల్లుచుండె
బాణాలు వేయంగఁ బరఁగుబ్రమోఁతలకు
భువి తల్లడించెను బోరు కలఁగసచును
గదిసిరి విలుమూఁక ఖడ్గహం బేర్చి
మూఁకలుమూఁకలై మొనసి యిర్వంక
సరిగ నారిబిగువు సళ్లకుండగను
పంచభూతంబులు వాపోవఁగాను
నార్చుచుఁ బేర్చుచు నవల శరములను
సీసలతోఁ గదిసి యుద్ధరంగమునఁ
జౌకళింపుచు దూకి చాచి జళిపించి
వాటముగ బోరుదురు వడుసుమన్నీలు
అడిదంబులను దట్టు చటు చౌకళించి
సురియల నఱకిరి శూరులై నిల్చి
యురిగెలఁ దాటించి యన్ని యొగదట్టి
గొదకొని గొల్లగా గోపాలకులును
చీకాకుపఱచిరి శిరము లెత్తఁగను
నఱుకుచు రణమున నార్చుచుఁ గొంత
విడువక పోరాడువిధమునఁ గొంత
పోచయ్య ముమ్మయ్య పోడిమి మీఱ
నప్పుడు బాలలు నశ్వాల నెక్కి
బాలలు కదిసిరి బలుయుద్ధమునకుఁ
బల్లికొండయుఁ దమ్ముఁ బైనంబు సేసి
యాన తిచ్చినక్రమము హరివంశపరులు
తప్పక వారితోఁ దలపడి యాజి
ముప్పిరి గొనుకోపమునను జేయంగ

## బావమఱఁదులు సొగటాలాటలోఁ బంతములఁ దెలియుట

నాసమయంబున నట నున్నయట్టి
పశుపతి నలనన్న పద్మరాఘువుఁడు
పసిఁడితమళంబుకుఁ బైనఁగూర్చుండి
రసికుఁ డౌ నాపద్మరాఘువుం డనియె
'నయితన్న బాలలు నమర యాదవులు
సరగ యుద్ధము సేయుసమయంబు నిదియు
మనవార లేరీతి మసలుచున్నారొ
పగవార లేగతి పాఱుచున్నారొ
తెలియంగ చూదాము తేటపడగాను
పట్టుమా సొగటాలు పట్టి యాడుదము
అందుఁ దెలుపుదురు హరిహరుల్ మనకు
బావరో! తెప్పించు పాళె పాచికలు'
అని యిట్లు పద్మనాయండు పలుకంగ
నవు నంచు నలనన్న యల్లున నవ్వి
యుద్ధంబులో వార్త యిటు దెలియగాను
అపుడు తనమదియందు నమర నూహించి
మేరువుధైర్యంబు మించి సొగటాలు
సారెలు పాళెపైఁ జయ్యన నిలిపి
పరఁగంగ నవ్వుచుఁ బాచిక లీయఁ
బద్మనాభుఁడు సారెపంపు లేర్పఱిచె
'నరిదళము యాదవుల నాలించి చూడు
మరయంగ భూదెల్పు అన్నియు నివ్వి
పరదళంబులు నెఱుపు వరులట్లు నలుపు'
అని యిట్లు పోల్చెను నా రాఘువుండు
ఆవులన్నియు నెంచె నాత్మలోపలను
బరఁగ గణపతిఁ దలఁచి ప్రార్థించి హరుని
నిక్కడ సొగటాల యీ యాటలోను
నక్కడఁ దమ్ములయనిఁ దెల్పవలెను
భారతిఁ దలఁచి తాఁ బాచికల్ విడిచె

బావపందెం బని పక్కన నవ్వె
నిపుడు తమ్ములు రిపుల విఱుగఁ బోడిచేరు
అప్పుడు రాఘవుం డటు పుచ్చుకొనియుఁ
బందెంబు చూడుము బహు లెస్స యాయె
నాపందెమును జూడు నరనాథతిలక!
అని హస్తముల నలచి యవనిపై విడుచు
జక్కదగడవైచె సాహసంబునను
బగదళంబులు సమసె బావరో! చూడు
మిప్పుడు మించిన నిలఁ గూలు దళము
యని సారెఁ బోడిపించి యా యెత్తు గెల్చె
యతివేగమున రాజు అపుడు పుచ్చుకొని
తప్పక హరి నెంచి తమకు మే లనుచు
నప్పుడు తా వైచె నారాజఘనుడు
నదా అదె చూడు సంతోష మనుచు
సాహసంబున నున్న సారెలఁ జీరె
సమసె నిరుదళములు సరి పాళిమీఁద
...యాదవులు...పోల్చిన సారెలు
అయిదు కఱ్ఱలు పండె నంతలోపలను
నీ పంతమే నిజము నిజము నీదేను
తగ నిట్లు వార లుత్సాహంబు మీఱ
యాదవుల్ రణమున హర్షంబు మీఱి
పక్కలొక్కరు కదిసి వైనవైనాన
చక్కగా నఱికిరి సమరంబులోను
నఱికిన శిరములు నలిగిలి యాయె
హరి నెంచి మూర్ఛితు లయ్యేటివారు
శంకేమియును లేక చలరేఁగి మించి
కొంతలు నఱికినఁ గూలు నశ్వాలు
జళిపించి కటార్లు సాహసంబుగను
సూర్యసోమ వీథులఁ జొచ్చి నఱుకంగ
ధరమీఁదఁ బీనుఁగుల్ తఱచుఁగా నుండె

నేలపైఁబరువడి నిల్చి పోడిచినను
మేల్వాంతకారు లని మెచ్చియు వారు
తఱిమి గొల్లల నఱుక దద్దరిల్లియును
బాజేటిర క్తంబు పయిఁ జల్లుకొనియుఁ
జచ్చినవా రంపుఁ జొచ్చేటివారు
సజ్జగా సురియల నఱికినయపుడె
ప్రాణాలు విడుచుచుఁ బరఁగ నిట్లనిరి
తల్లిదండ్రుల భార్యఁ దనవారిఁ బాసి
బల్లాల నేజాల పాలైతి మిట్లు
తలవడి యాదవుల్ తఱిమి పగతురను
బలముల సమయించి పాలకులఁ జూచి
యెఱసిద్ధిరా జెక్కు నేనుఁగుమీఁదఁ
గరియావులన్న తా గజము నడిపింప
నమితవిక్రమశాలి యానలనన్న
తమకంబుపై నుండి తాఁ జూడఁగాను
నేనుఁగుపై నెక్కి యెఱసిద్ధిరాజు
క్రమ్మక రాఁగాను గరియావులన్న
కరులపై నుఱికింపఁ గణకతో డుతను
దిరికట్టి మూకలఁ దెగువతో నఱికె
నినుపరాగోల్లల నిట్టట్టు నార్చి
యేకాండమునఁ గొట్టె నెఱసిద్ధిరాజు
ఎఱ్ఱసిద్ధిరాజు ఎక్కిన గజము
బోరునఁ గొండవలె భూమిపై నొఱగె
కరియావులన్న తా ఖండించి వైచె
సిరిబాల ముమ్మయ్య సింహావిక్రముడు
చేరినమూకలఁ జెండు చెండాడి
విడిబడి యుండవెల్లి విరిగోవుతోను
జలముచే సాధించె సాహసంబునను
బోరి యాదవురొమ్ముఁ బొడిచి పడఁద్రోసి
దండిశత్రుల నెల్ల ధరణిపైఁ గూల్చి

పందుమల పోచయ్య పసిపెండ్లికొడుకు
హెచ్చిన మూకల నెడలేక నఱికెఁ
గన్న కొమారకము నేలుఁ కనకము గంగరాజును
చెన్నపట్టణమేలు చంద్రశేఖరుని
తిర్ణమల తిప్పయతో ధీరతఁ బోరి
యాగ్రహంబునఁ జేతి యాయుధంబునను
దఱిమి యాముగ్గురితలలు ఖండించి
తఱిగిన శిరసులఁ దనచేతఁ బట్టి
అలనాడు ఓమామ ఆరవెల్లివద్ద
నావులఁ బిలువంగ నవి రా వటంచు
నలనన్న నాకపుడు నగుబాటు చేసె
పక్షపాతముసూపి పరిహాస మాడె
బంత మీఁడేర్తు నని పలికితి నపుడు
యావ్రలు దక్షిణాది కరుదెంచినపుడు
ఆరవెల్లిగంగ నపుడు ప్రార్థించి
కుంభాలు పోయించి కోర్కె లీడేర
నావులఁ బిలువంగ నానతి యిచ్చె
నరలేక పిలిచితి మావుల మనము
ఆరవెల్లివద్ద నావేళ నన్నుఁ
బోనాడి నిను మెచ్చెఁ బొందుగా మామ
పద్దు కొదవాయె నాపంత మీఁడేర
బహువిధంబుల నార్చి పగఁ దీర్చినాఁడ
పగవానిశిరసులు పశుపతి కేను
బాదకానుక పెట్టి పంత మీఁడేర్చి
వత్తును ఓమామ ! వక గడియలోను
నల్ల నేరెడువద్ద నానవాలుగను
వలసటఁ దీర్పుమి యరజాము మామ !
తామూఁడు గడెలకుఁ దాంబూల మంది
జంబువృక్షముకడకుఁ జేరంగవత్తు
నని యిట్లు ముమ్మయ్య యానవాల్ సెప్పి

## బోచయ్యపంతమునకు నలనన్న మెచ్చుట

శిరసులు కొనివచ్చి శ్రీతమకమునఁ
బల్లికొండ నలనన్న పద్మనాయునికిఁ
బాదకానుకఁ బెట్టి పగతురతలలఁ
బరగంగ నివ్వాళి పట్టెను వేగ
అల్లున నవ్వేను వల్లవుల రాజు
ఇతని సాహసమెల్ల నిటు తెలిసికవలెను
బోచయ్యతో రాజు పొసఁగ ని ట్లనియెఁ
'జచ్చిన శిరసులు చాల నుండంగఁ
దేజ మాశిరసులఁ దెస్తివా యిటకు
సరదారులను నీవు సాధించి నటికి
తెచ్చిన మాటైతె తెలుపంగవలెను'
అన మండి పోచయ్య యవ్వ డి ట్లనియె
'చెల్లెలికొడుకని చెదర నాడితివి
తమ్ముఁ డవి ముమ్మయ్యఁ దగుఁదగు నాటి
చిన్నబో నాడఁగఁ జెల్లునా మామ!
నాఁ డావులను బిల్వలేఁ డని నీవు
నవ్వినప్పటినుండి నలనన్న! నిజము
నారసా లైయుండె నామదియందు
నేఁడు గొదకొని పోరి నేను ఘోరాజిఁ
గోసి పగతురతలలఁ గోరిక మీఱఁ
బాదకానుక గాఁగఁ బట్టితి నైన
మే లని తెచ్చిన మెచ్చుకో వైతి'
మామ యల్లునితోను మఱియు ని ట్లనియె
'సాహసంబునఁ బగఱ సాధించి నటికి
కొనివస్తి నంటివి కొన్నిశిరసులను
అయితేను పలికించు మన్ని శిరసులను
అతి సాహసుఁడ వందు నల్లుఁడా! నిన్ను'
మామాడుమాటలు మఱియుఁ బోచయకు
గోర్చుట్టుపై నీటె గ్రుచ్చిన ట్లాయెఁ

బూని యీటెలకొద్ది పొడిచిన ట్లాయె
మంటలై మిన్నంటె మఱచి దేహంబు
అరలేక పరమాత్మ నంటె జీవంబు
నాపద్దు గెలుపు మని హరులఁ బ్రార్థించె
'ఓపరమాత్మ! నిజ మొక్కఁ డెఱుఁగుమును
పంతాన శిరసులఁ బలికించు' మనుచు
వేఁడిన శ్రీహరి వేడుకపడుచు
పరఁగ శిరసులకుఁ బ్రాణంబు లిచ్చె
నార్భటంబులు సేసె నంతఁ బోచయ్య
మీసాల నెగవేసి మిట్టిపడెఁ దలలు
ధరణి మున్నుగ నదరెఁ దమకంబు వణఁకె
రణవీరతమకాన రాజు పల్లి కొండ
యాశ్చర్య మందుచు నవ్వు డిట్లనియె
'నింత సాహస ఘనుం డితఁడు పోచయ్య
యర్జునునికి సాటి యనవచ్చు నితని
బలశాలి కాకుంటె పలుకవు తలలు
భీముని సరివచ్చుఁ బృథివి లోపలను
లంకలోపలఁ దొల్లి రావణుఁ జంపి
ఘనముగాఁ బట్టంబు గట్టిననాఁడు
పలుకవు శిరసులు పద్మనాయుండ!
యల జరాసంధుతోఁ జెలఁగి కృష్ణుండు
సరిపోరె నని విందు సమరంబునందు
నాఁడు పల్కవు పద్మనాయుఁడా! తలలు
కడు పరశురాముండు కార్తవీర్యునిని
వేయుఁ గరములు ద్రుంచె వేడుక మీఱఁ
నాఁడు పల్కవు పద్మనాయుఁడా! తలలు
సత్యంబు గలయట్టిసాహసుం' డనుచుఁ
బోచయ్య గుణములు పొగడుచుఁ జాల
మేలు భళా యని మెచ్చి యల్లుణ్ణి
యపుడు విడెముల నిచ్చి యతిసాహసుఁ డన
సెలవంది రణవీధి సరగ నేతెంచె

## ముమ్మయ్యమృతికిఁ బోచయ్య విచారించుట

జంబునేరెడికాడఁ జేరంగ వచ్చి
పసిడితంగేళ్లన్ని పాఱంగఁ జూచెఁ
గనుగొని వెదకినఁ గానరాకున్న
నాలించి తనమామ నందంపి పిలిచి
'వీరనందుల మామ! యిక్కడ లేవు
ఎక్కడ నున్నావొ యేమి సేయుదును
విజయనందుల మామ! వెలయంగఁ బలుకు
కంచునందుల మామ! కపటంబు చేస్తి
గజనందుల మామ! గడి చెప్పిపోతి
నెందుఁబోయితి మామ యెందు వెదకెదను
గదిసిన దళములఁ గల్లుగాఁ జంపఁ
దామసింపఁగ లేక దళముపై దూసి
చెండాడు చున్నావ చేరి యో మామ!
ఆలజాలము లాడ నల్లుఁడఁ గనుక
యోనవాలును దప్ప నవలీలగాను
దాఁగి యున్నాఁడవా తందర సేయు'
నని నాల్గుదిశలను ననిలోనఁ జూడఁ
గానరాఁ డాయెను గాంతిచంద్రుండు
'నేను వచ్చిన దాఁక నేరెడువద్ద
పంతాన నుండు మని పలికితి మామ!
పంతము కడవస్తి పద్దులు గెలిచి'
కలవరపడి యంత ఘనవాల వేసె
'వాలరా! యోధీర! వంశవర్ధనుఁడ!
వాలరా! వల్లవ వంశాబ్ధి చంద్ర!
వాలవాలో నీకు వల్లవులమామ!
వాలరా! కడచన్న వల్లవులముమ్మ!
మోస మ్మయినమామ ముమ్మకు వాల!'
వాల లని పోచయ్య వగఁ జెందసాగె
ముమ్మన్న వీరజడ ముడిచినపువ్వులు

దెప్పలుగ రక్తానఁ దేలుచు నుండి
జొత్తువలె రక్తాన సొరిది నుండంగ
వాలయు చాగ నెత్తురు వఱదలో నుండి
వా లన్న యామాట వకకాస్త వినెను
మామను జూడంగ మతి కలఁగిపోయె
గాయాలతో ముమ్మ కళ దప్పియుండ
దగ్గఱఁ గూర్చుండి తాత్పర్యముగను
తోణకి హస్తంబులఁ దొడలపైఁ జేర్చి
మృదువుగా నాతని ముద్దులముఖము
కళ దప్పి బాష్పముల్ కాల్వలై పాఱ
జిలుగు సన్నపుఁజంద్రశాలుఁ జేపట్టి
దరదర రక్తంపుధారలు దుడిచి
'చంద్రబింబముఁ బోలు చక్కనిముఖము
కాంతి సెప్పఁగలేను ఘనుఁడవు మామ!'
కణఁగి నెత్తురుకాఱు క్రమదేహంబుఁ
జెంగావివలిపంబుచేఁ దుడిచె నంత
'మామ! యీకాంతి సంపద గలమేనుఁ
బొత్తెపు నేజాలఁ బొడిచిరా మామ!
నేను వచ్చినదాఁక నేరేడునొద్ద
నిలువక పగఱపై నేల యెదిరితివి
కదిసినపగతురఁ గలనిలోపలను
బాహువుల్ నొచ్చెనే బారుల నఱుక
నటుతిరిగి చూచితే యండ లేఁ డనుచు
అప్పుడు సంధించి యా పాటు సూచి
మాయగాఁ బొడిచిరటె మామ! బల్లానఁ
బూని శత్రుల నీవు పొలియింపఁగాను
బరగంగ వేసిరా బాణాల నిన్ను
నిరుగడల వచ్చియు నెడము లేకుండ
వలపల నఱుక డావల వెలువడెనె
సూర్యకటారితోఁ జూడఁ జోద్యముగ
వెన్నంటి నఱుకంగ వెయ్యివేల్ఁ గూడి

వంకిణీల్ నేజాల్లు వడి నారసములు
నెదురొమ్ముననను బోట్లు వెడలెనా నీకు
వారిలో సాహసుల వజ్రాయుధముల
నుత్తముఁడ ! పోటుల నుర్వి నొఱిగితివి
గన్నెరాకమ్ములు కడుఁ దాకెనట్టి
దొనియింటికోలలు తుదల వెడలెనె
యెత్తినబాణాలు ఎదల నాటినవె
జల్లున బాణాలు సందు లేకుండఁ
గంచువంటిది బొంది గడియలోపలను
దూరెనా ఓమామ తురములో నిన్ను
గడుపులో బాణాలు కత్తులు దిగెనె
వజ్రాయుధంబుల వల్లవులవారు
వైనముగఁ బోట్లాడి వఱగిరా మామ ?
తిరుమందులవారి దివ్యబాణాల
ధీరులై యొఱగిరా దివ్యరణమందు ?
సమరంగ నీవెంట నంటియుండ నని
కపటంబు నుంచకే ఘనుఁడ ! యోమామ !
వట్టి వగపులు గావు వల్లవుల మామ !
వద్దుగాఁ జూడుము బాహువిక్రమము
నిన్నుఁ జంపినవాని నే హతము సేతు
వీరతమకము రాజు కేచు దగిలింతు
దనతొడలపై మామ ధరణిపై జేర్చి
పయిఁ గప్పి కనకంపుఁబట్టుశాలువయు

## ఉగ్రుడై పోచయ్య విజృంభించుట

నుగ్రుఁడై పోచయ్య యశ్వంబు నెక్కి
కాలు తాటించి కరాళించి దూకెఁ
జేరి విమతులతోడఁ జేసె యుద్ధంబు
పోచయ్య యొక్కఁడే పొసఁగఁ బదివేల
నప్పుడే వెన్నంటి హతము సేయంగఁ

గాల్బలంబుల నటికి కల్లుగాఁ జంపి
యామీాఁదఁ బగతుర నాముకొని కదిసి
జళిపించి బల్లాల సంధించగాను
చాచి బల్లాలపైఁ జౌకళించియును
దడయుసికోపాగ్నిఁ దలలు ఖండించి
యాముకొని పోచయ్య హతము సేయంగ
ఘోరు ఘోరనియెడి గోపాలు రెల్ల
వేడుక మీాఱుచు వెలయ నుఱుమాడి
యేన్గుల నశ్వాల నెన్నంగ బలము
విరివిగా రణమందు వఱిగినవిధము
ఘోరాజిఁ బీనుగుల్ గుట్ట లైయుండె
దురములో శిరసులు దొంతుల భంగి
గుట్ట లై యుండేను కొదవ లేకుండ
నారీతి రణమందు యాదవుల్ కదిసి
వెందగిలి సరద్దార్ల నిలఁ గూల్చఁగాను
దలనూప వెఱచిరి తఱచు మన్నీలు
తడబడి రణమున దాగేటివారు
విడిబడి రణమున వెళ్లేటివారు
తాటిబొందులసందు దాగేటివారు
పాఱియు నడవులఁ బట్టేటివారు
చచ్చిన వారిక్రిందఁ జొచ్చేటివారు
కడువేగ దొంతు లై కడవ లున్నట్లు
తలలగుట్టలసందు దాగేటివారు
వెళ్లేటివారికి నేమియు ననక
యెదిరించుమన్నీల వీరు లై కదిసి
యతిపరాక్రమశాలి యయితమరాజు
క్షితికొక శత్రుని క్షయముగా నటికి
గండగోపాలరాజు కస్తూరిరాజు
ముందుగా నందటి మొనసి పోరాడి
యిరవుగా నుండవెల్లి వీరగోపునిని
సిరిబాల ముమ్మయ్య సింహావిక్రముఁడు .

నార్చుచు నఱకిన నవనిపై నొఱగఁ
గస్తూరి సిద్ధిరాజు కదిసి యైతన్న
మదగజంబులతోడ మంచియశ్వాల
నని గూల్చి యటుతిర్గి ఉగ్రుడై లేచి
కస్తూరి సిద్ధిని ఖండించివైచెఁ
గరియావులన్న తాఁ గడుసాహసమునఁ
గదిసిన బలములఁ గల్లుగాఁ జంపి
యేకాండమునఁ గొట్టె నెఱసిద్ధిరాజు
నాచకూళ్లనాయఁడు నేతివారి ముద్దయ్య
యనుసాహసులు రణమందునఁ జెలఁగి
యులయుక సొలయుక యట్టహాసమునఁ
బల్లికొండ సెప్పినపద్దు మీఱకను
వైనముగ వారివారి వైరులఁ జంపి
మేరువుధీరులై మేదినిమీఁద
నారాఢిఁ బోట్లాడ నందుల రక్త
మస్తమానమువేళ నవనిపైఁ బాఱెఁ
బాలేటి కెదిరించి పరఁగ దక్షిణము
వగవారి రక్తంబు పాఱు చుండంగ
నంబరంబున సుర లానంద మంది
రపుడు యాదవులకు నతిభార మాయె
నెక్కిన యశ్వాల కేట్లు పోట్లాయె
నకరొకరి కమ్మలు వైనవైనాన
వజ్రాంగి సురియలు వంకిణీల్ నాఁటెఁ
దిరుమందులవారి దివ్యబాణాలు
అందటి కొకగడె నలుగులు నాటె
హరివంశరాజుల కటు మూర్ఛ లేక
శ్రీహరిభక్తులై సిరికళలతోను
బక్కర తేజీల బల్లాలు నాటె
పుత్తమరా జెక్కుపువ్వులనిడినిక్కిఁ
గత్తుల నీటులఁ గసిగందు లాయె
వలభ న్నెక్కేటి వాసిగల తేజి

వళ్లెల్ల నేజాలు వడివడి నాటెఁ
గడమ గుఱ్ఱాలకుఁ గడు గుఱుతులేక
యెడలేక యమ్ములు నెదముల నాటె
యదువంశతిలకులు యాదవ పుణ్యు
లదరుగుండెలు లేని యధికసాహసులు
నెదురొమ్ము పోట్లతో నేకాంగు లగుచు
సమరానఁ జెల్లక సజ్జనుల్ నిలువ
దనము కొం డేలేటిధారుణీశ్వరుఁడు
వారిని గొలిచిన వనరై నదళము
కాలిపరివారంబు కదనాన నొఱగె

బవరాన యాదవబలము హత మాయె
నస్త్రాద్రికిని సూర్యుఁ డరుగువే ళాయె
మందకు నావులు మరలువే ళాయె
నీతిజ్ఞు లయినట్టినీతిమంతులకు
ధర్మయుద్ధముసేయఁ దగనివే ళాయె
బల్లవ నలసిద్ధి పట్టాభిషేకు
తమ్ములు సెల్లిరి దళమును మడిసె
నేనుఁగుల్ లొటిపిటల్ వెలయునశ్వములు
మఱి రాచదళములు మన్నెమూకలును
హేరాళముగ మడిసె నెడములేకుండ
హత మాయె నని రాజు ఆశ్చర్యపడుచు
నుగ్రుఁ డై యుండెను నుర్వీశఘనుఁడు

## అనిలో యాదవు లలసి యావులన్నకడ కరుగుట

అప్పుడై తమరాజు సమర యాదవులు
జొత్తువలె రక్తంబు జొబ్బటిల్లంగ
గాయాలు నిరుమేలఁ గానరాఁగాను
వల్లవులశూరులు వచ్చిరి మగిడి
తిరుమందు లయినట్టిధీరులు మొదలు
కత్తులు నాఁటినకనులతోడుతను

నాచకూళ్ల నాయఁడు నేతివారి ముద్దయ్య
పోచయ్య ముమ్మయ్య పుత్తమరాజు
కరియావులన్నయు ఘనుఁడు నైతన్న
పరమోపకారుండు భట్టావులన్న
మొదలైనబలవంతు లెదురు రొమ్ములను
బల్లాలు నాటినఁ బరఁగ దేహంబు
చీలిక లై నెత్రు చిమ్ముచుఁ బాఱుఁ
గసికండ లై నాటి గాయాల నెత్రు
గ్రమ్మగ యాదవుల్ కలకల నగుచు
బూరుఁగ వృక్షాలు పూసినయట్లు
పారిజాతంబులు పర్విన యట్లు
పోటుగాయాం లవి పూల బంతులుగ
నారసా లెర్ర గన్నేరులే యనగ
మల్లెపూవులవలె మఱి దేహమందు
వేసినబాణాలు యెడలేక నాటి
తెఱఁగొప్పఁ బూవులై తేజంబు మెఱసి
పనసలు మావిళ్లు ఫల మందినట్లు
నెసఁగంగ బూవులు వికసించినట్లు
ఆరీతి యాదవుల్ హారికృపవలన
నశ్వాలఁ గోల్పోయి యచ్చోటుఁ బాసి
యుచ్ఛ్వాస నిశ్వాస యూపిర్లతోడ
నయితన్న వెనువెంట నంది యాదవులు
పొంకుగా దాసాని పూల్గూర్చినట్లు
అప్పుడు వచ్చిరి యావులన్న కడకుఁ

## నలనన్న యాదవుల నోదార్చుట

దమ్ములు రాఁగాను దప్పకసూచి
తమకంబుపైనుండి ధరణిపై దూఁకి
యెదురు వచ్చియు వారి నెత్తి దీవించి
సంగ్రామ విజయుండు సతివర్జితుండు

భ_క్తిఁ దమ్ములతోఁడఁ బల్కె నొకమాట
"నాకన్న ఘనులార ! నాయన్నలార !
పగతురమీఁదికిఁ బైనమై పోయి
భూకాంతుపై నిల్చి భుజశ_క్తి మెఱసి
చలముకొని వారితో సమరంబు సేసి
కోలాహలంబుగాఁ గోరికె లీడేర
దండిబారుల నెల్ల ధరిణిఁ గూల్చితిరి
వేడ్కతో మీవంతు వెసఁ గూల్చువఱకు
మీ తనువులు డస్సె నాతమ్ములార !
పరఁగంగ మల్లెలపాన్పులమీఁద
మసలేటిదేహాల మఱి నాటినావి
పరఁగ జాజులమీఁదఁ బండుదేహాల
నందఱికి నాటిన పతిబలులార !
పన్నీట స్నానంబు పంచప్రాణాలు
పల్లకొండ పంచిన ప్రజ్ఞ యీడేర్చి
క_త్తిపోటుల నెత్తు కాఱుచున్నదియుఁ
గమ్మనికస్తూరి గంధంబు నలఁదు
మేనఁ గాఱెడునెత్తు మెఱసి కరుండ్లఁ
దగ రణంబున రామతమ్ములవలెను
నిర్గడల నందఱు వెలయు విధములను
గరకంతుకృపవలనఁ గార్యమి ట్లాయె
నున్నదేచా లని యూరడించియును
దనపట్టుశాలున ధారలఁ దుడిచి
కళదప్పి ముఖములఁ గావురు గప్పి
కందువాఱియు నుండఁ గాటమరాజు
రవశాలు చేపట్టి రవధూళిఁ దుడిచి
యందఱికి విడిమట్టు నానందముగను
గొప్పగా శివనందులగూడారులోను
బట్టుజమకాణముల్ పఱపించి వేగ
నయితనకుఁ దివాసి యావయకుండంగ
పచ్చిగాయాలకుఁ బత్రి దెప్పించి

ప్రాణహానియుగాక పట్టువస్త్రాల
గట్టిగా వస్త్రాలఁ గట్టి రందఱికి
నలసన్న యను బద్మనాయుఁ డిద్ద ఱను
వెలయుపల్లికొండతో వేడ్క ని ట్లనిరి

### పల్లికొండతో రమపాటు విచారించుట

'బలభద్రమూర్తి! యోబావ! పల్లికొండ!
చెలఁగి మన యాదవుల్ చేసినయాజి
మాఘబహుళఅమావాస్యమంగళవారంబు మొదల
బాసగాఁ దంబళ బ్రహ్మరుద్రయ్య
దశమి గురువారానఁ దగఁ జల్ల వారు
నెసఁగంగ బొల్లావు నేకాదశితిథి
అమర ద్వాదశినాఁడు నరుదు బీరన్న
త్రయోదశినాఁడు తగ బాలరాజు
లెనయంగ రేపట నెవ్వరి వంతో
పరఁగ నానతి యిమ్ము పల్లికొండ! బావ!
ఘనుఁ డగుపల్లికొండ కాటన్న కనియెఁ

### పల్లికొండ పంతము చెప్పుట

'బరఁగంగ సిద్ధిరాజు బలములతోను
నెసఁగంగ బోరాడ యుద్ధరంగమునఁ
జట్టువా రెర్రయ్య సాహసంబునను
శ్రీకంఠరాజుపైఁ జెలరేఁగి మించి
గట్టిగాఁ బోరాడఁ గట్టడి కద్దు
మఱి వేగ పగవారి మదగజంబులను
నలుగు రెద్దులు గదిసి సమరంబు సేసి
కదనంబులోఁ జంపఁ గట్టడి కలదు
పగవారిఁ బుల్లెద్దు బసవన్న కోరి
యారూఢిగా నెదిరి యందఱిని గూల్చు'
అని యిట్లు పల్లికొండయనువార్త వినుచు
నారాత్రి యుండిరి యిష్టభోగముల

## పాపసిద్ధి దండుతో పయనమై వచ్చుట

నక్కడ సిద్ధిరా జధికకోపమున
జాముసఁ దెల్లవాఱ సరదార్ల భటుల
ర మ్మని పిలిపించి రాజు తాఁ బలికె
యాదవుల మీఁదికి యేన్గుల ఘటలు
నశ్వాల నన్నిటి నాయత్తపఱిచి
యా పరివారమున కధిపతియైన
పాపసిద్ధిరాజును బై నంబు సేయు
మంకించి రణమున కరుగంగ మాకు
సెల వని నలసిద్ధి జేరికోరంగ
నంతట తమ్ముని నలర దీవించి
నలసిద్ధి వారిని ననిసేయఁ బంపెఁ
బొలుపొందగా సూర్యపుటములనీడఁ
గదలె దురగంబులు కనకపొడి రాల
బలము లిరుగడల బాగుగా నడచెఁ
బడగ గొడుగులు గలవరఁగ నాయకులు
వెనువెంటనే కదిసి వివరముగ నడవ
వకఘటం బేనుఁగులు నశి మావటీలు
పాపసిద్ధిరాజు పన్నిద్దఱు దళవాయులు
మతిమంతుఁ డైనట్టి మన్నీల బొమినేఁడు
మొదలైనపరివారము మొనలు యేర్పడియు
నడిచెను దళములు నపిరిభేరీలు
నవాదు సేసిరి నాదు యెడలేక
ఘనబిరుదు టెక్కెముల్ గండభేరుండములు
కురురాజునకుఁ బోలెఁ గుంజరం బెక్కె
యిరుగడల వేయంగ వింజామరములు
తొండాల యేనుగుల్ దొడ్డిమీఁదికిని
మెం డైనసేనలు మెఱసి యేతేర
వేకువజామున హేరాళముగను
ఘన మైనయేనుఁగుల్ కాల్బలంబులును

గుఱ్ఱాలబారును గొదకొని వచ్చె
నటు దళములఁ జూచి నఱ్ఱావులెల్ల
మిఱ్ఱి మిఱ్ఱియు జూచె నిఱ్ఱులవలెను
మదగజంబులఁ జూచి మఱి సలుగుటెడ్లు
కదిసి ఱంకెలు వేసెఁ గాలు దువ్వుచును
గాల్బలంబులఁ జూచి కఁపటీలెల్ల
చాలుగా నిలిచిరి సమరంబు సేయ
దివ్యదృష్టులు గల ధేనువుల్ గనుక
యశ్వాల కెదిరించి యావులు నిలిచె
బలములయెదుట గోవకులెల్ల వరుస
లేర్పడి నిలువంగ నీరాజు దళముఁ
జూచి యాశ్చర్యంబుఁ జొచ్చి యిట్లనిరి
'గజముల నశ్వాలఁ గాల్బలంబులను
నొక్కటే బొల్లావు లక్షులఁ గూల్చె
నట్టియావులు గలయాదవులమంద
యీ మందమీదికి నిపుడు వచ్చితిమి
కుఱునెప్ప బంటేది కూలుట నిజము
అని యుద్ధసమయాన నగుభుగుల్ గాను
దుడుము డమాషీలు తుదిమేరలేక
తిడిమి తిడిమిన భూమి దిగులు గొనఁగాను
బరఁగఁ దుపాకులబలము లందఱును
యాదవుల యావుల యెద్దులమీఁద
గుబగుబ యని ధర గుబ్బటిలఁగాను
వెసఁ దుపాకులు గాల్చి రెడము లేకుండఁ
వాడిబడి యామీఁదఁ దుపాకిగుండ్లు
వడగండ్లఁ దొలకరివానవిధమున
దొడిబడ గురిసెను తుపాకిగుండ్లు
విలుమూకవారలు వేగంబె కదిసి
తెలివైనయమ్ములఁ దెగనిండఁ దీసి
బాణాలు వంద లైఁ బరువడి సేసె
మంచువలె బాణాలు ముంచెను మంద

కుంభినిమీఁదను ఘోరయుద్ధంబు
యిలపాలె యనుచు నాయీలెలవారు
పరువడిసేయుచు బారు లేర్పడుచు
నంతట జగడంబు నటు సేయఁగాను
నెద్దులు నావులు వెఱపింత లేక
నేమిచేసినగాని యెదురెక్కిరాక
పల్లికొండసెలవుకై పాయక జూచు
నెద్దులావులనీతి నెఱుఁగంగ లేక
పాపసిద్ధిరాజుబలము లందఱును
మనమునఁ దలపోసి మఱియు ని ట్లనిరి
మనమెున లనికిని మఱి కదిసినారు
యాదవు లని కెదు రెక్కి రా రైరి
సద్దుఁ దెలియక పిల్చి సంధ్యగోపాలుఁ
బాపసిద్ధిరాజు పరఁగ ని ట్లడిగె
'బరఁగ మనదళములు పరువడిసేసి
మందపైఁ దుపాకి మందుగుండులను
నెడపక బాణాలు వెసఁ గాల్చి విడువ
నెదు రెక్కి రామికి నేమి కారణము'
విని సంధ్యగోపాలు విన్నపము సేసె

## సంధ్యగోపాలుఁడు పాపసిద్ధికి సమయము చెప్పుట

'విను రాజశేఖరా ! వివరమంతయును
బరఁగ యాదవులకుఁ బల్లికొండఁ గలఁడు
ఘనుఁడు నాతం డనాగతములు తెలియు
వెలయు పల్లికొండ యేమ్యముల్ తెలియు
పల్లికొండసెలవులేక పను లేవి కావు
దినదిన మెవరికి దృష్టి నూహించి
పంపు లేర్పచునో పనిగొంద్రు వారు
చల్లవారు బొల్లావు సరఁగ బీరినేఁడు
అయితన్న యాదవు లంద ఱిదివఱకుఁ
బల్లికొండ సెప్పినపంపున నాజి

సేసిరి యీవేళ సెలవు గాలేదు
ఆవులు నెద్దులు యాదవు లిపుడు
పైన మైయున్నారు పౌజులఁ గూల్పఁ
బల్లికొండ సెలవులేక పైకిరాలేదు
పల్లికొండ నలనన్న పద్మనాయుండు
నెద్దులకు సెలవిత్తు రేన్గులఁ జంప
నావులకు సెలవిత్తు రశ్వాలఁ గూల్ప
హాతముసేతురు భటుల యాదవఘనులు
ఇవుడు వారికి సెలవు నిచ్చుచున్నారు'
అని యిట్లు పంతము లటు సెప్పగాను
నావరివారంబు నాశ్చర్యమంది
వీరనాయకులెల్ల నిట్లని రంత

## సంధ్యగోపాలుని మాటలకు వీరులు చప్పరించుట

'వరగంగ సంధ్యగోపాల! చెప్పితివి
పంతంబు బొల్లావుపంతంబు నాఁడు
అటువంటి యావు లని యమరఁ జెప్పితివి
బొల్లావురూపంబు పోల్చి వెదికినను
వక్క_లైనను లేదు వనరంగ వినుము
ఆవులమందపై నరయ మనదళము
కడఁగి తుపాకులఁ గాల్చిన యపుడె
మిట్టి చూచియు నవి యిర్రులభంగి
బాణాలవ్రేటుకుఁ బరఁగ నుఱుకంగ
దొడ్డిఁ దోలినయట్లు తోలఁగి పోవంగ
మల్లించకుండేను మలలకు నుఱుకు
పూరగంజి యావులతో సంధ్యగోపాల
చాలించు పంతంబు చక్క_గాదనిరి
యేమి దోఁచక రాజు పేమనకుండ
మది నుచ్ఛ్వసించుచు మఱి యుండఁగాను
గొల్ల కువ......గుంపులై రంత

నల్లంతటను నిల్చి యావులఁ జూచి
రాజుసముఖంబున రాణువ లెల్ల
నూరజంగిటి యావులనువార్త నిజమొ
పోల్చి చూడంగను బొల్లావువంటి
దొక్కటి యున్నను దక్కువ లేక
దళములఁ గదిసియుఁ దల లూడఁ దన్ను
నేన్గుల నశ్వాల నెడలేక చంపు
నందఱి నీవేళ హతముగాఁగూల్చు
నమరంగ నీయెద్దు లావు లన్నిటిని
మలుపుదురు 'ఛే' యని మఱి చిన్నవాండ్రు
అటు తోలి తెత్తురు అన్ని మేపుకొని
పణతులు కట్టుదురు పాడావు లన్ని
దొరకినవానిని దొడ్లఁ బెట్టుదురు
తమలోన నీరీతిఁ దలపోత సేసి
పోటుకాండురవలె బోరున మనము
గొల్లల మందంబె కొల్లకువ......
...ట్టు టావుల తాళ్లు పట్టుకోరాక
దం డైనసరదార్ల దళములఁ జూచి
యిలవర గండరాజింటికి పోయి
యీబె బోతే మాడ యిత్తు మని వస్తి
మాడ గానక పోదు మఱియీబె పోతె
తలకోలలను గాని తర్లించలేము
ఆవులు దొరకితే యవి లక్షసేయు
నని విచారము సేసి యాయీబె లన్ని
మట్టుగాఁ దలకోలలు మఱి సేతు మనుచు
రాళ్ల సందునఁ బెట్టి రయమున విఱిచి
కాళ్లఁ ద్రొక్కియుఁ బట్టి గడలను వంచి
తాళ్లు లేవా యని తలపోఁత సేసి
కొంత ధట్టీ లన్ని గొబ్బునఁ జించి
చేతాళ్లు పేనిరి చెలరేఁగి యంత
దలకోలలు చేఁబట్టి దాయంగవచ్చి

పోల్చి యావులఁ జూచి పొసఁగ నిట్లనిరి
పయ్యావు నా దని పలికెను నొకఁడు
నల్లపొడలయావు నా దనె నొకఁడు
పుల్లావు నా దని పోల్చెను నొకఁడు
మైలావు నాదని మఱి పల్కె నొకఁడు
నీరీతి బోల్చుచు వెలయ నుబ్బుచును
బారుగా నిలిచియుఁ బట్టుక యెత్తఁ
దలకోలలను జూచి త్వరితముగ లేచి

## ఆవులు, లేగలు అందఱిని అదిరించుట

జిఱకొట్టి యావులు చీదర రేగి
త్రాచుఁబాములరీతిఁ దఱుమంగ సాగె
దలకోలను విడచి తల కొకదారి
మొనసి యుఱికెడువారి మోరెత్తి చూచు
చుండ నావులఁ జూచి యుర్వీశుబలము
అల్లకల్లోల మై యటు పాఱిపోయెఁ
కొల్లకాండురమూక గుంపు లై యుఱికి
యాడ మొత్తము గూడి యాడి రొకమాట
పంతంబు సంధ్యగోపాలుండు సెప్పఁ
బంతంబు గా దని పరివార మెల్ల
నవి యూరజంగు లని యావులఁ బట్టఁ
దలకోలలుగ వించి తగ నీఱు లన్ని
యావులు నెదు రెక్కె నవి యాడ వేసి
వేగ రాకున్నను బెంచులుగఁ ద్రొక్కఁ
జెక్కులు డొక్కలు చినఁగఁ గొందఱిని
దొరకొని పొడుచును తొందరగాను
ప్రాణాలు దక్కంగఁ బరుగున వస్తి
మని యిట్లు వా రంత ననుచుండఁగాను
నావులలేగలు నాడుచు నుండి
చెల్లాట లాడుచుఁ జెంగలింపుచును

నావుల నెడబాసి యాడుచు నుండె
జిన్ని లేగలఁ జూచి చేరువకాంగ్రు
ముదమొంది నాయకుల్ మొనసి యి ట్లనిరి :
'అన్నలు ! మీ కింత యాపద యేల
యావులన్ని మనకు హ స్తగత మాయె
దూరాన నున్నవి త్రుళ్ళుచు లేగ
లావులఁ గలియక యడ్డము పోయి
లేగలఁ గొనవచ్చు లేశమాత్రమునఁ
దగ వీనిఁ దోలితేఁ దల్లు లన్నియును
దమకుఁ దామే వచ్చుఁ దావులు విడిచి
నాగుర్లుఁ గొట్టుచు నవె వచ్చు ననుచుఁ
బడ గొట్టకుఁడి వానిఁ దడగడలతోను
సూక్ష్మ మాసన్నపుఁజువ్వలతోను
నావులఁ దోలుద మనుచు నందఱును
హేపెట్టి తోలంగ నెగిరె లేగలును
సేనలు తోలంగ చెలరేగి మించి
జిఱకొట్టి యావులు చిర్రుముర్రాడి
పట్టి తోలు మనుబలముల గదిసి
చెలరేఁగి లేగల చెంగలింపుచును
గ్రేవుల నటు ద్రొక్కఁ గిఱురుపడె దళము
ఆ గర్రు గే యని యఱచెఁ దఱుపులు
లేగలు పరుగున లేకుండ పోయె
మేదినిపైఁ జూచి మెం డైనదళముఁ
దాటించి తన్నినఁ దల లూడి పడెను
గాలు దాటింపుచుఁ గడు వేగ నెగసి
లేళ్ళపై సింహముల్ లేచినయట్లు
లెడపక పగతుర యెదములు పగుల
దన్నుచుఁ ద్రొక్కుచు దళములు గూల్చి
నాలుకల్ చాచియు నతికోపమునను
బగవారు శత్రులు పట్ట వచ్చినను
నుఱికి తలపునుకలు నూడిపడఁ దన్ను

నక్కుడెక్కుడె శత్రు లరికట్టఁ బోవ
నామూాల నీమూాల నదిరిపడఁ దన్నె
ధేనువులకడపోను దెసఁవ లేదాయె
ఎదిరించి లేగలు వెసఁ గూల్చె భువిని
బొట్రేళ్లవలెఁ దాకి పోరు చేసినవి
లేగలే గద పట్టలేమా యటంచు
ఆశకు వచ్చిన యా కొల్లదండు
రోషించి లేగలు రూపు మాయించె
గొదకొని లేగలు ఘోరించఁగాను
బద్మనాయుఁడు రాజు పల్లికొండెతోను
మఱి వేగ సిద్ధిరాజు మందపైఁ గదియ
నెద్దులావులు తెరలి యే తెంబోవు
చెల్లాట లాడుచుఁ జెంత నుండెగను
బగదళిము చుట్టుకొని పట్టఁ జూడెంగ
కోపించి లేగలఁ గొట్టి మిట్టాడి
చుట్టినదళిముల సుడివడె జంపి
యూగుర్రు గే యని యట్లు పిలిచినను
సెలవు లే కావులు చేరంగ బోవు
ఎద్దులావులకును నేర్పరుపు పంపు
మిప్పు డెవ్వరిమీఁద నెదిరి.పవలెను
సెలవిచ్చి పంపు మని చెప్పెను రాజు

## పల్లికొండ ఎర్రయ్యతో పంపు లేర్పరచుట

పల్లికొండయు లేచి పంపు లేర్పఱిచెఁ
జేర్పెర నలనన్న పిలిచె నందఱిని
తమ్ముని నెర్రయ్య దాయంగఁ బిలిచి
మఱఁదిని నెర్రయ్య మఱివేగఁ బిలిచి
యిద్దఱు నిలిచియు యుద్ధంబు సేయుఁ
డని చెప్పి యిరువురి నటు కౌగిలించి
'మాకోరెౕ పగఱపై మనసు రంజిల్ల
మించి పగతురమెదడు మేదినిమీఁదఁ

గుప్పలుగ రాలంగ ఘోరయుద్ధంబు
ఓ తమ్ముఁడా! మఱఁది! యువయూ_స్తమానము
సీతాపతికృపను సేయుఁ డాలంబు
నెద్దుల డీకొల్పి యశ్వాలఁ బొడువు:
డామీఁద పౌజుల హాతము సేయుండి'
యని సెలవిచ్చిన నాపల్లికొండ
యెరనన్న యెఱ్ఱయ్య వేడుకతోను
మ్రొక్కిరి వేగమే మోదముతోను
అతివేగ రణమున కాయిత్తుపడిరి
అప్పుడు కట్టిరి హానుమంతకాసె
వీరు లై తలజడల్ వీరజడ లల్లి
విరజాజులను నతివేగ ధరించి
మెడఁ బూఁబు గందంబు మేలుహారములు
శరకుంతములు చేత జక్కఁగా బట్టి
బెజవాడ బెబ్బులి పెయ్య లెర్రయ్య
వేడుకతో రణవీధి కేతెంచి
యెర్రయ్య చట్టువారి యెర్రయ్య యంత
నవరత్నములభూషణంబులు దాల్చి
కరమొప్ప నొకపెనుగద దీసికొనియు
నరులతోఁ బోరాడ నప్పు డేతెంచెఁ
బశుభాష దెలిసినపరమపుణ్యుండు
పశువులలో నిల్చి పగతురమీఁదఁ
బయనంబు గ మ్మని భావంబు దెలిపె
నావుకు హరిమంత్రం యెద్దుకు గురుమంత్రం
వినిపించె వీనుల కిదిమోక్ష మనుచు
గుఱి దెలిసి యెద్దులు గుప్పున లేచె
యాత్మభావము దెలిసి యవి లేచె ననుచు
నప్పుడు పగదళము హాతముగాఁ జంప
పల్లికొండ చెప్పినపంపకము తెలుప
నన్నిటిఁ జేర్పెర నావులఁ బిలిచి
పల్లవరాజులబలములపైకి

హెచ్చరికతో నిల్చి యెద్దులావులను
భీకరలీలతోఁ బృథివి కంపింప
బాగుగా డీకొల్పె బలములమీఁద

## ఎఱ్ఱయ్య యెద్దుల నాహ్వానించుట

'సురభిధేనువులార! సురకాంతలార!
కరుణతో మాపాలఁ గలిగితి రైన
వచ్చినదళముపై వడి నుగ్రు లగుచు
నిప్పుడు డీకొని యిలఁ గూల్చ వలయు
వాహిని సిద్ధిరాజు వచ్చినదండు
రాశిగ రంపమారై వడ బొడువు
శ్రీకంఠము రాజు సేన లేతెంచు
నేకామ్రనాథుని నెదిరించి పొడువు
గుత్తి గుఱ్ఱముకొండ కూటువమూకఁ
బ్రహ్లాదు కొఱకయి పరఁగ చీరినటు
లల నృసింహుండవై యరలేక చంపు
కుంభకోణముమూక గూడెను దండు
సరగ సోమకు నసురుఁ జంపినయట్లు
జాంబవనాథ! నీవు చక్కఁగా గూల్చు
మారొక్కన వచ్చెను మళయాళదండు
బలిమి భూమిని నడ్గి పాతాళమునకు
నణఁగఁ ద్రొక్కినయట్టి హరికృపవలెను
కోరొక్కండ గిరినాథు ఘోరించు పగఱ
మట్టి నుఱుమాడవలె మాయగా నిపుడు
కాశ్మీరదళములు గడికొని వచ్చెఁ
గడు పరశురాముఁడు కార్తవీర్యునిని
వేయు శిరములు ద్రుంచువిధమున నిపుడు
హరిమల్లె చెన్నుఁడా! యదిరిపడఁ బొడువు
వేవేగ నల్లమల యెఱ్ఱమలనుండి
వచ్చిరి తుపాకి వరుస నాయకులు

రామునికృపచేఁత రావణుమీఁదఁ
బరఁగ శ్రీరాముండు పంపైనయట్లు
గొడుగు మల్లె చెన్నఁడా! ఘోరించి పొడువు
మదగజంబులు చాల మందపై వచ్చె
మధురలో కృష్ణుండు మామ కంసుణ్ణి
తల విదళించినటు తడవు సేయకను
కదిరి యోబలనాథ! కల్లుగా జంపు
పుల్లెద్దు మట్టెద్దు పురహరుఁడు బసువన్న
కల్లగాదు నేఁడు కట్టడి మనకు
కటకము జగన్నాథుకరుణను మీరు
యెద్దుల నుసికొల్పి యెనయ దీవించి
యావులఁ బిలిచెను నతివేగమునను

## ఎర్రయ్య ఆవుల నాహ్వానించుట

నాఱురాజ్యపుమూఁక లాదుకొని వచ్చె
సొచ్చి పొడుతువు రావె సొగల నెవలి!
మొరసరాజ్యపుమూఁక మునుకొనివచ్చె
భాగీరథీ గంగ! బలముతోఁ బొడువు
వాగర్తమూఁకలు వచ్చెను దండు
శ్రీలక్ష్మి! గుర్రాలఁ జీఱుదు రమ్మ
గోదావరీ! రమ్మ గొంతి గాంధారి!
భూదేవి! సరస్వతి! పొందుగా రమ్మ--
భూతేశ! యోగిరిజ! భూమి దేవమ్మ!
భైరవి! విరాళి! భద్రగిరి వినుత!
దుర్గ! మహంకాళి! దుందుభి! రావె
సౌమిత్రి! జాంబవతి! సౌభద్రు దేవి!
కౌసల్య! రేవతి! కాళింది! రమ్మ
ధర్మదేవత! చంద్ర తగమతి దేవి!
పార్వతమ్మా! రావె భద్రకాళెమ్మా!
పద్మాక్షి! రావమ్మ పాంచాలి! రమ్మ
అహల్య! రావమ్మ అరుంధతి దేవి!

అమ్మ సీతా ! రావె అంజనీదేవి !
పాలపెద్దా ! రావె పావని ! రమ్మ
త్రిపుర సంహారి ! యో దివ్యాంబ ! రమ్మ
దివ్య తేజము గల దీపమా ! రమ్ము
భోగవతీ ! రమ్ము బొండుమల్లె ! రమ్మ
గాంధారి ! రావమ్మ కయ్యమ్ము సేయ
వైనముగ నిఁక బిల్వ వడిఁ బ్రొద్దు లేదు
అన్ని యావులఁ బిల్చి హస్తము లెత్తి
మ్రొక్కి పగతురఁ జూపె మొనసి యిర్గడల
సెలకోల యెత్తినఁ జెర్లించి లేచె

## ఆవులు యెద్దులు యుద్ధము సేయుట

నాగుఁబాములరీతి నల్లావు లెల్ల
బంపుల నేర్పడి ప్రఖ్యాతిగాను
రాజేంద్రునశ్వబారముల చేర్చినటు
లుండంగ నావుఃలు నుఱిమి జూచుచును
పోడెంబు ద్రొక్కుచుఁ బొంకాన మెఱసి
జడుపును వెఱపును శంకయు లేక
పొడువు చంపుము త్రుంపు పోరాడు మంచు
నెద్దులు చెలరేఁగె నేన్గులమీద
దంతిఘటములతోఁ దగిలి పోరాడి
కొమ్మునఁ జిమ్మినఁ గుంభముల్ పగిలి
యేనుఁగు లన్నియు నిలఁ గూలిపోయె
ముమ్మరముగ నెద్దులు మొత్తముగ గూడి
చిమ్మి యేన్గులఁ గూల్చి చీదరరేఁగి
యెర్రయ్య చూడంగ నెగసి మావటులఁ
దల లూడఁ దన్నుచుఁ దగఁ బొడ్చి చంపు
గుఱ్ఱాలమీదను గొదకొని కదిసి
నల్లావు లన్నియు నతికోపమునను
బాదముల్ తాటించి వాలంబు లెత్తి

చెలఁగి రోషంబునఁ జెవులు రిక్కించి
తురగంబులను బొడిచెఁ దుదిపదము గాను
వెనువెంట నెర్రయ్య వెసకొల్పుచున్న
చంగలింపుచు నెగసి శంకయేలేక
అశ్వాల రౌతుల నటు తన్నగాను
తన్నుకుఁ దల లన్ని తల్లడిల్లుచును
నఱచుచు ధరణిపై నన్నియు వ్రాలి
అగచాట్లు పడుచుండె నాతల లన్ని
బావ మఱఁది చూచి పకపక నగుచు
నడచె శిరసులపైని నర్రావులెల్ల
నశ్వాల కెదు రెక్కి హతము సేయంగ
నలుగులెద్దులు నేను సాహసంబునను
జెక్కిళ్లఁ బొడిచినఁ జెవులకు దూరు
పక్కలఁ బొడిచిన బరులకు వెడలుఁ
గుతికెలఁ బొడిచిన గొంతులు చినుగు
వెన్నునగొమ్ములు వెళ్ల గుమ్ముచును
బకాళించి తన్నఁ గుంభఁబులు పగిలి
మొదడు కుప్పలు గాఁగ మేదినిమీఁద
నెరసన్న యెర్రయ్య వేడుకపడుచుఁ
గరుల నుఱుమాడుచుఁ గలనిలోపలను
గాలావు లెద్దులుఁ గలను సేయంగ
నెరసన్న యెర్రయ్య వెసకొల్పఁగాను
జూచి పాపసిద్ధి చోద్యపడుకొనుచు
నేన్గులు గుర్రాలు నేకముగ నొఱుగ
దళవాయిలను బిలిచి దాని జూపించి
పలికె నిట్లనిరాజు పరువడితోను
'పరఁగంగ సంధ్యగోపాలునిమాట
కడువేగఁ బలికితిర కల్లని మీర
లెద్దు లావులు గూల్చె నేన్గులశ్వాల
దళములపైఁ గదిసి త్రొచులభంగి

నందఱుఁ గదిసియు హతము సేయువలె
నని చెప్పఁ దుపాకు లగుభుగుల్గాను
నెద్దులావులమీఁద నెడము లేకుండ
రయమునఁ గాల్చిరి రణగొల్లుగాను
రణము రణ మటంచు రణభేరి వేసి
కదిసిరి యీటెల కత్తులవారు
మందపై విలుమూఁక మంచుచందానఁ
జెలఁగి సమరము చేసి చెదరక నిలిచె
సలుసెద్దులు పగఱ సరికొని పోర
నెఱనన్న యెర్రయ్య వేడుకపడుచు
బావమఱందులు భావంబు పొల్చి
పరఁగంగ గోపాబె ప్రళయవాయువుగఁ
జాయల బల్లాలు జళిపించి తళుకు
గణుతింపఁ దీగ్గలై ఘనమెఱుపు లయ్యె
నెసఁగ సూర్యపుటాలు నింద్రచాపముగ
వడి తుపాకీగుండ్లు వడగండ్లు గాఁగ
సిద్ధిరాజు సేనలు చెలరేఁగి యప్పు
డీరీతి భావమున నెడము లేకుండ
సాహసంబున నాలఁ జలరేగి పొడిచి
కదిసి గోవులు పొడువఁ గడు నొఱగువారు
కలసి విల్మూకలు కయ్యంబులోను
నెద్దులావులమీఁద నెడము లేకుండఁ
బరఁగఁ గురియింపంగఁ బంతపు బసలు
గొదకొని చెలరేఁగి గోవులు పొడిచె
కదిసి గోవులఁ బొడిచి కాల్బల మొఱగె
కదిసి విల్మూకలు కయ్యంబులోను
గోవుల యెద్దుల గోపకులమీఁద
నెడలేక బాణాలు వెస గురియించి
గొదకొని యశ్వాలఁ గొమ్ములేన్గులను
గూలిచె నావులు ఘోరరణమందు

## ఆవులెద్దులపోరునకు దేవతలు హర్షించుట

హరిహరుల్ దేవత లటు మహామునులు
ఋషులు కిన్నరులును రూఢిగాఁ జూచి
యెద్దుల పోరుకు వేడుకపడిరి
ఆవులెద్దులమీఁదఁ బూవులవాన
హరిహరుల్ గురియించి రక్షత లిడిరి
మఱి సంతసంబున మది నెద్దులావు
లక్షతల్ వేయంగ హరిహరుల్ మీఁదఁ
బాపంబు వీడెను బరము సిద్ధించె
ననుచు సంతోషించు నావులమీఁది
వేసుచు నున్నట్టియెద్దులమీఁద
సమయంగఁ జిక్కిన సాహసుల్ కదిసి
వేసినబాణాలు వెలయు నంబులును
నెడలేక వేసిరి నేనువిధములను
నెద్దులావుల కన్ని యెడలేక నాటె
ఘనమైనయెద్దుల గాయాలు నాటె
దానవింటికోలలు తొడల సరికట్టె
నేనుఁగులు చంపంగ నెద్దులు నొఱఁగె
నంపకోలలు నాటె నాలంబునందు
భోరుభోరున నార్చెఁ బొడితేగ లెల్లఁ
జెదరక యేన్గుల జెర్లించి పొడిచె
నలుగుటెద్దులు నొఱగె సమరంబులోను
నంతట గోపాలు రావులచేత
నెంతయుఁ బగఱను బంటింబు మీఱి
దళమును నేన్గులఁ దగఁగ నశ్వాల
గూల్చిరి రణమందుఁ గొదువ లేకుండ
నెదిరించుదళమున నెల్లరను గూల్చి
యెద్దులావులు నొఱగెఁ బద్దులు జెల్లఁ
దలపోసి యెఱ్రయ్య తడ వాయె ననుచుఁ

## యెఱ్ఱయ్య కలియఁబడి పాపసిద్ధిపనిబట్టుట

గదిసెను వగఱపైఁ గయ్యంబు సేయఁ
గోర్కెతో జగజంపుగొడుగులనీడ
సిద్ధిరాజుల వెంట శ్రీకంఠరాజు
పన్నిద్దఱు దళవాయులు బారులై యుండ
మదపుటేన్గుల రేచి మావటులఁ జూచి
వడి నగుచును జట్టువారి యెఱ్ఱన్న
అధికశూరులమీఁద నప్పుడు గదిసె
మహిపాలకునియొద్ద మదపుటేన్గులకు
నాయుధాల్ కొమ్ములకు నమరించి కట్టి
కడువేగ గొలుసులు గట్టి తొండాల
ఘోరాజి డీకొల్పి కొమ్ముటేనుగుల
మదగజంబులమీఁద మఱి యెరనన్న
గద తీసికొని కదిసి గమకించిదూకి
చేరి బలశాలులకు శంకయే లేక
మొఁడొడ్డునేన్గుల మించి గద యెత్తి
యప్పుడు కదిసి రహంకారు లఁసుచు
పిడుగుతో సరి యైనపెనుగదతోను
ఘట్టించి యేన్గుల డాసి కొట్టినను
కుంభస్థలాల్ పగిలి కుంజరా లొఱఁగ
ఆవుతెఱ్ఱయు చట్టువారి యెఱ్ఱన్న
ఆవుపైఁ జెలరేగి హాగ్రులై మండి
వడి శిరసుపై పూని వజ్రాయుధంబు
భీకరశక్తితోఁ బెఱికి పడవైచి
శ్రీకంఠరాజును జెల్లించి రంత
బావమఱందులు పాపసిద్ధిఁ జూచి
కయ్యంబుసేయను గదిసి రావలెను
పరఁగఁ గరిపైనుండి పాపసిద్ధిరాజు
కదిసినవారిపైఁ గరిని డీకొల్పి
ఆగ్రులై కదిసిరి యవని ఘూర్ణిల్ల

సాహసుల్ డీకొన్న చందంబు వీర
తమకముపై నుండి తగ నలనన్న
చూచి వేసుకపడఁగఁ జోద్యంబుగాను
పింజ పింజ గదిసి పృథ్వి గంపింపఁ
గను వచ్చుబాణాలు గద నెగదట్టి
భీకరలీలఁతోఁ బెనుగద యెత్తి
కొట్టిరి రిపులను గుట్టలై కూల
గంజిల్లసాగిరి రణవీధిలోను
లక్ష్మణుండు కదిసి లంకపై నాఁడు
వేగ రావణుమీఁద నెదిరించినట్లు
ఆ రాజుపై యుద్ధ మటు సేయగాను
సురలెల్ల దివినుండి చోద్యపడఁగాను
తఱు చైనయంబులు తడవు లేకుండఁ
వడగండ్లచందాన వడి గురియంగఁ
బనివడి పోరాడి పాపసిద్ధిరాజుఁ
జేరి యా యెర్రన్న శిర మంటఁబొడిచె
నప్పుడు యెర్రన్న అంబులు తొడిగి
వైచిన గజమును వసుధపై నొరగె
రాజు సిద్ధిరాజును రణమందుఁ గూల్చి
తక్కినబలములు తందర లాడఁ
జిక్కినబలములఁ జీరి రణమందు
నెదురురొమ్ముపోట్లతో నేకాంగి వీరులై
చెదరక నిలిచిరి సేనలందరును
గోపాలు లొరిగిరి గోవ్రలు మడిసెఁ
బరఁగ నంతటికిని భానుఁడు గ్రుంకె

నలనన్న యెర్రయ్యలు సేదదీర్చుకొని నలసిద్ధిపై పోఁబోవుట

మగుడివచ్చిరి వారు మందలోపలికి
నని గెల్చి యిద్దఱు నావులన్నెదుట
నిట్టూర్పు లూర్పుచు నిలిచి రిద్దఱును
గనుగొని నలనన్న కౌఁగిలించుకొని

మునుపటితమ్ముల ముందర నుంచె
గాయాల శ్రీతులసి గట్టించె నర్థి
గొదకొని యిద్దఱేఁ గూర్చుండ నుంచె
బల్లికొండయు రాజు బంధువర్గంబు
శివపురాణము నేకచిత్తాన వినుచు
శివరాత్రి జాగరము చేసినయట్లు
అతివేడ్కతో వినుచు నాత్మ రంజిల్ల
దాను వేఁడుచు శివునిఁ దనలోనఁ గనుచు
నతివేడ్కతో నన్న నర్కుండు పొడిచె
నంతట మఱునాఁడు అమావాస్యనాఁడు
పంతపునలసిద్ధిబారు లేతెంచె
గడువేగ నెదిరించి కాటమరాజు
పద్మనాయఁడుఁ దాను బైనముగాను
గట్టిరి హనుమంతకాసెలు నేగ
హనుమంతకాసెపై శేమంతముండ్లు
చేమంతిబంతులు చెలఁగుచు వేసి
కనకవడ్డాణంబు కట్టిరి మీఁద
మేలుతుమ్మెదరెక్కమీఁటినవన్నె
సంపెఁగ నూనెచే వంపించి కురులు
వీరజడ లల్లిరి వేడుకపడుచు
ముడిచిరి గేదగుల్ ముంచుకొని యుండ
ఫాలమునఁ గస్తూరి బాగుగా దిద్ది
పచ్చలపులిగోరుపతకముల్ దాల్చి
సన్నపురుద్రాక్షసరులు ధరించి
వన్నెగా బిరుదులు వరుస ధరించి
చల్లవారి పుల్లైదు సలుగుబెద్దులకుఁ
గొమ్ములకుఁ గుందనపుఁ గుప్పెలు దాపి
ఘంటలు మెడ బొడ్డుగంట ధరించె
పంచవన్నెజల్లులు పట్టెండ్లు వేసె
ముత్యాలుదాపిన మువ్వాలు దాల్చె
నాలుగు కాళ్లను నాదుటందెలను

శంఖుచక్రంబులఁ జెవుల నమరించి
శివనందులగుడార చిఱునవ్వుతోను
బరఁగఁ గోరిక దీరఁ బల్లికొండ జూచి
తా నున్నయట్టియా తమకము పైకి
మానవేశ్వరుఁ డైనమాధవుఁ డంత
నల్ల రఘుపతిఁ బిల్చి యప్పు డి ట్లనియె

భక్తిరన్న రాలేదని పశువులన్న తలపోయుట

"పల్లికొండ! రఘుపతి! బావరో! కావ!
అన్నిట సంతోష మమర-గ వినవు
ఈవేళ భక్తిరన యెన్న లే డాయె
చెలఁగి యా కురురాజు సేనలరీతి
నలసిద్ధిరాజుల బలములతోను
నల యెద్దులావులు నని సేయువిధము
కన్నులఁ జూడంగఁ గారణము లేదు
నేఁటికి రాడాయె నేనేమి సేతు
మనసుదీఱఁగ నేను మఱి సిద్ధిరాజు
శరములచే వాని శిరము ఖండించి
పగవానిశిరసును బాదకానుకగఁ
బ్రియమార గంగకుఁ బెట్టువే ళాయె
హరిహరబ్రహ్మాదు లమర దేవతలు
సురలోకమున నుండి చూచుచున్నారు
ఇంతలో బత్తిరన యిటకు వచ్చెడునో
బావరో! తెలుపుమీ పంతంపుమాట"
విని పల్లికొండయు విస్మయం బంది

భక్తిరన్నరాకనుగూర్చి పల్లికొండ చెప్పుట

"మఱఁది! కాటమరాజు! మఱి వినుము వార్త
యీ జగడము భక్తుఁ డెఱుఁగఁ డిన్నాళ్లు
దశమి యేకాదశి ద్వాదశి మొదలు

నీశ్వరు పూజలో నేకచిత్తమున
నున్నవా తెలుఁగుచు నాగిని బెద్దలకు
నక్కడ మోక్షంబు నందించు వేళఁ
గదిసి పగతురఁ జంపఁ గార్యము నీకు
నెనయుఁ దుదియుద్ధ మీా యెఱగడ్డపాటఁ
బరశు ఖండివాల పట్టిసంబులను
బగతుర పై నెల్లఁ బరఁగ డీకొల్పి
చే సేటియుద్ధము చెల్లేటిబలము
కాశిలో యుద్ధము కానవచ్చెని
అప్పుడు భక్తిరస యా విశ్వనాథు
కొప్పుగా సాష్టాంగ మొనరంగ జేసి
వేవేగ దానకొండ వెంచేయు నతఁడు
కనకరథమున వచ్చుఁ గాటమురాజ!
కాశితీర్థంబును గయ నున్నభూతి
దేశయాత్రలు చేసి దెచ్చెని యిటకు
బరఁగ మున్నూరు నెన్బది యామడలను
నేట రేపటఁ గాని నెళవుగా రాఁడు
భక్తుండు లేఁ డను భ్రమ నీ కదేల?
నీయన్న యున్నట్టి నెఱిఁ దోఁచు నాకు
నిరువంశముల వారి కిహపరము లీయ
నరిగెను భక్తుండు యాత్ర కుత్తరము
ఆవుల మేపంగ నరుదెంచి తీవు
పగలు చేకూరెను పశుపతిరాజ!
నీవు నీ పగతుర నిర్జించువఱకుఁ
దల్లివంకవారిని దండ్రివంకవారి
నేడుతరములవారి వెంటఁ బెట్టుకొని
భక్తుఁడు వచ్చెని పగ సంహరించు"
పల్లికొండ మాటకుఁ బశుపతి నవ్వి
విన్నపం బున్నది విను మని పలికె

## పశుపతి పల్లికొండసెలవు వేడుట

"పరమోపకారు లని పరఁగ యాదవులు
తరతరములనుండి ధాత్రిలోపలను
బాగడఁబడు చుండఁగఁ బోట్లాట గలిగెఁ
దగినయేలిక లేఁడు ధాత్రి నిన్నాళ్లు
నా పుణ్యవశమున నా కోరినట్లు
నీపాదపద్మముల్ నేఁ జూడగంటి
రాజన్ను గురుడవు రక్షకుఁ డీవు
భానుకులజుం డగుపల్లవరాజు
ఏనుగుఘటలతో నెదిరించినాఁడు
ఎదిరించి యనిసేయ నే దుపాయంబు
కదనంబు చేసేటిక్రమ మెల్ల నేఁడు
ఈ దైసరాజుతో నిలనాకు గలిగెఁ
దగ మాకు సెలవిచ్చి తమకమునుండి
చూడుమా యో బావ! చోద్యంబు అనక"
అని రాఘవుఁడుఁ దాను నా పల్లికొండకు
వినయులై యనియేక యిష్టముల్ సెప్పి
ముహూర్తమిచ్చినముక్కుమ్మి కుంతంబు
డాచేతఁ గోర్కెతో డయంగఁ బట్టి
ఖడ్గ త్రిశూలముల్ గాండీవ మాది
పగతుర వడిఁ గూల్పఁ బద్మరాఘవుఁడు
కనకసంబులపొది గాజువిల్లందెఁ
గొందఱు కనకపిడికోలలు పట్టి
రందఱు యాదవు లంది కటార్లు
గొనకొని యొకలక్ష గోపకులనడుమ
నా రాముపెండ్లికి నరుగుచందమున
గరిగె పేరంటాలు గంగయు రాఁగఁ
బెనసి త్రిమూర్తులు పెండ్లిపెద్దలుగ
బనివడి శారద పార్వతి లక్ష్మి
దేవతల్ భృత్యులై దివినుండి జూడఁ

కమలాక్షు (శ్రీ)హరికరుణ నారాజు
కనకరథ మితరులకుఁ గానంగరాను
ముచుకొని యమ్మహామునులు దీవింప
నరసి తుంబురు నారదాదులు పొగడఁ
గవగూడి యాదేవకన్యక లంత
కల్యాణమే గౌరికల్యాణ మనుచు
మంగళ శుభకార్య మైపట్టిరాజు
చెలఁగుచు నేతెర నమరంబు మెఱసి
బాజాబజంత్రీలు పంచవాద్యములు
త్రిజగంబు లెల్లను దిగులుకొనంగ
నవపాజగొడుగుల నలనన్న గదలెఁ

## నలనన్న రణమునకు నడచుట

బడగలు గొడుగు లుభయపార్శ్వములను
మెఱయుచుఁ బట్టిరి మేలు మే లనుచు
నడుమను బసువన్న నాది నాఁ గదలె
బలసి యిర్వంకలఁ బ్రమథులవలెను
సలుగు బిడ్డలు గదలె సాహసము మెఱసి
ఛత్రచామరములు చేరి పట్టంగ
వెంట వింజామరల్ వేయుచు నుండ
నాలవట్టము రాజు కావలీవలను
సింహతలాటముల్ చేరి పట్టంగ
భూచక్రగొడుగులు పొసగఁ బట్టంగ
నసురతలాటముల్ హనుమంతుపడగ
ముందర రణభేరి......
నరగలు పీరెలు నాగసరములును
గమ్మున మ్రోయంగఁ గదలెను రాజు
కత్తళీఁడు నలనన్న కదలి రాఁగాను
గణఁకతోఁ గదలెను గాంతిచంద్రుండు
ప్రళయాంతకునిఁబోలి పద్మజుఁబోలి

నలసిద్ధిరాజుతో నని సేయఁ బూని
నిలిచె గొడుగులనీడ నీలవర్ణుండు
సేనలు నల్గడలఁ జేరి కొలువంగ
గజముపై సిద్ధిరాజు కనుగొని చూచి
కాటమరాజును గడు నున్నతంబు
నతనిగాత్రము చూచి యాశ్చర్య మంది

## నలనన్నవిగ్రహమును జూచి నలసిద్ధి యాశ్చర్యపడుట

"యిన్నాళ్లు నీభూమి నేలితిమి మనము
నితనిదొడ్డతనంబు నితనిరాజసము
నెంచి చెప్పంగ లే దెవ్వరు నఘన
ననుకోఁగ విన మైఁతి మాశ్చర్య మాయె
చాతఁ గుంతము పట్టి చను దెంచి నపుడు
ఇతఁడు గొల్లండని యేర్పడెఁ గాక
హాలాయుధము పట్టఁ డాయెను గాక
బలభద్రరాముతోఁ బాటింప దగును
శరచాపముల పీఁడు చేఁ బూని తేను
బరికింప శ్రీరామభద్రుఁ డనవచ్చు
గాండీవశస్త్రముఁల్ కడు లేవు గాని
పాండవార్జునునికిఁ బ్రతి యనవచ్చు
నింతటివానితో యుద్ధంబు సేయఁ
బంతము నిలుచు నని బలములు సనిరి
పంతపునలసిద్ధిప్రభునికిఁ గాక
తక్కినవారికిఁ దరము గా" దనుచు
నన నట్లు పరివార మంతయు బలుక
నినకులాధిపుఁ డైన యాసిద్ధిరాజు
కాటమరాజుతోఁ గయ్యంబు సేయ

## కాటమరాజు నలసిద్ధి కయ్యమున గలియుట

మేటిబలములతోను మొజసి పోరాడ
రామభద్రునిబలము రావణుబలము

కదిసినచందానఁ గాటమరాజు
షాంమగాఁగను నిల్చి పోల్చి మదియందుఁ
బేరుసాగినయెల్లు పెండ్లిపెద్దలుగ
పేరు గలబసవన్న పెండ్లికొడుకునుగ
బుధుఁడు బృహస్పతి పురోహితులు గాఁగ
పృథివి నెరగడ్డపాడు పెండ్లియరుగనుగ
శ్రీదేవి శ్రీకాంత సేసలు చల్లఁ
గడఁగి పేరంటాలు గంగయు గాఁగఁ
బశుపతి నలనన్న పద్మరాఘవుఁడు
పేర్మి బసువన తోడిపెండ్లికొడు కయ్యె
నిగుడంపుఁదుపాకి సివ్వాలగుండ్లు
నెలమితోఁ బెండ్లికి నెదురుకో ల్లాగ
నార్చివేసెడియంబు లక్షతల్ గాఁగఁ
జబురఖంగులు కాల్చిన సరితాఁకు గుండ్లు
విరజాజిమొగ్గలవేట్లాట గాఁగ
పెడబొబ్బ లూర్పిళ్లు పెద్దరంతులును
బెండ్లిపాటలు గాఁగఁ బృథ్విఁ గంపింప
వడి రక్తధారలు వసంతములు గాఁగఁ
బల్లవరాజును పశుపతిరాజు
పెండ్లికూతు రటంచు పేర్మితో చూచి
కోరి వేడుకపడుచు శూరుఁడై యుండఁ
గదిసి పోరాడుచుఁ గయ్యంబులోను
చెయిచెయి తారసిలి శంకయే లేక
సురియలఁ బోరుదురు శూరులై కొంత
కాలుకాలు పెనసి కలనిలోపలను
బాలుపుగా బాకులఁ బోట్లాడువారు
పండ్లుగీటి కటార్లు పైకొని కదిసి
పిడిగుద్దు లాడేటిబిరుసుమన్నీలు
పరువడి సేయుచుఁ బరఁగ నవ్వుచును
గదిసి సూర్యకటార్లఁ గలనిలోపలను
నోస్వామి యనుచును నారగేటివారు

విల్లునంబులు పూని వేట్లాడువారు
చిల్లకోలంబులు చేరి వేయంగఁ
దూటి యా బాణాలు పరమందు వెళ్లి
సమరంబులోపలఁ జొక్కళించియును
జంజాళములఁ బొడిచి సరి నొరగువారు
కదిసి కత్తులదూసి కినుక సాహసమున
నఱుకుచు నఱుకుచు నరులు పోరుచువారు
పూని యీటెలతోను బోట్లాడువారు
మాఘమాసమున నమావాస్యనాఁడు
మంగళవారాన మహిమ దీపింప
నధికులై పోరిరి యంతకంతకును
హేరాళముగ నుస్సురయా సేనలను
యధికులై యాదవు లతిసంభ్రమమున
శూరులై యుద్ధంబు సేయుచుండఁగను
జల్లవారి పుల్లెద్దు సలుగుటెద్దులును
జెలరేఁగి యెన్నులఁ జెల్లించి పొడిచి
కోలాహలము గాఁగఁ గొమ్ముటేనుఁగుల
సలుగుటెద్దులఁ గొన్ని సమయింపఁగాను
బ్రళయసముద్రుం డగుబసువన్న యపుడు
వరఁగ సిద్ధిరాజును బాలుంగఁ జూచి
దళములపై దూకెఁ దందర చేసి
యాగ్రహుఁడై బసువన్న యాదుకొని కదిసె
బసువన్న మీఁదికి భద్రగజంబు
నెసగంగ డీకొల్పె నా సిద్ధిరాజు
గజము పై కొనిరాఁగఁ గాలు త్రాటించి
నిలిచి అంకెను వేసె నీలకంఠుని గోలి
బసువన్న అంకెకు బట్టపుటేన్గు
గజము సింహముఁ జూచుకై వడి గాఁగ
అఱ్ఱొంచి కొమ్ములు నట్టిట్టు నార్చి
మించి ఘంటల మ్రోఁత మిన్నంది మ్రోయఁ
గాలు దువ్వియు దూకి గజమును బొడిచి

కప్పించి పొడిచినఁ గుంభంబు పగిలి
గజము రక్తము సెలకాల్వచందమునఁ
దప్పక రక్తము ధరణిపైఁ బాఱె
ఘోరున కొండవలె భూమిపై నొఱగె
ధారుణీశ్వరుఁడును ధరణిపై నిలిచెఁ
గదిసె బసువన్నపైఁ గాల్బలంబులును
బసువన్న యిర్గడలఁ బగవారు చేరి
రాదుకొని బసువన్న నంపవర్షంబు
పింజపింజలు కదిసి పెనఁగి వేయంగ
నుగ్రుఁడై నలగన్న యురవడి లేచి
కల్యాణశుభ మనుచుఁ గాటమరాజు
ఎడపక ఘంటల నెత్తి కుంతంబు
జళిపించ నాసూర్యకాంతులు చెదరె
నపుడు తళతళ మెఱయు నవని గంపింప
ఘంటకుంతము జూచి ఘనుఁడు సిద్ధిరాజు
బలము లందఱుఁ జూచి భయ మందగాను
...జా దీసికొని నలసిద్ధిరాజు
కదిసెఁ గాటమరాజుఁ గయ్యంబు సేయ
దక్షుఁడు శంభుండు తారసిలినట్లు
ధరణిగహ్వర మెగయఁ దగను బోరాడి
కడు రామరావణుల్ కదిసిన యట్లు
పృథివి ఘూర్ణిల్లఁగా బోరి రిద్దఱును
మత్స్యంబు మత్స్యంబు మల్లాడినట్లు
వారిధి వారిధి వడిఁ గలిసినట్లు
వడికొని పోరిరి వసుధపై నంత
మేరువు మేరువు తారసిలినట్లు
సాహసంబునఁ బోర సాహసాత్మకులు
ధరణిధూమము నెగసె తందర నొంది
సురలు మూసిరి కండ్లు చోద్యంబు నంది
సూర్యునికిఁ గావురు చుట్టెన ట్లాయెఁ
గడువేగ చంద్రునిఁ గప్పిన ట్లాయె

గాలాంతకునిఁబోలి కాటమరాజు
సిరి లఘువుతోఁ గదిసి సిద్ధిరాజులను
నెదురు రొమ్మునఁ బొడిచె నెగసి కుంతానఁ
గుంతానఁ బొడిచిన గుండెలు పగిలి
రంతుగా నార్చిరి రణవీథిలోను
ననిఁ గూలె రణముపై నలసిద్ధిరాజు
కాటమరాజుకుఁ గాయము కనుక
నారగుచు నలసన్న నురమునఁ బొడువ
గాటమరాజుకు గాయాలు తగిలె
నంతట సిద్ధిరాజు హాత మాయె నపుడు

## సిద్ధిరాజు మడియగా చింకర్ల భీమన గలియుట

సిద్ధిరాజుప్రధాని చింకర్ల భీమన్న
బావ సంగడికాఁడు పద్మరాఘవుఁడు
అధికయుద్ధము సేయ నప్పుడు గదిసి
మన్నీల బొమ్మినేఁడు మఱి దళముతోను
రాఁగాను నాపద్మరాఘవుఁడు కదిసి
గాజువిల్లును గత్తి కనకబాణాలు
వేయుచు నార్చుచు వెసఁ గూల్చె రిపుల
మఱియును బగతురు మార్కొని రాఁగ
చిరిపోతు రాజుకు శివ మెక్కినట్లు
పద్మనాయునిమేన బాణాలు దాకె
ప్రధాని భీమినేఁడు బవరానఁ గూలె
మన్నీల బొమ్మినేఁడు మహిమీఁదఁ గూలె
వరుగుచుఁ బొడిచిన వక్షస్థలాన
పాటు పడినను వీరభద్రునిఁ బోలి
విడిబడి తూలాడు వీరజడ లుండ
గోపాగ్ని కన్నులఁ గురియుచు రాజు
కుంతము జళిపించి కూల్చిన రిపుల
దంతులఁ బొడిచిన ధరఁ గూలువిధము
కూలేటిపీనుఁగుల్ గునియునశ్వాలు

వాలేటిపీనుఁగుల్ వరుసఁ లొటిపిటలు
కదలెడిమొండాలు కలన నెడలేక
చెదరేటికండలు చెరియుంచు చుండెఁ
గొమ్ముటేనుంగులు గోరపెట్టు చుండె
నాడాడ పడి యుండె నాయుధంబులును
గొల్లగాఁ బడి యుండె గోలపడగలును
దెప్పలై రక్తానఁ దేలు గొడుగులును
గుప్పలై పడి యుండు గురుపోతుజల్లు
లీడాడఁ బడి యుండు వింజామరములు
త్రొక్కితే నలఁగిన తుడుము లెడలేక
యెడలేక పడి యుండె నేస్గుచాదోళ్లు
పొగులుచు మొండ్యాలు పొర్లాడు చుండెఁ
గడలేని లొటిపిటల్ కలనిలో నొఱగి
కొదలేక రణమందుఁ గొండలరీతిఁ
బడియుఁ బొర్లాడేటిభద్రగజములును
చంద్రవంకగొడ్డళ్లు చేపట్టుకత్తులును
భద్రగిరియీటెలు భద్రాయుధములు
ఉరువులై పడి యుండె నొగి రణమందుఁ
జోకట్లపోగులు సరిపెనల్ గొలుసులు
రాకట్లు కడియముల్ రత్నహారములు
ముత్యాలహారముల్ ముద్దుటుంగ్రములు
పతకహారంబులు బలుసొమ్ము లెల్ల
రక్తాన బెసగొని రణమందు నుండె
సైకపుదుప్పట్లు చలువలు మడిగి
తెప్పలై రక్తానఁ దేలాడు చున్నఁ
బైకొని పడి యుండె పడివాగె లన్ని
యింద్రనీలపుఁగత్తు లినపజీరాలు
అంకెవన్నెతాళ్లు ఆ కంచుటరిగెలు
బొ క ను ఘనమంచిభూచక్రగొడుగు
లసురతలాటములు నా శంఖచక్రముల్
వన్నరై నయామంచివన్నెగుడార్లు

హెచ్చు గలిగినయట్టినెల్ల గుడ్డాల్లు
ఎత్తినచోఁ బిన్గు లెపలేక యుండె
మురిగినమొండ్యాలు మూల్గుచీను[illegible]లు
పరపర లై యున్న పట్టుదట్టీలు
కకచిక లై యున్నకక్కుకళ్యాలు
అమరఁ గట్టిన సకళాతు పల్లముల యశ్వాలు
అలసి గాయములతో స[illegible] తిరుగుచుండు
కుంభిని పల్లాలు కూలు నశ్వాలు
కరమొప్పు కేడలు కావుపడగలును
బడగలక్రిందను పరఁగ మొండాలు
చాలుకొని పడియుండు సంకుటరిగెలును
గూలినలొటిపిటల్ గునియునశ్వాలు
పేరాళముగ నుండె నా రణమందు
నడికట్లతో నొజ్జసేనాయకుల్ తఱుచు
వడ్డాణముల నొఱగువసుమన్నీలు
బొమికెలు శిరములు ప్రోగు లై యుండె
వజ్రాంగి ధరియించి వరగువజ్రీలు
గోరకపోటులు నాటి గోరపెట్టు చుండ్రి
చిల్లకోలలు నాటి చెల్లి సాహసులు
గడియూలసాహసుల్ మడిసి యున్నారు
చినిగినడొకటులు చిదికినతలలు
పాతేటిరక్తానఁ బడినమొండాలు
వకటలు ముక్కలై పరఁగె రణమందు
బెదువులు దంతముల్ పెనగొని యుండెఁ
జెక్కిళ్లుఁ జెవులును జేతులు మఱియు
మోకాటిచిప్పలు ముంజేతివ్రేళ్లు
కనుగ్రుడ్లు నాడాడ కండలు నుండుఁ
బుఱ్ఱలుఁ బునుకులు ప్రోగు లై యుండెఁ
బండ్లసందును గఱచి పట్టి నాయకులు
తఱచుగా రణమునఁ దలలు పడియుండె
బాకులు చేపట్టి పరఁగ విడువకను

సటు ఒకర్ప్రాణాన నల్లాడునరులు
మొన దెగినహస్తముల్ మోపులై యుండెఁ
గుమ్మరి చేసినకుండలకుదురు
గూర్చినట్లు తలలు గుట్టలై యుండె
గజములు నశ్వాలు కాలుబలములును
రణమందు నరలేక రాసులై యుండె
దమకంబుమీఁది యాదవరాజు లపుడు

## యాదవుల గెలుపునకు హరిహరులు మెచ్చుట

వస్త్రాల దాలసిని బరమాత్మ యనుచు
వేఁడుచుఁ గట్టుకొని వీరశేఖరులు
నలనన్న పోటులు నాటినవెనుక
అరువై యేండ్ల నాఁటి గాయాలు అవి పల్లికొండకు
అప్పుడు నలనన్న హరిహరుల వేఁడఁ
బల్లికొండయుఁ దలఁచెఁ బరమేశ ! యనుచు
మెచ్చిరి దేవతల్ మేలు మే లనుచు
నతనియందము దృఢ మాతయుఁ జూచి
హరిహరుల్ వారిపై నవలీలగాను
బృథివిపైఁ గురిసిరి పుష్పవర్షంబు
అంత గోపాలకుల కాపులెద్దులకు
మూర్ఛ తెలిసినయట్లు మోహంబు వీడె
దివ్యమూర్తి పల్లికొండ దృష్టి నూహించి
ముందు యుద్ధము చేసి ముమ్మయ్య పోచయ్య
రా ర మ్మని పిలిచి రణములో వార్త
కాశిలో నున్నట్టిఘనుడు భక్తునికి
చెప్పంగ కారణము చెంది యున్నాది
యేగి మార్గంబున నెఱిఁగింపు డనఁగ
సెలవ ది కాశికిఁ జేరిరి బాల
లయితన్న నలనన్న యమర యాదవులు
పంతాన నరులను బట్టి పోనీక
కంతముల సామంతు గుఱుచకత్తులను

కటార్లు జంజాళికములును ఖండివాలములు
ఘనమైనసిద్ధిరాజువాల్ళులంటించను
బరంగంగ గద్దెపై బం తాడినట్లు
వెస యుద్ధ మునం బెండ్లి వేడుకైనట్లు
అందఱిమనసున నరమర లేక
విరివిగా దళమును నిలం గూల్చి తాము
పంతాన పోబడి పగవారిచేత
నెద్దుల నుసికొల్పి యేనుగులం జంపి
యావుల డీకొల్పి యశ్వాల గూల్చి
సిద్ధిరాజుబలముల సృష్టిపైం గూల్చి
బొందితో బొల్లావు పోయె స్వర్గంబు
అజుం డనేపుల్లెద్దు హరిపురి కేగె
బగ మిగులకుండంగం బ్రఖ్యాతిగాను
బగదీర్చె నెఱగడ్డపాట నలనన్న

## భక్తిరన్న వచ్చువఱకు రణరంగమును వీరగంగ కాచియుండుట

పల్లవరాజులం బాశేటం జంపి
పగవారిరక్తాన బ్రదక్షిణము తిరిగి
పాలేటిగంగకుం బగవానిశిరసు
పాదకానుక పెట్టి ప్రస్తుతిం జేసి
యల్ల కాశికి యాత్ర యటు పోయినట్టి
పల్లవులబత్తిరన వచ్చినదనుక
రణము కాపాడంగ రాజు వేడంగ
సంతోష ముప్పొంగం జయ్యన లేచి
తమ్ముండు నైతన్న తానును మఱియుం
గలనినడుమను నిల్చి కన్నులం జూచి
యారణంబును గని యాశ్చర్య మంది
పరమోపకారులు బహుపరాక్రములు
సాధించి పగతురం జాల సమయించి
యరలేక యొరగిరి యమర యాదవులు
రణము కాపాడితే రణభుక్తి కలదు

నన్నుఁ బూజించిన నాథులరణము
వనరఁ గాపాడితే వచ్చి బత్తిరన
కలియుగంబున భుక్తి కట్టడి చేసు
అని తలఁచి యాగంగ యాపోతురాజు
వలకొని యారణము వనరంగఁ జొచ్చి
వల్లవులమీఁదను నైనవైనాన
నేసగిన్నెను వీరనేసలు పట్టి
యుందత్రిపైఁ జిల్కి యవుడు ముఁద్రించి
యీఁగ వ్రాలకయుండ నీలె యిడకుండ
గాకు లారణమందుఁ గదిసి రాకుండ
నక్కలు రణమున నడమాడకుండ
నీచుకు భూతాలు నీగి రాకుండఁ
గాజుకుఁ గ్రద్దలు కారాడకుండ
నాకాశపక్షులు సజ్జు వంచకుండ
మేదినిఁ బందులు మొడవాల్పకుండఁ
బుట్టలోఁ జీమలు పొలిసి రాకుండ
బెట్టినతిరుమణి పే డెత్తకుండఁ
బూసినగందంబు పురి చిల్లకుండఁ
గాంతిగల దేహాలు కందిపోకుండ
రహిం గాచుచుండెను రణవీరగంగ.

— సమాప్తము —



పల్లికొండ గంగ.

గుంటూరుజిల్లా ఒంగోలు తాలూకా ఇనమనమళ్లూరు గ్రామవాస్తవ్యుడు చినకోటయ్య కుమారుడు విన్నకోట ఆదిశేషు మా కీ చిత్రములను దయతో ఒసగినారు.

# అనుబంధములు

అనుబంధము ౧.

## భట్టురాయబారము

అనుబంధము ౨.

## కోటపాటి తాటివృక్షము తెచ్చే కథ

అనుబంధము ౩.

## ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట

---

అనుబంధము ౧

# భట్టురాయబారము



సీసమాలిక.

బ్రహ్మాయు వగు నీకు బహుకుటుంబాధార !
రమణీయయాదవరాజచంద్ర !
జయమస్తురా నీకు సమరనిశ్శంక ! సా
హసవిక్రమా ! యసహాయశూర !
ఐశ్వర్యమస్తురా అమరావతీపురీ
సి హాసనా ! నీకుఁ జిరవిలాస !
కల్యాణమస్తురా ఘనకీర్తిమందార !
ప్రస్తుతోభయవంశపావనుండ !
గృహమస్తురా నీకు గోపాలకాగ్రణి !
బాహాబలస్తోమ ! పరశురామ !
కుశలమస్తుర నీకుఁ గుసుమబాణుని తేజ !
వసుమతి యాదవవంశతిలక !
జయమస్తురా నీకు జననాథ ! మఱియును
గరుణింపు యాదవఘనసుకీర్తి !

ద్విపద.

పశుపతి నటువలెఁ బ్రస్తుతి సేయ – రసికుండు పశుపతిరాజులభట్టు
కొమరుబంగరుభట్టు గొబ్బున వచ్చి – క్రమమొప్ప నతనికిఁ గనుముందు నిలిచి
కడునయముతో నమస్కారమ్ము జేసి – యెసఁగ జండీశుని కప్పు డిట్లనియె
"దండమయ్యా ! నీకు దైవజ్ఞమూర్తి ! – నింక వేడుకతోడ నిలిచి మామంద
నన్నితీరులఁ బల్క నాశ్చర్య మొదవ – విన్నప్పుడే మాకుఁ జెన్ను దీపింప
నినుఁ జూడఁ గలిగెను జని సార్థమయ్యెఁ – గనులపండువ యాయెఁ గరుణ శోభిల్ల
దీవించి చదివేవు తావేది నీకు – కేవలము నీ మహిమ కేళింపరాదు
భూసురులో భట్లో భూతేజనములో – యేసీమ, యేవూరు, యేమట్లు మీరు,
తూరుపో పడమరో తుది పూర్వమేదో – తెలుఁ గొప్ప మీరాజుదేశంబు పేరు

పనికొద్ది నీ వున్న పట్టణము పేరు - మనుజేశు పే రేమి మంత్రిపే రేమి
గొనకొని నీరాజుగోత్రంబు పేరు - దినమును గొలిచెడి దేవుని పేరు
నన్నదమ్ముల పేరు నతిప్రేమతోను - గన్నవారల పేరు ఘనత నీ పేరు
తప్పక మాతోను దాత్పర్య మెసఁగఁ - జెప్పుమా! భట్టు! వే చెవుల పండువుగ'
నని యడ్గునామాట కనసీశుభట్టు - వినిచెను మఱుమాట వివరంబుగాను

"ధారుణి మెరగా దక్షిణ భూమి - ధీరతఁ బాకనాడు దేశంబునందు
బన్నుగా శివుజడలఁ బ్రబలియున్నట్టి - చదలేటితోఁజూడ సరివచ్చు పెన్న

వ. ఆ నది కా సమీపంబున

సీసమాలిక.

*భూలోక సారమై పొగడంగ నెల్లూరు
శ్రీ వీరవిక్రమసింహపురము
ఆ పట్టణంబున నమరంగఁ దూర్పున
మాకందచందనమహితవనము
ఆ నగరంబున కటు దక్షిణంబునఁ
జెలువారు వేమాలసెట్టిబావి
యా పురి పడమట నంభోజరాజిచేఁ
బ్రాకటం బైనతటాక మమరు
నొప్పారునవ్వీటియుత్తరదిక్కున
మున్నీటి కెదురైనపెన్న దనరు
నా రాజధానీమహారాజమార్గంబు
గంధర్వసింధురబంధురంబు
ఆపుటభేదన మం దున్నపణఁతులు
రత్నంపు బొమ్మలై రమణ మెఱయ
సకల విద్యా ప్రవీణతఁ జెలువు మిఁగిలి
..........................
వీరభటులకు నెన యైనవిభవ మనఁగ
వినుతి కెక్కెను నెల్లూరివిభవమహిమ.

---

* ఈ పద్యమే యించుకమార్పుతో చాటుపద్యమణిమంజరి ప్రథమ భాగమున నున్నది. చూడుఁడు—పుట 30.

గజాశ్వంబులకు కట్టుమట్లు – కురుకుకురు పట్టాలకు సింహాసనాలు
కరపట్టాలకు కన్నతల్లి – శంభుని గుడి సాక్షి కుంచెనివిూద
నంభోజు నెల్లూరు ఆతావు మాడి – అల్ల ధాత్రీకోట అమరలింగనకు
బ్రాహ్మణకన్యకుఁ బ్రభవించినాఁడు – సూర్యుకన్నులవాడు ముక్కంటి యనఁగ
ముక్కంటికొమరుండు మొగి జనోధీరుఁడు – జనోధీరునికుమారుఁడు మనోధీరుఁడు
మనోధీరునికుమారుఁడు మన్మసిద్ధిరాజు – కొండొక సిద్ధిరాజు కొమారసిద్ధిరాజు
కస్తూరిసిద్ధిరాజు గండగోపాలరాజు – తిల్లి యేఱురుసిద్ధిరాజు వశవాయి భీమన
పట్టభద్రుఁడు భరద్వాజగోత్రుండు – వరవితరణగుణసంశవద్ధుఁడు
నవరసాలంకార నవమన్మథుండు – సిలకీర్తి గలరాజు నలసిద్ధిరాజు
భానుతేజుఁడు సార్వభౌముండు సర్వ – జగమేలునధిపతి సిద్ధిభూవరుఁడు
ధరమీఁద షోడశదాన వినోది – యిలఁ గీర్తి గలరాజు నలసిద్ధిరాజు
వాసి కెక్కినసూర్యవంశమునఁ బుట్టె – శేషుఁడే యనఁదగు సిద్ధిభూవరుఁడు
మంత్రులు గొలువ సామంతులు పొగడ – సిద్ధిరాజనఁగఁ బెసిద్ధి గలరాజు
దక్షిణవారిధి దరిమేర నేలుఁ – దూర్పుసముద్రము తుదమేర నేలు
బలు వైభవమునభరద్వాజగోత్రుండు – అతని ప్రధాని అనపెసత్యవాది
పృథివిలో చింకర్ల భీమినేఁ డొకఁడు – మనుజేశు నలసిద్ధి మంత్రి యై పుట్టె
కరుణాకటాక్షుండు గాంభీర్యఘనుఁడు – స్థిరకీర్తి యగునట్టితిక్కన్న పొగడ
రాజభూషణుఁ డనురసికుఁడు తండ్రి – గాయకుఁడ రాజశృంగావళి పేరు
మీఱిన కవులకు మేదిని మ్రొక్కి – భారతీసుతుఁ డనఁ బరఁగుసోదరుఁడు
భువిలో నుభయకులపూజ్యుండ నేను – బహుమానపూజ్యుండ భట్టదేవాను ”

“భట్టయ్యగారు! సెబాసు లెస్సాయె – భట్టదేవర వైతె భాగ్యంబు పండె
యాచకలక్షణాన నే తెంచి రాజు – ననుసరించితి వైన నవనిలోపలను
దానధర్మాత్ముండు ధర గుణశాలి – యితని వేఁడిన నిచ్చు నిష్టభోగములు
అన్నదానము కోరి యాశించి వస్తే – పరఁగంగఁ బెట్టించుఁ బాయసాన్నములు
వస్త్రదానము కోరి వస్తి నంటైన – ప్రస్తుతించియు నిచ్చుఁ బట్టువస్త్రములు
భూషణాల్ లే వని పొగడను వస్తే – రసికుఁ డెన్నఁగ నిచ్చు రత్నాంబరములు
కనకంబు లే దని ఘను నిష్ట గంటే – యిప్పుడే యిప్పించు నెన్ని వలసినను
పరిమళద్రవ్యాలఁ బడయంగ వస్తే – పొలుపుగా నిప్పించుఁ బునుఁగు జవ్వాజి
గ్రాసము లే దని ఘనుఁ బొడగంటే – రాశిగాఁ బోయించు రాజనములను
నేరు సాగఁగ దున్న నెడ్ల నడిగితివే – గోర్కెతో నిప్పించుఁ గోడె లెద్దులను

గోదాన మిచ్చినఁ గొంపోదు నంటే – నడిగిన న్నిచ్చు మా అయితమురాజు
ఏమి నీ మనసున నేమి కోరినను – గామితార్థము లిచ్చుఁ గాటమరాజు
దాసి వేశ్యలు రెండు తప్పక విడిచి – యెంతైన నాశించి యేమి యడిగెదవు
అడుగుమా రాయశృంగావలి ! భట్ట !"

"బ్రహ్మయు వగు నీకు బహుగులరాజ ! – ధర్మంబు గలయట్టిధన్యులు మీరు
పొగడ వచ్చినయట్టిభూసురవరుల – కెడపక మీ రన్ని యియ్య గలవారు
సకలగుణాధార ! సర్వజ్ఞ ! యెవరు – నొక్కవనికై వచ్చి యొక టడుగ రాదు
ఏమి నిమిత్తంబొ యెఱిఁగించు మంటే – ఆ వార్త నీతోడ నాన తిచ్చెదను
ఆవులమేపుకై యగు నొడంబడిక – వివర మంతయు మీరు విన్నారొ వినరొ
అలనాడు యాదవు లందఱుఁ గూడి – నెల్లూరిలోనికి నేర్పున వచ్చి
యందలంబుల నుండి యర్లు వంచుకొని – యేకచక్రంబుగా నేలినయట్టి
సిద్ధిరా జనఁగ బ్రసిద్ధి గలరాజు – నపుడు మీ యాదవు లడిగి రొకమాట
అమరావతీ భూమియా కరు వాయె – పశువులా లక్షలు బదుమూఁడు గలవు
కొమరుఁ దొమ్మిదికోట్లగోవులు గలవు – ఏమి యడిగినఁ బుల్ల రిచ్చేము మేము
అని పలుమారు ప్రియంబులు పలికి – భీమునేనికిఁ జాల బ్రియములు చెప్ప
మాభీమినాయుండు మఱి యుక్తి చెప్పెఁ – బూరికి నీళ్లకు బుల్లరి యొప్పి
మాడలు కోడెలు మంచి యావులును – నేఁడాదినాఁటికి నిచ్చే మటంచు
సమ్మతంబుగ రాగిశాసనము వ్రాసి – యిచ్చి వచ్చిరి మును యాదవు లెల్ల
నాడినమితి దప్పె నంపిన రాదు – అందుకు సిద్ధిరా జంతఁ గోపించి
కోర్కెతో నేటను గొలువు కూర్చుండి – వీరపరివారంబు వేగంబె పిలిచి
తాకీదు చేసియు ధనము తె మ్మన్న – నందుకు మారాజు అలుగకఁ జెప్పి
వీలభటులను బంప విహితంబు గాదు – వారితోఁ బుల్లరి వచ్చేన యేమి ?
గొల్ల మీఁదిపుల్లరి గోసమీఁదిబచ్చలి – మెల్లనె నేఁ బోయి మితి మందలించి
వచ్చెద నని వస్తి వసుధేశతిలక ! – మాడ లేమందలో నూడకున్నాయొ
కోడె లేమైనఁ జను కుడువ కున్నవియొ – చమురు చాలుట లేదొ తరి చుట్టుకొనిరొ
వారిలో వారికి వైర మేర్పడెనొ – ఒకరిమాట కొకరు నొనగూడ లేదొ
కారణం బేమిగాఁ గలిగి యున్న దియొ – విదితంబుగా నెఱిగి వివరింతు నంటి
గుట్టుమార్గమున నీ గుణమెల్లఁ గంటి – రట్టు సేయక ధనము రాబట్టు తెలిసి
యాదవులమీఁదను నలుగనేమిటికి – నే వచ్చి యీ వార్త నేర్పునఁ జెప్పి
మాఱువార్తలు గొంచు మగుడిపో వస్తి – నిందు నిమిత్తమె నిన్ను జూచితిని

యే భట్ట ! త్యాగంబు నియ్య మనిగాము – యాచకకులనాశ నేకెంచి రాజు
ననుసరింపఁగ వచ్చు నర్థిని గాను – పుల్లరిధనమునకై పూని వచ్చితిని
పల్లవరాజుల భట్టను నేను ”

“ ఓ వెట్టి వజీర ! యో వెట్టి భట్ట ! – యీ వెట్టి బుద్ధులు నేర్చితే పుట్టి
నిచ్చిన మాత్రము నీతనిచేతఁ – బుచ్చుకో నొల్లవు వెచ్చంబు కనుచు
నొకటి యడుగు మంటె నొకటి యడ్గెదవు – ఉలవ తెత్తామంటె యూళ్ల నడిగెదవు
అలువడి తలపోసి యంటెచందాక – దాన మడుగు మంటె సగ్గము వచ్చి
భూనాథు నెదుటను పుల్ల రడిగితివి – యిట్టి వెట్టిబుద్ధి యేమి మనగలవు !
పుట్టిననాఁటి నీ పుత్తెరుణ మేమొ – నీ రాజు నెల్లంపె నీ వెట్లు వచ్చె
పీ రాచకార్యం బదేల నా కనక – కొలూరి సిద్ధన్న కదనము న్నవ్వె
యేను మరగ రాత్రి వెన్నెల బైటఁ – బుడమి సంక్రాంతి గలపున్నాని మెసవ
పాకనాటికి నడుమఁ బాలేరు గడిని – నలనన్న పుడమిరాజులవలె నుండెఁ
బూరికి సీళ్లకుఁ బుల్లరి గాఁగ – మీ రడిగినధనము మారాజు నొప్పె
కవులుపత్రాలను గడిపెన్నఁ బెట్టి – సభవారు సిద్ధిరాజు సంతిస మంద
బాస దప్పి సిద్ధిరాజు పసుల వేగించి – యాస నిప్పుడు ధనము నడుగ నిల్లంపె
నప్పన మడిగిన నొప్పె మా రాజు – చిరుమన చి కర్ల భీమినాయండు
మన్నీలబొమ్మినేఁడు మఱియుఁ దిక్కన్న – బచ్చులుఁ గోమట్లు బలిజలు వారు
వచ్చిరి పెన్నలో వసుధేశుసభకు – పుల్లరిపత్రాలు పుచ్చుకొని వచ్చె
కమ్మ చెన్నమనేఁడు సమ్మతిఁ దెచ్చె – మన్నీలబొమినేఁడు మంత్రి తిక్కన్న
పిన్నలు పెద్దలు భీమినేఁ డుండ – మీ రాజు కవులిచ్చె నే మందినాము
నీరాజు సత్యంబు నిలుప లేదాయెఁ – బాడి దప్పినవారు పాకనాటి దొరలు
పాడితప్పిన మాట పట్టంగ రాదు – పాపాత్ముఁ డని రాజుఁ బలికినందులకు
కోపించి భీమినేడు గొబ్బున లేచి – యెట్టి మా సత్యంబు నేమి తప్పితిమి
పట్టిమాటల దూఱ వలదుగా కనుచు – మీకును మాకును మేదినియందు
సంగమదేవుండు సాక్షి యున్నాఁడు – అతఁ డెఱుంగనికల్ల యది యేమి కలదు
చేతాము బాసలు చేరి లె మ్మనెను – పిన్నలుఁ బెద్దలుఁ బ్రేమతో వారు
పెన్నలోఁ బలికొండ పెరుమాళ్లు సాక్షి – గయ్యాళిసేతలఁ గదిసి ముందుగను
జయ్యన వచ్చె బాసకు భీమినేడు – చంగావి వస్త్రము జలము తడిసీరు
సంగమదేవుని సముదృష్టి నిలిచి – పెరుమాళ్ళప్రసాదము పెన్నలో వైచె
శిలలు పలుకవాయెఁ జిన్నబోవంగఁ – గొలువులోఁ గంపటీల్ గొబ్బున లేచి

తీర్థపసాదాలు కెజంగొప్ప నంది – ప్రార్థించి పెనులోం బడవేసి నపుడె
యేసు జెలు పెన్న యెదురయి తొట్టి – గుడిమీదినంపులు కూడిన ట్లాయె
గుప్లూరిదేవుని గుడి యెల్ల వ్రేయు – వారిమీందను శిలలు వఱగిన ట్లాయె
నిద్దఱుం జూడంగ నెఱుకలసాని – సిద్ధిరాజులమీంద సిరికొట్ట సాంగె
సభవారు సూడంగ సంగమేశ్వరుండు – గర్భగృహముమూత గ్రక్కున మూసె
నంత శారదసు బ్రాహ్మణ వమగు నచ్చె – సంతసంబున రాగిశాసనాల్ చదివె
నెక్కడి తగవోయి! యెఱసిద్ధిరాజ! – మోసపోయితి మని మొగ మడ్డగించి
సన్నుతిం బెద్దలు చప్పట్లు కొట్టి – సభ సత్యసంధులు ఝల్లున లేచి
పెద్దలు నెల్లూరి కెనుబ్రోవ పట్టి – పాలి నోడితి మని పరివార మంతం
జిన్నబోయెను నాండె సిగ్గువడె రాజు – నాంటిమాట మనసునం దేమి లేక
చెల్లిన కాలావు లెన్నోయి గొల్ల – రావోయి! యంటనె రహి తీర్థ మనెడు
నా వొకటి చెల్లెను నదినేయు మూండు – భూము లనంగ నప్పుడు పెద్ద లంతం
బుల్లరి ధనమంత చెల్లెనం చనిరి – ఆవు చెల్లిన ధనము నది లెక్కసేసి
యార్న్నారు చేనునం చని రంత వారు – ఎద్దులు మేసిన యా పసినంబు
లెంత చేసు ననంగ సిన్నూరు చేసు – నాన్నూటి కిన్నూరు వరయంగ వెరసి
నన్నూరు యి త్తు మనె నలసిద్ధిరాజు – చచ్చినయెద్దుకు సగము పైకంబు
వద్దని నలనన్న వచ్చెం బాలేరు – నాంటిమాట మనసునం దేమి లేక
యేటికి నిన్నంపె నెఱసిద్ధిరాజు – అంపితే నేమి మీ రర్థి వారుగను
నీతి యెఱుంగక నీ వెట్ల వస్తి – వచ్చితివేనియు వడిం దప్పు గాదు
వచ్చి ధర్మము తప్ప వరుసయుం గాదు – పలికించి శిలలను బాలి గెల్చితిమి
పుల్లరేడది తిర్గి మళ్లిపో భట్ట!''

" ఉత్తర కాశి గొట్లరాజు ఉత్తముడు నలనన్న – సత్యవాక్యానికి సాటి లే దనక
తటపట మాటలు తగనిమార్గమున – నావు లోడినమాట లాడంబోయ్యేవు
నాం డాడినట్టులు నేం డాడవైతి – తగులూరిపందెము తగులు పడ్డట్టు
లోకమాట యొకతప్పు నోడబడెం గాక – అది యెటువలె నంటె విదితముగ వినుము
బొడ్డు గలకోడెల భూదానమునకు – నిత్తు మంటిరి యంత కియ్యలే దాయె
'సిరునపుట్టిన పూరెల్ల' నంటె – మావాసి తప్పట మందలావులచేం
దోటిఫలము లన్ని త్రొక్కించి మేపి – వనములు నుగ్గాడి వరిచేను మేపి
కోటలు గాలించి కొల్లం జేసితిరి – పండినపాకనాడు నిర్మూల మయ్యె
పండినవరిచేలు బారిం జొచ్చితిరి – గడి చేరి యుండంగం గానికె కోడె

లడుగవస్తే మమ్ము నదలించివేస్తి - శేషది పుల్లరి కోసా లెక్కడిది
మాటలాడక తిర్గి మళ్లి పో మ్మనుచుఁ - గొజగాని సేతలు సుమనుకవా తప్పు
పూరి నీళ్లు దక్కితే పుల్లరి దక్కేన - తటవటచే దేవపలసాక్షిగాను
నవనిఁ బుట్టినపూరి యాతయు మేసి - వడి పెట్టుసేతల వచ్చి యా పెన్న
బాసల శిలలను బలికించినారు - బాసలు చేసేటిపాషాణములను
నరిఁ బలికించేది సరిపోయె మీకు - నీ సదుపాయము నెఱుఁగఁ డా రాజు
అది యెటువలె నంటె విదితముగ వినుము - తొల్లి యా రఘుపతి యల్ల సుగ్రీవ
జనపతి కభయహస్తంబు నిచ్చినటు - భాగీరథీగంగ బ్రహ్మతో నివ్వ
డాలాకు మీకును నభయ మిచ్చినది - చల్లవారింటను చతుర్ముఖుండు
పుల్లయె ద్వైపుట్టె భూలోక మెఱుఁగ - శ్రీరాబ్ధిశయనుండు చెలఁగి మీమంద
నారూఢి బొల్లావు అయి పుట్టినాఁడు - పర్వతాలమల్లన్న ప్రముఖులు సూడ
చాఱుబసువ నై జన్మించినాఁడు - కడమ దేవత లెల్లఁ గాలావు లయిరి
గంగ యిర్వేలుపై కాపాడుచుండె - నీరు గంగా మహిమ నిజరూపు గనుక
పాఱకుండ నిలిపె పఱుగురుదకాలు - పమిడి పాంశిటు పలికిస్తు మనుచుఁ
బుల్లరి యిమ్మాక పొయ్యేది విహిత - ధర్మమే యిదియును ధరను న్యాయంబె
యుపకృతి మఱచేరు ఉచితంబు గాదు - పిన్నకరువునఁ జాలఁ బెద్దకరువునను
చంబావు నిస్తిమని సామెత నొకటి - పలుకుచుందురు జనులు పరిపాటిగాను
నీరు జంటితే నైతే పూరి కరువ్వార మైతే - నీ మంద నానాఁడు నిలువ జేసినది
అట్టివేళను మిమ్ము నాదరించినది - యది విచారించుమీ యాదవరాజ!
కినిసిన వచ్చేన మంచితనమున వచ్చేన - కినిసి మా సిద్ధిరాజు కీడుఁ దలచినను
బాళెముఁ జొచ్చినఁ బట్టి సాధించు - సంత వారలతోను సర్కాతు సేసి
గంతులు సెల్లవు కాటమరాజ! - బుద్ధిచూలియు వెఱ్ఱిబుద్ధులు గాక
పెద్దటికాల్ మాని పెట్టు పుల్లరిని"

"వినుము రాయశృంగార! వివరంబుగా - - ను మీరు చేసినమూర్ఖపుఁదనంబు
ముందఱ చెఱకులు మోపులు గట్టి - ప్రధానిభీమినేనిఁ బంపి మీ రాజు
హితకారిమాటల నెలమి రప్పించి - ముంచి వాదము సేసి ముంచినావలె
నాయకుఁడు సిద్ధిరాజు నయమునఁ బలికెఁ - దా లుపట్నమై తరు నెల్లూరఁ
బూని సత్యముగాను బుట్టించెఁ గవులు - మీసీమకరణము మీ తిక్కమంత్రి
వ్రాసిన పత్రాల వైనాన వినుము - కడఁగి యా విషభవ కార్తిక శుద్ధ
పంచమీతిథి గురువారమునాడు- పసిబాసఁ దెలిసినవరమపుణ్యుండు

చెలువుండు కాలావు చెన్నమనేని - కిలయేలుసిద్ధిరా జిచ్చినకవులు
'ఎన్నాళ్లు మీ యావు లీ భూమి మేయు - నన్నాళ్లు మా సీమ నగ్ని లేకుండ
నెచ్చోట వర్షంబు హెచ్చుగా గురియు - నచ్చోట నెల్ల మీ యావుల మేపి
కంచె బీడు చెలికె కట్టితె మ్మాక - కంచి విజయనగరము గట్టి మీ సాదు
నీకుచ బుట్టినపుల్లరి నీకి త్తునంటి - గూడె మాడెలకును గోవులు పోవ
నేటిపాటలు రావు నాటికి న టి - రొకటి గనకున్నను నోయి! మీ సొమ్ము
నొకటికిఁ బజాబుగా నొసఁగెద నంటి - పత్రంబునకు మొదల్ పరమేశ్వరునికిఁ
గొమరుఁ డై నవినాయకుఁడు సాక్షిగాను - పల్లికొండ పెరుమాళ్లు పారేటిపెన్న
సాక్షి మాకెఱుకలసాని నెల్లూర - సంగమూలస్థానలింగంబు సాక్షి
వైకుంఠకంచి యా వరదప్ప సాక్షి - భూమి యాకాశంబు బొంకని సాక్షి
పృధివిలోఁ జెంచోబలేశుండు సాక్షి - పర్వతాలమల్లప్పతి సాక్షి మాకు
వినుకొండ నున్న యావీరభద్రుండు' - ననుచుఁ దనవ్రాల్ పెట్టి యాకుల వ్రాసి
నమ్మ బాసలుసేసి నయములు పల్కి - కమ్మ చెన్నమనేని కమ్మ వ్రాయించి
మమ్ముఁ బంపెను తొల్లి సమ్మతంబుగను - తమ్ములు సిద్ధిరాజు ధర్మంబు దప్పె
నందిపాద చెఱువుకు నాఁడు రాగాను - మందావు వేయించె మన్మసిద్ధిరాజు
కవు లిచ్చి తిప్పినఖులచిత్త మోముఁ - గనుగొన దోషంబు కలలోన నైన
మాట నిజ మైనట్టిమానవేశులకు - మాటాడి తప్పితే మాన బు తప్పు
నుడుచునకుపు రెండు ఉండు నాలుకలు - కా లీయ నొకనాల్క కవు లిచ్చి తప్ప
వాలాయ మదిగామ వ్రాసినటు లైన - నీక నిన్నుఁ బంపుట కేమి కారణము
నాలుక చెఱచుట నయమును దప్పుట - యేడు రెండేండ్లకు నేట్లు పోట్లయ్యె
నాఁడు చేసినసేత నాఁటితో సరియ - తోడ నెల్లూరికిఁ దొడక రావద్దని
పడమటితీరాన బశువులు గదలె - దక్షిణసముద్రము దరిమేగగాను
పెన్నవెంట నెల్లూరికిఁ బేరుసాగి కదలె - పన్నుగా లక్ష్మిదేవి పున్నమ పర్వదినాలు
అరువర గంపసిద్ధి ఆయుధా లంపి - భోగించగా బంపె బొగ్గేటివెంట
కలిగిరి చెఱువున కానుగలనీడ - నీలవర్ణునిమంద నిలిచి యుండంగ
పంచగిరి అప్పమ్మలవాఁడు పెదపేటిభావరాజు - వచ్చి యావులఁజూచి మచ్చరంబునను
కొంకివెదుర్లతో క్రొవ్వన నార్చి - పోకుండ నావులఁ బొడిపించినాఁడు
పొడిచిరి యెడ్లను బోయనాయకులు - పొద్దుబోయి పాళాలకుఁ బొర్లిపోతాను
యేపెలు అండగొని యెద్దుల వేసి - కానుగు లండగొని కాలావుల వేసి
పోట్లు దాకినయెడ్లు పొరలాడ సాగె - గడగిరి కోలలఁ బడి పొర్ల సాగె
ఘన మైనయెద్దులకుఁ గందనాల్ నాఁటి - శ్రీరామబాణాలు శిరసులు గాడి

గుమ్మడిగిం జలుగులు కతికెదిం పామె - పలు వాడియుబులేలు ప్రక్కలు గాడి
వానవింటి అంబులు దూయించుటామె-యెద్దుహాపఋదప్ప యేమ హావ మామె
యెద్దు వళ్లు జూడ హేమవర్ణ మామె - వన్నె తేరిమెళ్లు వచ్చి యని బడసె
మూఁడుభూములుసేయుమూఁడుయెద్దులు చెల్లె - అన్న మేలెక్కిన మనెడి యూ
[వొకటి చెల్లె
కావరంబును బూని ఘనుఁడు సిద్ధిరాజు - గోహత్యకును మాత కొంకక మునుపు
కామధేనువుఁ జంపి కార్తవీర్యుండు - మెట్టితి నై పోమె నెఋఁగవా భట్ట!
అట పొట్టి శిరసులు అన్నితావులను - భార్గవరాముండు పడగొట్ట లేదె
ఆరీతి మిమ్ముల నంటఁబట్టి - ఘోర నొక్కించేని పోరక చంపె
బద్దిగోర్ల సేతుము భాగీరధికిని - అయినతడ వామెను నఖిలలోకముల
దైవకట్టడి రాజు దగ్గఱ వచ్చి - నదెక పలుమాఱు వసుధేశు నెదుట
కదలి రమ్మనుమి మా కలవారి నెల్ల"

"ఓయి! మా కడవి త యోడక నీవు - చెలగి శాకితనము సేయఁ బోయ్యేవు
గయ్యాళిసేతల గడిచేర ధనము - నియ్య బైసియుమాలి యెట్లాడుతావు
మఱపు మోసానను మదిరి నాయకులు - ఎఱుఁగక వ్రేసిరి యెడ్లను మాఁటి
అంతకే మీరంత ఉల్లాడు చుంట్రి - పశుప్రలు గలచోటఁ బరగదే చావు
పల్లవనలసిద్ధి పట్టభద్రునికిఁ - బుల్లరి యొడ డి భూమికి రాఁగ
నుత్తరలోఁ జిత్త నొక్కొక్క చోట - నెత్తుబడి మీ యావు లెన్నిచావ విల
నందులో నివి కొని యనుకోను తగును - అటువంటి తెఁగువ నీయందున లేమ
తెడ్డడిగి నప్పుడే కొయ్యడిగినట్లు - వదిగి యూ సామెతై వచ్చె మీ యెద్దఁ
దగిలిపెట్టు మనంగఁ దగవేస్తి మంత్రు - తగవు లోపల బొంకఁ దా నచ్చె మీకు
నయిన పశువులు నెన్ని యరయ ధన మెంత - మీ మందె మేలమున మిక్కిలిగాఁగఁ
గొంకక పట్టిన కోటలో జొచ్చి - వంకదారులకాడ వారి జేసినట్లు
పుట్టిన సీమలోఁ పూరెల్ల మేసి - పెరిగినయెద్దులఁ బెద్దకోడెలను
నరయంగ నేడువే లంపు మనంగఁ - బల్లవలసిద్ధి పట్టభద్రునికిఁ
దోలి యంపినాడు............ - అందులోపల మంచియవి వైనవాని
ముందుగాఁ బుచ్చుకో మూఁటికి మూఁడు - గుఱ్ఱపుఁ బిల్లలకును లేగటావు
నఱ్రావులఁ దోలె నాఁ డందులోనె - యందులోపల మంచియావులుగాను
నొప్పుగా బుచ్చుకో యొకటికి రెండు - కాక మా తోడను కక్కసా లాడి
మా కౌలు వెయ్యి మాడెలు కోడెలు - పుడమీశు కీయక పొయ్యేద మంటే

కడ గెలిచి మిమ్ముకు గదలిపో నీఁడు - ఉసురుతో మా ధనము నొప్పించి పిదప
నెసఁగంగ రాజ్యాన కేఁగుఁడీ మీరు - పరమోపకారిని వగయేటి కనుచుఁ
దెలిగెల్ల మీతోను దెలుపుచున్నాను - కాసేపు మనసు దిలాస చేసికొని
ఆలోచనను జేసి యాపైని రండి - ఘనముగాఁ బోరాడఁగలవారు గారు
గజములు నశ్వాలుఁ గల్ల లొటిపిటలు - భూ కంపటం బెల్లఁ బూని యేతెంచి
పెళపెళ నార్చినఁ బెదవులు తడవు - చడవుల కుఱికేరు యాదవు లంత
కోట్లపర్యంతంబు కూడినవేళఁ - బోట్లాట కుడుముల వేట్లాట కాదు
గద్దరిచేఁతల గద్దించరాకు - పెద్దఱికాల్ మాని పెట్టు పుల్లరిని"

"విను రాయశృంగార! వివరవంతుఁ డని - పని బూని వ స్తివి పసిపుల్లరికిని
అనుపుచదువులు చెప్ప నన్నివివరముల - ఘనుడ నంటివి యీడ గర్వించి యిప్ప
డే తావు చదివేవు ఏ తావు చెప్పేవు - వసపోసినట్టుల వదరేవు గాక
యొకొ్కక విధమున నారసి చూచినను - చక్కఁగా నొకమాట జవాబు లేదు
ఎవ్వరని చూచితి యాదవవరుల - వివరించి చెప్పేను వినవోయి! భట్ట!
ద్వాపర మేలేటిధర్మసేనుండు - ఆపదబాంధవుఁ డావల్లికొండ
పల్లికొండ యాదవులబ్రహ్మాది ముఖుఁడు - భీమబలసేచుండు బిరుసు వీరుండు
సార బలశాలి యా చట్టువారి యఱ్రయ్య - .....యర్జునుండు జనియించె
రేచర్లగోత్రుండు రణశూరుఁడతఁడు - పద్మనాయుఁడు భోగభాగ్యాలపంట
సకలవిద్యాకళాసత్కీర్తిఘనుఁడు - నకులుండు నాచకూళ్లనాయంకుచూడ
సహదేవుఁ డాతఁడు సాత్వికగుణుఁడు - భూదానసేనుండు పుత్తమరాజు
ఏవురు పాండవులే యాదవులును - వేడుక నెఱగడ్డపాడు కురుభూమి
వీరు తిరుమందులు వినుతసాహసులు - అనుచుఁ ద్రేతంబున నవని యాదవులు
రామచంద్రునివార్త రసికత వినుచు - చతుర్వేదముల కయి సాగరంబుల వె
దకి సోమకునిఁ జంపి యొకరూపమునను - చక్కఁగా రాక్షసునిఁ జంపి కొమ్మునను
నుర్వి తా నిలిపెను నొకరూపమునను - గనక కశ్యపునిదొకడుపు వ్రయ్యలుగ
నొనర నఖములఁ జీఱె నొకరూపమునను - నల వామనుం డయి యడుగులు గొల్చి
బలిచక్రవర్తిని బఱిచె నొకటను - వా(ఓ)డక క్షత్రియులు వైనాన నఱికె
గ్రద్దగొడ్డంటను గార్త వీర్యుణ్ణి - ఒండొ డె ద్రుంచెను నొకరూపమును
జగమేలునారామచంద్రుఁడై పుట్టి - యొగి రావణునిఁ జంపె నొక రూపమునను
నా రీతి మిముఁ జంప నఖిలంబు నెఱుఁగ - మారాజు జనియించె మఱి సాహసమున
సీతాపతి యయిన(శ్రీ)రామచంద్రుఁ - డితఁడే ధరమీఁద నెంచి చూచినను

నితని సహోదరుఁ డినవంశతిలకుఁ - డా దిశేషుఁడె లక్ష్మణుఁ డాతఁ డెవరన్న
దశరథరాజేంద్రతనయుండు భరతుఁ - డసమానఘనుఁడు నా యయితమరాజు
సుమిత్రామహాదేవిసుతుఁడు శత్రుఘ్నుఁడు - రమణతోఁ గరియాపుల
[రాజశేఖరుఁడు
భరతుఁ డేలినయోధ్య వరఁగ దానకొండ - వరుసతో శృంగారవనముపూదోట
అాబెట్ల పెద్దమల ఆరుట్లకోన - పశువులున్నకోన పర్ణశాల యగు
నరుదుగా నెలయించు నా మాయమృగము - వరగఁగ మీ భూమిఁ బశువుల
చెరుకూరిజగడమే సీతమ్మదేవి - చెఱబట్టురావణుఁడె సిద్ధిరా జనఁగ [మేపు
కవులెల్ల వెదకంగఁ గానలోఁ జూడఁ - జెప్పిన సంపుదురె శిలాపుత్రులు
గడినుండు పాలేరు గంభీరవార్ధి - పుడమి నా రావణుపుర మేమి పురము
భూనాథు క్షేమము పుల్లరిమాట - జానకిము దిక చెప్పిన వెల్ల
నిచ్చిన పత్రాలె నిల రాముముద్ర - వచ్చినకంపటి వాయుసుతుండు
పచ్చ తెక్కల చిలుక......లంక యిండ్లు - పక్షి నేసిన బాణమె పవనజువాలు
పదిల మానెల్లూరుపట్టణము లంక - తుద రావణుఁడు సిద్ధి త్రుంగ నెఱగడ్డ
నా రాత్రిఁ జంపుదు మందఱ మిమ్ము - వదరక పలుమాఱు వసుధేశునెదుటఁ
గదలి ర మ్మను భట్ట! కలవారి నెల్ల"

"వినవోయి! యాదవవీరులభట్ట! - పనుపడ మీవారిపౌరుషం బెల్ల
మించి మా ముందర మితిమీర లేక - యెంచేవు సారెకు నెక్కువగాను
అడవులు తిరిగేటియాదవవరుల - కెక్కడిసాహసం బేడ పౌరుషము
గుఱ్ఱంబుఁ బొడగంటె గుట్ట కుఱుకుదురు - వెఱ్ఱిగొల్లల బిరుదు వెయి వేలగతులు
కలవి లేనివి కొన్ని కల్పించి యాడ - యాదవవంశంబు నిలఁ గూల్చువఱకు
నుబ్బించి యుత్తికించి యొరుల బడగొట్ట - దబ్బరబుద్ధులు తప్పవు గాక
యిట్టియనేకులు నీ మందలోను - చేటు దెచ్చుకొనేది క్షేమంబు గాదు
ఏడఁ బుట్టినవారి నాడఁ జల్లార్చి - ......వారు భట్టున గాక
ఎగఁద్రోలినప్పుడు ఎగసి యా మిడత - అగ్గిలోపలఁ బడి యట మడియుఁ గాక
యటువంటి చందంబు యాదవు లెల్ల - గట్టిగా నీ బుద్ధిఁ గైకొని వినుము
నీచు బుద్ధులు మాని నీతులు చెప్పి - చచ్చేరు యాదవుల్ సత్య మీ మాట
వారు చావగ నీకు వచ్చునా కొంత - వారు లెస్సగ నుంటె వచ్చును గాక
త న్నేలురాజుకుఁ ద ప్పొప్పు లేక - మంచిబుద్ధులు సెప్పి మగుడింపవలయు
నేకులతో బాకు లెంత సేసినను - నాఁట నోపున యవి నలియును గాక

పచ్చిపాలను ద్రాగి పశువులఁ గాచి – మచ్చరింతురు వారు మద మచ్చరమున
పేదవానికోపము పెదవులతీట – చేఁతగానిది యేమి సేయఁగఁ గలఁడు
వూని దీపము సూచి వూనకము లెల్ల – మలుప వచ్చి య దిందు మలఁగునాయెట్లు
కోపించునీమాఁద గోపాలు లెల్ల – చావక పోదురే సమరంబులోనఁ
గదనంబు కేఁగినకాటిగుఱ్ఱాలు – చెదరక జగడంబు సేయంగఁగలవె
పెరుగుఁ బాలును ద్రాగి పెద్దబాకులను – గావళ్లు మ్రోయంగఁ గడలేక పెరిగి
బొఱ్ఱలు పెంచుక బోఁకునలె నుండు – నగ్రమానుసు లెల్ల పని సేయఁ గలరె
యొంత గాత్రం బైన నెద్దుల ఫౌజు – దంతి ఘటతోడ నుద్ధతిఁ బోరఁ గలదె
నగ్రావులకదుపు నాణ్యంబెయైన – గుఱ్ఱంపుఁబౌజుతోఁ గూడంగఁ గలవె
యాదవసైనికు లెందఱేఁ గాని – నెల్లూరిసాహసుల నెదిరించఁ గలరె
పొడవుగాఁగను జెప్పి పొగడేవు సారె – యేమిటికిఁ బొడవులు యెంచి చూచినను
బూరుగు తా నెంతపొడుగు బెరిగినను – చందనముతో నది సరితూఁగఁ గలదె
యెలమి జీలుగుచెట్టదెంతలావైన – సలమేడకంబాల నాచంగఁ గలదె
పాములు బారలు పదినూఱులైన – విష్ణువాహనముతో వివరించఁ గలవె
యెలమి దూదికొండ లెంత ఘనమైన – ననలంబు నొకయింత యణఁపంగఁ గలవె
మదియించి యున్నట్టిమత్తేభములును – బొదలి సింహముఁగూడి పోరంగఁ గలవె
అరుదైననీ మంద యావు లెంతైనఁ – బరికింప బెబ్బులిఁ బట్టంగఁ గలవె
వద్దనునుండేటివారలబలిమి – కబ్బి చెప్పుకు నేవు ఘనత మీఱంగ
నూరక యుండంగ నుబుసుపో దేమొ – వారిఁ బొగడుదుఁగాక వద్దన నేల ? ”

“ ఓ రాయశృంగార ! యొనరంగ వినుము – సాహస ఘనుఁ డితఁడు సార్వ
[భౌముండు
మనసున వాక్కున మఱి చేత లందు – నసిసేయ నితనికి సమలచిత్తంబు
ఏడేండ్లకును సాము చేశేటినాఁడు – వేడ్కతో రణమున వెదకఁ బోవంగఁ
గడువేడ్క బాంధవులఁ గలసేటియపుడు – గడినుండి శత్రువుల గదిసేటియపుడు
కడుసాహసుం డగుకాటభూపతికిఁ – బుడమిలో నితనికి వడి నొక్క దృఢమె
మీఱిన రణమున మిడిసిపడునపుడు – శూరుల ఖడ్గాన శోధించునపుడు
ధారుణి నర్థులకుఁ దగ నిచ్చునపుఁడు – ఘోరరణమున రిపులఁ గూల్చేటియపుడు
మేరు సమానుఁ డౌధీరుఁ డావులనకు – వా రెంతదృఢమైన వడి నొక్క దృఢమె
మంచిగంధను చాల మైనలఁదునపుడు – మించి యని రక్తంబు ముంచినయపుడు
ఎంచి పూబంతుల వేసేటియపుడు – కూడి యంబులవాన కురిసేటియపుడు

బంచబాణునిఁబోలు బడుగులరాజు – నెంచి చూచిన నితని కిది యొక్క దృష్టమె
బసువ శంకర బిరుదుపట్టె మెక్కేటప్పుడు – పశువుల క్రేపులపై వచ్చునప్పుడు
దుర్మార్గుఁడవు గనుక దూషించి తీవు – రాయబారు లై తేను రాజసముఖాన
వసుధపై దండెత్తివచ్చేటియపుడు – కుసుమబాణుం డీ గోపాలకునకు
వసుధలో నితనికి వడి నొక్క దృష్టమె – శ్రీరామచరితంబు చెవుల విన్నపుడు
విమతులార్భాటముల్ వెస విన్నయపుడు – తమ్ములఁ గనుగొని తగమురియు
[నపుడు
సమరంబులో రిపుల జంపేటియపుడు – అమితసత్యవ్రతుఁడు యాదవరాజు
కితని కెంచఁగ నిప్పు డిది యొక్క దృఢమె – యితనికి సాటిగా నిప్పటిరాజు
బ్రతి యెంచరాదు ఏ పగతురనైన – కృతయుగ త్రేతాయుగ ద్వాపరముల
నితని నెంచఁగవచ్చు నెవ్వరికైనఁ – గాత్రవీర్యునిఁ బట్టి గర్వంబు నడచు
పరశురామునితోను బరికింపఁగాను – సరిగఁ గీర్తింపనా సత్కీర్తిపరుఁడు
రావణకుంభకర్ణాదుల గొన్న – రామచంద్రునిసాటి రణములో నితఁడు
కురురాజబలములఁ గూల్చినయట్టి – యాల కిరీటికి సాటియగు జూడ నితఁడు
కలఁగక మధురలోఁ గంసుఁ బొరిగొన్న – బలభద్రరాముని బ్రతిబోలు నితఁడు
నాటినృపులనుగాని సాటిగా నిటను – నేఁటివారల నెంచ నేరంబ యగును"

"రావోయి! యాదవరాజులభట్ట! – కారుణ్యములఁ బక్కఁ గర్తవు గావు
మీరేమిసేతురు మిమ్మాడఁ దగదు – వనములోపలఁ జొచ్చి వడి మ్రాకు లెల్లఁ
జెల్లగొడ్డండ్ల జెలరేగి కొట్ట – అట్టి కట్టడి దొంగ యందులో నొకడు
వారిలోపలఁ జొచ్చి వడి మ్రాకు లెల్ల – జక్కగా నఱికినచందంబు నాయె
చిలకట్టు నేరముల్ చింకర్ల భీమినేఁ – డీలాగు సేయుట యెఱుఁగడు రాజు
మీరు వచ్చినరాక మీ రున్నయునికి – యది చూచి మా రాజు అడుగంగఁ దగదు
గడ్డి నీళ్లును లేక గాఱియలాడు – గొడ్ల భూమికిఁ దోలుకొనివచ్చినాఁడు
మన్నెలబొమ్మినేఁడు మందావులఁ జూచి – మన్నెమూకలతోను మళ్లి తోలించఁ
గనుగొని యాదవకంపటీల్ వచ్చి – మన్నెలబొమ్మినేనికి మనవిగా జెప్పి
గోవు గ్రాసము నొప్పఁ గొదలేని పుణ్యం – గోవుల రక్షించుకొండి యీవేళ
నడిగినంతధనము నంపేము మేము – ఆవుల నొకయేడు ఆదరించు మనె
సకలవస్తులు మీకు సమకూర్పగలము – ఒకయేఁడు మీభూమి నుండ నిమ్మనియు
అని యిట్లు పత్రము నప్పుడే వ్రాసి – పల్లవరాజుకుఁ బంపినఁ జూచి
యెక్కడి గొల్లరా జెఱుఁగము మనము – ఏమి యవసరమాయె నెఱిఁగిర మ్మనిన

అతఁ డొచ్చి మీచేత నంది కట్నములు - కప్పు లీయ నీ మంద కంపటీల్ తోడ
మా రాజు కొలువులో మఱి వేగ నిలిచె - నపుడు యాదవులు మాట్లాడ నేరకను
బూడిదఁ గప్పునిప్పుక కయివడిని - త్రొక్కినఁ గఱువని శేషునిరీతిఁ
జివుకిపోయిన కొండచిలువచందాన - వెడమాట లాడంగ వెజ్జులు వీరు
అడిగినంతధనము నంపేను మేము - అనినంత దయదలఁచి యప్పు డవనీశు
చేత నొక్కకవులుచీటి నిప్పించె - మా సీమ నుండంగ మంచిమాటలును
నా మీఁదఁ బ్రళయంబు లాయె మీ పనులు - పేరేమొ లొటిపిటల్, పెదవులు
[మృదువు

కోరిందపాద లెల్లఁ గోరిన ట్లాయెఁ - దేనెను మా భీమినేనికి నిచ్చి
యీ నేల నొకయింత లేకుండ మేపి - పాలేటిగడి సేరి బలిమిని మాట
లాడంగ జనులు మి మ్మవు నందురోయి! - చావక పసులకు సంజీవి యి స్తే
మురిగకుండగ బొమ్మ మురిపే దటంచు - రక్షించువారిని రమ్మని పిలిచి
భక్షింపఁ జూచినఁ బని యింత లేదు - కరువుబడి వచ్చినకాల మై తేను
కాకినెపముల నెన్నఁగాఁ దగు మీకుఁ - గేలింత లాడంగ గెలుతురే మీరు
చెల్లుకాలము మీకుఁ జేరువ యాయె - నెక్కడ బోయెదరో యింక రాజునకుఁ
జిక్కితిరి మీమీఁద శివుఁడు దయ దప్పె - నెన్నఁడు నారదుఁ డేతెంచి మీకుఁ
బంచాంగమును జూచి ఫల మెన్ని నాడో - యప్పుడే సీ పని యంతయుఁ దీఱె
మితి యరమాసము మీఁద నున్నాది - చిక్కుడుదివసాలు చిక్కి యుండగను
నెక్కుడుసేఁత ల వెం తైనఁ జెల్లు - నరమాస మది మీకు నధికమై యుండఁ
బసులకు మీకును బాలేటిలోను - గూలు నని చెప్పిన గుఱుతు నా మాట
వర మిచ్చినతఁ డైన వధియించు మిమ్ము - నేమిటికి జచ్చేరు యే గణకకడకు
వట్టి దుర్భ్రమ మీకు వలవ దీవేళ - చచ్చిన ధనమీక స్వర్గంబు లేదు
ఇచ్చినఁ గలుగును నింద్రలోకంబు - అలనాఁడు పంపెద మన్నట్టిధనము
నొడఁబడినంతయు నొనగూర్చి మీరు - మనవిగాఁ జెప్పుకొని మర్యాద దక్కి
నేఁడు మావల్లను నేర మున్నాది - అని విన్నపము సేసి యభయ మడిగినను
గరుణతోడఁత మిమ్ముఁ గాచు మా రాజు - శర ణని వచ్చిన మరణము సేయఁడు
శరణాగతబిరుదు జరపినవాఁడు - మితియు మేరయు లేని మిక్కిలిధనము
మీరు గడించినటు మీరు చెప్పితిరి - మీరు గడించిన మితి మేర ధనము
ఆపద కొకవేళ నడ్డుపడనీక - దాఁచంగ నా ధనము దక్కునా మనకు
ధనకాంక్షఁబడి భూమి దాఁతురు కొంద - అది గానకయు మిమ్ము నడుగంగరాదు
సగముపుల్లరి యిచ్చి సమ్మతపఱిచి - పరిణాన నుండుఁడీ ప్రజలతో పెద్దు

ఆడితే తప్పనియధిక నేర్పరులు - పలికితే బొంకనిపరమపుణ్యులును
పసిపట్టభద్రులు బ్రాహ్మణి కొప్పి - యెసఁగ బొంకినపాప మేమిటఁ బాయు
సిరకీర్తి గలమంత్రి తిక్కన ప్రెగడ - కారువేలవరాలు నప్పఁ డిత్తు మని
యొడఁబడు మిమ్మును నొకరైనఁగాని - బాధింపగా నోడఁబడితిరో నాఁడు
కార్యకర్త్రిని కరణాన కప్ప - డొడఁబడి లేదంట యొగి లెస్సగాదు
విప్రద్రోహముకన్న విషమైన మేలు - చెప్పగా వినవాకొ శాస్త్రంబునందు
బ్రాహ్మణిసొమ్మును బ్రాహ్మణి కిచ్చి - ......................
సామెత చెప్పేదురు సగమైన నిచ్చి - నా మాట విని పొండి నమ్మి సద్గతికి"

"విను రాయశృంగార! వివరంబుగాను - ఘనమైనరాజు మా కాటమరాజు
ఉత్తర కాంభోజ ఉర్వీశు లెల్ల - తత్తరించఁగఁ బట్టి తలలను ద్రుంచి
కొంకణ దేశాలు కొట్టి సాధించి - వంకిణి కీల్కొమ్మ వరుసఁ జెల్లించెఁ
గాళింగభూమినిఁ గాలావుల మేపి - వెలయంగ సత్కీర్తి వెలసినవాఁడు
ద్రావిడదేశాది ధరణిపులఁ ద్రుంచి - క్రొవ్వు లంచంబుగ గుడిపినవాఁడు
మాగధ మాళవ మతిమారకాత్ముఁడై - మగసింహబిరుదాంక మాన్యుఁడై నాఁడు
ఘూర్జర నేపాళ కువలయేశ్వరులఁ - జెల్లగా గుదియచేఁ జెల్లించినాఁడు
సింధు కాశ్మీరాది క్షితిపాలకులను - గమనించి వారిచేఁ గప్పలందినాఁడు
పరఁగఁ బుళింద భూపతుల నిర్జించి - హేలతో రణభేరి వేయించినాఁడు
కుకుర కొంకణ భూమి గోవుల మేపి - సకలాభిరాముఁడై చతురత మెఱసి
సుధేష్ణ చాళుక్య చోడ భూములను - నెదిరించువైరుల నిల నణఁచినాఁడు
అంగ వంగ భూమి నావుల మేపి - భంగప్రతాపునిఁ బడఁ జంపినాఁడు
పాండ్య సౌవీరాది పతుల నుగ్గాడి - చాణూర మల్లులఁ జంపినవాఁడు
పాంచాలభూ మెల్లఁ బశువుల మేపి - యెంచ గీర్తులచేత హెచ్చినవాఁడు
నుభయవిదర్భ విరోధుల నణఁచి - భుజ పరాక్రమముచేఁ బొలుపొందినాఁడు
కోసల కీరాత కుంతలంబులను - వాసిగా మూకల వధియించినాఁడు
సౌరాష్ట్ర వీరాట సార దుర్గముల - నవకోటిబిరుదంబు నడపినవాఁడు
మరాట లాటముల మందావుల మేపి - నెఱసాహసంబుగ నిలిపినవాఁడు
శూరసేన క్షితిపాలకులఁ గొట్టి - బిరుదుపెండెరముఁ గాలఁ బెట్టినవాఁడు
మచ్చకురు భూముల మందావుల మేపి - చెలగుచు వారితోఁ జెలి మందినాఁడు
మళయాళ గాంధార మహారాష్ట్రములను - చెలరేఁగి బిరుదులు చెలఁగించినాఁడు
బాహ్లిక గాంధార బహుభూములందు - బహుబల శాలి యై ప్రబలినవాఁడు

కర్ణాట తుళుభూమి ఘనతతో మేపి - దుర్జయరాజుల దునిమినవాఁడు
కాశ్మీర పశులను గన్నడుల నోర్చి - భాను తేజం బయి పరఁగినవాఁడు
కాంవీర భూమిని గాలావుల మేపి - నవనాథ సిద్ధుల నయము గన్నాఁడు
కర్ణాట ద్రావిళ గహనభూములను - గోవరా లుండంగఁ గూలార్చినాఁడు
యెవ్వరు కదియించి యెవరు కినిసినను - నెవరు నా రాజుతో నెదిరి నిలిచినను
వానిఁ బోనీయక వసుధపైఁ గూలఁ - బోర నావులచేతఁ బొడిపించినాఁడు
వడసార మీరాజు వధియింతు ననుచుఁ - గంకణంబులఁ చేతఁ గట్టుకున్నాఁడు
నిలుచుట ముందర నీతియుఁ గాదు - వెలసిన సాహసవిక్రమఘనుఁడు
పూని మీ నెల్లూరిపురవరుల నెల్ల - వెనుదగిలి మారాజు వెంటనున్నాఁడు
వదలక పలుమాఱు వదరేవు చాలఁ - గదలి రమ్మనుమి మీ కలవారి నెల్ల"

"అవు నోయి! యాదవయవనీశుభట్ట! - కవితకుఁ బోషణము కలదు మీవల్ల
నేనుఁగు నొకటొంతి యెదిరి పొడిచినను - నీవలావలఁ దూటి యేఁగ నేర్పరివి
కాసాక టీయక కల్లలు నాఁటి - యీఁగి గర్ణుం డని యెంచ నేర్పరివి
యప్పులతో నాట లాడేటివాని - నతఁడు కుబేరుఁ డం చనఁగ నేర్పరివి
పందె మొక్కటిగాని పట్టనివాని - ననహాయ శూరుఁ డం చనగ నేర్పరివి
గంధంబు కస్తూరి యందనివాని - జందనంబే యని చెప్ప నేర్పరివి
తంగేడుపూ వొకటి తల నిడనివాని - వాసవభో గని వదర నేర్పరివి
యెన్నడు సుఖ మను టెఱుఁగనివాని - దేవతాసఖుఁ డని తెలుప నేర్పరివి
స్త్రీలతోఁ జెలిమిని జేయనివాని - నల మన్మథుం డని యనఁగ నేర్పరివి
పలుకు రూపెఱుఁగని పనికిమాలినవాని - వాల్మీకుఁ డని గొప్పపలుక నేర్పరివి
బ్రహ్మయు వని వచ్చి పాడనివానిఁ - దుంబుఱతోఁ దులదూఁప నేర్పరివి
యింత లేకుంటేను నీ మందలోను - యాదవు లందఱు నవునంట యెల్లు
ఎవరిముందర నీవు ఎంచఁ బోయ్యేవు - బూరెగంపలకాడఁ బొర్లుదండాలు
వడి ముక్కుగా నిచ్చు వద్దనరాదు - అయిన నిటువలె నివ్వ డాబెడిమాట
కుత్తర మీయక యొగి నుండరాదు - పిమ్మటఁ దలపోయ వెఱ్ఱితన మగును
నెఱసాహసాత్ములై నేఁడు మా ముందు - సారెకుఁ జెప్పుట జంపు పుట్టుటకు
నుప్పెన కదలునే యుడుతచప్పుడుకు - సరిసేయ నివి గూబజంకులు గాక
యెవ్వఁడు ఘనుఁడు నెవ్వఁడు సుకృతుఁ - డెవ్వఁడో యీ మహిని వెఱవక చెప్ప
చల్ల పిన్నయ్యను సాహసుం డనెదు - తొల్లి యతఁ డెవ్వరితోఁ బోరి గెలిచె
నాతనితమ్ములు నతిశూరు లంటి - వటుక్రితం బెవరితో నని సేసి గెలిచె

వారివద్ద జాంబలివాడ సంతతి భట్ట - పరికింపగా జమిడిపం బనువాడు
పోటుబం టని చాలఁ బొగడితి వీవు - సాటికి నెవ్వరిఁ జంపినాఁ డతఁడు
బొల్లావు నెక్కువగఁ బొగడి చెప్పేవు - బొల్లావు మును పేడ పోరిలో గెలిచె
మసిలినేనిపుత్రుఁడు మన్నీఁడు బిరినాయఁడు - అసహాయశూరుఁ డని యతనిఁ [జెప్పితివి
పుట్టినయదోనాఁడు పోలిసె తలి తండ్రి - నాఁడె గైకొని పెంచె నంముల శిరిదేవి
తల్లిచన్నులపాలు తనివారఁ గుడిచేన - తల్లిదండ్రులవద్దఁ దగఁ బెరిగినాఁడో
పోతపాలఁ ద్రాగి పొట్టఁబట్టినదా - యాత డెవ్వరితోను పనిసేయఁ గలఁడు
బోడావుల చెన్నయఁ బొగడితివి చాల - నేడఁ బొడిచి గెలిచె నెక్కడఁ జంపెఁ
జెప్పట్టకత్తులు చెంపశిఖలె కాని - చెప్ప నేమిటి కతనిచేత నే మాను
ఎరనన్న ఘనుని మహాయెక్కువగ చెప్పేవు - సరిసేయ నేరాజు సాటికి వచ్చుఁ
బొటెడియావులఁ బట్టనే కాని - చేరి జగడ మొకింత సేయఁగా లేఁడు
చట్టువా ర్క్రయ్య సాహసుఁ డంటి - మొదలు చట్టుగల్లు మొసలపై నిలుచునా
నాచకూళ్ళనాయని నాయము చెప్పేవు - కొంచెపుబంట్ల నెంచ గొదవయు గాదు
అతిపరాక్రముఁ డని యయితమరాజు - సారెకు మాతోను జదివేవు ప్రజ్ఞ
అతఁడు సాహసి యైతె యాట చెరుకూర - పోలురాజు నొసటిపోటును దాఁకి
మట్టికిఁ దలగడగ మందలో జెల్లె - తండ్రిపగ దీర్చక తా నెందుఁ బోయె
నెక్కువ సంపదల నెలకొంచి పోయి - నాఁడు వెఱచినవాఁడు నేడు రా వెఱచుఁ
బుత్తమరాజును బూని చెప్పేవు - ఎత్తుసాగటాలాట నెఱుఁగనివాఁడు
తనకడ గెలిచితే దగ్గఱవచ్చు - ననువు గాకుంటేను నటు మళ్ళిపోవు
బుద్ధి పోవిడి దుష్టబుద్ధులు దలఁచి - యనిలోనఁబడి చావ నతనికి నేల
పోచయ్య ముమ్మయ్యఁ బొగడి తింటాక - వే చూపు మెక్కడ వెలసి రనిలోనఁ
బలుమాఱు లాతనిబలము చెప్పేవు - లోట చేత్తామని లోకంబు నెఱుఁగు
కరియావులన్నను ఖడ్గసుఁ డందు - ఓరుగంటి జగడాన నొకనాఁడు పిలిచె
నోరుగంటిమూక నొకనాఁడు గదిమె - శారికకుఁ దెలుపను శాస్త్ర మున్నాదె
పెద్దలికములు సెప్పి ప్రేలేవు గాక - తఱుచు వదరక ధనము సగునఁ బంపు"

"రాజుతోఁ బలుమారు రావోయి! యెదుట - రాజులఁ జెప్పెను రాయశృంగార!
యేరాజు సాహసుం డేరాజు ఘనుఁడు - నే రాజు పుణ్యాత్ముఁ డెఱిఁగింప [వోయి!
క్రొవ్వూరగాఁ బలిసి కొలువు గూర్చుండి - జగజంపుమాటచేఁ జాటి పల్కెదవు

సారిది సమ్మతముగా సోమరుల నెల్ల - నేలచెప్పెద వీడ నెక్కువసేసి
మతిమాలి సుజనుఁ డని మఱి పొగడేవు - మనుమసిద్ధిరాజు మఱి యెన్నఁ దగదు
దశరథరాముండు తనపౌరుషమున - వరుసతో మీపురివద్దను నిలిచి
ముయ్యేడుదినములు ముట్టడి వేసె - నతఁడు సేసినసేఁత యది నాట లేదా
ఘనముగా నలసిద్ధిఘనుఁ డన్నమాట - యస్తవ్యస్తుం డతఁ డని చెప్ప నేల ?
దండు గూడినయపుడె తలసూప వెఱచు - నెఱసిద్ధిరాజును నెన్నకు భట్ట !
యెక్కడ బొడిచెను నెక్కడ గెలిచెఁ - గదిసిన చీఁబోతుగాంభీర్యమేను
నలసిద్ధిరాజును తలపకు భట్ట ! - యెడమచే కుడిచేయి నెఱుఁగనివానిఁ
గొని యేకపొగడుచుఁ గొండసేసెదవు - పాపసిద్ధిరాజు ప్రజ్ఞ చెప్పకుము
జగడ మింతెఱుఁగఁడు సాహసి గాడు - నీతిమంతు డటంచు నీవు చెప్పితివి
యేరీతి యెఱుఁగని యేకాంత మతఁడు - పిక్కతోఁ జేసిన పీకైనపాయ !
కొమరసిద్ధిరాజు గుణమైనవాఁడు - పలికితి సభలోను పలుమాఱు నీవు
కల్లలాడితి భట్ట ! కావరంబునను - రాయబారానకు రా జని వస్తి
పోరుపొం దెఱుగవు బుద్ధేమి లేదు - తిక్క యెత్తెనా లేక దెస తప్పినావా
బలు వైనభూతము పట్టెనో నీకు - పైత్యమెక్కెనా లేక భ్రమనుగొన్నావా
యెప్పుడు చాదస్త మేమైనఁ గద్దా - పాడి గానిమాట పలికేవు గాక
యొప్పినమాటయు నొకటయిన లేదు - బ్రహ్మరాక్షసి నిన్నుఁ బట్టెనో లేక
తడఁబడ నేఁటికి ? దగదొట్టినావా ? - రాజశృంగావళి ! రమణతో నీవు
తగవు వివేకము తప్పి తిరిగేవు - ఏల యీలాగునఁ బ్రేలేవు భట్ట !
ప్రజ్ఞలు నిచ్చటఁ బనిసేయరావు - కడుఁ గ్రొవ్వి మాతోను గచ్చకు రాకుఁ
జెడఁ గారణము మీకుఁ జేరిక యాయె - మునుపును మీరును మూర్ఖు లని చాల
మమ్ము నడుగ వారి మదముల నడఁప - మఱి మేము కోటపై నెఱయ దండెత్తి
లావులు మెఱయించి లగ్గల కెక్కి - పట్టణంబును గొల్లబెట్టేటినాఁడు
నీ రాజు రాలేదా నీ వపుడు లేవా - బలిమి చెడిపోతిరో పరిజనము లేదా
పోయి బంట్లును దండు పోయి రాలేక - సిద్ధిరాజుకు మొదలు సిగ్గింతలేదా
కోరి చేతుల కూర కోయఁబోయితివా - మదియించిరో చూడ మది దప్పినారొ
వరుసతోను నగళ్లవారు దోఁచంగఁ - బొంచులు నున్నారొ ప్రొద్దులుగూకఁ
జెలఁగి మీపట్నంబు చెరుకూరు సేయ - పగ నిర్వహించనిబ్రతు కది యేల ?
కటకటా ! క్రిందుమీదు కానవు గాక - కుటిలబుద్ధులు మీకుఁ గొఱగావు భట్ట !
వడముడిగాఁ జొచ్చె వాంతి వెళ్లంగ - మఱియును వినవోయి ! మామందలోను
మిన్ను చెడబడ నుఱిమి మీఁద వచ్చినను - నరచేత నాచేటియధికు లున్నారు

సిద్ధుఁ డాతఁడు పరస్త్రీవర్జితుఁడు – వితరణ కర్ణుండు విఖ్యాతిపరుఁడు
మతిమంతు లెంచఁగలమంచిసజ్జనుఁడు – పుణ్యాత్ముఁ డగు పెద్దిభూపాలసుతుఁడు
కాంతిచంద్రుండు మా కాటమరాజు – ఎఱుఁగవా యో భట్ట! యిఁక నొక్కమాట
యెఱుక మఱపు లేదు నెన్నఁ బగవారి – కెన్నఁడు చూపండు ఎన్నిచూచినను
జే తప్పు వాతప్పు చెదరనీఁడండె – పిఱికికండయు లేనిబిరుదుసాహుతుఁడు
కాటమరాజుతోఁ గలియుగములోను – నెవ్వఁడు రణభూమి నెదిరించఁ గలఁడు
శాకతో మారాజు టముకు సేయంగ – దక్షిణదేశంబు తల్లడం బందెఁ
బాకనాఁడు చెదరెఁ బలినాఁడు వణకె – గౌడదేశం బెల్లఁ గళవళ మందె
ములికినా డంతయు నులికిపడె నాడు – కాకినాఁ డంతయుఁ గాకిపా రాయెఁ
గంచి భయం బందెఁ గటకము జడిసె – గుత్తిరాజులకెల్ల గుండెదిగు లాయెఁ
జంద్రగిరి రాజులకుఁ జింత ఘన మాయె – నాదోని రాజులకు మోదంబు దప్పె
దనకొండరాజు పెద్దఱికము లుడిగెఁ – గాటమరాజును గడుఁ జెప్పినపుడె
కడుపులోఁ బిండాలు గజగజ వణఁకెఁ – జెలఁగి మారాజును జెప్పినచోట
భూమెల్ల మంచువలె భోరునఁ గప్పెఁ – బెద్దిభూపతిసుతు పే రన్నయపుడె
వెన్నిచ్చి మన్నీలు పెన్నఁబడి చనిరి – వలురాజుమనుమనివార్త విన్నపుఁడె
వాగర్తి మేరగా వలసలు దీసె – యాదవరాజును నెంచినచోట
నెంతవానినినైన నే పణఁగించు – బలముఁ జెప్పెదు భట్ట! నిలిచి మా యెదుట
నెద్దులే చాలు మీ యేనుగులఁ జంప – సలుగుటెద్దులు మిమ్ము సమయింపఁ జాలు
బొల్లావు మీరాజుఁ బొరిగొనఁ జాలు – దిక్కులు చూచేరు దెసదప్పినారో
పల్కినమాటకుఁ బ్రతిపల్కు లేవు – ఉన్మాద మేమైన నున్నదో యేమొ
దిమ్ము తలకెక్కెనో దెస తప్పినావో – కటకటా! వుల్లరికా నీదు రాక!
యెఱుకగలరాజు మా యయితమరాజు – అర్థికల్పకము మా అయితమరాజు
కొట్టి పగవారిని గుట్టలు వెట్టు – నాజి నుత్తముఁడు మా యయితమరాజు
అయితమరాజుకు నతికూర్మిమఱఁది – పుణ్యవైభవశాలి పుత్తమరాజు
పున్నమచంద్రుండు పుత్తమరాజు – భుజపరాక్రమశాలి పుత్తమరాజు
కొప్పుకొండభూమిఁ గొదవ లేకుండ – గడుసాహసంబున గవనిలోఁ జొచ్చి
భీకరంబుగఁ బట్టి బెబ్బులిఁ గొట్టి – బబ్బరించఁగ గవనిబయటకుఁ దెచ్చి
కొంకులగాలాలఁ గుప్పించి పట్టి – వీరన్న కంబాన విఱిచికట్టించె
నట్టిసాహసుఁడు మా అయితమరాజు – భూసురాశీర్వాద పుణ్యాత్ముఁ డగును
పుత్తమరాజు తానుకుక్కంబమును – వయినానఁ దన్నెను వగి నొక్కనాఁడు
కక్కసపువైరుల కడుపులు చించి – చెనగిన పగవారి చర్మము లొలుచు

గబ్బి విరోధుల కండలు చెండి – చెండాడి రాజుల చెలరేగి బొడుచు
రట్టడిపగవారి రణముసేఁ ద్రుంచు – బట్టయినపగవారిబలము నుగ్గాడుఁ
గుచ్ఛితపురాజులగుండెలు పొడుచు – సిద్ధిరాజులబలముఁ జీకాకుపఱుచుఁ
బుత్తమరా జొకడు పోరిలో సిద్ధి – భూవరుదళమంతఁ బొరిగొనఁ జాలు
నెఱినన్న పౌరుషము నిటు విను భట్ట!.. రాజుతమ్ముఁడును విరాజులదిసలు
కలనైన శంకనుగనట్టివాఁడు – పదివేలకైనను బదరనివాఁడు
లక్ష్యపెట్టఁడు నూఱులక్షలనైన – నొరసిన రాజుల నొక్కలాగునను
దుర్మార్గులను బట్టి తృటిలోనఁ ద్రుంచు – సమరంబు చేసేటిసమయంబునందు
నాడినమాటను నాడనిరాజు – నిర్మూలముగఁజేసి నెల్లూరు సంత
రమ్మన్న వచ్చును రాయశృంగార! – వెన నొకటమాటను వినవోయి! భట్ట!
కడగొట్టుతమ్ముఁడు కాటభూపతికి – మమ్మయ్య యనువాఁడు మొనసినవేళఁ
గెరలి మూకలనెల్ల కిటకిటపఱుచు – వెన్నిచ్చుసేనల వెనకంజవేసి
సమరంబులోపలఁ జంపెను గాక – విడుచునా యూరక వీరుండు రాజు
భట్టని వచ్చేవు బంధుల బిలిచి – పాటిపొయ్యేవారు భట్టనఁ దగునె
భట్టావుల వలభన్న పౌరుషము వినుమ – యేనుఁగు ఘటములు హేరాళముగను
నెత్తివచ్చినఁగాని యెల్ల యేనుఁగుల – సింహంబుకైవడిఁ జీకాకుపఱుచు
మరలి సంగరవీధి నరుల సాధించి – యవలీలగాఁ బొడుచు నారాజఘనుఁడు
అతనికంటెను ఘనుం డతివిక్రమమును – గలిగి వెలసినవాఁడు కరియావులన్న
వాలిసుగ్రీవుల బాహువిక్రమముఁ – గలిఁగి వెలసినవాఁడు కరియావులన్న
గజరాజుకంటెను భుజపరాక్రమముఁ – గలిగి వెలసినవాఁడు కరియావులన్న
చక్కనివారిలోఁ జక్కనివాఁడు – బిరుదులగన్నాఁడు పేరెక్కినాఁడు
తోరంపురత్నంపుఁ దొడవులవాఁడు – మీటినవైరుల ధీరత మెఱయ
వనరంగ యాదవవంశంబునందుఁ – గలియుగభీముఁడు కరియావులన్న
రట్టడితన మేల రాయశృంగార! – గట్టిగా నిటు విను గర్వంబు మాని
యేల శంకిల వీరు లెదిరినఁగాని – కాలాంతకుండగు గాటమరాజు
డమరు త్రిశూలంబు తగ మూఁపుకండ్లు – గలదేవుఁ డెంచ మాకాటమరాజు
తగ శంఖచక్రముల్ ధరియించినట్టి – కరివరదుఁ డెంచ మాకాటమరాజు
వర్ణింప యాదవవంశంబునందు – గర్ణుఁడౌ నీవి మాకాటమరాజు
అర్జునుకైవడి నరివీరవరుల – గర్జించి గెలుచు మాకాటమరాజు
కండతుండెంబులుగాఁ జేయు ననిలో – గద్దించు రిపుల మాకాటమరాజు
పాండునందనులతోఁ బ్రతి యెంచవచ్చు – రణశూరుఁ డైనట్టిరాజశేఖరుఁడు

విరుతికెక్కిన బాహువిక్రమోన్నతుఁడు – తనరు షోడశమహాదానవినో
వినయభాసురుఁడు వివేకసంయుతుఁడు – అతులప్రతాప మహాధైర్యశాలి
దురితదూరుండు బుధతోషితాత్ముండు – శాస్త్రపాత్రుఁడు సర్వశాస్త్రకోవిదుఁడు
నిఖిలసమర్థుండు నీతిపాలకుఁడు – కాంతిచంద్రుండు మా కాటమరాజు
పొట్టకావరమునఁ బొదలి యిచ్చోట – భట్టనంచు నువచ్చి పలికేవు గాక
యొకనికిరీటంబు నొకపౌరుషముగ – నొకని మాయుండర నొక కొండఁ జేసి
పూని చదివెద వీడఁ బొద్దేమి పోద – యందెలబండివలె నాడెడికి సైచి
నిందలు పల్కెను నీతియా నీకు – టక్కులు నిక్కులు టక్కరిమాట
లాడకు మూర్ఖత నటు చాటకుము – హాఁకి నాపరువయి యడవిలోపలను
గురుతుగా వెలసినగొల్లలు వీరు – పాడుకొని సంపదలు ప్రఖ్యాతిగాను
యదువంశ మప్రటను నెఱుఁగవా భట్టు! – యెవ్వారి ముంగల నీప్రజ్ఞ లెల్లఁ
దవ్వుగా నలసిద్ధిధవుని దెల్పెదవు – పేరు సిద్ధిరాజు పెద్దరికము కాని
యేకాంగి జగడము నెకరుఁ జేసెఁ – బాడిచేటిమావద్దఁ బొగడకు భట్టు!
బంటుతనముల నీపెఁ బచరించబోకు"

"వినవోయి! యాదవవీరులభట్టు! – జనసమ్మతంబుగాఁ జెప్పెద బుద్ధి
సారెకు మాతోను సామ్యము లేల? – సామంతదేవుఁ డని సరఁగ బెదిరింతు
బేతాళుఁ డగుగాక భీతేమి మాకు – గట్టిగా నీబుద్ధి గైకొని వినుము
నది యెట్టిమట్టిపై నడచెనో యేమొ – యెఱ్ర పల్నాడదా యెఱ్రమట్టిలోను
సాము చేసినవారు జగడంబుచేస్తే – యీ మహి జనులెల్ల నేఁడు బ్రదుకుదురె
అలనాఁడు సామునేయఁగ యాదవులతో – కాలుననున్నట్లు కాదు కయ్యంబు
బలిమిఁ బీనుఁగులై రిపులు సమసినపుడు – కలహమాడినయట్లు కాదు కయ్యంబు
అన్నదమ్ములరాజ్య మది క్రుంగఁద్రొక్కి – ఘనత నెక్కినయట్లు కాదు కయ్యంబు
తలపొలములో బెదరి నిలబడ్డగోవు – కలవిలుచుకున్నట్లు కాదు కయ్యంబు
ఆవుల కాపరివి అటు పాలు నీళ్లు – కలిపి త్రాగినయట్లు కాదు కయ్యంబు
ముద్రుపాలును జున్ను ముద్దలు మెసవి – గఱ్ఱుఁ ద్రేపుట కాదు కయ్యంబు
చేసినవెన్నల సెగపొంతఁ గాచి – కాసున కమ్ముట కాదు కయ్యంబు
గోవులావులపాలఁ గుండల నించి – కావళ్లుమోయుట కాదు కయ్యంబు
పశువులఁ దోడ్కొని పోయి భూములను – గసవు మేపినయట్లు కాదు కయ్యంబు
బానపత్రా లిచ్చి పండినచేలు – గాసిపుచ్చినయట్లు కాదు కయ్యంబు
అడవులఁ గొండల నావుల మేపి – గడిసేరియున్నట్లు కాదు కయ్యంబు

సిద్ధిరాజులభూమి చెలరేఁగి మేసి – గద్దించి పడునట్లు గాదు కయ్యంబు
చెలఁగి మాటలెకాని చేత నేమౌను – మాధవుఁడు నలనన్న మానాఁటిగాఁడు
మారాజు జగడాన మీరు చాలుదురె? – మనసున వారిధుల్ మఱి దాటవచ్చుఁ
గనుగొని కాలువఁ గడు దాటరాదు – మాటలే పోట్లైతే మదగజముఁ జంప
నీకేటుఁ గత్తులు నేల గడింపఁ – బొడుపొడు మనుమాట పోటులై తాకితే
కడనుండి సేయరా కయ్య మెంతైన – జావడికిని రాక సమరసం బగునె
వివర మింతయు లేక వెఱ్ఱివైనావు – రచ్చ లేటికి నీవు రాజు నేరిచితే
నిచ్చవచ్చినధనము నిత్తురు నీకుఁ – బొర్లింపు మాటలఁ బొర్లబోయ్యేవు
కుటిలబుద్ధులు నీకుఁ గూడునే రాజ! – చుట్ట చుట్టుక యెంతసుడిగిన పాము
పుట్ట జొచ్చేటపుడు పొడుగౌర వలదె – దూరాన మీరెంత దురుసు లాడినను
నేర్పుతో బలుకాడీ నెల్లూరి నృపుతో – గొల్లమంద బుద్ధులు కుమాచ విక్కడను
గుట్టుతో మాధనము గుఱిఁ దీర్చుకుంటే – చట్ట నెత్తింతుము సర్వదా చూడు
ఎరనన్న మీయొద్ద నెడఁబాయ దివిని – నరిగాలు నానించినప్పటికిఁ గాని
ధనము నొప్పింపఁగఁ దలఁపరు మీరు – ఇంత చేసినగాని మటువలె నుంద్రో
పుల్లరీయక మీరు పోసలుచుండెదరో – పంతాలుమాని మాపైక మిచ్చెదరో"

"మేలు! భళా! భట్టు మెచ్చవలె నిన్ను – గాలి జముదాడిసెటఁ గరముపది రేవు
ఇంక నీబుద్ధుల నేల చెప్పేవు – బొంకులే యుగ్గుగాఁ బోసింది తల్లి
వంకరదంపాలు వడవడమాటలు – మాకుఁ గానఁగవచ్చు మఱియేల చెప్ప
అదిగోను పులి అంటె యదిగోను తోక – కానవచ్చె నంటి కడు నేర్పుతోను
సిద్ధిరా జెచ్చట సేనలు నేడ – వచ్చె నీశ్వరుదండు వచ్చెడు నంటి
ఊరకే పొగడుచు నూరేలా చెప్పు – అవనిలో నేలాగు అగ్నిరాజైనను
వెఱ్ఱివిగాని వివేకంబు లేదు – సారెకు సిద్ధిరాజు సాహసుఁ డనుచు
నాపూఁచిఁ జెప్పేవు యాదవుల యెదుట – నేయూరు సాహసం బేయూరు రాజు
చవుబాసి మాటలు చక్క నేర్చితివి – యాచకులకుఁ బరియాచకుఁ డగుచు
చూస్తిమి నీయందు సుకృతము లేదు – ఆసాదిగానివలె నప్పటప్పటికి
మూస్తు తెలుచుచు వత్తు మురిపెమే లేక – బ్రహ్మపురివాడలోఁ దమ్మిదొరసాని
యెమ్మెలు నెత్తులు నిచ్చోటఁ జెల్ల – వేతాపుమాటలు నాతావునందె
చేతకాని వాదాలు సైచవు మాకు – వదరుకూఁతల నిట్లు వదరకు మనుచుఁ
జదువుచెప్పినగురువు చాటడా నీకుఁ – నుపదేశగురుఁడైన నాగి జెప్పలేదా
చెప్పక యుండంగఁ జెడుగుణము మీకుఁ – దప్పించగా లేరు ధర నెంతవారు

సజ్జనులకు బుద్ధి సరిజేయ వచ్చు - మూర్ఖుల దెలుపను ముక్కంటి వశము
వదరుబోతులు నెంతవారౌదురైన - బ్రాప్తంబు లెఱుఁగక పడుదురు భువిని
భూసురాశీర్వాదపుణ్యు లౌవారి - దూషించువారును దుర్గతి పడుదురు
భయ మెఱిఁగి నీతులు పలుకంగ వలయు - నది నీ వెఱుంగ వబద్ధకుఁ దగుట
వదరుకూతలు చాల వదరుచు నిక్కి - పట్టభద్రుం డైన పశుపతియెదుట
మొట్టగోడిగవలె మిట్టిపడియేవు - రాయబారము నాఁడ రావాము భట్ట!
నీతిమాటొకటైన నేర్చుకోవద్దు - కాకరకాయలు కడుపెద్దకాఁగ
జే దెక్కు వపునట్లు చెలఁగె నీగుణము - గోదకొని కోమాలు కొప్పరించుకొని
యదలించవచ్చేవు అంతకంతకును - దుడుకుమాట లవేమి దుర్భాష లేమి
చలిచీమ గఱచిందో జన్ని పుట్టిందో - ఉలికిపడుచున్నావు ఒకొక్కవేళ
దొర్లసరస నుండి దొరసిరి నంది - బర్లకాపరి కాదు భట్టువు గావు
వెట్టితిన్నట్టుల వెక్కిరించేవు - తర్లిపో నీనత్తి దయ్యము గొట్ట
పుల్లరేడది భట్ట! కల్లలాడితివి - పల్లవ నలసిద్ధి పంపెను నిన్ను
సద్గుణుం డని చాల సభవార లెంచి - చదువుల శారదనుఁ జాలినావంచుఁ
జదువనే మఱచి సెలవి సత్యంబు లేదు - అంధుని బోలినవైతివి నీవు
మంచివాడ వనంగ మహిపతి యొద్దఁ - గొంచెపుబుద్ధులు కొఱగావు భట్ట!
బ్రల్లద మాడేవు పుల్లరి యనుచుఁ - జెల్లదు నీప్రజ్ఞ చాలించు మింకను
నెల్లూర నుండంగ నీతిగా దనుచుఁ - బల్లవ నలసిద్ధి పగఁ గల్గి పంపె
సంపిన వస్తివి యస్త వ్యస్తుఁడవు - గాక కంపటులు మీకైరగాం డ్లనక
పసుపాతరలోకి వస్తివి గాక - పశువులు ద్రొక్కని పాఱిపో భట్ట!
పయ్యావు తొర్లించి పడఁ ద్రొక్కి పోయ్యాని-చయ్యన నొకదిక్కు జరుగుమా భట్ట!
సిద్ధిరాజునకును బుద్ధేమి లేదు - వద్దని చెప్ప మీవద్ద ధృతిలేదు
పెద్దవాఁడవె కాని బుద్ధింత లేదా - కూతుపంతాలు నిక్కులు నేర్చినావు
అర్భుఁడవు గావంచు నావంతగూడ - జేపట్టఁ డెన్నఁడు సిద్ధి నీ మాట
యీశ్వరపుత్రుఁ డని యెంతురు జనులు - కాసుకుఁ గొఱగావు కైకోరు నిన్నుఁ
బూజమానుండవై రాజునొద్దుండ - బాధ్యుండ వసఁగా వబాధ్యుఁడవె కాని
ఈడ నా డని దిక్కు లింతియే కాని - యెన్నఁడు నింతేసి యెఱుఁగము మును
ఎఱసిద్ధిదళములు హేరాళ మనుచు - వెఱపింప వచ్చేవు వే సాల భట్ట!
మందలించగనేల ముందుగా నిన్ను - నూర్లు నాపైఁ బదినూర్లు లక్షలును
దర్లి రమ్మనకుంటె తలిదండ్రులాన - యెందఱు వచ్చిన నేమి చేసేరు
మండలాధీశుని మాధవునిబలము - లమితవిక్రమశాలు లత్యంతబలులు

సమర మన్నప్పుడె సంతోష మౌను - గొల్లకాండ్రమూక కోటానకోట్లు
పల్లవరాజులబలము లెంచెదము - కాయకున్న పెద్దకమికె మన్నెపు
దగ్గరికిఁ బోవంగ ధైర్యంబు లేదు - దూరానఁ బెట్టినతురాయులదండు
అలకోలపెట్లకు నాగ దన్నట్లు - ఆశ వచ్చినవారు చేశేర రణము
బోటుమాటల నెన్ని పో నేర్చుకొంటి - వారిధి జలములు వర్షించినట్లు
పేంరాశముగ వచ్చి యేమి చేసేరు - అగ్నితాకు నిమిత్త మడలి రణభూమి
యగ్ని తగులుపడి యడవంతఁ గాలు - నంతటివారు మా యాదవు లరఁగ
సంతతిరాజుల సమయింపఁ గలరు - యదువంశతిలకులు యాదవపుఖ్యా
లదరుబెండెలు లేని యసహాయవరులు - బెదిరించ వచ్చేవు బెబ్బులినలెను
తిమరక నెల్లూరు తిరిగి పో భట్టు!"

"ధన మది యెంతమాత్రము గొల్లరాజ! - తగవు దప్పితిగాక ధనముకై నీవు
............ చావఁ బోదువు గాక - అట్టంట యేమంట యాదవరాజ!
మంచితనంబున మాభూమి వచ్చి - పశువులు మేపితిరి ప్రఖ్యాతిఁ గాను
గోగణము మేపితిరి కొదవ లేకుండ - నంమతు సహియించె నలసిద్ధిరాజు
అదియునుఁ దలఁపవు యాదవరాజ! - అన్యాయ మగు నీది యాదవరాజ!
సత్యము గలసిద్ధిజనపాలుమీఁద - స్వామి ద్రోహముతోడఁ సణిగితివి గాక
ఇక్కడ నక్కడ నెవరు చూచెదరు - ఈశ్వరుండును నీకు నిచ్చెనా లేక
ధర్మ మింతయు లేదు తగదు మీబుద్ధి - ప్రల్లదమాడంగఁ బౌరుషం బౌనె
పాండుభూవరుమతులు వరఁగ నందఱును - ధర్మజుకంటెను దగ బుద్ధిశాలి
నలసిద్ధిరాజును నమ్మఁ జాలుదుము - నకులనందనుకంటెఁ బ్రకట విక్రముఁడు
కొమరసిద్ధిరాజును గృహస్థుఁ డంద్రు - సహదేవుకంటెను శాస్త్రజ్ఞుఁ డనుచుఁ
బావసిద్ధిరాజుఁ బ్రజ గొనియాడు - నయిన నాపాండవు లయిదుగురికంటెఁ
బాటి సేయఁగ వచ్చుఁ బ్రభు సిద్ధిరాజు - ఆరాజుతో సాటిలేరు ఎక్కడను
బయిసిమాలును మీకు బాసలే దింక - మారాజుచేఁ జిక్కి మరియును దిరిగి
యెక్కడికిఁ బోఁగలఁడో యీగొల్లరాజు - పగఁ జెడి మందలఁ బాపేడు గాక
చలము సేయక ధనము చెల్లించు రాజ!'

"పాలిలోఁ బాలి గెల్చి ప్రజల మెప్పించి - మలిదేవి వెంటను మందావు లుండఁ
గడుఁ బట్టభద్రుఁడు కాటమరాజు - కొలువుఁ దీర్చియుఁ దాను గూర్చుండఁగాను
అంతట నే మని యఱ్ఱయ్య పలికె - 'నన్నరో! యోయావులన్న! యాలింపు

లేక లేకను గల్గె లోకరక్షణము - పాలిలోఁ బాలిగల్పి ప్రజల మెప్పించి
యరుదెంచినావు మహానంద మనఁగ - 'తమ్ముఁ తమ్ముండ! యచ్చయ్య యని పిలిచి
ఆవుల వేయించినందుకు నేఁడు - మన్నె దుర్గాలను మరల సాధించు
ఆవుల వేయించినందుకు నరుణై - యాదు కోవట్నాలు నటుల పాలించు
ఆవుల వేయించినందుకు ముందు - పసుల వేసిన వారిపల్లెను మరల
మువ్వాగురు సెలవిచ్చెఁ దమ్ముఁ డెట్రియకు - వేలి యుంగర మానవాలుగా నిచ్చె
నానవా లందుకొని యచ్చయ్య యంత - పథస్థంగా తీపి దవికిఁ బొంగళ్లు
పెట్టించవలె నని పెన్నలొండిరి - పచ్చాకుపందిళ్లు పడకిచె పతేరు
పాలతోఁ బొంగళ్లు చాలఁ జేయించి - సూర్యునికిఁ జెల్లించి సూర్యోదయమున
జమిలిమందకు నడుమ జయభేరి వేసి - సమనేడు కోటుల సంకెధేనువులు
మిడుతలదండుగా మీరి యామంద - లన్ని నెల్లూరిపై మిన్నంది కదలె
నేలపల్లెలు బెదరి నెల్లూరఁ బట్టె - నలురాజు మనుమసివార్త విన్నంత
నాగన్న మేఁగా వలసలు దీసె - బెద్దిరాజు కొమరుని పేరు విన్నపుడె
పెన్నబడి రాజులు వెన్నిచ్చిచనిరి - అరిగెలును మేసె నగిసెఁ గోరాజె
బండుతీగెలు మేసెఁ బసస కోరాడె - నిత్య వెయి పుట్టేటిసిమ్మఁ గోరాజె
పరుపుగలసంపెఁగెలు పరఁగంగ మేసె - బ్రొద్దు నెయి పుట్టేటిపసజెలగాంచు
బొద్దుమల్లెలు మేసె బొప్పావు లిలను - నల్లమలతోటలు నగ్రావులు మేసె!
బుల్లిని అల్లము పురుల మేపించి - కోసేటిరాజనము కొయ్యకరికట్టి
వేసేటికుప్పలు వేయు కరికట్టి - యెండువరి ద్రొక్కించి పండువరి మేపి
నేమాలబావిలో వే నీళ్లు చేది - నలసిద్ధి చూడఁగావలె నని రాజు
కూర్చుతమ్ముండు దెలి గూడారు నెత్తి - కోరుఁడు మేపియుఁ గోటపై రాగ
కన్నమదేవుల కడుఁగూర్చుచిలుక - యోడబేరి పంపిన యొప్పులకుప్ప
పడపప్పు బెల్లము నరుసగా మేపి - పంజరంబునఁ జిల్క బదిలము సేయు
బంగారుగొలుసులు పసఁగఁ దీయించి - చిలుకను బంపెను వెలికిఁ గన్నమ్మ
చిలుకపల్కులకును జిత్తాలు మండి - వేలుపుధేనువులు విసవిస లాడె
బసిభాష దెలిసినపరమపుణ్యుండు - ఈరాజు చెలికాఁడు నీరాజు మఱఁది
పద్మనాయఁడు చూచి పసఁగ విల్లందె - నాయఁడు వింటికి నారి యెక్కించెఁ
బిడిపట్టు ముత్యాలు పదివేలు సేయు - నకుపట్టు ముత్యాలు ఏడువేల్ సేయుఁ
దలగడ ముత్యాలు ధగధగ మనుచు - సూర్యుని నావింటఁ జూచినట్టుండుఁ
జంద్రుండు నావింట జ్వలియించుచుండు - బ్రమాడు విల్లు గాదు మఱి భూతవిల్లు
పోలురాజు బాణము పొది వెళ్లఁదీసి - వాలాడి బాణము వంకలు దీర్చి

తనతమ్ముఁడును జవుదంతి యేనుఁగుల - జగజంతు క్రోల్పులి సామంత గొల్ల
చట్టువారెర్రయ్య సరఁగున బిలిచి - 'రావోయి! తమ్ముఁడ! రమ్ము యర్రయ్య
పంట్లకు వచ్చినపక్షు లయితేను - ఇంతకు వచ్చేన యెటో పాఱిపోవుఁ
బారవచ్చిన చిల్క పోక నిలిచింది - శృంగారవనములోఁ జిగురుమామిడిని
జిలుక వ్రాలినది కూర్చినయట్టి చిలుక - వెయ్యిఁ బంతముగాదు వెలయంగ మనకుఁ
గోటి గోపకులచేఁ గొవ్విన నార్చి - చెప్పట్లు గొట్టించి చిలుకఁ దోలించు'
మన మహాసంతోష మాయె ననిపలికె - ......................
చిగురుమామిడిమీఁదఁ జిలుకఁ దోలించె - నెగురఁ దోలిన చిల్క నేసె
(రాఘవుఁడు

చిలుక బాణముతాకి సిద్ధిరాజునగర - వ్రాలెఁ గంబాన నాబాణముదోఁడ
బాణముఁ దీయించెఁ బట్టపుదేవి - చిలుకయు మూర్ఛిల్లె నాళువరికట్ట
వెంబడిఁ జిలుకను వెస బాఱవేసి - బాణము తననగర భద్రంబు సేసె
వింటికోల రాక కాని విడిదిక్కు రాను - పొదికోల రాక కాని బొం చేయ రాను
తూరుపు తెలవారెఁ దార పొడువంగఁ - బడమటఁ బొద్దుగూకె బ్రహ్మాదు లెఱుఁగ
రాయిడిగుబ్బలిగాడుగు పద్మరాఘవుఁడు - పారటీగ గదలి వచ్చి నిలిచెను
చక్కగా దూరాన సర్వేపల్లి గవనివద్ద - చల్లవారిగోసంగి చమిడినాయనిబొమ్మ
నూరుపుకొత్తళాన తూగుటుయ్యాల - ఆరువేల పిడికత్తులు అనుమ
[నాయని చెన్న

............ రాచకొమాళ్లు - పావురాల్ దోలేటిపయ్యాలి బైట
దేవపూజ గుడాల్లు ధేనువు నిలిచె - పెనుగొండగవనివద్ద పెరుసాల బైట
పెయ్యాల యెరనన్న యెద్దులు నిలిచె - ఉత్తరపుగవనివద్ద నూటబావులవద్ద
నుత్తమకామధేనువులు యెల్ల నిలిచె - కోటసందునఁ జవుదంతి కొమ్ము టేనుఁగుల
జగజంతు క్రోల్పులి సామంత గొల్ల - చట్టువారెర్రయ్య సలుగు టెద్దులు నిలిచె
బాసిగా లెస్సలకు బంతులు గట్టె - వరిగురుమంత్రాల యావులెద్దులకు
సంగడావుల సంకె సంకల్పములను - వేలాదియెద్దుల మేలుకొలిపించి
యంచెల యెద్దులు అవ్రగుళాల్ దాఁటఁ - బెండేల యెద్దులు పేరెములువాఱఁ
బొంగరుమై సంకెళ్లు పోటురంకెలు వేయ - నెద్దుల కెరనన్న యేకాంత మాడె
ముందరావులధూళి ముత్యాలమేడ - నడిమియావులధూళి నల్ల మేడలను
గోడెలరవధూళి కోటెల్ల గ్రమ్మె - రాహిని వాస్వాదాంక లగ్గడీవులుగా బొడిపించె
కొప్పెర పానకాల్ గోపకులచేతఁ - గొల్లలాడించె నల్గులకు బెల్లాలు
బసువయెద్దులమేపి పరఁగ నామీఁదఁ - గొలువుదీరిచి రాజు కూర్చుండునట్టి

రం తగునా చెల్వాటాయి సఱకించి - పంతమాడివచ్చిన పశ్చిమప్రభు చెట్లఁ
బట్టి పట్టుకోకలు చుట్టలుసుట్టి - మందలో కాటాయి మజ్జి తెచ్చినాఁడు
గోలెలు నొలిపించి పాలు బోయుస్తే - గముకులు పొడిపించి తముకు సేయింపఁ
గానాలి గంగురాజు గడిలోన లేఁడా - పల్లెల పట్నాలఁ బరిజనము లెదా
...సద్యోగమై నరపతుల్ లేరా - సాకినగ్రాలు సైన్యాస లేరా
సైన్యాన నవకోటిక్షత్రియుల్ లేరా - న్యాయశీలుఁడు రాజు నాఁడు నెల్లూరి
లేఁడా నెల్లూరను లేవైతో నీవు - నాఁడు జగడము సేయ నయములు పల్క
కీవెందుఁ బోయి తోయీ! వెఱ్ఱి భట్టు' - ఉప్పరిగెపై నెక్కియున్న మీ దేవి
'శరణోయి! శరణు నీ చెల్లెలి మాట - పరాస కల్యాణము పాపన్న మాట
అన్నల చెల్లెలు అగుమంచి మాట - పంపువలు యడపప్ప పంటవిల్లి మాట
ఆడవారు చెప్పేది అపకీర్తి మీకు - ఆరునెల లాయె మా యెఱసిద్ధిరాజు
వెలిగొండ చాలుగ వేఁటాడఁ బోయె - నెల్లూరి పట్నాన సలసిద్ధి లేఁడు
కోవూరి మిట్టలఁ గోటలై రాకు - మందలో బాణము మళ్ల నంపింతు'
నని వేఁడె శరణ బు నందఱుఁ జూడ - శరణాగతబిరుదు చెల్లించు మనెడు
రాజు తమ్మంపు యర్రయ్య యంతటను - అరయ మంటే కాచి యాదవపెరుదు
తన యాలమందను తర్లించుకొనెను - గజనిమ్మ తోఁటలు ఘనమైనమేడ
లెన్న సూటకు నయి విఱుగ ద్రొక్కించి - కోవూరి మిట్టలఁ గోటకే సిలిచెఁ
బళ్లెము నిండను మాడలు పోసి - పట్టుకోకను బొదిగి పట్టెపెనుఁగుపై
పీటెలో ముత్యాల పీథు లేగించి - మందలో బాణము మళ్ల నంపించె
వింటికోల వచ్చెనని విడిదికి వచ్చె - పొదికోల వచ్చెనని బొం చేయ వచ్చె
వారి పళ్లెరమున వారి మాడలును - వారు పంపినయట్టి పట్టుచీరయును
వారి పట్టపుటేన్గు పరఁగ నెల్లురికిఁ - బసుపుకుంకుమలకై పద్మరాఘువ్రఁసు
పరఁగంగ దేవికిఁ బంపంగ లేదా - పదరకు పలుమాటు వసుధేశు నెదుటఁ
గదలి గమ్మనుమి మీ కలవారి నెల్ల"

"ఓయి! బంగరు భట్ట! యొనరంగ వినుము - యింత గిచ్చెంబేల యీమందలోను
అప్పుసామ్మడిగితే అదిరదిరిపడెదు - పొగురు డీకొల్పుచు పొరేటిమీఁద
వడి అంకెవేసినవార్త నిజ మాయె - మేపులె రూపులు మేనుల కెల్ల
మేపులు గలిగితే రూపులు వచ్చు - రూపంబు గలిగితే కోపంబు వచ్చు
కోపంబు బ్రహ్మత్య కొనితెచ్చునట్లు - మీసీమ కరువైన మాసీమ కొచ్చు
నాఁ డెందుఁబోయెను నపుడు కోపంబు - ఎందుఁ బోయెను కోపము యాదవరాజ!

నేఁత నీళ్లును లేక మేనులు డస్సి - పాలేమి లేకుంటె పశువుల తోలుక
వచ్చి మా భూమిలో వదిగి యుండియును - నలిని ధర్మాత్ముఁడు నలసిద్ధిరాజు
నెల మూఁడువర్షాలు నెల్లూరఁ గురియు - మీరు వచ్చిన మొదల్ మేపులు గల్గి
వచ్చిపూరిని దిని పశువులు బలియు - నాపాలు ద్రాగి మీ రాడనే వచ్చు
నమితసత్యవ్రతుఁ డాసిద్ధిరాజు - తిమిరి పలుమాఱు నిందించేరు సారె
రామ! రామా! యతని రంగెంతు రోయి! - పాపంబు నెన్నటికిఁ బాపుకోఁ గలరు
కాశికిఁ బోయినఁ గడఁ బొల్గిపోదు - ధరణికి నెంతయుఁ దాలిమి కద్దొ
అంత తాలిమి కద్దు అవనీశ్వరునకు - నీవికి గర్ణుండు వితరణశాలి
సత్యహరిశ్చంద్రుఁ సరి సేయవచ్చు - నాడిన దప్పఁ డా యవనీశ్వరుండు
ఒకపాటి రాజైతె ఓపక గలదు - మేలైన కోరుదల మేసితి నంటి
నీవుబుట్టిన పూరి కోర సిచ్చితిమి - గడ్డి భవిష్యానకు ఘనుఁడు సిద్ధిరాజు
ఏల కనిపెంచుకొను నెఱుఁగను మీరు - చిలుకఁ బంపితి మని చెప్పిరు ప్రజ్ఞ
చిలుకఁ బంపను రామచిలు కెంత గద్దు - ఓడ బేరుల చేత నొప్పైన చిలుక
తెమ్మంటె దీవులఁ దెత్తు రొకలక్ష - చిలుక మాత్రమునకు సిద్ధిభూపాలుఁ
డలుక చేసునటోయి! యాదవరాజ! - నిండిన చెఱువుల నెఱయఁ ద్రవ్వితిమి
పండిన చేలెల్ల పరిజేస్తి మంత్రి - ఎంతైనఁ గష్టపడి వేయిస్తె గాక
ముగులికన్నా చెర్వ్వు ముగ్గ లెట్టఁగను - అది పౌరుషం బని యనుకొనఁ దగదు
శృంగారవనములు చేకొని నఱికి - పంగైనపూఁదోట రాచయావులను
మేపితి మంటిరి........ - ప్రోదిచేసి వనములు పోషించవలెను
చీడపురుగులు చేలు చెరిచివెయ్యంగ - బయటితోటల నన్ని వరిజేస్తి మంత్రి
కోటలో నేమైన తోఁటలు లేవ - రసవర్గములు పండుటాకులు లేవ
కోపించి చలువ రా కొట్టి నఱికించి - గోతెలు దొల్పించి గోక్షీరములను
పోయించి యందుల పోషిస్తి మంత్రి - మతిభ్రష్టుగొల్లలకు మఱి బుద్ధిలేదు
కొంచుపోయి యాదవుల కూర్చుండరాద - అడవుల యందును తిప్ప లేకుంటె
పరఁగ దానకొండ నొప్పంగను రాద - అదిచూచి హర్షించు నయితమరాజు
మేలుమే లని చాల మెచ్చును మిమ్ముఁ - దెలియక పోయె మీ తెలి వెంచ నేల?
వెనుకఁ జింతించుట వెఱ్ఱిపని గాని - రాయి కావలె నని రాజు నడిగినను
దాని మీఱినరాయి దయసేయ మనును - మీరు చేసినచేత మీకుఁ దగుఁగాక
వెఱ్ఱిగొల్లలు మీర లేమిచేసినను - మనసున నుంచఁడు మారాజఘనుఁడు
అట్టిసాత్వికునిపై నలుకతో మీరు - కొంచ మట్టెట్టమంత్రి కొల్వ్వులోపలను
చల్లనినీళ్లును సంద్రము దాఁక - మెల్లనే పాఱును మితిమేర లేక

తిన్నంగ నుండంగఁ దిమిరేచు గాక – పులులతో స్నేహంబుఁ బొసఁగ భుజగముల
పొందుచేసినవారు పోదురు క్రొద్ది – ఓట్రించి పలికేవు ఒకగొప్పగాను
గోండ్రకప్పకు నోరు గొప్పది లేద – దెబ్బల నెల్లఁబలె బొబ్బరించేవు
దబ్బఱ కాదు మాధవమును నిపుడు – గొల్లవంకరబుద్ధి గొబ్బున మాని
చెల్లించుమీ రాజ! చెడిపోక మీరు" – ఆమాటలను విని యధికకోపమున
గమకించి కాటమకాంతిచంద్రుండు – కన్నుల్ యెఱ్ఱఁగఁ జేసి కనుమొనల నున్న
తనమఱఁదివంకను దప్పక చూచి.

'నాయఁడ! వినవోయి నాచిన్నమఱఁది!
వెలలేనిసంగడీఁడ! పెమ్మనాయఁడ!
పాయరానిసంగడీఁడ! పద్మనాయఁడ!
కులమున వెల్మ నాచెలిమిని గొల్ల
చెలికాండ్లచిత్తము! చెఱఁగున సైడి!
గట్టిగా నీభట్టు కసుఁ గ్రొవ్వి యెదుట
మాటమాటకుఁ జుఱ్ఱ మాటాడుఁ గాని
గొల్ల గొల్లని యెంత క్రొవ్వియున్నాడో
వేలఁ గట్టమ్ముల వేయించ వలసి
చూచేటిజనాల సూదులు గ్రుచ్చి
తిత్తి వలిపించియుఁ దిముదుట నణచి
మందలో త్రిప్పించి మనరణభేరి
సభలు సభలున గుండె ఘూర్ణిల్లగాను
వాయించ వలదటో! పద్మనాయఁడ!'

ఆమాటలకు భట్టు నతిభీతిఁ బొంది – గడగడ వణఁకుచుఁ గడు వేగమునను
బద్మనాయనివెన్క భట్టు దా నిలిచెఁ – గోపంబు గలరాజు కోపంబు తలఁగఁ
బద్మనాయఁడు మంచివాఁ డౌటచేతఁ – గాటమరాజుతో గ్రక్కున ననియె

'కాంతిచంద్రుండ! యో కాటమరాజ!
నిజలోకపుత్రుడ! నీలవర్ణుండ!
వంచన గలయట్టివసుధేశగండ!
పెంపున వినవయ్య పెద్దిరాజుకొమర!

భట్టన బ్రాహ్మణప్రవరుఁ డనంగ
నుభయదళాలకు నుర్వి లింగాలు
భట్టును బ్రాహ్మనిఁ గొట్టినవారుఁ
దిట్టినవారును ధృతి నెందు లేరు
అదిగాక యొకరాజు అంపెను గనుక
పగరాజుమాటలు పలుకక తగదు
మనభట్టు పోయిన మన మన్నమాట
పగరాజువద్దను బలుకక తగదు
వారికిఁ గట్నాలు వలనుగా నిచ్చి
వారి భూమికి భట్టు వసుధేశ పంపు'

మని యామాటకు యాదవభట్టు – గొనకొన్న పులివలెఁ గొల్లవాలోపలను బలికెఁ బల్లవరాజుభట్టుకో నతఁడు.

"మాటమాటకు గొల్ల గొల్ల డనియేవు – సుదముగా నీ భూమి మోసెను గొల్ల
తరికొండ లూగంగ ద్రొ డాయె గొల్ల – సాగరము త్రొక్కులఁ జల్లెను గొల్ల
వేడుక వ్రేపల్లెపల్లెదులఁ గూడి – గొల్ల లాడినవాఁడు గొల్లతఁడు కాడ
కన్నులఁ దెఱువనిచిన్నబాలుండై – కోపించి శకటంబు గూల్చెను గొల్ల
ముదులబాలుఁడై మూఁడనెలను – దానవిచనుబ్రాలు ద్రాగెను గొల్ల
యేడాదికుఱ్ఱడై యిలఁ దృణావర్తు – మెడఁబట్టుకొని వాని మృతిఁ జేసె గొల్ల
తల్లి వెన్నలకునై తను రోలఁ గట్టఁ – గొమరుడై మద్దులుకూలుకంగ నీడ్చె
ముద్దుగోపాలుండు మూరితిగొల్ల – వత్సునిఁ జంపినవాఁడును గొల్ల
శబలుడై ఖరదైత్యుఁ జంపెను గొల్ల–యితఁడు సామాన్యుఁడే యెంచి చూడంగ
బ్రహ్మదేవుఁడు గొల్ల పశువతి గొల్ల – బ్రహ్మను గన్నశ్రీపతియును గొల్ల
పావనరుద్రుఁ డేర్పాటైనగొల్ల – దేవేంద్రుఁడును గొల్ల దివిజులు గొల్ల
భావింప రుద్రుండు పరగంగ గొల్ల – మాకులమున బుట్టె మదనగురుండు
మాకులంబున బుట్టె మఱియు సూర్యుండు – మాకులంబున బుట్టె మఱియు చంద్రుండు
మాకులంబున బుట్టె మానిగుణంబు – మాకులంబున బుట్టె మఱి యొక్కవేది
అవునోయి ! భట్ట ! నీవాడుకో దగును – గొప్పమాటల నెంత కొప్పరించేవు
భట్ట నంచును వచ్చి బయిసి పోవుటకు – గాటమేశ్వరు నిట్లు కాఱు లాడితివి

దేవేంద్రుఁ డెక్కినదివ్యరథంబు - భావజ హరవర భక్తుండు నెక్కెఁ
బరులకు వెన్నీనిబాహుబలుండు - పరకాంతఁ దల్లిగా భావించినాఁడు
ఇటువంటి రాజు కనుమొనటను నిలిచి - తాటోటు మాటలు తప్పఁ బల్కితివి
నుగ్రాన నుంటివో చూడు నామంద - యుగ్రసింహము కోర లూచంగ వశమె
బెబ్బులిమీసాలఁ బెనఁగాడ నలవె - యొజసి రాజును జెనక నొకరాజు తరమె
మఱచి రాజును చెనక మన్నీల కగునె - పాఱిపోవఁగఁ జావుఁ బోరఁ బొమ్మగట్టుఁ
బేరు కలవారలకుఁ బేరు లెత్తించు - జాఱిపోయినవారిఁ జంపు నిశ్చయము
తత్తరించకు భట్ట! తడబడకు సభను - మిత్రాన గంపటీల్ మీఱ నెద్దులును
గాటమప్రభువెంటఁ గదలి రాగాను - శత్రురాజులు చెదరి చలకట్టలైరి
మాధవుఁడు మీభూమి మగుడి వచ్చెను - మన్నెరాజుల కెల్ల మదములు డీయు
మేదకుఁడ! యోభట్ట! మెఱవఁ బొయ్యేవు - ఊళ్లు నడ్డాడెదు నుదయగిరి బెదరి
సావిళ్లు సందనాగె చంద్రగిరి బెదరె! - ద్రోవ చూచుకొనియుఁ దొలఁగేది లెస్స
గ్రహియించ వోభట్ట! ఘనునిమందకును - మేడలు మూస్తివి మాడలాసకును
కోడెలు ద్రొక్కెని గోకులం బెల్ల - నలసవైతివి భట్ట! యాస్థానమునను
బొసగించు నుడిలేదు బొంకేది తఱుచు - వసద్రాగుపిట్టవలె వదరేవు చాలఁ
బోకసోకైత్తెనా పొదిలేవా గాక - తికమకయైత్తెనా లేక దెస తప్పినావా
ప్రత్తిగింజలవలెఁ బండ్లు తెఱచెదవు - నూతిలోఁ గప్పవలెఁ గాతరించేవు
ఆరాజు భట్టుగా నప్పడవు గావు - పూజారివై యూళ్లఁ బొట్టపోసికొమి
తల్లి పోగొట్టఁగాఁ దం.శికాన - గేలిమాటలచేతఁ గెల్తురటోయి!
కూడులే దంటివా కులకాయకమున - కాఱడవుల కేఁగి కట్టెలు గొట్టి
కాను కమ్మక నీవు కడుపు పోసుకొమి - భట్టవా భారంపుభట్టవు గావు
భట్టవా నీవు యంబెట్టవుగాని - యుద్ధంబు సేయక యొసఁగము ధనము
సిద్ధిరాజు రమ్మను శీఘ్రంబు నీవు - ఏసీమరాజులకు ............
తాలిమి దివ్యాయుధముల బోట్లాడ - మారాజు కాటమక్ష్మాపాలుఁ డిపుఁడు
ఆవులకొమ్ముల నాయుధాల్ నేసి - యేనుఁగునకు నెద్దు సత్వానకావు
తరువుకు తట్టువ బంటుకు బంటు - రాజుకు రాజు కాలారికి కంపటీఁడు
మీసిద్ధిరాజుకు మాయెద్దు కాలిబొమ్మ - రణము సేయఁగ నెత్తిరాఁగ మారాజు
తల్లి రాని రాజుకుఁ దరపు పొలిబొమ్మ - చెల్లి రాని రాజుకు చెడికాలి బొమ్మ
రాకుంటె దిగువందము రమ్మను వేగ - వేగమె సిద్ధిరాజు వెడలి రమ్మనుము
పట్టుకోకలఁ జుట్టి పలుపుగాఁ బెనచి - నాకుఁ బెనచుట గాదు మీకల్ని యంపు
తగసిద్ధిరాజులకు దామెనపలువు."

అని భట్టుతోఁ జెప్పి యందఱుఁ జూడ – వినయానఁ గట్నాలు వేగఁ దెప్పించి
పంపించెఁ బశుపతి ప్రజలెల్ల మెచ్చ – నంపించె సంతోష మధికంబుగాగ
వచ్చెను నెల్లూరు పడిమిరాజు భట్టు – నిచ్చెను శంభుండు నిహపరసుఖము
నిదివిన్న వ్రాసిన నిష్టభోగములు – సదయుఁడై యిచ్చును సర్వేశ్వరుండు
కాటభూపాలునికథ యెవ్వరైన – వాటంబుగా విన్న వసుధేశ్వరులకు
రాయబారం బని రంజిల్లు జగతి – నాయురారోగ్య భాగ్యంబులు గల్గి
పూజ్యమై యీ కథ పూర్ణమైయుండు.

అనుబంధము — ౩

# కోటపాటితాటివృక్షము తెచ్చేకథ

★

అంత నాభూపతి యాదవప్రల్ గొలువ – సూర్యసంభవు సభలోన నుండె తాను
కలువగొంద నెల్లూరి నలసిద్ధిరాజు – చెలిమితో బంపగ జేరగి యచ్చో
రాయభూషణనుతుండు రాజులభట్టు – రాయబారము వచ్చి రంజిల్లి పల్కె
పశువులమందలో గ్రాలుచున్నట్టి – పశుపతి బోలగ గాంచి ప్రస్తుతించియును
ననమానధీరుడై యప్పుడీట్లనియె – "వసుధాధిపతి కొండబలిష్ఠలక్ష్మి ని
నిచ్చి యీయాకయ నీ విటువలె నుంట – మంచికార్యము గాదు మామహారాజు
పుల్లరిధనముకై పొసగ పంపె – పల్లనాథీశ్వరు పైకము నిచ్చి
పోవుట యుచితంబు భూపాల!" యనగ – "నప్పా! మిక్కిలి క్రొవ్వితివి
యెదుట నిలిచి
గద్దించి పలికిన గర్వం బడంతు – యుద్ధంబు సేయక యొసగను ధనము
సిద్ధిరాజును వేగ జెలగి రమ్మనుము – బుద్ధి గల్గియ భట! పో పొ"మ్మటంచు
బట్టుకోకను నొకట పలుపుగా నెంచి – భట్టుకు మెడబట్టి పంపగ భూపాలు
డపుడె నాభట్టుతో నాడు వినగ – "నిను జేయుటయు గాదు నిన్నేలురాజు
లేవ్వరి మెడలను నింపొందు గలని – తావున నిట్టులే దామెన యనుచు
దెలిసియుండగ నీకు దెలియ జెప్పితిమి – తలకకు" మని భట్టు దగ్గఱ బిలిచి
ఘనవస్త్ర భూషణకలితుగా జేసి – 'యనకులాధీశ్వరు లేవ్వరి నిపుడె
పైనమై రమ్మను బలములు గూడి' – యని భట్టు బొమ్మన్న యాదవరాజు
ఘనమైనయట్టిగోగణములమంద – తనరుచు నున్నట్టితావును గడచె
నెడనెడ వడకుచు నెల్లూరు త్రోవ – గడువేగమున భట్టు కదలిన వెనుక
నంత కాటమరాజు ఆ మఱునాడు – మాతనంబున దన తమ్ముండి కిట్లనియె
"బరగండభైరవ! పద్మరాఘవుడ! – నరనాథుడై నట్టి నలసిద్ధిరాజు
పూజితుండగు రాయభూషణనుతుని – హేళిబుగా నంపె నీమందలోకి
భట్టు వచ్చిన యపుడె పగ నిశ్చయంబు – గట్టిగా దెలివిడిగా మది దెలిసె
నన్నదమ్ములు మన మంద తోకలైతె – పన్నుగా బగవారు పై సేయ లేరు

కమ్మలో నీవార్త గట్టిగా వ్రాసి – తమ్ముఁడై తమరాజు దంపు ర మ్మనుచు
కమ్మ పట్టణమున కంపవలెఁ గమ్మ – సమ్మతంబుగ మంచి సవరని యాకు
కోన గలమోవాకు కుదురు చక్కనిది – కనుగొను మందలోఁ గమ్మ దొరక"దన
నంపు కేమని నవ్వి యారాఘవుండు – మందరధీరుతో మఱియు నిట్లనియెఁ
'గోన గలమోవాకు కోటపాటియును – నొనరఁగ నున్నది యుర్వి నెన్నఁగను'
నన నగుచు మఱఁదితో నవనీశుఁ డనియెఁ – "దాటివృక్షం బని ధర నెన్నుటంతె
తాటివృక్షము గాదు దనుజులకోట – కుదురు పొద్దును జూడఁ గొండ యై తోఁచు
నది మతంగులకొండ యగునో మఱంది! – రాజాధిరాజులు రాపోనితావు
గాజుకొండకు నసురకావ లున్నదియు – గొప్పకొండను బెద్ద కోరపం దొకటి
యెప్పు డా తర్వాన నేమఱక యుండు – గ్రచ్చయుఁ గోరింద కలియ బలిసియును
నచ్చగాఁ దరువున నల్లియున్నదియు – మొగబంటు లెవ్వరు మోవాకు తేను
దెసవ నీమందలో ధీరు లసువారు" – నని భూనాథున కనియె రాఘవుఁడు
'భీమబలుం డను బిరుదుఁ బొగిడించు – సామజంబుల వైరి చట్టు వారెర్రు
ఉన్నతసత్త్వుండు నొగి శూరుఁ' డనుచుఁ – బన్నుగాఁ బలుకుచుఁ బద్మరాఘవుఁడు
నప్పుడు తిలకించె యర్రయ్యవంక – నప్పుడు చూచిన నతివేగమునను
భీకరశక్తితోఁ బృథివీశునెదుర – ముకుళితహస్తుఁడై ముందర నిలిచి
"కాటభూపాల! యో కాంతిచంద్రుండ! – మాటమాటకు నతిమాత్రపౌరుషము
నేమని చెప్పెద మెంత మాత్రంబు – భూమిలో నది యొక్క భూరి చెప్పితివి
మన మందలోఁ గల మగధీరు లెన్న – ఘనశౌర్యములు గలకదనసాహసులు
నొకరి కంటెను నొక్క రుత్తమోత్తములు – ప్రకటింప నేల నీబలములఁ గూర్చి
మొనఁ జేసి నన్నంపు మోవాకుఁ దెత్తు" – ననఁగ నా నలనన్న యల [సహోదరుని
భూషించి యావేళ భూపాలుఁ డపుడు – భాషాచమత్కారి పద్మరాఘవుఁడు
కర్పూర గంధబు కస్తూరి యగురు – పుష్పాడి గందవొడి పునుఁగు జవ్వాజి
తెప్పించి యిచ్చినఁ దెఱఁ గొప్ప నంది – నప్పుడు రాఘవుం డనియెఁ దమ్మునికి
"సాహసవిక్రమశాలి! యర్రయ్య! – బాహుబలంబునఁ బైనమై వేగ
పనివడి యా కోటపాటికి నీవు – ఒనరంగఁ బోయియు నొక తాటికమ్మ
ననురక్తిఁ దెమ్మ నీ"వనిన నెర్రయ్య – ఘనవేగముగ విడిది కడ కేఁగి యప్పు
డనువైన క్రొత్త చల్లణముఁ దొడిగి – కనకాంబరముఁ దలను గట్టి గొజ్జంగి
పూలదండలు జారఁ బూన్చి తలపాగ – తెలివైన నవనమాల తిరుమణి నొసల
నాణిముత్యాలను నమరుశలగోల – వేణువాద్యము దగ నెడమభుజమునకు

గండ్రగొడ్డలిఁ బూని కరమున బాఁకు - కుండలంబులు కర్ణకోటిఁ గెంపు మెఱఁగ
సందిట దాయెతుల్ సరికొత్త మెఱయ - విలసిల్లు గోఁచిగల్ వెంట నేతేఁ
గొలువఁగా నెఱయ్య కోటపాటికిని - రాగ నచ్చట నొక రాక్షసి వచ్చి
తేజమై జనులెల్ల దిగులుకొనఁగ - గొంప గానెడిగాజుకొంపదానవియు
మెండుగా వచ్చియు మిడిగ్రుడ్లు కొలిపి - కన్నుల నెఱయ్య గన్గొంచి దైత్య
పండ్లు గీటుచు రాజు భయపడ బొబ్బ - రింపుచు రాగాను నెఱయ్య చుఱుకు
రప్పెల్ల కొట్టేటిరాక్షసిని జూచి - భీకరశక్తితోఁ బృథివి యల్లాడ
నాఁకొన్న పులివలె నాగ్రహం బెసఁగ - గొడ్డలిఁ ద్రిప్పుచుఁ గొట్టఁగా నదలి
వడ్డు గూలినక్రియ వసుధ మూర్ఛిల్లి - తెప్పిల్లి రాక్షసి దేహంబు ద్రుక్కి
తెప్పతెప్పునఁ బడి తిరిగి సూచుచును - వడివడి నాతన్ని వదలి కొండలను
బడిపోయె నంతటఁ బంది యొక్కటియుఁ - బొదలోన నుండి యాఘాఘాకోఁ
గనుచు
మదియించి కోఁలు మాటిమాటికిని - వదకొని చరియించి పడి దీటుకొనుచు
నెమరు దాకిసయంత నెఱయ్య దాని - రెండుకొమ్ములఁబట్టి సంకీనోషమొనర
మొండుగా మోచేత మోకాట మెదిపి - పెఱికిన నాపంది పృథ్విపై నొఱగి
సొమ్మసిల్లియుఁ గొంతసేపటిదాఁక - దిమ్మువట్టఁగ నుండి తెలిసి పెక్కులకు
కుఱుచ బాఁకిసగోవు కోఁడె చందాన - ..........................
దవ్వుల నెనయగా దండి వేగమునఁ - బోయిన పిమ్మట భుజగంబు లెల్ల
డాయఁగా వచ్చినఁ దరిమినఁ బుట్ట - దిక్కులఁ గానక తిరిగి వేసారి
యెక్కడఁ జంపునో యీరాజ టంచు - కొరాకు క్రిం దుండె గండుచీమయును
నారాళ్లములు వెడలి యుద్ధంబు నడుమ - నచ్చట నాచీమ నరకాల దాచి
గ్రచ్చ కొరిందయుఁ గడకు బోనొత్తి - నిగనిగనామంబు నిఱ్చినోప
తరువున నుండి యంతట నిట్టు లనియెఁ - బరఁగఁ గాటమరాజుఁ బన్మ రాఘవుఁడు
పరువున నొక తాటిపత్రమ్ముఁ దెమ్ము - అని నన్నుఁ బంపినా నంతియె కాని
యసుర శక్తితోఁ బోయి యంతట నన్ను - ముదురు లేఁతయుఁ జూచి మోవాకు
[నొకటి
సదయుఁడు మాబావ చెప్పకపోయె - నిది యది యని యెట్లు లెఱుఁగుదు నేను
వుదురు బిడుకున వచ్చి పోవఁగా నేల - చెప్పని పని యొకటి చేట్టాను నొకటి
వప్పఁగాఁ గొంపోవ వలవదు నేను - వ్రాలాకుకమ్మలు వారికే తెలియు
నీలాగు చింతింప నేల నా కనుచుఁ - బెం పైనయా తాఁడి పెకలించి నేను

గొంపోదు మాబావ కొల్వులో కంత - అని నిశ్చయము సేసి యారాజఘనుఁడు
నాసరఁగా నుంగరంబులచేతఁ దువ్వ - నూచి చూచియును బ్రమా నొకకొంతసేపు
అచ్యుతవరభక్తుఁ డాత్రేయగోత్రుఁ - డలనాఁడు రామకార్యార్థమై పోయి
తెలి వొప్ప సంజీవిఁ దెచ్చినవాయు - నందనుఁ దనమది నపుడు ప్రార్థించి
యందున్నపక్షులు నట్టిట్టు చెదరఁ - గుదురైనయామ్రానుఁ గూకటివేళ్లఁ
బదపడి పెకలించి పటుశౌర్యమహిమఁ - జకటఁ బోవఁగ మళ్లి సాహసంబునను
బెక్కుబలములు వచ్చి భీకరాకృతిని - గొనిపోవు చున్నంతఁ గోటపాడేలు
మనుజనాయకుఁడును మన్నిలఁగూడి - యెదిరించి నీవు నెం చేగుదు నిలువు
మేది నీయూరు నీ వెవ్వర వనినఁ - దాడిని జేఁబూని తఱిమి యెఱ్ఱయ్య
దూఁడ లావుల నొడ్డిఁ దోలినయట్లు - కోటపాడేలేటికుంభినీశ్వరునిఁ
గోటలోఁ జొరఁ ద్రోలి కోటతల్పులను - వేసిన పిమ్మట నెఱ్ఱయ్య పలికెఁ
బశుపతి నలనన్న పద్మరాఘవుని - యెఱుక లేకను దల్పు లెవరు దీసినను
ధరణిలోఁ దోకకుఁ దగినబందెయును - దియ్యక విడువము తెలిసుండుఁ డనుచు
వెయ్యసి విధముల విఱ్ఱ జెప్పితింతె - యనుచు వేగమె తాడి నటు గొంచు వచ్చె
ననువొందు నలనన్న సామాత్యవర్గంబు - కొలువఁగా గూర్చున్న కొల్వులోపలను
పొలుపుగాఁ గూర్చున్నబుధజనోత్తములు - భటులు నాయకులును బహుమన్నె
[వారుఁ
బటు ప్రవీణులు వీరభటులు గోపకులు - జవుష్టివిద్యల జనపాలు రంతి
అవుర! యీక్రియ నెన్న నజునకు వశమె - యనుచు భూసురకోటి యాశీర్వదింప
వినయంబుతోడుత యెఱ్ఱయ్య యపుడు - కొన గలసురమాను గొబ్బునఁ దెచ్చి
దనకొండకును జాబుఁ దనరవ్రాసేది - గొనకొని యారాజు కొలువులో నిలుప
నందుకు నలనన్న యతి సంతసిల్లి - మందరధీరుండు మఱది కిట్లనియు
నాత్రేయగోత్రుండు ససహాయశూరుఁ - డీ చట్టువారెఱ్ఱ యెంత ధీరుండు
తాటాకుఁ దెమ్మన్నఁ దటుకునఁ బోయి - తాటివృక్షముఁ దెచ్చి తగ నిల్చె నిచట
నతులిత భుజశక్తి యతిపరాక్రముఁడు - నితనికి సాటిగా నెంచఁగా వినవె
ధర మున్ను అంజనీతనయుని నొకనిఁ - బరఁగంగ నాసింహబలుని నొక్కరుని
నిరవుగా భూప్రజ లెన్నుదు రెపుడు - సరిసేయ వారిలో సమమైనశక్తి
పరికింప నాల్గవభాగంబుఁ గలదు - అని చాల హర్షించి యవనీశ్వరుండు
ఘనమైనకస్తూరి గంధంబుఁ బూసి - కప్పుర విడియంబు ఘనతతో నిచ్చి
యప్పుడు వ్రాలాకు కను వైనకమ్మ - కత్రించి యావెన్క కడువేగ తాడి
చిత్రవేగంబునఁ జెలువొప్ప మునుపు - యక్కడ నుండెనో యాతావునందు

మక్కువ నీతిర్వ మఱి నిల్పి నున్ను - అని వేగముగ నంప నా యెరసన్న
మునుపు దెచ్చిన తావు ముదముతో చేరి - పాపలో నాతర్వ వదిలమై యుంచి
మరలి గ్రక్కున వచ్చె నది సంతసిల్లి - సరస నలవన్నకు సముఖాన నిలిచెఁ
బెద్దిభూపాలునిప్రియతనూజుండు - ఒద్దిక రాఘవుం డో...ల్వునను
తలకొని ధనకొండ ధరణీశ్వరులకుఁ - జెలఁగుచు లేఖలు సెప్పి వ్రాయింప
భాసురకీర్తి ప్రభావశేఖరుఁడు - లేఖలు వ్రాయను లిఖియించి చదువ
ప్రాకట చప్పన్న భాషాధికారి - కాటభూపాలునికరుణతో నతను
మేటియై ప్రభవొందు మితభాషణుండు - కందర్పసాటిగాఁ గలరామచంద్రుఁ
జెలఁగుచు పిలిచి యూజనపాలుఁ డపియెఁ - జెప్పెద విను రామచంద్ర వివరంబు
ప్రమదమున మా బావ పల్లికొండకును - గోమునక్క సిరిదేవి కొక్క సిద్దజేకిఁ
జెలువొప్ప మనయోగక్షేమంబు వ్రాయు - చెరుకూరి నలనాఁడు చెల్లినరాజు
తెలియఁ జెప్పిన వార్త తేటగా నపుడు - తలఁపులో బాఱంగఁ దగనొప్ప వ్రాయు
కరుణతో నంతటఁ గరియావులన్న - వరుసతో నావెన్క భట్టావులన్న
అంత నయితమరాజు అవనీశ్వరుకుఁ - బుత్తమరాజుకుఁ బోఁడుగా నీవు
వేయిభంగుల గొప్పవిన్నపములుగాను - మా యోగక్షేమంబు మఱి వేగ వ్రాయు
మటమీఁద నీ కయ్య మయ్యేటి వార్త-తటుకున వ్రాయుమీ దండు రమ్మనుచుఁ
బసుల మేపినవార్త పసులఁ జంపినది - పసులఁ జంపినయట్టిపాపాత్మువార్త
మదిలోనఁ బగవారు మడియింపఁగోరి - యెదిరించి యిచ్చోట కదిసినవార్త
పదివేలవిధముల బాగుగా వ్రాయు - కడలి రాఁ గలిగిన గలియు వచ్చేది
అని రామచంద్రున కపుడు సెప్పె - వినయాన లేఖలు వివరంబుగాను
బల్లికొండకు నపుడు ప్రత్యేక మొకటి - తల్లి సిరిదేవికిఁ దాల్మితో నొకటి
బాలరాజులు నంపపట్నాని కొకటి - వాలాయముగ వ్రాసి వైనానఁ జూచి
తప్పొప్పు లేకుండ ధరణీపుఁడు వినఁగ - నప్పుడు లేఖల నన్నియు జదివె
విని చాలవేడ్కను వేగంబె రాజు - వనధిగంభీరుండు వంశవర్ధనుఁడు
తనవ్రాలు చేసిన తగులేఖ లన్ని - ఘనముగా జలకైను గడు చంద్రికలును
వరుసతోఁ జేసియు వైనానఁ బట్టి - యురువైన తనచేతి యుంగరంబునను
లక్క-ముద్రలఁ జేసి గ్రక్కున నపుడు - కబురున నారాజు కాలారిఁ బిలిచి
కాలారి చేతికిఁ గమ్మ లందించి - నైళంబె కమ్మలు వైనానఁ గొంచు
బాలరాజులు నన్నపట్టణము పోయి - బాలరాజులకును బల్లికొండకును
వ్రాలుఁగమ్మల నిచ్చి వజల వేగముగఁ - జదివించుకొని దండు సన్నాహములను
యదుకులాధీశుల నిటకు రమ్మనుమ - అని చెప్పి కాలారి నపుడు బోధించి

అని యేకవినరాల నతనితోఁ దెలిపి – యమరంగఁ జద్దిమూటంతఁ గట్టించి
కొమరొప్ప నా దంకొండ కంపించె – నంతటఁ గాలారి యాకమ్మ గొంచు
నతివేడ్క ధనకొండ కంత నేతేర – ముదమొప్ప నడుదారి ముసిఁ గాంచి యందు
నుదకము చేరువ నొనరఁగా నిలిచి – ముసిలోనఁ గావించి ముఖమార్జనంబు
పొసఁగఁ దిరుమణి చాఁది బొట్టు ధరియించి–పలుదెఱంగుల సూర్యప్రార్థనముఁ జేసి
ముదమొప్ప నాచద్దిమూటయు విడిచి – సదయుఁడై కడుపారఁ జద్ది భోంచేసి
జలములఁ జేతులఁ జయ్యనఁ గడిగి – చెలఁగుచు సవరించి జతనాన లేచి
తడవుసేయక యుండకుఁ దరలి వేగంబె – పడమట నరజాము పర్యంతమునకు
ధనకొండ పట్టంబు తాత్పర్యమునకు – ఘనవేగమునఁ జేరి కాలారి చూడ
నావేళ ధనకొండ యతి సంభ్రమమున – దేవేంద్ర భోగమై తెలివి దీపింప
నరల వాద్యములును సంగళ్లవెంటఁ – జెలఁగుచు ఘోషించు శంఖకాహళులు
ఘుమ ఘుమ వాసించు కుంద జవ్వాజి – కమనీయ మగుమంచికస్తూరి యగురు
నేదిక్కు చూచిన నెల్లభాగ్యములు – శోధించి చూడనే చోద్యమై యొప్పు
జాజి మించిన మంచిజాతి సంపెంగ – భావింప మొల్లల పరిమళంబులును
నా బావులను జూడ నమృతోదకములు – మెలికల సోపానములు మించి యుండు
నే గరిడీలో వారె నెలమిఁ గైకొనిన – నొకరి మించినవారు ఒకరు శూరులును
నే కవీశ్వరునితో నెదిరి భాషింప – నాకాళిదాసాదు లనవచ్చు కవులు
నే గృహంబునఁ జూడ హెచ్చుకళ గలిగి – బాగైనచిత్తర్వు ప్రభవింపుచుండు
నేసావిడిని గాలు వెవరు గూర్చున్న – భూసురాశీర్వాదపుణ్యావర్తనులు
ఆసభాపతి యైన అయితమరాజు – వాసవు నట పోలి వసుధ నింపొంది
మేడలు మిద్దెలు మేలుచవికెలును – వాడలు శృంగార వనముల తోడ
నొప్పైనధనకొండ యూరి ముందరను – జెప్పఁ జోద్యంబైన చాలురావులును
నచ్చటఁ గలిగిన నటకుఁ జేరునను – రచ్చగాఁ గూర్చుండి రాజు తమ్ముఁడును
న మ్మనుజాధీశునల్లు రైనట్టి – ముమ్మయ్య పాచయ్య ముద్దుబాలురును
గొమరొప్ప జగజంపుగొడుగులనీడ – నమరంగ బొంగరా లాడుచుండంగ
మందలోఁ గాలారి మారన్న రాఁగ – ముందుగా సిరిబాల ముమ్మయఁ జూచి
యన్న కాటమరాజు అంపినభటునిఁ – గన్నులఁ బొడగనఁ గలిగెను నేఁడు
ఏ వార్త దెచ్చెనో యెలమి వేడుకల – నావార్త నాయన నడుగుద మనుచు
బాలలు నిద్దఱుఁ బరువునఁ బోయి – కాలారి నప్పుడు కౌఁగిలించుకొని
వేవేగఁ గర్పూరవిడెయంబు నిచ్చి – యావుల పరిణామ మడిగె ముమ్మయ్య.

"వినవయ్య ! కాలారి ! వినర మారన్న ! - నానా వరావాసినాగరంబులకు
నారూఢిక్షేమమా ! యన్న కాలారి ! - పేరుకెక్కినకె ద్విప్రక్షిపిసెసుతురకు
నలనన్న యాపద్మనాయుఁ డెట్లయ్య - చెలఁగుచు నున్నారె క్షేమానఁ వారు
చవుదంతి యేనుఁగు చట్టువారెల్ల - నవిరళ నూత్ర్చిచే నానందమున
బొల్లావు విరుమన్న ! బొ...గా రుబులను - చట్లవారేవ్వరు సాహసాట్లు గలు
నండ గలకంపటము యాదవులు లక్ష - మంగళాధిపు లైనయన్నమూశెలును
మందలావులు పెక్కు మనలు(ల?)కోడెలను - నెప్పుడు గన లగుకెనుమిలాబిగను
బరిణాన నున్నారె భవహరుకృపను - బెరన్నయ ను లక్ష్మయునాగుండ
లందఱు సేమమే యన్న! కాలారి! - అని రాచయున్నయ్య యనుమాటలను
వినియు మారన్నంత విన్నపము సేసె - నన్నరా ! ముమ్మయ్య ! యల్లుడ !
[ముద్ర

యెన్నఁగాఁ బోచయ్య వినరయ్య! మీరు - ఆలమందలనుండి యరుగెంచువరకు
ఆవులెద్దులు యాదవాళి యెట్లయ్య - ఆవు లన్నయ్య నాయంగ క్షేమంబు
మెం డై సధనకొండ మేదినీపతికి - గడినుండి వచ్చన్న కమ్మ లందించెఁ
గడమ వార్తలును నీకమ్మలోఁ గలవు - అని యిట్లు మారన్న యాబాలురకును
వినిపింప నూర్యుండు వేగంబె గ్రుంకె - నావేళఁ గాలారి యాత్మలోపలను
యీవేళఁ నీజాబు లిచ్చితి నేని - నయితన్న బందు రయినవా రెల్ల
వయినానఁ జూచి యీబ్రావాలఁగమ్మలను - నాపద వడియెన వది నిశ్చయంబు
ఈపాప కర్మం బడేల నా కనుచు - మదిలోనఁ దను దానె మార్గంబుఁ దెలిసి
యుదయంబుఁ గానిచ్చి యుర్వీశునకును - గొదకొని కొంపోయి కొలువు కేతెంచి
నదయుఁడై యున్న యాజనపాలునకును - జదివించుకొమ్మన సమయంబు గాని
యీ సంజచీకటి నీయరా దనుచు - భాసురంబుగ నన్న బాలు రవ్వేళ
నమ్మకు సిరిదేవి కాబాలు రపుడు - సమ్మతంబుగఁ జెప్ప నరగ సిరిదేవి
యెమ్మె మీరగ క్షేమ మెన్న కాలారి ! - సదమలాచారుండు జనపాలవరుఁడు
నధికసాహసుఁ డగునలనన్నమంత్రి - పద్మరాఘవుఁడును బయ్య లెట్లయ్య
మందల నావులు మన్నీలు భటులు - సాధుపోషకుఁ డగుచట్టువారెల్ల
పరిణామమే యన్న బలికెఁ గాలారి - సురభులతోఁ జను సుజనపాలునకు
క్షేమమే యనినను సిరిదేవి యపుడు - ప్రేమతో దాసులఁ బిలిచి చెంబులను
జలములఁ దెప్పించి నరగ నిప్పింపఁ - జెలఁగుచు స్నానముఁ జేసి కాలారి
వచ్చి కూర్చున్న నా వనితలచేతఁ - బంచభక్ష్యంబులుఁ బచ్చళ్లుఁ బెరుగు
భోంచేసి కాలారి పొగడుచు లేచి - సిరిదేవి సెలవడ్గి చెప్పిన విడిఁది

కరిగె నంతటఁ గమలాప్తుఁడు గ్రుంక - నంత నైతమరాజు అప్పుడు కొల్వు
నంతయుఁ జాలించి యంతఃపురమునకు - సంతోషమున వచ్చి స్నానంబుఁ జేసి
కృత్తివాసుని పూజ బత్తిఁ గావించి - దివ్యగంధంబును దెఱఁగొప్ప నలఁది
దివ్యమాల్యంబులఁ దెఱఁగొప్పఁ దాల్చి - తెఱఁ గొప్ప భోంచేసి దివ్యతేజమునఁ
జేరి యిర్గడలును సేవకవృత్తు - లొనరించుచును జెలు లొకకొంత నడవ
జననాథుఁడై తన్ను చెలులు కొల్వఁగను - మేలిమిబంగారు మేడలో కరిగి
చాల వేడుకతోడ శయ్యఁ బవళించి - సరస సాహిత్య ప్రసంగ సంగీత
పరులు పురాణముల్ వకకొంతప్రొద్దు - నారీతి గడపిన నట నిద్రఁ జెంది
తారలఁ జంద్రుండు ధవళమై కాయ - నాలుగోజా మాయె నటఁ జుక్కపొడువఁ
దెలివిగాఁ బశ్చిమాద్రిని శశాంకుండు - గ్రుంకినఁ గోకముల్ గుబులుగాఁ గూయ
నా కమలాప్తుండు నంత తూర్పునను - గట్టుపై నెక్కియుఁ గాంతి దాఁ జూపె
నావేళ పట్టణం బందు పెల్లుగను - బటహ మృదంగాది బహుశ్రుతుల్ సెలఁగ
నిటలాక్షుభక్తుండు నిజమానసుండు - అటమున్నె మేల్కాంచి యయితమరాజు
ఘట్టితమై మెఱయు కలవాని నొంది - మతివేగముగ ముఖమార్జనముఁ జేసి
పరఁగ దివ్య విభూతి ఫాలమునఁ దాల్చి - శంభునిఁ బూజించి జననాథుఁ డంత
గాంభీర్యమునఁ గొల్వుగద్దె కేతెంచి - కూర్చిన ముత్యాలకొల్వుచావడిని
గూర్చున్న నారాజుకొల్వులోపలను - నన్నలు, దమ్ములు నాప్తవర్గంబు
మన్నీలు దొరలును మంత్రులు భటులుఁ - బల్లికొండయు సరస భట్టావులన్న
యుత్తమరాజును నుత్తమఘనుఁడు - సత్యసంధులు రాజుసముఖాన నిల్వ
భట్లు పొగడంగఁ బాపలును దీవింప - జట్లును దమలోన సాధనల్ సేయఁ
బాడేటియాటలపాటల వారిఁ - గనుచుఁ బురాణముల్ వినుచున్న యంత
నావేళ గాలారి యప్పుడు వచ్చి - వేవేగముగ భూమి విభుకొల్వుఁ జొచ్చి
పల్లటి వేసి యాహలికొండ కెఱఁగి - యల్లటివేసియు నయితన్న మ్రొక్కి
కడియాలచేతులఁ గమ్మ లందీయఁ - నొడికముగ నారాజు ఉత్తరా లంద
రాచకరణం బగురామచంద్రుఁడును - లేచి యారాజుచే లేఖ లందుకొని
చంద్రికలో నాకుఁ జయ్యనఁ దీసి - యందులోపలివైన మంతయుఁ దెలిసి
మండలాధీశుఁడు మతివేగ నిపుఁడు - దండు రమ్మనువార్త తాఁ దెలుపకయ
మనసులోపలనుంచి మంత్రిశేఖరుఁడు - ఘనవేగమునఁ గమ్మఁ గట్టిగా జుట్టి
మానవేశ్వరునితో మంత్రి యిట్లనియె.

"మనుజేశ! విను నేఁడు మందలోనుండి - భానుతేజం డిటకుఁ బంపినలేఖ

సాదరా తెలియఁగాదు సన్న చిన్నెలును – నీ జాబు దెలియదు యదుకులాధీశ!
అనిన నైతమరాజు అప్పు డిట్లనియె – వినవోయి! మంత్రి! యీ పత్రంబులోన
చెప్పున్న భాషల శేషాహి వనుచు – చెప్పఁగా బొగడుదురు వన్నె వాసిఁగను
నీ వెట్టివా లైన నిమిషమాత్రమున – వివరించి చదువను వెలయ ప్రావీణ్యంగ
దిక్కులఁ గరణాలు దినదినంబునను – మక్కువగా నెన్న మంత్రివా! వినుము!
నీకుఁ దెలియ దటన్న నెగులొందు మదిని – చేకొని యీ కమ్మ చదివేటి మంత్రి
నీవె చెల్వు మటన్న నెఱ మంత్రి మదిని – భావించి పలికె భూపాల చంద్రుండ!
యే నెంతవాఁడను నీ యుర్విలోన – ఘను లెక్కువగువారు గలరు నాకన్న
బరమేష్ఠిసతియైన భారతీదేవి – కోరితమును చేసి కూరిమిచేత
వారిజ పుష్పబోణి వారిజనేత్రి – వారిజగర్భుని వరమునఁ గన్న
నీముద్దుకూఁతురు నీలాలవేణి – ప్రేమతో గొల్చియుఁ బ్రియమార వ్రాసి
తెలుఁగు వరవంబును........ – చెలఁగి కన్నడమును జదివె నాగరము
నరనాథ! మీపుత్త్రి నలినాయతాక్షి – తెఱఁగొప్ప చెప్పన్న దేశీయభాష
లక్కమగారికి నంత తెలివిడియు – మక్కువ మీరు మామనవిఁ జేకొనియు
నక్కడి కీకమ్మ లంపక కాని – తక్కినవారికిఁ దగదు తెలియంగ
నని విన్నపము సేయ నంగీకరించి – ఘనవేగ మారాజు గద్దెపై లేచి
యాటపాటల నన్ని యపుడు చాలించి – సాటుగ నెక్కిన సభవారి నంపి
బంధు సహోదరుల్ పల్లికొండయును – నందఱు నగరికి నప్పుడే తెంచి
మతివేగ శారదామండపంబునను – నారాధి వయసుతో నప్పుడు గూర్చున్న
నప్పుడు కూటాల కడ్డతెఱ గట్టి – కప్పురగంధులఁ గడువేడ్క బిలిచి
కొమ్మలారా! మీరు గొబ్బున బోయి – యమ్మ నాకాబిక కటు విన్నవించి
సిరిదేవి కొమరక్క సిరిభోగలింగ – సరసన నసమంచి చల్లపూరమ్మ
పందములు యరణప్ప పైడివారి తల్లి – అందఱిఁ దోడ్కొని యతివేగ రారె
యని వారి లోపలికి నంపి మైతన్న – తన యాప్తు లందఱుఁ దనచుట్టుఁ గొల్వ
గంగరేగులు మంచిఖర్జూరములును – బంగారుపళ్ళాల బాగొప్ప నుంచి
పంపినలేఖలు ఫలముల నడుమ – చెప్పగా నుంచియు వారితో ననియె
వినరయ్య! సభవార! వివరంబుగాను – జననాథుఁ డంపినజయలేఖ లిఖగను
సకలంబు నావలి సందేహ మెడల – నొకప్రశ్న చూతము ఒనరంగ మనము
పరమపుణ్యుం డిటుఁ బంపు లేఖలును – సిరిదేవికడ కిపుడు శీఘ్రమంపినను
నా చిన్నకూఁతురు! నారి సిరిగిరియుఁ – జూచి తనమదిలోన చోద్యంబు నంది
ఫలముల ఖర్జూర ఫల మాదెనేనిఁ – జెలువొంద మనపనుల్ జయము కాఁగలవు

పొలతి జయలేఖలు పుచ్చుకొన్నంతఁ - గలహంబు పాలేటఁ గలుగుట నిజము
అని నిశ్చయింపఁగ నంత నాచెలులు-నణుమాత్రమునఁ బోయి యంతఃపురమునఁ
గొమరగిరి సిరిదేవి కోడండ్రతోను - కలసిమెలసి యున్న కాంతలఁ బిలువఁ
గనకపూఁబోఁడుల కైవడితోను - చనుదెంచి యడ్డతెఱచాటున నిలువఁ
గుసుమకోమలు లెల్ల గొబ్బున వచ్చి - పసిడిపీఠము లెల్లఁ బరఁగఁ దెప్పించి
ఘనవేగముగ దైవగద్దెల మీఁదఁ - బొసఁగఁ గూర్చుండిరి పొలఁతు లందఱును
నంచలగద్దెపై యక్క కొమరక్క - సమముగా నాదండ చట్టిమారెమ్మ
చెలులు సిరిదేవియు శృంగారముగను - నలివేణి తొడలపై నాసిరిగిరమ్మ
పగడాలగద్దెపై పంసుముల యరణప్పఁ - దగ నొప్పఁ బైడివారి తల్లియు సరస
కొమరక్క కోడండ్రను కొమ్మ లందఱును - నమరంగఁ గూర్చుండి యక్క
[కోడండ్రు
సిరిదేవి కోడండ్రు చిత్తర్వులవలె - వరుసతోఁ గూర్చున్నవైనాన సరస
నెలత లందఱుఁ గూడి నెమ్మితోఁ గొలువ - ఫలములు లేఖలుఁ బాప నచ్చోకి
వడిమీఱ సిరిదేవి తొడలపై నుండి - యచ్చట సిరిగిరి యవి చూచి తాను
పళ్లెములో నున్న ఫలముల విడిచి - వేగంబె జయలేఖ వెలది యందుకొనె
యందిన వార్తల నటు పెద్దలకును - చందనగంధులు చెప్పి రంతటను
జెప్పఁగా విని వారు శకునఫలంబు - నప్పుడు రఘుపతి నడిగి రందఱును
నడిగిన వివరంబు నంతలోఁ దెలిసి - కడువేగ రాఘవుఁడు కలవారి కనియె
జనులార ! వినుఁడి యీ శకునఫలితంబు - నని సిద్ధమగు మరు యాదవులెల్ల
వలురాజుసుతుకంటె వలరాజుకంటె - నిలలోను నీజగడ మెక్కువ గలదు
గాంభీర్యలక్ష్మి ! యో కాంతాలలామ ! - యంబుజనేత్రి ! యో యలినీలవేణి !
అయితన్న పట్టి ! యో అలసిరిగిరమ్మ ! - వయినాన జయలేఖ వరుసవినిపించు
మనివల్క రఘుపతి నందఱుఁ బొగడ - జననాథుఁ డంపిన జయలేఖ లప్పు
డందఱు పెద్దలు నయితమరాజు - ముద్దుకూతురుఁ జూచి ముదమున ననిరి
అమ్మరో ! సిరిగిరి ! అమ్మ ! వినవమ్మ ! - నెమ్మదిఁ జదువంగ నేర్చితి వమ్మ !
పానదేశము నుండి పశుపతిరాజు - భూనాథుఁడే తనకుఁ బుత్తెంచినట్టి
జయలేఖ లిపుడు నీచెయిఁ బట్టినట్టి - దయచేసి మాకిపుడు ధరణీశపుత్రి !
వినిపింపు జయలేఖ వివరంబుగాను - ననినఁ జంద్రికఁ దీసి యాసిరిగిరమ్మ
పెనువ్రేలు వ్రాలాకుఁ బెట్టి యప్పుడును - చప్పన్న భాషల శేషాహిమూర్తి
యంపిన జయలేఖ నందఱు వినఁగ - 'స్వస్తి సమస్త విజయ గుణాధార !
హస్తి పైడి బిరుద ! అబ్ధిగంభీర ! - భువన జనారాధ్య ! భోగదేవేంద్ర !

రవితేజ! సర్వజ్ఞ రత్నకుండైన - బావ పశుపతికిని బలసిన మిామతుడవు
సలనన్న దండప్రణామంబుఁ జేసి - చెలఁగి విన్నపములు క్షేమ మాసిజము
నీయెడ నభిలాష యేయెడల మాకు - వాదాసమోహావిభ్రాంతియు మెప్పుకు
అనియేకమార్గముల నాత్మ మిావదన-వనజముల్ గనుగొన వాంఛ యున్నదియు
యాదవరాజ్య మేలించి యీాడేర్ప - నాదిమూర్తివి నీవ! యువనిలోపలను
ననువొంద గతహేమ్య మంతనెఱుంగుదువు - అనురక్తితో పంప కరుదేరవలయు
నలనాఁడు మిాతోడ నయ్య పోతురాజు - చిలుకలమఱ్ఱికడఁ జెప్పినవార్త
చిత్తాన నుండెనా శీఘ్రముంబె వచ్చి - నిక్కముగ నెఱుగక్షేమ సిగువ్రుడీ మిారు
... ... ... ... ... ... ... - ... ... ... ... ... ... ...'
నటువెన్క నొకలేఖ నప్పుడు చదివె - శ్రీపార్వతీదేవి సీత భగవతియు
శ్రీపాపనాశని శ్రితలోకగంగ - యరుదైన యట్టి యా యన్నపూర్ణయును
సరినొప్ప భారతసావిత్రి సతియుఁ - బరమపతివ్రతాపద్మినులైన
వారి సమానమై వైభవ మొందు - సక్కు కావకు నమస్కారా మొసఁగ
జక్కఁగా నలనన్న సాష్టాంగముగను - ప్రమొక్కి పంపినవినవ మొనరించంగ వినుఁడీ!
యక్కడనుండి మిాయానతిచేతఁ - గార్తిక మాసాన గదలి వచ్చితిమి
వార్తగా దేశముల్ వసర దిరిగితిమి - భ్రాంతి కృపచేతఁ బరిణాన మేము
సురభులతో నెల్ల సుఖమే పొలంబు - దంకు గడపినవాని తనయుఁ డైతన్న
యండ గలకంపటీ లందఱు మాకుఁ - జేతులోఁ జెయివేసి చెప్పి యొప్పితివి
యేతావునను మిాకు నేమి గల్గినను - నా తావులను మిారందఱుఁ గూడి
యంచితపుత్రమిత్రాదులతోను - బంచుక భోంచేయఁ బద్ధతి యిదియు
ననియిట్లు దీవించి యప్పు డంపితివి - యనియేకవిధముల నపుడు బోధించి
యలపాకనాటికి నంపితి మమ్ముఁ - దల్లిరో! యామాట తనలోన నిలిచె
మనములోపల మిగుల...నున్నాది - అమ్మరో! నీమది నెమ్మది నుంచి
యంత విన్నప మని యటనుంచి యప్పు - డంతట నొకలేఖ నందుకొని చదివె
"స్వస్తి శ్రీమత్సుగుణ సంపన్ను లయిన - సుస్థిరముగ ధర్మ సుగుణపయోధి!
బంధు శిరోరత్న! బాహుబలరామ! - మందరనగధర! మానుషయోధ!
శాస్త్రవాక్య ప్రతిష్ఠాపనాచార్య! - శ్రీకాంత పరిపాద సేవా ధురీణ!
నాకసుతప్రౌఢి నాయకులైన - చేకొని శుభముల జయరాము లయిన
కరిఘటములవైరి కరియావులన్న - వరశక్తి భట్టావుల వల్లభన్న కును
బొసఁగ నైతమరాజు పుత్తమరాజు - పశుపతి నలనన్న పంపినలేఖ
మాఘ త్రయోదశి ఆదివారమును - బాగుగా నున్నాము బలములతోడ

లక్షకంపటమును రాఘవుఁడు మేము - దక్షిణదేశాన తరలి ధేనువుల
పరఁగంగ నాసేతుబంధనము కరిగి - మఱలి వచ్చియును మామందల నెల్ల
జన్నవాడను నిల్పి చలఁగి వేడుకల - మన్ననచే మదిమఱచి యుండినను
పడవీటి కాదరాజు పాపాత్ముఁ డగుచు - బొడిపించె నెద్దుల బోయలచేత
మూఁడు భూములుసేయుమూఁడెద్దు లొఱఁగె - నాలుభూములుసేయునావును జెల్ల
దొరకొని చంపెను దుర్మార్గుఁ డయ్యెఁ - బసుల వ్రేసినయట్టిపాపాత్ముతలలు
వసుధఁ గూల్చిన గాని వచ్చుట లేదు - తరమైన పగ యేడ దాగెనో యనుచు
వెరవున భూములు వెదకుచు రాఁగ - నేడు తరములపగ యెఱగడ్డపాట
నీపైనజగడంబు నింపుగాఁ గలిగెఁ - బుల్లరి యొడఁబడి భూమి మేపితిని
బల్లవరాజుతోఁ బగయు నేర్పడెను - శ్రీదేవి పతియైనశ్రీహరికృపను
వాదించి పసులెల్ల వసగూడె మనకు - నలిగి పోవఁగ వింపు అయినచందమునఁ
గలిగె నాకును నిపుడు కయ్యంబు సేయ - గ్రక్కున మనశక్తి గలిగిన యపుడె
యొక్కటై యీపనుల నీడేర్పవలయు - నటుగాక మీయంత యాత్మవర్గములు
నిటలాక్షుకృపచేత నిండుఁ గలిగి - పగ నిర్వహించేటిపశువులఁ గలిగి
హిమసేతు మేరగా నీజగము పొగడ - విమతుల నిర్జించి విఖ్యాతి మింతు
నంతశక్తియు మాకు నాత్మలోఁగలదె - ఇంతవార్తయు మీకు నెఱిగింపవలయు
నలనాఁడు సిరిదేవి యాడువాక్యములు - కలిమి కోఱకుగాను గమ్మ లంపితిని
ఆలాగె మీమది హర్షంబు పుట్టి - వ్రాలాకు విన్నంత వచ్చియిది మీరు
దండ్లు గూర్చుకొని మీ దళములు మీరు - పెండ్లి చందమువలెఁ బ్రేమతోరంజి
సోమేశ్వరుని శుభశోభనము లైన - ప్రేమతో బసవన్న పెండ్లి మనయింట
నిల సిద్ధిరాజింట నింతిపూబంతి - వెలయంగ బసవనకు వేఁడఁగా వలయు
మాఘ బహుళంబున మంచిలగ్నంబు - బాగుగాఁ గలదని బ్రాహ్మలన్నారు
శివరాత్రిదినమున స్థిరలగ్నమందుఁ - బ్రవిమల యెదురుకాల్ ప్రఖ్యాతిగాను
సకలవాద్యంబుల సన్నాహ మలర - సకలపార్థివు లెల్ల సన్నుతింపఁగను
నెంతో వేడుకఁ బెండ్లి కేతేరవలెను - సంత బంధువులు మీ రరుదేరవలయుఁ
దాత యొక్కఁడు మన తండ్రులు వేఱు - తాత తండ్రుల పగల్ దరికొని వచ్చె
వచ్చి గలియుఁడి మీరు వాలాయముగను - నిశ్చలచిత్తాన నిటకు వచ్చేది
కాక మీ మనసులోఁ గపట మందినను - నీకమ్మలను జూచి యీక్షణంబునను
యొక్క కాపురా వెసరెడి ప్రజతులు - తక్కినదూడలు దళముల నెల్ల
తల్లించుకొని కృష్ణ దాటుఁడి మీరు - పుల్లగొడ్డ యలమంచి నుండు డావెన్క
విదియ తదియలకైన వేవేగ నిటకుఁ - గదలి వచ్చియు నీవు కలని శోధించి

చన్నవారిని జూచి సమరంబులోన - నున్నవారిని జూచి యొగి రణము గుడిపి
పోరాడి రణములోఁ బొలిసినయట్టి - వారికాంతల నెల్ల వైకుంఠ మనుపు
మంతలో సేనకు నన్న భర్తేన్న - యంత్రాట రణముకు సమదించెనేని
సాయుజ్య పదవికి సోపాన పదవి - సేయుంగ గలవాఁడు జగతిలోపలను
నటుమీఁదఁ బనులకు హరిగురువు లక్షుగు - ఇటుకున ప్రైతె తలి వచ్చేది
యిదికార్య మని మీకు సింత వ్రాసితిమి - యిది మది నుంచేవి వివరమంతయును"
నని లేఖఁ జదివిన నంతసిరిదేవి - విని చాల మదిలోన విభ్రాంతిఁ బొంది
తనసుతుఁడై తను దండు పోయినను - తనమది నెటువలె ధైర్యంబు నిలుచు
మొగము వెలవెల బాజ మోముచు వంచి - శోకకన్నుల నీళ్లు జొట జొటనఁ [గురియ
నదరుచు నాదేహ మంతయు వడఁకఁ - బసములు భూకాంత పైని నిల్వకను
జేతులఁ బిసుకుచుఁ జెల్లఁ బో! యనుచు - నాతన్వి శోకాబ్ధి నవనిపై సొలఁగి
వనజాక్షి కన్నీరు వసుధపైఁ గురియ - మూర్ఛిల్లుచుండై కడు మూర్ఛయు నొంది
యప్పుడు సిరిదేవి యవనిపై సొలఁగి - తెప్పిల్లకున్న సిరిదేవినిఁ జూచి
యన్నల చెల్లెలు నడుమంచి వచ్చి - కన్నీరు నొడిచియుఁ గడు లేవ దీసి
మెఱుఁగుఁ బట్టుశాలు మెడనిండఁ గప్పి - యురమునఁ జేర్చుకొని యడిద [యిట్లనియె
"కటకటా! యోయమ్మ! కడుదైన్య పడుచు - నిటువలె మూర్ఛపో నేటికి నీకుఁ
బరఁగ దక్షిణముకుఁ బంపి నీ కిపుడు - పరికింప నలనన్న పగవాఁడు నాయె
నేరాలి కొడుకును వేఱుగఁ జూచి - మారుభూమికి నంప మనసెట్లు నిలిచె
నీ కన్నకొడుకైతె నీవు అంపుదువ - యాంకాటభూపాలు నంపితి గాక
పక్షపాతివి గాక పశుపతి నీవు - దక్షిణాదికిఁ బంప ధర్మమా! నీకు
ధరణిపై వానికిఁ దల్లి యుంటేను - బోరాడ రిపులపైఁ బొమ్మను నె తల్లి
కట్టనిచీరెలు గావు ఓ యమ్మ - కన్నకడు పేమియు గాదమ్మ సీది
యేటిమాటలు నీదె వేఱు బంధమును - శాటించి నీసుతుల పాటిలే దమ్మ
యెంత కపటివి గాక యెన్న నీసుతుల - సంతోషమునఁ బంపఁ జాలవైతివిని
పగపాటుఁ దలపోసి పాకనాటికిని - సగమైన బలమును సాయమంపకను
నలనాఁడె నలనన్న యంపితి వమ్మ! - తెలిసె నీ కపటంబు తేటగా నంత
నితని బొమ్మనఁగనె యిటు మూర్ఛ వచ్చె - నతని బొమ్మన నోరు ఆడెనే తల్లి!
దశకంఠు డాది యాదైత్యుల నెదిరి - వసుధపైఁ గూల్చెటివై భవం బెసఁగ
నంత శ్రీరాముండు ఆ నలనన్న - వంతగించియు రిపులఁ బరిమార్చు నిజము

అలనాఁడు ఒకమాట ఆరవెల్లి కడఁ – బలికిన మాటకుఁ బంపెను గాక
యసహాయుఁడే యమ్మ! యావులన్నయును – బసులచేతనె తనవగఁ గెల్వఁ
[గలఁడు
భూనాథుఁ డైతన్న పోకున్నఁ గాని – కానున్నపను లెల్లఁ గాక పో విపుడు
చెలిమితో దీవించి జయము గమ్మనుచు – నలివేణి! నీ సుతుల నంపవే తల్లి!
వలదు నిష్ఠూరంబు వలదె యోయమ్మ! – నీకు మూర్ఛిలఁబోను నేటికి నిపుడు"
అని దూఱఁ బలికిన నంత సిరిదేవి – తన మూర్ఛఁ దెలివొంది తనలోనె తాను
నంతంతఁ బెదవులు నటు తడువుకొనుచుఁ – జింతించి సిరిదేవి శివునిఁ దా దూఱె
"ఓ పార్వతీనాథ! యో భక్తవర్య! – యీ పసుభూమిలో నావుఁకు మేపు
గద్దని చెప్పి యీకాటభూపాలు – సిద్ధిరా జున్నట్టిసీమ కంపితివి
వీరికి వారికి సరిపోరుఁ బెట్టి – యేరీతి దాగితివి యేమందు నిన్నుఁ
బట్టభద్రుఁడు దండు పయనమైనాడు – ఎట్టు కట్టడిచేస్తి వీశ్వరా!" యనుచు
మగువలుఁ దానును మందిరంబునను – బొగులుచు నడలుచుఁ బొలఁతి యున్నంత
నంత నైతమరాజు నా వల్లభన్న – కాంతిసమానుండు కరియావులన్న
జయలేఖ విని వారు సంతోష మంది – దయ మీఱ బంధుసోదరులును దాను
ద్వాపర మేలినధర్మరాజైన – నాపల్లికొండల యనుమతితోన
నుభయపార్శ్వాలను నుండి తమపనులు – నభిమతి నొనరించు నాప్తుల మనియె
నన్న కాటమరాజు అంపినలేఖ – విన్నప్పుడును నుండ విహితంబుగాను
దక్షిణభాగాన దండు గూడార్ల – నీక్షణంబునఁ బోయి యుంతె చూడగన
ధరణీశు సెలవునఁ దద్దయు నందె – తగురీతి పయనమై దక్షిణముగను
డేరాల నెత్తిరి తెఱఁగొప్ప వారు – ధారుణీశ్వరునితోఁ దగ విన్నవించి
పలువగ నేజా తుపాకులవారి – ననువైన యీ ఛత్రి సాయుధమువారి
ఘనమైనయాభద్ర గజములవారి – దోడైన గుఱ్ఱాల దొరమన్నెవారి
దండు పైనం బని తగఁ జాటి రంత – వలను మీఱఁగ దళవాయుల కనియెఁ
"గులుకుల దుపాడు కొచ్చెర్లకోట – తురిమెర్ల కొకర్ల తొండమనేడు
అరియంగఁ జెన్నూరు ఆరణిఁ జేర్చి – అద్దనిడు దనకొండ అలరెండు యెరువులు
అద్దంకి వినుకొండ అమ్మనబ్రోలు – అరుదైన మూఁకల నటుపిల్వ నంపి
భీకరంబుగ రణభేరి వేయించి – నయముగ నా సభానాయకుల నిల్పి
యమితవై భవముల నయితమరాజు – తమతల్లి నగరికిఁ దద్దయు వచ్చి
తల్లిని నూరార్చి తా నంత వేగ – జలక మొప్పఁగ నాడి శంభుని నవుడు
చెలువొందఁ బూజించి శీఘ్రమె లేచి – పొలుపొంద భోజనశాలలో కరిగి

యన్నలుఁ దమ్ములు నపుడు భోంచేసి - పన్నీరు గంధంబు బయి నిండ నలఁది
యడప వారెల్లరు నాకు చుట్టీయఁ - గడువేగ మొగసాలకడ కేగుదెంచి
కొలువు మొగసాలలోఁ గొమరు మీఱలంగ - గుల బాంధవులు రెండు? కొల్వఁ [గరణాలు
పరఁగంగ నా రఘుపతి యుత్తముండు - ధర బలాధికుఁడయి తమ రాజవరుఁడు
కల్ల రిపులకు వైరి కరియావులన్న - వల్లభ న్నాదిగా వరుస గూర్చుండి
సకలశాస్త్రపురాణసంపన్నులైన - సకలవిద్యల వారి సరగ రప్పించి
యారాత్రి జాగర మటు చేసినట్లు - భారత పురాణములు బాగ వివరించి
సభను సత్కవులెల్ల సన్నుతులుసేయ - విభవాన దేవేంద్రు విధమునఁ బోలి
వీరశూరత్వమును వివరించి చూడ - నాహూఢి నా విక్రమార్కునిఁ బోలెఁ
దనకీర్తి దిక్కుల ధరణి వ్రేయంగ - ఘనదానమునను నా కర్ణునిఁ బోలి
యుత్తమోత్తమ కళల నొగిఁ జంద్రుఁ బోలి - సత్యభాషల హరిశ్చంద్రుని బోలి
యీరీతిఁ గొలువుండి యిలతలాధిపుఁడు - ధారుణీసురులకుఁ దగ యాచకు కు
గానవిద్యాప్రౌఢ కవితార్కికులకు - దానంబు లిచ్చుచుఁ దగ వేడ్క నుండె
ధరణిఁ జీకటివాసెఁ దగఁ జుక్క పొడిచె - నెఱిఁ గొండపై నపుఁడు నిలిచె సూర్యుండు
నా సమయంబున నష్టదిక్కులను - వాసి మీఱఁగఁ గదలి వచ్చెను దళము
నచ్చుగా గావించి యయితమరాజు - వీరపరివారము విం దావగించి
వారికి విజయముల్ వరుసతో నిచ్చె - సొమ్ములుఁ గట్నాలు సొన్నటంకాలు
గమ్మన వాసించు కట్టువస్త్రాలు - జల్లులు సవరాలు జమిలిపెక్కెములు
వల్లవకులపతి వరుసతో నిచ్చె - భేరీ మృదంగముల్ పెక్కువాద్యములు
నారూఢి మ్రోయంగ నవనీశ్వరుండు - నావంటి పెద్ద మల్లెనో కాని
వేవేగఁ బిలిపించి వేడ్కనిట్లనియె - గొప్ప తేజీలును గోరాజములును
జల్లులు సమకట్లుఁ జాల సవరించి - వల్లన గట్టుమనఁ బల్కి రంతటను
రాజు సెలవందియు రావలనఁ బోయి - వాజుల కన్నిటికి వైనవైనాన
వాగెలు బంగారువన్నె సమకట్లు - బాగైన కట్టాణిబన్నసరములును
బిగిలితలాటాలు బిరుదుజల్లులును - సకలంకబంగారు టందెలు......
బాలార్క బిళ్లల పగడదేవళలు - పాలసంకుల పేర్లు వసపురుమాళ్లు
నెచ్చైన బిరుదెంకు ముఖముల అందె - పచ్చని బంగారుపల్లము వేసి
తలచైనబంగారుటంగీ బిగించి - పరిగె పట్టెసములు పైని సవరించి
సిగె బందు జీరాలు సింగిణీవిండ్లు - తగఁగ బొమిడికములు తగ ధరియించి
యుత్తరరాజుకు ............. - కత్తులకల్లెంబు కంచుపక్కెరయు

ముత్యాల ముఖమఱుఁగు మూఁడు ముఖములవి - వింతగా రిపులపై విజయంబు [నొందె
కొంత్తైన చాళువ గొలుసు లిర్గడలఁ - బంతగించినక్రియ పట్టుక రాఁగ
నయితన్న యెక్కేటి అపరూపరాయనికి - రావిరేకలు మణి రత్న భాషికము
లావణ్యఖని యైనలాలుసరిజల్లి - అనువవ అఖముల అద్దె హనుమంత బిరుఁదు
పసిమించు నెట్టిగోపాల మనుబిరుదు - వేగంబె ధరియించి వేడుకతోను
... ... ... ... ... - వరభక్తి భట్టావుల వలభన్న యెక్క
తురగంబునకు నొక్క తొంవపల్లము వైచి - సరి బోర రత్నాలసరిపెన వేసి
అరివేగ అల్లుఁడా యన్న యెక్కేటి - యున్నతహయమునకు నొనర వేగంబె
పులితోలు పల్లంబు పొందు వాగెయును - బసిఁడితలాటంబు పటువైరి అందె
పసిమించు పువ్వుల పేరులు వేసి - కరియావులన్నెక్క గండక త్తెరకు
బిరుదైనమువ్వల పిగిలి జల్లులును - దక్కిన గుర్రాల తగనఘంజోళ
పక్కెర తేజీల పల్లన కట్టించి - మావంటి కడుమల్లు మతివేగవచ్చి
యవనీశ్వరునితోడ నంత విన్నవించె - నప్పుడు నయితన్న హయశిక్షకునకుఁ
గప్పురగందంబుఁ గడువేడ్క నిచ్చె - బంధుసోదరు జూచి పలికె నైతన్న
'యందఱుఁ బైనమై యతివేగ రండి-యింప జా గేలయ్య యిది పండు'గనుచు
నందుల నూకాంబ నగరు కేతెంచి - యప్పుడు నయితన్న యతివేగమునను
నొప్పుగా ముమ్మయ్య అల్లుని జూచి - కప్పురగంధులఁ గడువేడ్కఁ బిలిచి
యప్పుఁడే యందలము నతివేగఁ బట్టి - 'బాలరవెంబడిఁ బైనమై పోయి
యలమేడలో నున్న యతివపాళన్న - మనసులోపలిచింత మాన్పి మీ రంత
ఘనవేగమున నిటకు గ్రక్కున రండి' - యని వారిఁ బంపిన నాలాగె పోయి
నిబ్బరంబుగ మేడ నిచ్చెనఁ జేర్చి - గొబ్బున మేడకుఁ గోర్కెతో నెక్కి
చేడెలు పోచయ్య చిన్నముమ్మయ్య - మేడ యంతరువుకు మేకొని యెక్కి
యాపాపఁ గనుగొని యని రిట్టు లంత - "ఓ పరమపావనీ! యొక విన్నపంబు
కరియావులరాజు ఘనుఁడు నైతన్న - హేరాళముగ దండువెడలుచు మిమ్ముఁ
గన్నులఁ జూచి పోఁ గలవార మనుచు - మన్నెరా జయితన్న మము మేడ దించి
తమసముఖానకుఁ దరలి రమ్మనెను" - అనెడు నన్నలమాట కతివ శోకమునఁ
గన్నుల నీర్నించి కాంత యిట్లనియె - "ఓ చేడెలార! మీకుచితమా యిట్లు
అవనీశ్వరుఁడు మిమ్ము నంపె నీలాగు - మాతల్లి సిరిదేవి మతివేగ మునుపు
ఐతన్న మొదలైనయాసహోదరులుఁ - గన్నులు పండుగఁగా జూచుచుండు
నెన్నడు రఘుపతి మన్ననతోను - గడమేడ నుంచియుఁ గన్నతల్లియును

గడసాగి యిటుపిల్వఁ గారణం బేమి – నను మేడనంచియు నాతిసిరిదేవి
కనుగొన దోషంబు కలలోననైన – నంత్యకాలము వచ్చె యాదవుల కిప్డు
డెంతైనఁగాని యీమేడ దిగ ననుచు – నన్నదమ్ములకును నతివేగ మీరు
విన్నపంబున జేయుఁ డిది బుద్ధి యనిన – వారందఱును మేడ పై శింబె డిగ్గి
ధారుణీశ్వరునితోఁ దగఁజెప్పి రపుడు – "అన్నరో! పాపకు నని యేకములుగ
విన్నప మొనరింప వినక యాపాప – యన్నలఁ జెప్తల నాసిరిదేవి
దూఱుచు మిముఁ జాలదూఱె మీచెలియ – లని విన్నపము సేయ నయితమరాజు
తనమదిఁ జింతించి తల్లిని దూఱి – వారిధిగంభీర వంశవర్ధనుఁడు
ధరణీశుఁ డైతన్న తాఁ బైన మయ్యె – జీనాంబరములను జెలువొందఁ గట్టి
చక్కనిముత్యాల చౌకట్లు పెట్టి – కెంపులయుంగరాల్ కేలఁ గడియములు
సొంపైనముత్యాలజోడుహారములు – గడుపెద్ద ధరియించి గండపెండెములు
నడుమున నొడ్డియాణము నేమమునను – మస్తకమున వజ్రమకుటంబుఁ బెట్టి
కస్తూరి గంధంబుఁ గరమొప్ప నలఁది – చన్నరిపులకు వైరి జమిలియుఁ గట్టి
పున్నమ చంద్రుఁడై పొంకంబు మెఱసి – నన్నలుఁ దమ్ములు నాత్మబంధువులు
మన్ననతో బావ మఱఁదు లాదిగను – నారీతి భూషణా లలవడఁ దాల్చి
యారూఢిగా వచ్చి యయితమరాజు – నిరుగడలను గొల్వ నిలతలాధిపుఁడు
తల్లి సముఖానకుఁ దాఁ దరలివచ్చె – వల్లవకులజుఁడు వచ్చుటఁ జూచి
కొమరక్క సిరిదేవి కొలువుండె నంత – నమితవిక్రమశాలి యయితమరాజు
నుల్లంబులో భక్తి యుల్లసిలంగఁ – దల్లికి నత్తకు దండంబుఁ బెట్టి
"యోయక్క! యోయమ్మ! యొనరంగ మీరు – దయమీఱ నరిపుదళ
[ములపైని
వీరశూరత మాకు విఖ్యాతి గలుగ – ధీరతతో మమ్ము దీవించు తల్లి!"
యనుపుత్రు వాక్యముల కంత సిరిదేవి – మనమున భీతిల్లి మఱియు నిట్లనియెం
"నో యాదవాంభోధి! యోపూర్ణచంద్ర! – దయమీఱి నోధర్మ ధర్మవర్త
[నుఁడ!
యెన్నొ నోములు నోచి యేనిన్ను గంటి – నన్నరో! నేనిన్ను నంపుదే దండు
తొల్లి శాపభయంబు తోడయ్యె నేమొ – వలని సాహసములు వద్దంటె వినరు
అలనాఁడు వద్దంటె యామాట వినక – నలనన్న తాఁ బోయె నట దక్షిణాది
పరభూములకుఁ బోయి పశువుల మేపి – కొలి వారలతోడఁ గయ్య మేమిటికి
నందినకార్య మేలాగైనఁ జేయ – కిందఱ కీలాగు లేఖ లంపించి
యంపిన జయలేఖ లంది మీకిపుడు – ఒప్పుగాఁ బైనమై యున్నట్టివారి

సంపక పోరాదు ఆత్మజులార! - అంపితే యట మీకు నైనకొదవేమి
గదలిన శకునాన ఘనపుణ్యులార! - కదనంబులో రిపులఁ గల్లుగాఁ జంపి
యా రిపుబలముల కపజయం బొసఁగి - విరివిగా మీబలము విజయంబునొంది
పశుహత్యఁ జేసిన పాపాత్ము తలలు - వసుధపై ఖండించి వైభవంబునను
నిలజనుల్ పొగడంగ నెంతొ వేడుకను - దలపూవు వాడక తరలి రమ్మనిన
అనువాక్యములు విని యయితమరాజు - మనవిగా దల్లికి మఱియు నిట్లనియెఁ.

"దల్లిరో! మామీద దయచేత నీవు - పల్లవరాజులబలముల విడిచి
తల్లి మము దీవించఁ దగునటో యమ్మ! - యెల్లలోకము లోన నెన్నఁగాఁ దల్లి
యిరు బయిజ్వలమీఁద నెక్కుకై వడిని - బరఁగంగ దయయుంచు ప్రఖ్యాతిగాను
దూషింప వలదమ్మ! దుర్జనులనైన - భూషింప వలెఁ దగఁ బుత్రులవలెను
సత్యంబు నిలిపిన సమకూరు శుభము - నిత్యమా దేహంబు నీటిపై బుగ్గ
సత్యంబు నిలిపిన సకలపుణ్యములు - సత్యంబు నిలిపితే సాటెవరెక్కు
సత్యమే జయ మని చాటు వేదములు - సత్యసంధునిఁ బోలి చరియించువారు
సత్యలోకానను సన్నుతించెదరు - సత్యవ్రతముఁ బోల సాటి లే దెందు
నటుగన్క వారిపై నతిభక్తి నిల్పి - తటుకున నిటుమాకుఁ దగ శౌనరి గనక
పాలేటి జగడమో పాలి గాకుండఁ - బాలివంతంబు లేర్పఱచి పోరాడ
వీరకథ లోకమున విరివి గమ్మనుచు - నాయూఢి దీవించి యంపవే తల్లి!"
యని యిట్టు లయితన్న యాడుమాటలకు - విని వేడ్క సిరిదేవి వేవేగమునను
దన సుతుల శిరములఁ దగ సేస లిడియు - వనజాక్షి దీవించి వైళంబె యపుడు
నాయన్న! నాపుత్త్రి! నావంశతిలక! - యీయెడ దీవన లిటు వినరయ్య!
దశదేశములు ద్రుంచి ధాత్రిఁ బాలించు - దశరథరామునిదయ మీకుగలుగు
విపులశౌర్యుఁడు కార్తవీర్యునిఁ జంపు - జమదగ్నిరామునిశౌర్యంబు గలుగు
నెలమిఁ గుస్వాములనే పడఁచినట్టి - బలభద్రరామునిప్రఖ్యాతి గలుగు
విరటుధేనువులెల్ల విడిపించినట్టి - నరునకుఁగలయంత నాణ్యంబు గలుగు
బగతురకు వెన్నీక బాహుబలమునను - బగతుర నెఱగడ్డపాటఁ బొగడగను
సమరేంద్రుఁ బొగడంగ నారాజు మీరు - సమరంబులో నొక్క సమయానఁ బోరి
కలియుగ మెన్నాళ్లో కడతేరుదనుక - నిలువుఁడీ! మీకీర్తి నిఖిలంబులోన"
ననుచు దీవించంప సందఱు నపుడు - మనసు సమ్మదముగా మఱి యుండిరంత
నంత నైతమరాజు అగుమంచిఁ జూచి - యెంతొ సంభ్రమముతో నిట్లని పలికె
"అన్నల చెల్లెల' అగుమంచి! వినరో! - యన్నమ్మ దకు మేము అరుగంగవలయు

నిదిమొదల్ శివరాత్రి యిట వచ్చుదాఁకఁ - బదిలముగ దనకొండ పాలించునీవు
పంటయేరువరెడ్లఁ బద్మనాయకుల - నొంటరిగా నున్న యొక్కొక్క బలము
పటుబలంబున జనులఁ బాలించు నీవు - కటకట యిదిగో యీకాపు కరణముల
వెలయఁ బాలించుమీ విశ్వాసపరులఁ - గలలోన నైన బొంకనిసత్యవ్రతుల
ముద్దు బాలకుల ముమ్మయ్య పోచయ్య - యిద్దఱి నిటఁ బుత్తు నిక తోడుగాను
దొంతేట నుండి మన దొరమన్నవారి - మంతెన మూఁకతో మరల నంపెదను
దినదినవార్తలు దినచరులచేత - ననుపోఁద నంపెద నక్కహో! నీకుఁ
బాలేటివార్తలు పావురాల చేత - వైళంబె లేఖలు వ్రాసి యంపుదును
నేనుండి శివరాత్రి నెల మాన మెఱిఁగి - మానకే తెంతురు మఠము జంగాలు
వడయుల కన్నంబు వడిఁ దృప్తిగాను - దడయక యంపించు తగ వేడ్కతోను
అని యిట్లు అయితన్న యచటబాలురకు - అనియేక విధముల నచ్చనబుచ్చి
సిరిబాల ముమ్మయ! సింహవిక్రముఁడ! - కరివసుమ నిజదాస! కల్లంచుల పోచ!
అగ్నిదేవకుల వరప్రసాద మీరన్న! - విఘ్నంబు సేయక పనుఁ దొక్కమాట
ఆవులన్నియు లేఖ యంపినందులకుఁ - బోవలె నటమేము పోకున్నఁ దప్పు
ఆవుల మందకు నతివేగఁ బోయి - యావులన్నను గాంచి యతిభక్తితోడ
ఫాలలోచనుఁడైన పసులన్నఁ గాంచి - యిలలోనివింతల నింపుగాఁ దెలిసి
పసులమందలవార్త బాగుగాఁ దెలిసి - దశమి తిథి వచ్చునంతట వత్తుమిటకు
నావులన్నునుమతి నంపించుకొనియు - వేవేగఁ గ్రొవ్వులుల వెల్లగొండలను
దెఱఁగొప్ప వేఁటాడి ధీరత మెఱసి - కరిసింహ శార్దూల శరభముల్ మఱియు
జిలుకలుఁ బావురాల్ చెలఁగు డేగలును - దెలివగు సారంగములుఁ జక్రములును
రాచగోర్వంక లారామభూములను - గాచినఫలములుఁ గర్పూరములును
బరఁగంగ భట్టుచేఁ బట్టించుకొనియు - మఱలి వచ్చెద మయ్య మహావేగమునను
నిచ్చోట మీరిద్దరెసక మెసఁగంగ - నచ్చుగా బొంగరా లాడుఁడీ! చాల
రాణివాసమునకు రణశూరు లయ్య! - పోడిమి దనకొండపురి నుండుడయ్య!"
యని యిట్టు లయితన్న యలబాలురకును - ననియేక విధముల హర్షం బెసంగ
నక్కిరెడ్డి మొదమాదు ననువుగఁ బిలిచి - మక్కువ మీఱ నామహిపాలుఁ డనియె
'వినుడీ! సాహసులార! వివరంబుగాను - ధనధాన్యముల మీఁద దనకొండ

[మీఁద

కెరలి కుటుంబంబు గృహములమీఁద - సరవి హెచ్చరికతోఁ బరఁగుడీ మీరు.
కయిజీతగాండ్రను గడువేగఁ బిల్చి - యయితన్న వారితో నవ్వు డిట్లనియె
"సాహస ఘనులార! సజ్జనులార! - బాహుబలంబునఁ బ్రఖ్యాతి గలిగి

పదిలాన నూఁడుడీ పట్నంబులోన - నిదె నిల్పెఁ డెచ్చరిక నిదె పోదు మనియు
నందలంబులు పైఁడి యల పల్లకులతో - దండు పైనము లయ్యెఁ దగ వేడ్క
[నడచు
మన్నీలు దొరలును మంత్రివర్గంబు - సన్నాహములతోడఁ జయ్యనఁ గదిలి
రారాజు ననుమతి నట ముందుగాను - కోరినవస్తువుల్ కొదువ లేకుండఁ
జక్కెర కట్నాలు సన్నబియ్యములు - బుక్కాలు గండవొడి పునుఁగు జవ్వాజి
పోకలు కంట్లాలు పొన్నుటాకులును - చేకొని యొకకొంత చేరువగ నడువ
బట్టుతివాసీలు పరజాలు కొన్ని - దిట్టముగ మందర ధీరత నడవ
బట్టెమంచాలును బరువులు దిండ్లుఁ - బెట్టెల చీరలుఁ బెద్దయడపములుఁ
గొట్టడి యెద్దులు గొబ్బున నడువ - ముట్టడి సేయంగ ముందుగాఁ గదిలె
గొప్పైన గూడార్లు గోడసరాతు - లొప్పుగా నెత్తిన యెద్దులు నడచె
నటుముందుగా జెండ అదిగోని కదిలె - నటువెన్క సేనలు నంతయుఁ గదలె
విలుమూక యీటెలు వెసఁ దుపాకులును - వెలుగొందగా నూఱు వెల్ల ఛత్రములు
గంభీరవాద్యముల్ గాలిటెక్కెములు - శంభునిపల్లకి సరసనే కదలె [ములు
నందివాహను సరస నతిసొంపుతోను - వందుమల రఘుపతిపల్లకి గదలెఁ
బరఁగంగఁ బల్లికొండపల్లకి గదలెఁ - గరియావులన్న గండక త్తెర నడచె
నావెనకఁ బల్లకి నయితమరాజు - వేవేగముగ నెక్కి విజయంబు సేయ
నరుదుగా గదలెను నాసరస నిపుడు - నాచకుళ్లనాయఁడు నేతివారి ముద్దయ్య
యంచెలఁ గదలిరి యశ్వాల నెక్కి - యరువైన యాసరస నందలం బెక్కి
వరసెట్టి భట్టావుల వలభన్న గదలె - పుత్తమరాజును బొంది యేతెంచె
నవిరళంబుగ మేఘమతి యను తేజి - నవనీశ్వరుని సుతుఁ డల్లుడా డెన్న
మెందుగాఁ దేజిపై మెరవడిఁ గదలెఁ - గొండువారి కొండయ్య గోవులగంగయ్య
మెండైనమూకతో మెఱసి చను దేర - నూఱిన కేడెముల్ నేజాలతోటి
నెఱి దెగ కదలెను నేతిముద్దయ్య - కొలువు గడలు మంచి గొప్పబంతులును
గొలవారినాగినేఁడు గొబ్బునఁ గదలె - వెండిమప్పె కటార్లు వింజామరములు
దండిగాఁ బిన్నయ్య తాఁ గదలెనంత - జగజంపుగొడుగులు జమిలి టెక్కెములుఁ
బగడంపుఁ జాయలఁ బటువైననగలు - తందఱను భేరీ మృదంగములు మ్రోయ
నందడింపుచు రాజసన్నాహములును - సరదార్ల తోటల్లు సయ్యాన గదలె
నారాజు నిర్గడల ననువొంద భట్టు - చేరి కైవారముల్ సేయుచు రాఁగ
వరుసతో బ్రాహ్మణవరులు దీవింప - విరి వైనదనకొండవీధు లూరేగ
బాలరాజులు పోవు పయనంబు దెలిసి - చెలియ లందఱు వేగ సేసలు గొంచు

విలసిల్లు శృంగారవీథి కేతెంచి - చెలియలు దీవించి సేసలు వైవ
భూతలాధీశ్వరుఁ బొడగని పొగడి - యాతరుణులు కుంకు మటు చల్లి రంతఁ
దగనొప్ప నయితమధరణీశుఁ జూచి - మగువలు గందవొడి మఱి చల్లిరపుడు
జననాథులను జూచి చెలఁగి యావేళ - ఘనవసంతముఁ దెచ్చి కాంతలు సల్లి
రంత నామూకలు నతిభీకరమునఁ - బంతంబు లాడుచుఁ బరిపరిగతుల
గంగవారుపు గమిడి గడిమన్నవారుఁ - బొంగుచుఁ గదలిరి బోరు కలఁగంగ
వింజ్ల చెరువు గమిడి విడిమూక కొంత-మెండుగాఁ గదలిరి మెఱసి యాడుచును
నచ్చాళి మూకతో నశ్వాల నెక్కి - కొచ్చెర్ల గమిడిని గొబ్బున గదలె
గుడిపాటి గమిడిని గుఱ్ఱాల నెక్కి - వడివడిగా దండు వచ్చె నాక్షణమె
పొట్లపాటి గవనిఁ బొందియుల బార్లు - కట్టుగా గదలిరి కడుమోదమునను
హనుమంత గవనిని నయితమరాజు - తనతోడ మూకల దరలించి గదలె
పాలగొర్లను విడిచి పడఁ బొడిపించి - యిలఁ బిక్కటిల సర్వదళములకెల్ల
శ్రీరామమాడలు చేతులకొలఁది - యిరవందనిచ్చుచు నేతెంచుచున్న
కొల్లకాంద్రందఱుఁ గూడి ముందఱను - మల్లెలవాగను మనివాగు చూప
నాసమయంబున నయితమరాజు - ఎనగంగ దొడ్డతన మేల మన్నీల
దనకొండకును వారిఁ దగ మల్లి అంపి - యినకులాధీశుండు వేగంబె కదలి
పొదిలి నిమ్మనాథుని పురముకేతెంచి - పొదిలె నిమ్మనాథునిఁ బొడగాంచి వారు
అంద్రగిరి పల్లెకు నయితన్న వెడలి - యంద్రగిరి భీమేశు నపుడు సేవించి
తలకొని యొకలక్షదళములతోడ - బాలరా జైతన్న పాలేట నిలచి
నిలిచె గుఱ్ఱపుదండు నిలిచె నేనుఁగులు - నిలిచె దళములు పెక్కు నిలిచె రఘు
[పతియు
గండభేరుండని గబ్బి హనుమంత - జండాలు వెసనెత్తి చాటించి రచట
సూర్యుఁ డంతట గ్రుంకెఁ జుక్కలు వొడిచె - ధరణిపై యాదవధవు కీర్తిఁబోగడు
విధమునఁ జంద్రుండు నుదయించెఁ దూర్పు - నదిచూడ మనినట్లు నడచెను మింట
నంత నైతమరాజు నల సఖులుఁ దాను - సంతోషమున నున్న సరదార్లు పొగడ
బిరుదైనవాద్యముల్ పిల్లగ్రోవులును - భేరులు శంఖముల్ పెద్దబూరుగలు
పంచవాద్యంబులు బలువిడి మ్రోయ - పంచాయి దివిటీలబారులఁ గాంచి
యెచ్చరింపుచు దండు యేగుచు వారు - అచ్చటచ్చట నిల్చి యటు లెచ్చరింప
పాలేట నీరీతిఁ బ్రఖ్యాతిగాను - వలనొప్పు రఘుపతి వసుధేశుఁ డుండె
నావేళ నలనన్న యారాఘవుండు - దేవేంద్రు జనదెంచు దివ్యతమకమును
సమముగాఁ గూర్చుండి సంద డాలించి - కొమర బంగరుభట్టు గొబ్బునఁ బిలిచె

"ఇటు విన వో భట్ట! యీప్రొద్దదేమొ! - పటునాదములు సాలఁ బాలేటివెంట
పెనుమ్రోత మ్రోగెను భేరినాదములు - నినుఁ డస్తమించెను నీసంధ్యవేళ
మానదళంబులో లేక మఱియొకరిదళమొ - సరగ మనపైవచ్చు శత్రులో కాక
యెవ్వరైన మిత్రులో యేమిటో తెలిసి - వేవేగ రావలె విను మొక్కమాట
పోరుకుఁ దొడిబడఁ బోరాదు మనము - దూరంబు తెలియక దొరకొనరాదు
నీవేగి యీవార్త నేర్పున దెలిసి - వేవేగ ర"మ్మన్న వేడ్క నాభట్టు
వరువునఁ బోయి యా బలములఁ జూచి - ధీరుఁడై యా భట్టు తెఱఁగొప్పఁ బలికె

"ఓ వీరపరివార! మొనరంగ వినుఁడు - ఈ వసుధేశ్వరుం డెవ్వఁడు నిటకు
సాహసంబున వచ్చుచందం బదేమి - సాహసంబున మందసరస కొచ్చితిరి
రణవిజయుఁడు మా రాజు నలనన్న - కణగి శత్రులనెల్లఁ గల్లుగాఁ జంపు
బలువైనకాణ్యాలు పఱిపించి యిపుడు - బలువుగా నెఱగడ్డపాటను నిలిచెఁ
భటులు ముప్పదివేలు బహుకాల్బలములు - నిటలాక్షుతోనైన నెదిరింపఁ గలరు
దాచక చెప్పుడీ దళములోవార! - తోఁచి యుండగవలె దొడ్డకార్యంబు
ధాతకైనను మంద దాఁచంగ రాదు - పోతుటీగైనను బొలియంగరాదు
చూపుల నొరుమంద చూడంగ రాదు - భూపతులకు మంద పొడగట్టరాదు
ఇదిప్రొద్దు ఇదివేళ యీపటాటోప - మిదివచ్చి నిలుచుట యేమికార్యంబు
మీదుగోత్రముపేరు మీతండ్రిపేరు - పదపడి మీరేలు పట్టణముపేరు
నదియంతవినిపింపు డతివేగ మీరు - గొదకొని మీరేల కూడినా రిటను
బందుగులో మీరు పగవారొ మాకు - చందం బదేమిటో చాటింపరయ్య!

అనిన యంతట భట్టు నాభట్టుతోడ - నినకులాధిపుఁ డున్నవిడిపట్టు కేగ
నడిగిన యర్థంబు లంత దెలుపుటకు - వినయాన భట్టుతో వివరంబు పలికెఁ

"గొమర బంగారమా! కొమర వినవయ్య!- యమిత విక్రమశాలి యాదవరాజు
వలరాజుమనుమఁడు వార్త మన్నీడు - పోలు దేవేంద్రుండు పోత్రాజుకొడుకు
బాలరాజైతన్న పట్టభద్రునకు - నల పల్లికొండకు నాదిపెద్దలకు
దనకొండ యేలేటిధరణీశ్వరులకు - నన్నదమ్ములకును నాత్మవర్గముకు
జయలేఖలను గొంచు చెలఁగి కాలారి - వయినాన దనకొండ వచ్చి లేఖలను
నన్న కాటమరాజు అంపించె ననుచు - నున్నతంబునఁ జెప్ప నొయ్యన లేచి
యన్న యఃపినకమ్మ నంది శిరసునను - గన్నుల నద్దుక కడువేగఁ జూచి
వైనాన వల్లవుల్ వినఁ జదివించి - పైనమై వచ్చితి బలములతోను

నాత్రేయగోత్రు కాయమ్మృతవల్లవులు - ధాత్రి వెలసినయట్టిధర్మవర్తనులు
సెనఁగంగ విభవదేవేంద్రసము లగుచు - వసుధ మించినయట్టివంశవర్ధనులు
పల్లికొండ రఘుపతి భట్టావులన్న - వల్లవకులజులు వంశవర్ధనులు
భుజబలాధికుఁ డైనపు త్తమరాజు - గజవైరి భీకరుఁడు కరియావులన్న
నాచకూళ్లనాయఁడు నేతి ముద్దయ్య-రాచబలములు కొంత రాతు అల్లుడావెన్న
మెఱసిన యొకలక్షమెండురాహుతులు - బరఁగిన మూకతో బసవదేవునికిఁ
బెం డ్లని విని మేము ప్రేమతోడుతను - తమ్ముఁడు నయితన్న తగవచ్చె ననుచు
దెగువ జెప్పినమాట దెచ్చి మదిలోన - పగవారుగా రనుమి బాంధవు లనుమి
యన్న నలనన్నకు నయితన్న చాల - మన్ననల్ సెక్కెనని మఱి విన్నవించు''
మని భట్టుకును జాల హర్షంబు పుట్ట - ఘనభూషణంబులు కడువేగ నిచ్చి
యంపిన నాభట్టు నతిసంభ్రమమున - నింపొందఁగా వచ్చి వృత్తాంతమంత
నలనన్నకును దెల్ప నాత్మలో మెచ్చి - పల్లికొండను జూడఁ బైన మైసంత
మందరధీరుండు మహిన త్త్వధనుఁడు - పద్మరాఘవుఁడును బైనమైవచ్చె
నెరనన్న చట్టువారి యెరనన్న మొదలు - పరివార మొకకొంత బలిసి కొల్వఁగను
నందలం బెక్కెను నావులన్నయును - నంద మాపల్లకి నలరాఘవుండు
హేమపల్లకిపైన నెర్రయ్య యెక్కె - నమిత మా బంగారుఅందలముపైని
చట్టువారెర్రయ్య నయ్యనయెక్కె - దిట్ట మా కానుగదిరిటీలువెయ్య
పట్టించి రప్పుడు ప్రబలి శంఖములు - దిట్టమై యూదుచు దిద్దిమిధ్వనుల
బూరలు దారలుఁ బూని గౌరులును - నాయూధి మ్రోవంగ నవనీశ్వరుండు
వచ్చుట గనుగొని వారి కెదురుగను - నెచ్చరిక నయితన్న యాదవుల్ గొల్వఁ
దమ్ములతో నేటఁ దగవచ్చెనంత - తమ్ములఁ గనుగొని తమయందలములు
పల్లకీలును డిగ్గి బావ రఘుపతియు - వెల్లిగొల్పుచు రాఁగ వీరశేఖరుఁడు
దండంబుపెట్టెనతఁడిని నెర్రయ్య - దండంబుపెట్టెను చట్టువారెర్రు
అందఱను దీవించి యాపల్లికొండ - యందఱుఁ బొగడఁగా నపుడు నలనన్నఁ
గౌఁగిటఁ జేర్చుక ఘనుఁడు రఘుపతియు - నగుచు మెల్లన నలనన్న కిట్లనియెఁ

''పశుపతి! నలనన్న! పట్టాభిషేక! - వసుధలో యాదవ వంశాబ్ధిచంద్ర
మున కొని మీతాత ముత్తాత లేదు - నెనయంగ మీతండ్రి లేవురు మునుపు
పగవారి నిటువలెఁ బాలింపలేదు - ధేనువుల చప్పన్న దేశాల మేపి
యొక్కొక్క దేశాన నున్నశత్రువుల - నుక్కడంగించితి రుర్విలోపలను

మానవేశ్వరుఁ డీవు మనుజలోకమున - పనిబూని వెలసినపరమేశ్వరుఁడవు
నిల తాతతండ్రిపగ లీడేర్చినావు - కలియుగంబున నీదుకథ నిలుచునంత''
అని చాల భూషించి యక్కునఁ జేర్చి - మనసును సంతోషమున నొప్పుచుండె
నా సమయంబున నయితమరాజు - నెనఁగఁ దమ్ములు సుతులు యదుకులపతులు
బావలు మఱఁదులు బంధులతోడ - నావీరశూరులు నందఱు వచ్చి
పశుపతి నలనన్న పాదపద్మములు - పొసఁగ మ్రొక్కినవారిఁ బొగడి దీవించి
యయితన్నఁ గనుగొని యావులన్నయును - దయమీఱఁ గొనియాడి తమ్ముల [నపుడు
కరపల్లవములచేఁ గడులేవఁదీసి - నురమార నెత్తికొని యుర్విపై దించి
యనుజుల దమ్ముల నాత్మబంధువులఁ - గొనియాడి నలనన్న గొబ్బునఁ బలికెఁ
''బోలురాజకుమార! భోగదేవేంద్ర! - బాల రా జైనట్టిపట్టభద్రుండ!
అందఱు వస్తిరి యలరిన వేడ్క - ముందు నాతమ్ముఁడు ముమ్మయ్య యేడి?
యేడి నాయల్లుఁడు యేఁడి పోచయ్య? - కడువేగ మీవెంటఁ గదలి రాలేదె?
కాశికిఁ బోయిన కడుపుణ్యఘనులు - వాసిగా మిముఁ గూడి వారు రారైరి
కానిమ్ము దైవ సంకల్ప మెట్టిదియొ!'' - అన నలనన్నకు నంత నయితన్న
''నరయంగ శివగురు వన్న భక్తిరన్న - పరిణాన గయయందుఁ బ్రఖ్యాతి నుండు
నిప్పటికి మము గలియ నిటకు రాలేదు - ఎప్పటికి వచ్చునో యెఱుఁగంగ రాదు
ముమ్మయ్య పోచయ్య ముద్దుబాలకుల - నమ్మ తా నున్నట్టియాదవకొండ
సమ్మతంబుగఁ గొంత సైన్యంబుఁ గూర్చి - నెమ్మది నొకకొన్ని నేర్పులు దెలిపి
పదిలముగ దనకొండ పట్నాన నుంచి - కదలివస్తిమి మేము కాటభూపాల!''
యని విన్నపము సేయ నయితన్న యప్పుడనియేకవిధముల నపుడు గొనియాడి
తనమఱఁది రాఘవుఁడు తనుఁజేరి కొలువ - దొనకొని హరిగురువు తోడుగానడవ
నరనాథుఁడై తన్న నలనన్నతోడఁ - దన యాప్తబంధువుల్ తగినపెద్దలును
మరలి వారందఱు మాటలాడుచును - నరుదుగా నరువది యాఱుకంబాలఁ
జెంతగానొక పట్టుజమకాళ మునిచి - యంత పువ్వులపాన్పు నటుపఱచి పైని
పందుముల రఘుపతిని బరఁగంగ నునిచి - యందఱు నలనన్న పాలివలనఁ
బొద్దుగాఁ గూర్చుండి ప్రొద్దుసూచుచును - గద్దులే దనకుండఁ గలసేన లెల్ల
రఘుపతి నలనన్న రాచకార్యంబు - వగసాటి పంతముల్ భాషించుచుండ్రి.

---

# ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట



శ్రీరంగధాముని జెలువొప్పఁ దలచి - కారుణ్యగుణరాశిఁ గమలజఁ గొలిచి
శంభు నారాధించి శక్తిఁ బూజించి - యంబుజాసను శారదాంబను దలఁచి
యేకదంతుని వేడి యెల్లలోకములు - సాఁకెడు గుండాల శాంభవిప్రాపు
సమకూర్చుకొని చాలసన్నుతిఁ జేసి - విమలవిజ్ఞానవివేకంబు లొసఁగు
గంగాభవానిని గడఁగి సేవించి - కొంగుబంగారు చేకూడిన మేలు
సమ్మతముల్ సర్వజనులకుఁ గూర్ప - నెమ్మది బోయపాట నెలకొన్నగంగ
కంజలి యొనరించి యర్థించి మ్రొక్కి - సంకీవరాయని సతతంబుఁ దలఁచి
కలుముల నొడఁగూర్చు కరుణాప్రపూర్ణ - నెలమంచి గంగాంబ నెంతయుఁ దలఁచి
... ... ... ... ... ... ... - తనమది నిలిపి తాత్పర్యంబుతోను
ప్రకటింతు నెఱగడ్డపాటిపోట్లాట - సకలభూజనులకు సంతోష మొదవ

## కథా ప్రారంభము

వివరింప నా కథావిధ మెట్టి దనిన - నవని యాదవ వంశమందు జన్మించె
భువన భీకరుఁ డగుభుజబలోన్నతుఁడు - ... ... ... ... ... ... ... ... ... ...
వసుధపైఁ బెద్దిరాజు వరతనూజుండు - అసమానధీరుండు నమితవిక్రముఁడు
పసుపతివలె నున్నపట్టభద్రుండు - దిశదిశలను నెల్ల ధేనువుల మేపి
వడ్డెదేశము నేలువసుధపాలకుని - దండించి కోవ్రురా లుండి విడిపించి
మఱలి దక్షిణభూమి మఱివేగవచ్చి - బిరుదులు చేకొన్న భీకరోన్నతుఁడు
కఱిమాధవునియాజ్ఞఁ గాటభూపతియుఁ - బరగ దక్షిణభూమిఁ బశువుల మేపి
యెసగంగ జొనవాడ కేతెంచి యచటఁ - బొసగంగ గొబ్బిదేవుళ్లకుఁ బెట్టి
రంతుమ నెల్లూర తాయి సఱికించి - వంతగించినక్రియఁ బగ యేరుపడెను
వెరవొప్పఁ జిలుకను వేయించురాజు - ... ... ... ... ... ... ... ... ... ... ... ...
పగబెణకి తనమఱఁది పద్మనాయఁడును - దగుబంట్లు జనులను దమ్ములు బలము

ఎద్దులావులు గోడె లేపాకమిగుల - సద్దడింపుచుఁ బరిజనములతోడ
గడిభూమిలోపలఁ గయ్యంబు బెణకి - నడిభూమికిఁ దిరిగె నతివేగమునను
బాళేరు గడ్చిపోవలె ననివారు - వాలాయముగ సరసివద్దను నిలువ

## శకునము

నెద్దులు పోట్లాడి యిట్టట్టు చెదరె - దద్దిల్లి గోడె లందంద బెదరఁగను
కాలావు లోకలక్ష కాలు కదపకను - చౌలాలకింపుచు జిఱికొట్టసాఁగె
నదిచూచి నలనన్న యాశ్చర్య మంది - మదిలోన నిదియేమి మాయయో కాని
అని పద్మనాయుని నడుగ నూహించి - తనకైనమఱఁదిని డాయంగఁ బిలిచి
తెలియఁజెప్పిన విని తేటగా నవ్వి - పలికె నలనన్నతోఁ బద్మరాఘవుఁడు
కలకల నవ్వుచుఁ గడువేడ్కతోను - సలలితంబుగ నేను సరగఁ జెప్పగను
విను మహీపాలక! వినలేవా భావ! - ఘనముగా నీవు గోగణముల భాష
నీ సహోదరుఁ డగునీతిపాలుఁడును - వాసిగా నెఱ్ఱనరవరుఁడు గుర్రె బుఁగు
పిలువ నంపు మటన్నప్రియవాక్యములకుఁ - గలకల నవ్వుచుఁ గాటభూపతియుఁ
దనబంట్లఁ గొంద ఱుద్ధతి వేగ నంపెఁ - బనిబూని యెఱ్ఱయపాలికిఁ బోయి
యన్న కాటమరాజునానతి వాసు - విన్నవించినఁ గడువేడుకపడియు
బెజవాడబెబ్బులి పెయ్యలెఱ్ఱన్న - రాజపూజితుఁడును రణభూవిజయుఁడు
పొలుపొందఁ గాటభూపునిచెంతఁ జేరి - వ్రాలి దండముఁబెట్టి వరుస దీవింప
కరములు మొగిడించి కడు వేడఁదొడఁగె - "వారిధి గంభీర! వంశ విస్తార!
ధీర! ధీరోద్ధార! దివ్యావతార! - కరుణాసముద్ర! యో కాటభూపాల!
ననుఁ బిల్వఁ బంచినపని యెల్ల మాకు - విన నవధరింపవె విమల చారిత్ర!"
అని వేడునెఱ్ఱయ్యయాడువాక్యములు - విని కాటభూపతి వెసనిట్లు పలికె
"వినవోయి! తమ్ముఁడ! విను విచిత్రముగ-ఘన మైనవృషభముల్ కామధేనువులు
చాలఁ బోట్లాడిన శకునంబు దెలియఁ - బాళేట మల్లాడుపంతముల్ దెలియ
రప్పించితిమి సోదరా! నిన్ను ముందు - చెప్పఁగా బెజవాడ శివునిసత్కృపను
గోవులభాషలు గొంత తెలిసితివి - యీవు దాఁచక మాకు నెఱిగింపు" మనిన
నవ్వుచు నెరనన్న నలనన్న కనియె - "యివ్వేళ పనికాదు యెల్లిజామునకు
నింపుగాఁ జెప్పెద నిలతలాధీశ! - పంపుమా సెలవిచ్చి పంపవే" యనినఁ
బొమ్మని సెలవీయఁ బోయి యెఱ్ఱయ్య - యెమ్మెమీఱ విడిది కేతెంచి రాత్రి
పవ్వాలపూపాజ్య పాయసాన్నముల - నొప్పార భుజియించి యొగినిద్రఁ జెంది

తెల్లవాఱిన వెన్క దివ్యతేజమున – సల్లలితాత్ముండై స్నానంబుఁ జేసి
తెల్లనివలిపముల్ తెఱఁగొప్పఁగట్టి – మల్లికార్జునుఁ దన మదిలోన నిలిపి
భక్తితో మందలోపలికిని బోయి – భక్తితోడనునిల్చి పశువులకు మ్రొక్కి
హస్తంబులను మోడ్చి యతిశయంబుగను – ప్రస్తుతింపుచుఁ బల్కె బయ్యా
లెన్న
"సురభి ధేనువులార ! సురకాంతలార ! – కరుణతో మాపాలఁ గలిగితిరన్న
మీలోన వాక్యంబు మేము దెలియగను – చాలఁ గోరెద భక్తి సమకూర్పవలెను
ముందర నడచేటి తొందరల్ మేలు – నందఱు వినఁగ మాకానతి"మ్మనిన
నెఱ్ఱయ్య భాషల నెద్దు లావులును – నఱ్ఱావు లెల్లను నాలించి తెలిసి

## గోవుభాషాంతరములు

యెద్దు లావులు దూడ లేపారమిగుల – (సద్దడింపుచుఁ జాలఁ జొక్కళింపుచును)
మందలోపలఁ జాల మట్టుమల్లాడె – నందలిధేనువు లావలకుఁ బోరలె
నడలె ధేనువు లెల్ల నంభాయటంచు – మెడలెత్తి వంచెను మిగుల ధేనువులు
గనుఁగొని యెఱ్ఱన్న కాటభూపతికి – వినుపింపఁ జనుదెంచి వినయుఁడై మ్రొక్కి
ధేనువుల్ పల్కిన తెఱఁగెల్లఁ దెలిపె – "విను కాటభూపాల ! విను మహారాజ !
చప్పన్నభూముల నసివసి మేపి – యొప్పుగా నెల్లూరి కొచ్చిననాఁడె
గడిమన్నెవారితోఁ గలహంబు గలిగెఁ – దొడిబడ నెల్లూరి దొరలకు మనకు
నీ డైనజగడంబు లిక్కడఁ గలుఁగు – జో డైనరాజుల జూడంగ గలుగుఁ
సరియైనరాజుల సమయింపఁగలుగు – బరిపరివిధములఁ బల్కె ధేనువులు
లంక నెల్లూరు పోలంగను ధాత్రి – శంకలేకను నేలు జనపాల గురుఁడు
దశకంఠుఁడనఁగాను దగుసిద్ధిరాజు – దశరథరాముగాఁ దగుదు నీవన్న !
పటువిభీషణుఁ బోలుఁ బద్మరాఘువుఁడు – ... ... ... ... ...
అర్జునుసాటిగా నయితమరాజు – అర్జునతనయుగా నమరుఁ బోలన్న
గరిజించు రిపువైరి కరియావులన్న – భరతునిఁ బ్రతిపోలు బట్టావులన్న
నకులుని సాటిగా నలరు ముమ్మయ్య – ... ... ... ... ... ... ... ... ...
చెలగి సుగ్రీవుఁడే చట్టువారెఱ్ఱు – పొలుపొంద నంగదుఁడు పుత్తమరాజు
వనచరులను బోల వసుధలో మనకు – ఘనమైనగోపగోగణ పంక్తి యలరు
నారూఢమగు నీడ నాలంబులోన – శూరులై పోరాడి స్రుక్కి యిచ్చలము
లచ్చోటఁ జచ్చేరటం చెద్దులావు – లెచ్చరింపుచుఁ బల్కె నెలమి మిగులంగ

నిది ముక్తికినిద్రోవ యిది వీరమహిమ—సదయుఁడై పొగడొందె జగములోపలను
బరఁగంగ నెఱగడ్డపాటను మనకుఁ – బురుణింపఁగాఁ జల్ల పోలురా జిపుడు
చెప్పిన దినములు చేరువై వచ్చె – నొప్పుగ యాదవు లుర్విపై నొఱఁగఁ
గట్టడ చేకూరెఁ గామధేనువులు – రట్టడియెద్దులు రౌతు రాణువయుఁ
జచ్చుట సిద్ధంబు సమరంబులోన – నిచ్చవచ్చినరిపు నెదిరించి పోరి
చచ్చి స్వర్గముసూడ సమకూరె ననుచు – ముచ్చట్లు వార్తలు మురియుచునాఁడు
ధేనువుల్ పల్కిన తెఱఁగెల్ల మీకు – వినిపించి” తనఁగాను విని నలనన్న

## రణోత్సాహము

కలహ మానసుచుచు గలగల నవ్వి – చెలువొప్పఁ బెన్నధి చేదొరకినట్లు
చావుకుఁ జింతింపఁజాల నే ననుచు – గావున స్వర్గభోగము గల్గుననుచు
మదిలోన నవ్వుచు మఱఁది రాఘవ్రుని – సదయుడై కనుగొని జనపాలుఁ డనియె
“విను పద్మనాయుఁడా! వింటె విచ్చోట – ధేనుభాషణములు తెలిసెగా మనకు
సరి యైనరాజుతో సమరంబు గలిగె – ధరణిలో మన తాతతండ్రుల పగలు
సమముగాఁ బోనాడ సమకూడె మఱఁది! – క్రమమెగ్గి యిచ్చోటఁ గనక డేరాలు
కోటిగోపాలురఁ గొమరశేఖరుల – నేటివెంట గుడార్ల నెత్తించు మనుచు
సెలవిచ్చి వంపవే చిన్ని నా మఱది! – వలనొప్ప నీ” వన వానిపై పొంగి
యాదవులను బిల్చి యిట్లని పలికె – “మేదినిలో నట మీర లీవేళ
హేమాద్రి గూడార్ల నెత్తుఁడీ!’ యనిన – నా మానవాధీశుఁ డాడువాక్యములు
విని వేగ యాదవుల్ వేడ్కతోఁ బోయి – కనకకుండలు పూని ఘనగుడార్లెత్తి

## రణ సన్నాహము

యెండకుఁ జాటుగా నెర్రగుడార్లు – మెండుగా నామీఁద మేఘవన్నెలును
వేడుక గుల్కెడు వెల్లగుడార్లు – నాడంగ నామీఁద హనుమంతుపడగ
మంచులు సొఱకుండ మైనగుడార్లు – మించి యుండెడి మంచిమీను టెక్కెములు
బసవన్న యుండెడు బంగారుపాత – పసిమించు ముత్యాలఁ బరఁగు పాచూరు
నిరవొంద నొకడేర యింపుసొం పలరఁ – బురహారు మాఱుగాఁ బొగడ బసువనికి
మునిదొడ్డి నడుమను ముందుగా నెత్తి – కనక కలశంబులు కడువేగఁ బూని
పంచనందుల నిల్పి పటుహారు మేని – పంచవన్నెల శాలుపై ఘంట శంఖ
సింహాసనంబుపై సిరులు చెన్నొంద – గహ్వరరిపుగజకంఠీరవుఁ డన

వరఁగ బసువని కిరుపార్శ్వమ్ములందు – నిరవుగాను గుడారు లెత్తించి మీఁద
వేవేగ నింద్రగోపాలంబు నొకటి – భావింపఁగా నెర్ర పట్టుగుడార్లు
నలువుగా నలువదినాల్గుస్తంభాలఁ – దిలకింపగా నొక్క త్రికూటం బసేటి
యిరవుగా నొకగుడా రెత్తి రామీఁద – గుఱుతుగా బంగారుకుండల నెత్తి
పన్నుగా ముత్యాలపందిరిఁ బెట్టి – వెన్నెలలో గ్రుమ్మగ్గు వెదచల్లురీతిఁ
గన్నుల కావిరి గప్పినయట్లు – పన్నియెత్తిరి సూర్యపట్టుగుడార్లు
చూపుడు కంబాల చుట్టి సరాతు – లేపార నెత్తిరి యెలమి వేడుకలఁ
దిరుమందు లుండేటి తెల్లగుడార్లు – ... ... ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... – వేగ మెత్తించె భూవిభుఁ డావులన్న
విని దివిజులు మెచ్చ వెల లేనియట్టి – ఘన మైననవరత్న కనకపీఠంబు
నొనరంగ వైచియు నుబ్బుచు మదిని – ఘను లైనయాదవుల్ గ్రక్కునఁ బోయి
వినుపింప నావేళ వీరరాఘవుఁడు – తనబావ కాటభూధరణీశు కపుడు
తెలియఁ జెప్పిన మదిఁ దెలిసి నలనన్న – చెలఁగుచు మఱఁదిని జేదండఁబట్టి
రాజిల్లఁగా నెక్కి రత్నాసనంబు – రాజు రాఘవుఁడును రమణతోఁ గొల్వఁ
గూర్చుండి మఱఁదిని గొనియాడెనంత.

## కాటవిభుని శంక

... ... ... ... ... ... – "నాచిన్నమఱఁది యోనాయుఁడ! వినవె
యీవసుంధర నేలు నీ సిద్ధిరాజు – ఏవేళ వచ్చునో యెఱుగంగ రాదు
కోట లేనియుద్ధము కూడి చనరాదు – సాటి లేనియుద్ధము సమ్మతముగాదు
అలనాఁడు మాతండ్రు లందఱు వినవె – చలమొప్పఁగాఁ గోట చాటు లేకప్పు
డందఱు జగడాన హతులైరి మఱఁది! – ముందు చేసిన కలహమును విన్నవిధము
అరవీరకలహాన హతులైరి కాని – నెఱవీరకలహంబు నెఱిసేయవలెను
ఘను లైనరిపులను గదిసినవేళ – నేనుఁగుల కశ్వముల కెద్దులావులును
తరుపు బంటులు నిల్పి తట్టు బంటులకు – వరఁగ రాజుకు రాజు పౌఁజులు గదిసి
నలఁ దోలి పట్టుఁడీ యని ధిక్కరించి – చెలఁగి సెలగోల గొని జగతీశు నెదిరి
పోట్లాడవలె మఱఁది! పొందుగా నిపుడు – కోటపెట్టక యొనఁగూడ దాలంబు
హరిహరాదులుమెచ్చ నాయుత్తముగను–వెరవొప్పఁ గోట గావించు మిచ్చోట"
ననిపల్క నలనన్న కనియెరాఘవుఁడు – ... ... ... ... ... ...

## నాయని రణనీతి

... ... ... ... ... ... – "విను కాటభూవర ! వీరాగ్రగణ్యా !
వితరణగుణశాలి ! విఖ్యాతిపరుఁడ ! – సతతంబుఁ గొనియాడ సర్వజ్ఞనిధివి !
పున్నమచంద్రునిఁ బోలు నీమోముఁ – గన్నులు చల్లగాఁ గంటి మో బావ !
కోటకొత్తళములుఁ గొమ్మల మఱుఁగు – చాటులు మాటులు చావఁ జాలకను
మనగోరువారికి మఱుఁ గంతె కాని – చనిపోవువారికిఁ జాటు లేమిటికి
నెల్లలోకమువారు నెన్నికగాను – సల్లలితాత్ములై జనులు పొగడుదురె
ప్రాణహానికిఁ జాల భయపడి రాజు – గణుతింపఁగాఁ జాటు గావించె ననరె
నగుబాటు గాకుండ నామాట వినుమ ! – తగుబుద్ధు లెటిఁగింతు ధరణిపై మనకు
నేనూరుకోటలు నెదుట నుండఁగను – నేనూరుకోట లీ నడుమ నుండఁగను
నన్నలుఁ దమ్ములు నాప్తులు సుతులుఁ – బన్నుగా బంధువుల్ బలము లెక్కవగఁ
గల వృషభంబులుఁ గామధేనువులుఁ – దలఁపఁగాఁ గోడెలుఁ దరుపు లాదిగను
మే లైనకోటలు మేదిని మీకు – వాలాయముగ నుండ వరుసతో మీరు
మెండుగా నాకోట మేకొని వేడ్క – దండిగా భోగింపఁ దగుఁగాక మీరె
కొమరొప్పఁ బెట్టినకోట మా మదిని – నమరు కోటకుఁ గొమ్మ లనఁదగు మేము
కొమ్మలు గూలక కోటలు పడునె – ముమ్మరంబుగ ధనపుముద్దులు మీ రు
ముడుపులపై నుండుముద్రలు మేము – కడుముద్ర గోల్పోక కనకంబు పోదు
ఉన్నతం బగుకన్ను లెన్నఁగా మీరు – వన్నుగాఁ గనులతెప్పలముగద మేము
కనుతెప్ప గోల్పోక కను మోస మగునె"-యని పద్మనాయకుఁ డాడువాక్యములు
విని కాటభూపతి వెస నిట్లు పలికె – ... ... ... ... ... ... ... ... ... ... ... ...
"నాయఁడా ! వినవయ్య ! నాచిన్న మఱఁది ! – పాయరాని సంగడీఁడ ! పద్మ [నాయుండ !
యందుకు బుద్ధి మాకానతి"య్మనినఁ – బెద్దిరాజుకొమరుని ప్రియవాక్యములును
నొప్పుగా వినలేక యుచితవాక్యములు – చెప్పెదఁ గాటభూజననాథవర్య !
యన్నదమ్ములు మీర లంద ఱొకటైతె – పన్నుగ బగవారు పై సేయఁగలరె
యెన్నఁగా గుమిగూడ నెవఁడైన మనలఁ – గన్నెత్తి చూడఁగాఁ గలఁడె మో [బావ !
యి వ్వసుంధర నన విని నలనన్న – నవ్వుచు నాపద్మనాయుని కనియె
"వల్లవులను గూడి వాలాయముగను – జల్లపిన్నమనేనిసముఖాన కేగి
యిక్కడ నడచిన వృత్తాంతమంత – యక్కడ మాయన్న కంత విన్పించి

యా రాజు లేవురి నాలస్య పడక - బోరునఁ దె''మ్మైన భూపాలు కనియె
''నమ్మహీపతికడ కవనీతలేంద్ర! - పొమ్మన్న నేనెట్లు పోమనే బావ!
పల్లవాధీశుతోఁ బగబెణకి మనము - చల్లవారినిగూడి సకలంబు నెఱుఁగ
వచ్చి సాగలకొండవద్దను నిలిచి - యచ్చోట మీరప్పు డాడువాక్యంబు
లిటువంటిశౌర్యం బదెచ్చట లేదు - తటుకున నిటువంటిశౌర్యంబునకును
దగిన యీ పరిపాటి ధరణీశ్వరులను - నొగి నేపాలిట వచ్చునో కాక
గండిలోపల నుండి గజము లశ్వములు - మెండైనబలములు మెఱసి రారాదు
మచ్చరంబున వచ్చుమన్నీల నెల్ల - శిక్షింపనేనచ్చుఁ జెండుబెండుగను
పేరుబలము లేకిపేర నున్నవియె - వారిఁ బంపుద మని వస్తిరె మీర
లనిన వాక్యములకు నా చల్లలకును - దన తమ్ములను దాను దలపోసి పోసి
యందలాలను దిగి యన్నదమ్ములును - మందరధీరులై మన్నెరాజులును
గోపాలురును లక్ష గోసంగు లాది - యేపుతో నిల్చిరి యీ రాజువద్ద''
నని పద్మనాయకుఁ డాడువాక్యములు - విని కాటభూపతి వెలవెల పోయి
''కటకటా! రాఘవ! కానిమాటలకు - నిటువలెఁ జిన్నయ్య నెట్లంపుదయ్య!
తమ్ములు మేము పెద్దలు సూడ వారు - తమ్ములఁ బనిగొనఁ దగుఁగాక తమకుఁ
దమ్ములపని విన్నఁ దాళునే భువిని - దమ్మ రాజును గొనఁదగుఁగాక మఱఁది!
పిన్నయ్యపే రన్నఁ బృథివిలో జనులు - పిన్నలుఁ బెద్దలుఁ బేర్మిఁ బొగడుదురు
పరదళంబులు మందపై రాకమున్నె - యెరసిద్ధిరాజులు నిల రాకమున్నె
వేగంబె మీరును నెరనన్నఁగూడి - బాగుగాఁ జిన్నయ్యపాలికిఁ బోయి
యీ వివరమునంత నెసఁగ విన్పించి - వేవేగఁ దోడుక యీవు రారమ్మ
పనిఁబూని పొమ్మన్నఁ బద్మరాఘవుఁడుఁ - దనమఱఁదెరనన్న తగినబంధువులు
కొందఱ భటులను గూర్చుక వేగ - నందలంబున నెక్కి యతిమోదమునను
సందడింపుచు వారు సన్నాహములను - నందఱు నరుదెంచి యాచల్లవారి
నందఱిఁ గని డిగ్గి యందలంబులను - మందహాసంబుల మఱఁదు లిద్దరును
జల్లపిన్నమనేని సన్నిధిఁ జేరి - ... ... ... ... ... ... ... ... ... ... ...
వారు దండముఁ బెట్ట వరుస దీవించి - ... ... ... ... ... ... ... ... ... ... ... ...
రంగల్ల నాపద్మరాఘవుం డప్పు - డంజలి యొనరించి యంత నిట్లనియె
''యదుకులాధీశ్వర! యిచ్చోట నిట్టు - లిదియేమి నిలుచుట యేమికారణము
నలసిద్ధిరాజుతో నాలంబుఁగోరి - నలనన్న యుంచిన ట్లలనాఁడె తెలిసి
లక్షగోపాలుఁరు లక్షకంపటము - లచ్చోటనే నిల్చి రది యేమొ కాని
పెది రాజుకొమరుఁడు పెట్టంపె మమ్ము - నందలంబుల నెక్కి యన్నదమ్ములును

బాలేటికిని జాలఁ బైనమైరండి - ...............................
మఱి దాఁటుమాటలు మదిలోనఁ దెలిసి - యిరవుగాఁ బిన్నయ్య యిట్లని పలికెఁ
"బరదళసింహమ! పద్మరాఘవుఁడ! - ధరణి యేలిన సిద్ధిధరణీశుదళము
దీమసంబున నెదిరి తెగటార్చి పైవ - మేముండ నిచ్చట మితి యేఱువఱచెఁ
గలకాలమున మిమ్ముఁ గన్నడగాని - వలపక్ష మొనరించి వసుధేశ్వరుండు
చెప్పనట్టుగ సైఁచఁ జేసెను మాకు - నప్పుడే తెలివిడి యాయెను మఱఁది!
తమ్ముఁడు పెట్టినతాణ్యంబు గాదు - నమ్మిన గాచెడినాదు దేవతలు
హా! హారుల్ నిర్మించి యందఱు మెచ్చ-నురవుగా మా కిచ్చి యుండరే మఱఁది!
యెడఁదాక కండెద మెదురుబలములను - పదిలాన నెఱగడ్డపాట మీరుండ
నేమారి యుండక యేర్పడ మీరు - భూమిపైఁ బగవారు పూనిరాకుండ
గట్టిగా హెచ్చరికగా నుండుఁ డనిన - నట్టి పిన్నయ్యకు ననియె రాఘవుఁడు
"నన్నలు దమ్ములు నలర బాంధవులు - నిన్నుఁగొల్చిరి కాని నీ యంత వారె
నీ మాట జవదాట నేర్తురే వారు - భూమిపై రాజుల పొంకముల్ దూల
దంతిఘోటకములఁ దగిలి పోరాడఁ - బంతగించినవారిఁ బరిమార్చగాను
ఎక్కడెక్కడికిని నేర్పడఁ బంప - ...............................
ఘనముగ మీరును గదిలి రం"డన్న - గనుగొని పిన్నయ్య కడువేగఁ బలికె
............................. - "మనసులోపల నీవు మామాఱుగాను
అన్నలన్నకు మఱఁది! హర్షంబుపుట్ట - దవ్వుల నున్నారు తగఁ జల్లవారు
ఏ విధంబునను సందేహ మేమిటికి - భావింపఁ దండ్రులు పరఁగ తాతొకఁడె
పరగండభేరుండ పక్షు లన్నిటికిఁ - బరఁగఁ దనువులు నొకటె శిరములు వేఱు
అలాగు మామది ననువందు మఱఁది! - వాలాయముగ రిపులు వచ్చుచున్నారు
తాతతండ్రులపగ ధర నిల్వకుండ - నే తావునను నైన నీడేర్ప లెస్స
సాగలకొండలో జనార్దనస్వామి - వేగంబెసాక్షి దీవించి యిచ్చోటఁ
పతిపరివిధములఁ బగవారు మేము - సరిపడిఁ బోరాడి చచ్చిన వెన్కఁ
బల్లాపియేట మాపై రక్తములను - గొల్లగాఁ బాఱిన గుఱుతు మీకగును
గువ్వటి జడదేలి గొబ్బున వచ్చి - నవ్వుచు రక్తాన నట పుచ్చె లాడు
నలనన్న నా యుద్ధ మల నూడవలెను - ఏల మీరును బోయి వేగంబె యొదుఁ
జాటున్న దేరాలు చక్కఁగా దీని - వాటముగ నేర్పఱుప వలెనయ్య! మఱఁది!
తమ్ముఁడు నలనన్న తన మదిలోన - మమ్మువిడూఱక చాల మన్నించ మనవె
కడువేగ మనపాలఁ గలిగిన రాజు - ...............................
పల్లికొండకు ఘన బంధువర్గమును - వల్లవులకు మన వల్లభన్నకును

నయితమరాజుకు నన్నదమ్ములకు - వయినాన జాబులు వ్రాశంప మనవె''
యని పద్మనాయుని నా యరనన్నఁ - దన కవుఁగిటఁ జేర్చి తమ్ముని మఱఁదిఁ
బనిచిన నెఱగడ్డపాటి కేతెంచి - గొనకొని నలనన్న కొలువు కేతెంచి
బావను గనుగొని పల్కె రాఘవుఁడు - "బావరో! యో బావ! బావ! నలనన్న!
మీరు పంచినఁబోయి మేము వేడుకఁ - బేరు గల్గినచల్లపిన్నయ్యతోను
కొన్నివార్తలు మేము కూరిమిఁ జాల - నన్నిమార్గములను నాచల్లవారి
రమ్మన రాత్రైరి రంగుగాఁ దమరు - నమ్మియుండినయట్లు నలనన్న ! చూడ
సిద్ధిరాజు నెదిర్చి చిత్తువిత్తుగను - గద్దించి రిపులను ఖండింతు మనుచు
సలలితంబుగఁ గల్గె సరి తాణ్యములును - బలముల నొక కొంత బాసుగా నిచ్చి
యొసగ సాగలకొండ వెలసిరి వారు - పొసఁగంగఁ బిన్నయ్య పుడమిలో జనులు
పదివేలవిధములఁ బ్రకటించి పొగడ - సదయుఁడై యున్నాఁడు సర్వేశుకృపను
బరరాజు లెల్లను బైకొనక మున్నె - ………………………………
……………………………… - తగినవారల వేగ తాణ్యాల నిలుపుఁ
డని నిన్ను దీవించి యంపెన" న్ననఁగ - మనసులోపలఁ జింత మానె నలనన్న
తప్పక మఱఁదిని దాఁజూచి పలికె - "నొప్పుగా వినవయ్య! యోచిన్నమఱఁది!
నీవు సెప్పినమాట నిశ్చయంబుగను - నావును ముందుగా హరిహరుల్ మెచ్చ
గ్రక్కున సురభిని గడు వేడుకొనియు - నరు దైనతాణ్యము లా తేర్పఱించి
యురవుగా బొల్లావు నుంచఁగావలెను -

## బొల్లావు ప్రశస్తి

కృతయుగంబునఁ గార్తవీర్యునికొఱకుఁ - బ్రతిసేసి పుట్టెను భార్గవేంద్రుండు
దేవతల్ పొగడంగఁ ద్రేతాయుగమున - నావీరరావణు నంతంబు సేయ
దశరథపుత్త్రుడై ధర నుద్భవిల్లి - దశకంధరునిఁ గూల్చె ద్వాపరంబునను
గంసభూవరుఁ జంపఁ గల్కి రోహిణికి - భాసురంబుగ బలభద్రుఁడై పుట్టి
కాలకేయునిఁ జంపెఁ గలియుగంబునను-హాలాయుధము యాదవాన్వయముఁ బ్రోవ
ధేనువై పుట్టెను దేవతల్ పొగడఁ - బూని యానెల్లూరి భూపతులబలముఁ
జంపును ద్రుంపును సమరంబులోనఁ - దెంపుల నొనరించు ధేనువు మమ్ముఁ
గంటిని గనుతెప్ప గాపాడురీతి - నింటివేలుపువలె నెసఁగు నో మఱఁది!
వెతకి బొల్లావున్నయిరవులఁ జూడ - నతివేగ వేగర్ల నంపవే మఱఁది"
యనిన బావను జూచి హర్షించి మఱఁది - తసరంగ వేగర్ల దగ్గఱఁ బలిచి

## బొల్లావు అన్వేషణ

"వినరోయి! భటులార! వినుశూరులార! - ఒనరగ బొల్లావు ఉన్నతావులను
నేరుల ప్రాంతాల నెందు బొల్లావు - ఆరూఢ మైయుండు నా తావు వెదకి
శ్రీరామ బొల్లావు శీఘ్రంబె చూచి - మాటువార్తలు గొంచు మాపటికి రండి"
కవ్వారవిడియముల్ కడువేగనిచ్చి - చెప్పంప వారలు చెంగున బోయి
బాగైనయూరులప్రాంతముల కేగి - వేగంబె వెదకుచు విపినంబులోనఁ

## బొల్లావు దరిసెనము

త్రేతాయుగమునాఁటి దేవతలపుట్ట - బ్రాఁతిగాఁ గనుగొని బాగుగాఁ జూడఁ
బెక్కుకొమ్మలతోను బెద్దచందనము - నక్కడ శృంగార మైనవనమున
చందన పున్నాగ జంబు జంబీర - మందార బూరుగ మహిసాక్షి వెలఁగ
మాతులుంగ లవంగ మారేడు జమ్మి - చూత కేతకి పనస సురపొన్న తింత్రి
బృందారవతృముల్ పొలుపుదలిర్ప - సుందరం బెక్కడఁ జూడఁ జోద్యముగఁ
పచ్చనివిరజాజిపాదునీడలను - పచ్చికపై యావు పవళించియున్న
ఫణిరాజు గొడుగుగాఁ బట్టె ధేనువుకు - గణుతింప నెమళులు కడువేగఁ జేరి
యరుదుగా నాట్యంబు లాడంగఁ దొడగె - సరగుఁన దుమ్మెదల్ చాలఁగాఁ జేరి
మోదంబుగాను నున్మాదముల్ సెలఁగ - సాధుపోషకుఁ డటు చొ లాలకింపఁ
గోవెల లొకకొన్ని గుంపుగాఁ జేరి - భావింప రాగముల్ పాడంగఁ దొడఁగెఁ
గీరము లొకకొన్ని కెరలుచుఁ బండ్ల - సారంబులను గ్రోలి చలఁగి వేడుకల
శ్రీరామ కీర్తనల్ సేయుచుండఁగను - నారామ బొల్లావు నాలించి చెవుల
ప్రవిమలోత్సాహ సంపన్నత్వమునను - .................................
వినుచున్నబొల్లావు వేగర్లు చూచి - పనిపడి బొల్లావు పాదపద్మముల
నల్లంతఁ గని వార లప్పుడు మ్రొక్కి - బొల్లావు నుతియించి పొలుపుగా ననిరి
"శ్రీవత్సలాంఛనా! శ్రిత పారిజాత! - దేవేంద్ర వందిత! దీనమందార!
సకల జీవాధార! సాగరవాస! - అఖిలాండపోషక! అబ్ధిగంభీర!
యాదవాన్వయుఁడైన యానలనన్న - యాదరంబుగ రేపు యాదవుల్ దాము
మిముఁ జూడఁగా గోరి మీకు ముందుగను - సముదయంబుగ రాజు చాటి రమ్మనుచు
మన్ననచేఁ బూని మమ్మంపినాఁడు - మిమ్ముఁ గంటిమి ఎంత మేము ధన్యులము
పోయివచ్చెద మని పొందుగా వారు - వేయిభంగుల నావు వినుతింపుకొనుచు

మాపటివేళకు మందకేతెంచి – గోపాలపతిఁ గాంచి కోర్కెతో మ్రొక్కి
యదుకులాధిపునితో నని రిట్టు లంత – "వెదకి బొల్లావున్న యిరవులుసూచి
వచ్చితి మిట మీకు వార్తలు మేము – అచ్చట గలమహిమ లన్ని చెప్పెదము
మునిశిఖామణి గౌతముని వనంబొకటి – అనియేక విస్తీర్ణమయి యుండు నందుఁ
బొలుపుగా వృక్షముల్ పూచికాచియును-ఫలియించి ఫలములు పక్వమై యుండు
జాజి పూపొదక్రింద శయనించి ధరణి – రాజుగా బొల్లావు రంగుగా నున్నఁ
దుమ్మెద నాదముల్ దొరకొని నేయఁ – గొమ్మలపైఁ జేరి కోవెల ధ్వనులఁ
జెలఁగి రాగములెల్లఁ జెల్లించి పాడ – జిలుకలన్నియు రామచిలుకలు వాడ
నెఱి మయూరములెల్ల నృత్యంబు లాడఁ–గోరి శేషుఁడు పడగ నీడుగాఁబట్టఁ
జేరి యామృగములు సేవ యొనర్ప – గోరూపమైనయాగోపాలమూర్తి
మార్గ మంతయుఁ జూచి మరలివచ్చితిమి – బాగుగా నావార్త ప్రౌఢత మీకుఁ
దెలియజెప్పితి" మనఁ దెలిసి వారలకు – సెలవిచ్చి పొమ్మని చేదండ నన్న
పనిచారకులతోడఁ బలికె నలనన్న – "వినుఁడి! తలవరులను వేగంబె పంపి
నెల్లిప్రొద్దుట వెళ్లి యేకాంతభక్తి – బొల్లావు వేఁడుకోఁ బోవలె వేగఁ
బయనమై బిరుదులు పడిగెలతోడ – నాయుధంబులతోడ నాయత్త పడుఁడి
పదిలమై యొకకొంత బలములు నిలిపి – కదలక మందలు కాపాడుఁ డనుఁడి"
యనిన రాజుకుమ్రొక్కి యా పసులవారు – ఘనమైనతలవరుల గ్రక్కునఁ బిలిచి
యావుల ననుమతి నంపి రాక్షణమె – వేవురు తలవరుల్ వేగంబె పోయి
చెప్పంగఁ ద్రోణఁగిరి సేనలకెల్ల – "నొప్పుగా వినరయ్య యో శూరులార!
గోవిందు బసవన్న! గొల్ల నారన్న! – యాప్రు పుప్రులమాచు' అచ్యుతుని కేతు!
పంకజనబ్బొబ్బిల్లు! పయ్యావుశేషు! – శంకరభూపతి! చక్రాల చంద్రు!
కల్వాల కనకమ! కనకమురంగ! – నల్వాల శూరుఁడా! నరహరి నాగు!
అనురేశు వైకుంఠు డన పరశురామ! – పొసగంగ రఘువీర! పుప్వాలమాచు!
మదనగోపాలు దామర్ల పిన్నయ్య! – సదయుఁడో యోబళి చన్నగోపాలు!
పుల్లావు భూపతి! పుల్లయరంగు! – ముల్లోకములయన్న! మురహరి పద్మ!
గాంగేయ వెంగళ! కనకము లింగు! – బంగారు గొడ్డటి బలభద్రరాము!
మురహరు! జడదారు! ముంగరభీము!– పరవుపకారి! యోపయ్యావు శంభు!"
దేవుడావుల గాయుధీరవర్తనుఁడు – కావడి కదరును కడు ఆదిగాను
బిలచి వారలతోను ప్రియవాక్యములను – బలికిరి తలవరుల్ ప్రఖ్యాతిగాను
"వెరవుగా బొల్లావు వేఁడుకోవలసి – ధరణీశు నలనన్న తన బలంబులకు
రేపు ప్రొద్దటివేళ నెఱయోధులెల్ల – నేపుమీఱఁగఁ గూడి వెడలి రమ్మనెను

గొంత యాదవదళము గోకులమునుంచి - వంతగించిన క్రియఁ బైనమై రండి''
యని వారికిని జెప్పి యాతలవరులు - వినుపింప నలనన్న విమలుఁడై యుండె
నంతట సూర్యుఁడు నస్తాద్రి కరిగె - నంతకంతకుఁ జీకటులై తోఁచె భువిని
గలువలు వికసించెఁ గమలముల్ ముడిఁగెఁ - గలువలరాజు వెన్నెల గాయఁ
[దొడఁగె
మదనుఁడు తనదైనమార్గాన వెడలె - సదయుడై యున్న యా జనపాలుఁడంతఁ
గొలువులు సాలించికొని గాఢభక్తి - జలక మొప్పఁగ నాడి చలువలు గట్టి
యలరుచు శివపూజ నతివేగ సల్పి - పొలుపుగా లేచియుఁ బొలఁతుల తోడ
సమరంగ భోంచేసి యారాత్రి వ్రతముఁ-గ్రమ మొప్ప శ్రీరామకథ లెల్ల వినుచు
నడిపె జాములు నాల్గు నతిభక్తిచేత - గడచె నంతట వేగఁ గ్రక్కునఁ దూర్పు
తెల్లవాఱఁగ చుక్క తేటగాఁ బొడిచెఁ - బలుచనై నక్షత్రపంక్తియు నడఁగెఁ
గొండతూర్పున నెక్కెఁ గోరి భాస్కరుఁడు - మండలాధీశుఁడు మతివేగ లేచి
స్నానంబు గావించి ధవళవస్త్రము ల - నానందముగఁ గట్టి నలనన్న యపుడు
సరగునఁ గావించి సంధ్యార్చనంబుఁ - గర మొప్ప నీమంబుగా లేచి రాజు
పొసఁగ భూషణములఁ బొందుగాఁ బెట్టిఁ - రసికుఁడై చేరి మఱందియుఁ గొల్వఁ
గొలువున కేతెంచి కూర్చుండి వేగ - దళవాయిఁ బిలపించి ధరణీశుఁ డనియెఁ
"బరఁగిన యాదవబలములు నేఁడు - వరుసతోఁ బైనమై వారేగు దేరఁ
ద్రిజగంబు లెల్లను దిగులఁ కొనంగ - విజయంబుగొనురణభేరి వేయి చు"
మని వారికిని జెప్ప నాక్రమంబుగను - మనుజనాథునియాజ్ఞ మదిలోనఁ దెలిసి
భీకరంబుగ రణభేరి మ్రోగింప - గోకులపతు లెల్ల గొబ్బున వినియుఁ

## భూపాలునిపయనము

దమనీమవ్రతములు తమ రంత సల్పి - యమితవైభవముల నాయత్తపడియుఁ
గస్తూరి గంధంబుఁ గనకగిన్నెలను - విస్తీర్ణముగ నుంచి విరజాజి వన్నె
కుంకుమ జవ్వాజి కురువేరు పచ్చ - బుక్కాము గందవొడి పునుఁగు మైసాక్షి
యగరు గుగ్గిలమును నాదిగా వేగఁ - బగడపుఁ బల్లకిఁ బరఁగఁ బెట్టించి
యచ్చమౌ బంగార నమరుపాలకిని - పచ్చవిల్లునితండ్రి భక్తుండు నెక్కెఁ
బచ్చలపాలకిఁ బద్మరాఘవుఁడు - హెచ్చుగా నాదండ నెక్రయ్య గదలె
వేగంబె యా వెనుకఁ వెక్కసం బగుచు - బాగుగా నడచిరి బలములు మెక్కు
నవరణలును జాల జల్లిగొడుగులును - నవనీశ్వరునివెంట నడచె వేవేగ
కట్లాణిముత్యాలు గట్టినజల్లి - పట్టుగొడుగులఁ గదిలెఁ బద్మరాఘవుఁడు

వెలలేనిముత్యాల వెల్లగొడుగులును – విలసిల్లఁగా గదిసె వేగ నిర్దయ్య
వందిమాగధులు కైవారముల్ సేయ – సందడింపుచుఁ బరిజనములు గొలువ
శంఖులు గవురులు చెలఁగు బూరుగలు – బింకపుభేరీలు బెరుకుకాహళులు
రావణవీణెలు రజితదండెలును – గోవిందవీణెలు గొప్పవీణెలును
దండెలు వీణెలుఁ దఱచు గిన్నెరలు – మెండైనరావణమేటివాద్యములు
భేరీ ఢమామీలు పెద్దగౌరులును – బూరలు దారలు పోరు కలఁగంగ
శ్రీవిష్ణుపదములు చిత్తాన నిలిపి – భావంబులో రామభక్తుఁడై రాజు
దీనుఁడై వేవేగ ధేనువులున్న – కానంబుకు జొచ్చి కామధేనువులఁ
గనుగొని యప్పుడు కనుచూపుమేరఁ – గనకపల్లకులను గ్రక్కున డిగ్గి
కాటభూపాలుండు కడువేడ్కతోను – గోటి యాదవులును గోవింద! యనఁగ
స్వస్తివాచనములు చదువుచు వేడ్కఁ–బ్రస్తుతింపుచు మంచి బ్రాహ్మణోత్తములు
వందిబృందములు కైవారముల్ సేయ –నందనంద శ్రీరామ యనుచుఁ దాళములు
దాసులు కై తాళ దండెల ధ్వనుల – వాసిగాఁ బాడుచు వచ్చెడువారు
మంతనంబున వచ్చు మంది సందడులు – వింతగా నాలించి వినియు బొల్లావు
వాసన పసిపట్టి వడిగ లేచియును – శేషుపడగలక్రియఁ జెవులు నిక్కించి
నలుదిక్కులును జూచి నరనాథుఁజూచి – బలువైనయాసైన్యభావంబు దలచి
గొడుగులుఁ బడిగెలు గోపురెక్కములుఁ – దడిబడఁ గొనివచ్చు దళములఁ జూచి
యమకులాధిపుఁ డని యరసి బొల్లావు – మదిలోన నిట్లనె మహిపాలుఁ డిటకుఁ
దనమయ్య కలహంబు తాళియుండఁగను – నను వేడఁగా మది నాఁటి నే నున్న
యీవనికిని వచ్చె యదుకులవిభుఁడు – భావింపఁగా మనకుఁ బగవాఁడు కాఁడు
అనుచు బొల్లావును నప్పటివలెనె – తన యింపునఁ జేరి తాఁ బవ్వళించి
యుండినఁ గాటభూమండలేంద్రుండు – మండలాధీశుండు మఱఁది రఘుపతియుఁ
బోయి యాబొల్లావు పుణ్యాశ్రమమున – దాయంగ జనుదెంచి దళములుఁ దాను
జూచి యావనమునఁ జోద్యమెన్నుచును – బూచిన యా జాజిపొదనీడ నున్న

## బొల్లావు అలంకరణము

యావును గన్గొని యతిభక్తితోను – నావులన్నియు మ్రొక్కి యావుపాదములు
పాలేటియుదకాన బాగుగాఁ గడిగి – నీలాంబరుని మది నిలిపి యంతటను
బంగారుపళ్లెలఁ బట్టి తీర్థంబు – శృంగారముగ మఱఁదిచేతి కందియ-
బలముల కెల్లను బద్మరాఘవుఁడు – సలలితమ్ముగ దాని సమముగా నవుడు

పొందుగ వడ్డించె భుజియించి రంత - నందఱుఁ గొనియాడ నలనన్న యపుడు
పట్టువస్త్రమును జేపట్టి యా వేళ - బట్టుగా బొల్లావు పాదముల్ దుడిచి
కాటమరాజు తన కన్నుల సద్ది - వాటంబుగా నావు వరభక్తుఁ డపుడు
స్థిరముగా నావుకుఁ దిరుమణిఁ బెట్టి - తిరుచూర్ణ మానడుమ తీరుగాఁ దీర్చి
యురమున శ్రీగంధ మొనరఁగా సలఁది - కరమొప్ప నవరత్నకంఠహారములు
వన్నెగా బంగారువనమాలపేర్లు - సన్నపు గుఱుమృగ జల్లులు వేసి
ముత్యాలపేరులు మోముపై జాఱ - రత్నాలపేరులు రహిని మై మెఱయ
సంఖు చక్రములును సరముగా నున్న - పంకజనాభుని ప్రభలు బాలికలు
నురమునఁ దిరిగిరా నురుగబ్బిపేర్లు - గంగడోల్దిరిగిరా గంటలపేర్లు
నాల్గు పాదంబుల నాదుటందెలును - గొమ్మున బంగారుకుప్పె ధరించి
ధేనురూపము దాల్చు దివ్యమూర్తికిని - సాంబ్రాణి ధూపంబు చయ్యన వేసి
పశుపతి నలనన్న ప్రార్థింప దొడఁగె.

## బొల్లావు ప్రార్థనము

"దేవ! కృపాంబుధి! దేవేంద్రవినుత! - కావగ దయసేయు కరుణాసముద్ర
పదినూఱుజిహ్వాలఫణిశేషమూర్తి! - సదయు లొమియుఁ బొగడ జగతిపై మాకు
గారణము చేకూడెఁ గలని మధ్యమున - భారంబు చేఁబూని పగతురనెల్ల
జంపుమీ! త్రుంపుమీ! సర్వేశ! యీశ! - పంపుమీ నీదైన పటుకటాక్షమును
కూర్మావతారమై కుధరంబు క్రింద - నిర్మల మతితోడ నిలిచినదేవ!
ధరణి హిరణ్యాక్షు ధట్టించి చంపి - ధరఁ గొమ్మునను నిల్పుదాక్షిణ్యమూర్తి!
నరసింహమూర్తివై నఖదైత్యుఁజంపి - యరసి బాలునిఁగాచినట్టిదేవుండ!
యిలదానముల మూఁటి నెలమి నడిగియును - బలిచక్రవర్తిని బరిమార్చు వీర!
కార్తవీర్యునిఁ బట్టి గర్వంబు నడఁచి - వార్తకెక్కినభృగువంశావతార!
కదనాన నా దశకంఠుకంఠముల - విదళించినట్టి యో వీరశేఖరుఁడ!
మదగర్వమున నంటి మామను గంసుఁ - బదవడి చంపిన బలభద్రమూర్తి!
తరుణులమానంబుఁ దఱిమి నైకొన్న - పురములు గెలిచిన బుద్ధావతార!
యెలమి లోకములెల్ల నిట్లు రక్షింపఁ - గలవాడ వపుడవు కల్క్యావతార!
అంచితంబుగ నీదు అవతారమహిమ - యెంచఁగా నలవియే యెవ్వరికైనఁ
గేశవరూపంబు గిరి యెత్తినట్టి - నీశరీరమునందు నిలిచి యున్నదియుఁ
బన్నగాంతకురూపు పన్నగురూపు - నెన్నఁ మానవురూపు నెన్నగానట్టి

పదములు శిరములు పర్యంతమందు - ముదమొప్ప జగతిఁ ద్రిమూర్తులు నీవె
కడువేగ నీమోము గరుడని రూపు - నడుము జూచినను బన్నగరాజురూపు
వెనుకను గనుగొన వివరించి చూడ - హనుమంతురూపుగా నమరియున్నదియు
యిలను బొల్లావని వెలసె నీ పేరు - చలమున రిపులను జంపును వమ్ము!
బ్రహ్మ నీమోమును భావించిచూడ - నమల సుజ్ఞానంబె యయినీపొదుగు
క్షీరాబ్ధిగా నవనిజనులు నెన్నుదురు - గొరిసెలు వరుజులుగఁ గొనియాడుచుండ
నష్టదిక్పాలకు లదంబు బొడగ - సృష్టియెల్లను నెఱుఁగఁ జెలువంది నీవు
మముఁబ్రోవ మంటివి మాధవమూర్తి! - మిమ్ముఁగొల్చి యున్నాను మిమ్ముఁ
జూచినారు
గొల్లరాజును నేను గోర్కె మీఱఁగను - బల్లవాధిపునితోఁ బగ జెలికి వచ్చి
నావగ లీడేర్చు నన్ను రక్షించు - రేపు నాలుగుజాలు రేకలకాడ
నెక్కడఁ బగవార లెదురైన చోట - గ్రక్కునఁ బగవారు గదలి రాకుండ
బిల్లగొరిసెల నీవు భీతి పొందించు - వాలానఁ గొందఱి వడిఁజుట్టి చంపు
కొమ్ములఁ గొందఱిఁ గోరాడి పొడువు - చిమ్మఁగా రక్తమ్ము చీఱి వెటాకు
జగతిలో నీకీర్తి జనులెల్లఁ బొగడఁ - బగ నిర్వహింపుమీ సంతాన సురభి!"
యనుచు యాదవరాజు అప్పుడు మ్రొక్కఁ - గనుఁగొని బొల్లావు కడు సంతసిల్లి
పగయెల్లఁ దనదిగా భావించి మదిని - దగు ముదమ్ములతోడ ధరణీశుఁ జూచి
యుగ్గలంబుగ నొల్క నమృతపూరంబు - దిగ్గునఁ దాలేచి దేవతాసురభి
నిలిచె; నన్నలనన్న నిమిషమాత్రమున - సలలిత వైభవం బలర మోదమునఁ
గొమరొప్ప ముత్యాలగొడుగుఁ బట్టింప - రమణీయముగ నావు రంగుగాఁ గదిలె
చామరంబులు వెల్లఛత్రముల్ పట్టి - శ్రీమంతులై రాజశేఖరుల్ నడవఁ
గాళుల నందెలు ఘల్లు ఘల్లనుచుఁ - దాళమానంబుగాఁ దగువేడ్క మ్రోయ
ఘన మైనశంఖముల్ కనకతప్పెటలు - ఘనమృదంగంబులుఁ గర్ద చేరులును
వేణునాదములును వీణానాదములు - వినుతింప భేరులుఁ బెద్దబూరుగలు
ధారుణి వణకంగఁ దమటంబు లార్చి - చేరులును గడలును జెలఁగి మ్రోయంగ
గోరూప మైనయా గోపాలమూర్తి - యాగూఢి నాతావు కట్టులే తెంచి
యచ్చటనెత్తిరి అసురమోములది - హె చైచ్చనయొక డేర యింపుసొం పలరఁ
బరువుదిగువన వేసి పట్టుతివాసి - పఱచిన బొల్లావు పవళించె నంత
నావుకు ధాన్యము లటు లేరుపఱిచి - యావు విసరఁగా నావ్రలన్న యిట్లనియె
"అడ్డాముకటువు అమలచెలికె - తుండిలింగముకొంత తూములయేరు
పుచ్చములపాలెము పొమ్మనవుంట - యెచ్చయ్య పలుగుష్ల యేనేవు తఱచు

యెదురులచెఱువును నెలమి నాదిగను - వదలక కాపాడవలె నయ్య" యనుచు
ధరణీశ్వరుఁడు మ్రొక్కెఁదలయెత్తి యావు - వరమిచ్చి పొమ్మన వసుధేశ్వరుండు
నెఱగడ్డపాటికి నెత్తి చనె నంతఁ - ..................................
దమకంబు వయినెక్కి తన మఱఁది తాను - గొమరొప్పఁ గూర్చుండి కూరిమిచేత
మఱఁదివంకను జూచి మండలాధిపుఁడు - కరుణతోఁ బలికెను గలవాక్యములను
"సరుదైన తాణ్యంబు నావున కమరె - నెరవుగా తాణ్యంబు నిరవుగాఁ జేసి
సాగలకొండ జనార్దనునెదుట - బాగుగాఁ బిన్నయ్య బలములు నిలిచె
జిల్లరతాణ్యాలు శీఘ్రమేర్పఱుప - వలె నయ్య యోమఱఁది! వసర యాదవులఁ
బిలువనంపు మటన్న ప్రియవాక్యములకు - నలరుచు నాయుండు యాదవులఁ జూచి
పసచె వారల నెల్లఁ బయనంబుఁజేసి - "మఱిగుంట తాణ్యానామము నావులన్న
న్రావులన నీవు ననిమొన నుండి - గుర్రాల సీఁకెలఁ గొంకక పొడువు
............పార్థివబలముల నీవు - మందలావులతోడ మన్నీల నెదిరి
పెండ్యాల యెద్దుల పేరుకలబలము - నండఁ బాయకనిల్చి యాలంబు నెదిరి
కడువేగ వేయరులఁ గదిసి పొడిపించు - నెడపక సంగన! యతివేగఁ బొమ్మ
అమిత విక్రమశాలి! అల్లాది వరసు! - కొమరొప్ప లింగాలకొండపై నుండు
దామిశెట్టిచెఱువుదాపున నుండు - సమమైనబలముల సమకూర్చి చాల
హరిశ్చంద్రభార్గవ! అలసేనతోడ - దరిమడుగు దిక్కునఁ దగవేడ్క నుండు
కరివరద! నీ దైనకలమూకతోఁడఁ - గరియెద్దుకురువను గదలక యుండు
రాచెర్ల కృష్ణమ! రంగుగా నీవు - రాచగుళ్లాహట రమణతోనుండు
మెలకువ మారెళ్ల యెలనాగ నేఁడు! - చెలువొప్ప నీ వుండు సేనలతోడఁ
గొప్పకొండ నెత్తమునఁ గొమ్మకసి నేఁడ!-యొప్పిన మూఁకతో నొనర నీత్వంశు"
మని యిట్లు నాయకుఁ డాడువాక్యములు - విని వారు పైనమై వేగంబెపోయి
తమతమ తాణ్యాలు తగుమోదమునను - నమితవైభవముల నటు నిల్పి రత
అక్షోహిణియెద్దు లాదూర నిలిచె - రక్షించు కాటమరాజు చేరఁగను
సుబుగుయెద్దులతోడ చట్టువారెర్ర - యెలమితో నిలిచెను యెరగడ్డపాట
గొదువ లేకుండ నా గోపవర్గంబు - యదుకులాధిపునకు నిరుగడఁ గొలువ
బ్రాహ్మలు దీవింప భట్లు పొగడఁగను - నమ్మహీపాలుండు నలకొలు వసుచు
మండలాధిపుఁ డైనమఱఁది రాఘువుఁడు - దండగా నుండిరి తగువేడ్క నంత
నంత నావంచము డగుభట్టు యెన్న - రంతుగాఁ బటు పరాక్రమము వెమాఱు
కొనియాడ జగతిపై గోసంగిబలుఁడు - ఘనబలోన్నతుఁ డగుగరిబీరినేఁడు
శివసేవకుం డగుశివనాగుమయ్య - నవు ధరించిన కులనాయకోత్తముఁడు

పినవంతు పెదవంతు బీర్నీనిఁ దాము – వినతి యిర్గడలను వెలసి కొల్వఁగను
చినగబ్బి పెదగబ్బి చెన్నుసోదరులు – ఘనముగా బీర్నీనిఁ గదిసి కొల్వఁగను
బరఁగ బాడావుల పాలన్నిద్రావి – పెరిగిన చెన్నయ్య ప్రేమతోఁ గొల్వ
గండుగంటల బోడిపాగ శింగిరియు – ... ... ... ... ... ... ...
అడ్డకత్తియు పెబ్బడడిదెము కన్న – పొడుగుత్తి చెన్నయ్య మెమురులబొమ్మ
రొంపగందమనేడు రుద్రకోటి కొండ – కెంపునఁ గొమ్మినేఁడు కేళంపులింగు
వాలుకత్తియు నుసివి వరమాదినేఁడు – ........................
గచ్చుటరిగల గంధకల మబ్బినేఁడు – నిశ్చలవృతు నిమ్మ బోడయరంగు
పెదగుత్తి పాపఁడు బెబ్బులి మాకు – సదయుఁడౌ చెన్నమ సదరికి నేఁడు
కనకపిడియావు కారుపోతుల నాము – పినకత్తియును కారు పెనుగొండ మాచు
ఆరిగ కుంభల అనమడిపోలు – సురకత్తియును, చెన్నచూ చక్కినేఁడు
వీరలు మొదలైన వీరగోసంగు – లాఱువేలును గూడి యాబీరినేనిఁ
గొలువంగ సిరిదేవి కూర్మినందనుఁడు – కొలువుగాఁ గూర్చుండి కులభటులఁజూచి
సమర నిశ్శంకుండు సాహసోన్నతుఁడు – నమిత విక్రమశాలి యనుబీరినేఁడు
తనకైనభటులతోఁ దాను నిట్లనియె "వినుఁడి! సాహసులార! వివరంబుగాను
ఘనుఁ డైనలనన్నకాంతిచంద్రుండు – యను వైనతాణ్యాన నావును నుంచి
పాదచారయి పోయి బాగుగా మ్రొక్కి – ఆదిమూర్తి యయిన మావుకు మొన్న
మనుజనాథుండును మన్నెరాజులకుఁ – బసిబూని తాణ్యాలు బాగ నేర్పఱచి
తలపున నలనన్న తలచడో నన్ను – నలనాఁడు మాయమ్మ అమ్మ నూకాంబ
అన్న! నీ తమ్ముఁడు ఆదరంబుగను – మన్నించమని చాల మనవిగాఁ జెప్పి
నలనన్నకును నాడు నన్నప్పగించె – నలనాటి బాంధవము నావులన్నయును
యేమైన దలచునో యేండ్లు గడవంగ – మా మీఁది జ్ఞాపకము మానెనో లేక
యెన్నఁడుయుద్ధంబు నెఱుఁగడ యనుచుఁ – జిన్నవాఁడని పంపఁ జాలకున్నాఁడో
జగడంబు నెన్నఁడు సలుపలేదనుచుఁ – బగవారిపై నన్నుఁ బంపకున్నాఁడో
యెప్పుడు పగవార లెదిరింప వెళ్లు – నప్పు డావుద మని యటనుండె నేమొ
మనసులో మర్మంబు మాకెట్లుదెలియు – ........................
యీ రెండువార్తలు వేగంబె తెలిసి – యారూఢి నొకతాణె మడిగి వత్తాము"
శివపూజ జేసియు శివునకు మ్రొక్కి – వివరాన సొమ్ములు వేడ్క ధరియించె
జెవులను ముత్యాల చౌకట్ల జోళ్లు – నవరత్నఖచిత మానవరంజి పైఁడి
పతకము మొలనూలు బన్నసరములును – నధికమా పేరులు నాణెముత్యములు
కుచ్చెలకుళ్లాయి గులుకు నేవళముఁ – బచ్చలకడియాలుఁ బసిఁడుంగరాలు

రంగైనమురుగులు రత్నహారములు - బంగారుమొలత్రాడు బాగుగా నింపఁ
దెలివైనమొలధట్టి తిలకంబు బొట్టు - పొలుపుగా బంగారుపుష్పాలశాలు
భైరవ బలుఁడును బహువీరవరుఁడు - సొరుగా బిరుదుల సమరశేఖరుఁడు
గొనకొని మాతంగి గొర్రపాలుండు - జను లెన్నఁగా నుర్వి జాంబవకులుఁడు
వీరన్న వరసుతుఁడు వినుతసాహసుఁడు - ............ పృథివిపైఁ బొగడ
నిరవొంద నర్ధనారీశ్వరుజల్లి - బీరన్న ధరియించె బిరుదు లన్నియును
నమరంగ గోసంగు లందఱు నపుడు - తమ బిరుదు లన్నియు ధరియించి రంతఁ
గొమరొప్పఁగానంత గ్రొత్తచల్లడము - గమనీయ మగుచంద్రకావిధట్టీలు
పులితోలు బిరుదులు పూనికాసెలును - జెలువైనసరిపెనల్ చెంపగంధాలు
గాటంపుటరిగెలు గంటగాలములు - నీ లైనకుడిసిగలు నిలువునామములు
సిగలఁ బువ్వులచెండ్లు సింహమరిగెలును - నొక కాల నొర లేటి నొఱఁగు రుచూళ్లు
నొరలు గోసినకత్తు లొనరఁ జేపట్టి - కిరుమచేకత్తులు గీరుగంధాలు
బొగడ వచ్చులపేర్లు బేఋ బంధువులు ? - తగిన గవ్వలపేర్లు దండకడియములు
నెలుగుతలాటములు వేడ్కభుజములను ? - నెలుగుచర్మంబులు నెన్నఁగాఁగటిని
నెసవగ బిరుదులన్నియు సవరించి - యెడమచేతను గొమ్ము యిరవొక్క వేర్లు
కోవంపుఁజూపును గోరమీసమును - దాపిన నవరత్న దండకడియములు
రంగు మీఁజిన వన్నె రావి రేకలును - .............. మెడ పెను నేవళములు
వాఁడిగత్తులు సన్నవలిపెమువ్వట్లు - చెలువొప్ప సవరించి చెలఁగు తప్పెట్లు
కప్పెడు మ్రోయింప నగుభుగుల్ గాను - దప్పెట ధ్వనులకు దాళమానముల
నడుగుల చిందుల నాడేటివారు - నాడుచోఁ బాడుచు హరిహరాదులను
వినయాన గంతులు వేసేటివారు - ఘన మైనసింహంబు గ్రచ్చుటరిగెలను
మొలకత్తి జళిపించి మురిసేటివారు - నలకత్తులను ద్రిప్పి యంత మెరవళ్లు
నడ్డబెళుకులతోడ నటవచ్చువారు - గడలను ద్రిప్పుచుఁ గరులకై వడిని
మత్తుగా మసలుచు మఱి వచ్చువారు - మొత్తమై గుమిగూడి ముందర నడవ
మెఱసి గోసంగులు మెండుగా నడవ - బిరుదుల నీడను బీరన్న కదిలె
గబ్బులి రంతులఁ గదిసి కొల్వఁగను - గొబ్బున నలనన్న కొలువు కేతెంచి
మండలాధిపుఁ డైనమహిపాలునకును - దండ మొప్పఁగబెట్టి ధరసాగ మ్రొక్కి
ముకుళితంబుగ నిల్చి ముదముతో ననియె - "సకల జీవాధార ! సజ్జనోద్ధార !
ఖగపతి బిరుదులు గలమహారాజు ! - ....................................
రవితేజ ! యాదవరాజన్యచంద్ర ! - వివరముగ వినుఁడి నావిన్నపం బొకటి
చల్లవా రేవురు సాహసోన్నతులు - చల్ల గరిగెల వేగ సరగున నిలిచె

భోగమపాటను బొల్లావు నిపుడు - బాగుగా నిలిచెను బగతురఁ జంప
నుఱియు యాదవులకు మంచి పేరైన - సరసైనతాణ్యాలు నందఱికి నమరె
ధరణీశ ! మాకొక తాణ్యా మేర్పఱిచి - పరఁగంగ విడెమిచ్చి పంపుమీ నన్ను"
ననినఁ గాటమరాజు అల్లన నవ్వి - తనమదియున్నది దయతోడఁ బలికె
"విను బీరినాయఁడా! వివరంబుగాను - నినుఁ బంపఁ గార్యంబు నేఁ డేమి గలిగె
నమ్మ నూకాంబిక యలనాఁడె నిన్ను - సమ్మతంబుగ నిచ్చి చయ్యనఁ బంపె
నప్తితి నూకాంబ కనియె నొకమాట - 'యితని నీ తమ్ముని హితవుగాఁ జూడు
మితఁడు మన్ననబంటు నితఁడు శూరుండు - నితని బాహుబలంబు నెన్నదుము
[జగతిఁ
బురణింప మీతండ్రి పోలురాజపుడు - చెరుకూరకాడ మును చెల్లినవెనుక
బగవారు నందులై బలములు గదియ - జగడాన నెదిరియుఁ జంపె పగతురను
మడిసె నంతట మసిలినాయనిభార్య - కడు మసిల మ్మనుఘనపుణ్యకాంత
పైనమై గుండానఁ బడనుఱుకువేళ - వైనాన నా శిశువు వప్పించి మాకు
జగతిపై గోసంగి జాంబవకులుఁడు - పగవారిపై నితనిఁ బంపఁగాఁ బోకు
నిను మొయ్యఁ గార్యంబు నెన్నఁడు గలదో - పని గలవేళను బంపుమా యనుచు
నమ్మ సెప్పినమాట యతి గడవ వలదు - తమ్ములు సిద్ధిరాజాదళము లేతెంచి
చెప్పరానియుద్ధమును జేసేటివేళ - నప్పుడు అరజాము ఆలంబు సేయ
వచ్చెద వట నీవు వసరిన బలము - నిచ్చట నింపొందియేపు గ"మ్మనిన
నలనన్నతో బీరి నాయఁడిట్లనియెఁ - "దెలియఁ జెప్పెద రాజ! తేటగా వినుమ
యెన్నఁగా శత్రువు లెదిరినవేళ - వెన్నిచ్చి వచ్చుట విహితంబు గాదు
పట్టఁగా వచ్చినపగవానిఁ గన్న - నట్టిటు జూడక యటు తాళు మనక
గట్టిగా సత్కీర్తి గైకొనవలెను - నెట్టివారికి భువి నిదియె పద్ధతియుఁ
బగవారిఁ బొడగని పాఱిపోవ్యేది - తగవుగా దది వీరధర్మంబు గాదు
వంతగించినరిపులఁ బరిమార్చకున్న - వింతగా శత్రువు లెన్నుదు రెవనిఁ
జిన్ననాఁటను నుండి సిరిదేవి మమ్ము - మన్నించి పెంచిన మన్ననబంట
పగవారు వినినను పసికిరాఁ డనుచు - నగియేరు పురజనుల్ ననుఁజూచి చాల
మునుపు మీ రెన్నఁడునుద మొప్ప నన్ను - ఘనముగా నేఁజూడఁ గలహంబు
[గలిగె?
నేడుతరములపగలు నిటరాకమున్నె - నేఁడు తాణ్యము మాకు నేర్పడఁ దెలిపి
కరుణతో సెలవిచ్చి కడుప్రియంబునను - బరదళముపై నీవు వంపుట లెన్న
యెప్పు డావుకు తాణ్యా మేర్పడ నిలిపి - తప్పడె యాతాణ్య మమరకుండినను.

దక్షిణాధీశులు తరలి వచ్చేరు – ఈక్షణంబున మమ్ము నిప్పుడే పంపు
బ్రహ్మాది విష్ణువు పరమేశ్వరాన ! – బ్రహ్మ ప్రభావంబు బసవేశ్వరాన !
నమ్మిక బొల్లావు నరహరియాన ! – అమ్మ మాకాంబిక అగుమంచియాన
పల్లజడలును గల భక్తిరన్నాన ! బల్లిదుం డగురఘుపతిపాదమాన !"
బీరన్న మాటలు ప్రేమ నాలించి – మాఱు మాటాడక మహిపాలుఁ డపుడు
కొంత యాదవబలము గొబ్బునఁ బంపి – వింతగా నాకత్తి వేగ నిప్పించి
వప్పుగా నాకత్తి వర్ణించె రాజు – ………………………………
"పృధివిలో నీకత్తిపిడిఁ జూచిరేనిఁ – గుదురుగా జనులకుఁ గుధామై తోఁచుఁ
మొనవంకఁ జూచిన మొనసి శత్రులకు – ఘనమైనసింహంబు ఘాతమైతోఁచు
ధారఁ జూచినఁ గత్తి తన శత్రులకును – నారాఘీఁ దోఁచు వజ్రాయుధంబుగను
వెనుకఁ జూచినఁ గత్తి పెంపుతోఁడుతను–గొనకొన్న బలితంపుఁ గోరమై తోఁచు"
నటువంటి కరవాల మపుడు పూజించి – తటుకున నలనన్న తమ్ముని కపుడు
కప్పర విడియంబుఁ గరవాల మిచ్చె – నొప్పుగా గోసంగు లూనర శూరులకు
నేర్పున విడియముల్ నెఱి వేగ నిచ్చె – యప్పుడు భూపాలుఁ డనియె నంతటను
"విను బీరినాయుఁడా ! వివరంబుగాను – ననిమొన వైరుల హతము సేయుటకు
విరివిగా నినుఁ గొల్చు వీరశూరులను – బరఁగంగ మంగల్లిపాటను నిలుపు"
మని బీరినాయని నాచల్ల నేనిఁ – బనిచిన రాజుకుఁ బద్మనాయునికి
నప్పుడందఱు మ్రొక్కి యుచ్చోటుఁ బాసి – పంపుతో మంగల్లిపాడునకు వచ్చి
నిగనిగ మనుపట్టు నీలిగుడార్లు – వగవారి కెదురుగాఁ బఱఁగి నెత్తించి
చెలువొందఁగా బట్టుజముకాళములపై – గొలువుండె బీరన్న కులబాంధవుండు.

అసంపూర్ణము

PRINTED AT SOLAR WORKS, 12, THAMBU CHETTY STREET, MADRAS-1.